

సర్వవేదాన్తార్థసార మగు

# అష్టావక్రగీత

(టీకా - తాత్పర్య సహితము)

వ్యాఖ్యాత

'సాహిత్య శిరోమణి'

**శ్రీచుక్కా అప్పలస్వామిగారు**


ప్రకాశకులు

**శ్రీ వ్యాసాశ్రమము**

శ్రీ వ్యాసాశ్రమము పోస్టు, 517 621 (మార్గము) ఏర్పేడు,

చిత్తూరు జిల్లా, (ఆం. ప్ర)

2003

| | | |
|---|---|---|
| మొదటి కూర్పు | 1959 సం॥ | 1000 ప్రతులు |
| రెండవ కూర్పు | 1970 సం॥ | 2000 ప్రతులు |
| మూడవ కూర్పు | 1988 సం॥ | 2000 ప్రతులు |
| నాలుగవ కూర్పు | 1997 సం॥ | 2000 ప్రతులు |
| ఐదవ కూర్పు | 2003 సం॥ | 2000 ప్రతులు |

వెల : రూ. 45-00

ప్రకాశకులు:

**శ్రీ వ్యాసాశ్రమమువారు**

**ప్రతులకు:**

**మేనేజరు,**
**శ్రీ వ్యాసాశ్రమము,**
**(వయా) ఏర్పేడు,**
**పిన్-517 621,**
**చిత్తూరు జిల్లా (ఆం. ప్ర)**
**ఫోన్: 08578 -287528**

డి.టి.పి

*శ్రీ అసంగానందగ్రాఫిక్స్, శ్రీవ్యాసాశ్రమము.*

ముద్రణ:

*శ్రీ పారాశర్య ప్రెస్, శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు.*

“ ఓమిత్యేకాక్షరం బ్రహ్మధ్యేయం సర్వముముక్షుభిః”



“ వర్ధతాం బ్రహ్మ విద్యా చ లోకేభ్య స్సుఖమేధతామ్”



శ్రీవ్యాసాశ్రమ సంస్థాపకులు

**మహర్షి శ్రీ సద్గురు శ్రీ మలయాళస్వాములవారు**

ఓమ్

# విషయసూచిక

క్రమసంఖ్య | పుటసంఖ్య

# విజ్ఞప్తి

భారతీయ సంప్రదాయానుగుణముగా అనాదినుండియు సనాతన మగు ఆర్షప్రోక్తగ్రంథములకు ఆధిక్య మిచ్చుచుండుట ప్రాజ్ఞలోక వేద్యమే. అందు ఆధ్యాత్మికగ్రంథము లారాధ్యము లగుట జగద్విదితము. అవి సాక్షాన్మోక్ష సాధనము లగుటయే దానికి కారణము. ఈవిషయమునే భగవానుడు గీతయందు ప్రతిపాదించియుండెను. "అధ్యాత్మవిద్యా విద్యానాం"=విద్యలలో అధ్యాత్మవిద్యను నేను అని, ఈ భగవద్వాక్య మొక్కటియే పైవిషయమును నిరూపించుటకు చాలును. ఇక పెక్కు ప్రమాణములేల?

అట్టి అధ్యాత్మ విద్యా ప్రతిపాదకములే ఉపనిషత్తులు. కాని సంస్కృతభాషాపరిజ్ఞానము లేనివారికి ఉపనిషదర్థము సుబోధకము కాదని తలంచి లోకకళ్యాణతత్పరు లగు మహనీయులు కొందరు "గీత" అను పేరుతో ఆ యర్థమునే సుగమ మొనరించిరి. కావుననే ప్రపంచమున శివగీత, రామగీత, ఋభుగీత, భగవద్గీత- ఇత్యాది నామములతో నెన్నియో గీతలు వెలసినవి. ఈ విషయము ప్రాజ్ఞలోక విదితమే.

ఇట్టి ఆధ్యాత్మిక ప్రబోధకము లగు గీతలలో శ్రీ అష్టావక్రగీత ఒకటి. మానవునకు పరమ గమ్యమైన కేవల జీవన్ముక్తావస్థను, అతీతబోధను మాత్రమే అది నిరూపించునదై యున్నది.

ముముక్షు జనారాధ్య మగు నిట్టి యుత్తమ గ్రంథరాజమునకు సద్గురువులగు మద్గురువరేణ్యులు శ్రీశ్రీశ్రీ మహర్షి మలయాళస్వాముల వారు వ్యాఖ్యాన మొనరించుటకు నన్నాజ్ఞాపించి అనుగ్రహించినందుల కెంతయు కృతార్థుడను. శ్రీ సద్గురు స్వాములవారికి ఈ యష్టావక్రగీతకు టీకా, తాత్పర్యములు వ్రాయించి ముముక్షులోకమున కందజేసిన

మహోపకృతి కాగలదని యెన్నడో సంకల్ప ముండియుండెను. శ్రీవారి యాజ్ఞను శిరసావహించ గల పండితు లెందఱో యున్నను నాభాగ్యవశమున గాబోలు ఆ పని నాకై మిగిలినది. శ్రీవారి దివ్యానుగ్రహమే యీ పనిని నాచే చేయించినది.

శ్రీ అష్టావక్రగీతకు ఇంతవఱకు నా యెఱిగినంతమట్టుకు ఆంధ్రమున టీకా తాత్పర్యములు వ్రాయబడియున్నట్లు లేదు. శ్రీ కామర్షి వెంకటసుబ్బయ్యగారిచేత మాత్రము 1937వ సం॥న ఈ గీత తాత్పర్య సహితముగ ప్రకాశింపజేయబడినది. కాని అయ్యది లఘు తాత్పర్యమువలె నుండుటయేగాక టీక లేనిదిగా నున్నది. కావున సంస్కృత భాషా పరిజ్ఞానము లేని ముముక్షువులకు శ్లోకార్థము సులభగ్రాహ్యమై అత్యంతోప యుక్త మగుటకు టీక యుండినచో బాగుండునని తలంచియే శ్రీవారు నన్నీపనికి నియోగించిరి. ఇక దీనికి తాత్పర్యము వ్రాయుటలో హిందీలో "రాయబహదూర్ బాబూ శ్రీ జాలిమ్‌సింహ్"గారిచే వ్రాయబడిన అష్టావక్రగీత ఎంతయో ఉపకరించినది. వారికెంతయు నా ధన్యవాదములు.

ఇట్టి లోకోపకారకమగు పవిత్రకార్యమును చేయుటకు సదవకాశ మును గల్పించిన శ్రీ సద్గురుమూర్తి మద్గురువరేణ్యులగు శ్రీశ్రీశ్రీ మలయాళ మౌనీంద్రుల చరణ కమలముల సన్నిధిని నా కృతజ్ఞతా పూర్వక సుమాంజలిని సమర్పించుకొనుచున్నాడను.

విశేషించి యిది 1958 జూలై 26 తేదీని రాజమండ్రి గోదావరీ తీరమున ప్రారంభించబడిన శ్రీ చాతుర్మాస్య మహావ్రత సందర్భమున వ్రాయబడుట మఱింత ముదావహము.

మఱియు ఈ వ్రత సందర్భములో ఊపిరి సలుపని కార్యక్రమములో నున్నను అడుగగనే అనుగ్రహించి సందేహనివృత్తి జేసి గ్రంథమునకు సమగ్రస్వరూపము నిచ్చిన శ్రీవారి అపారకరుణ నేమని కొనియాడగలను?

మఱియు నీ గ్రంథమునం దేదేని మంచి గనిపించుచో నది అస్మద్గురుదేవుల యనుగ్రహ విశేషమే యనియు; దోషము లున్నచో నవి మదీయ బుద్ధిజనితములని యెంచి ప్రాజ్ఞులు హానోపాదానములను సూచించుచో మరుముద్రణమున సవరింపబడగలవు.

శ్రీవ్యాసాశ్రమము,

22-11-1958.

ఇట్లు

***శ్రీ సద్గురు చరణరజోరేణువు,***

***చుక్కా అప్పలస్వామి,***

***సాహిత్యశిరోమణి.***

# పీఠిక

జనన మరణరూప ప్రవాహముతో గూడిన సంసారరూప దుస్తర సాగరమును తరింప గోరువారికి "బ్రహ్మజ్ఞానము" అనగా "వేదాంతవిద్య" గాక మరి యే యితరవిద్యయు సాధనము గాదు. ఈ సిద్ధాన్తమును నిరూపించుటకై శ్రీశంకరాచార్యులవారు శ్రీ వివేకచూడామణియందు-

**"న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా ।**
**బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షస్సిద్ధ్యతి నాన్యథా ॥"**

అనియును, **"పాకస్య వహ్నివజ్జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి"** అని ఆత్మబోధమునందును చెప్పియున్నారు కావుననే సమస్త విద్యలకు ఆత్మజ్ఞానవిద్యయే శిరోమణి యని ఆత్మవిదులగు మహాత్ములు నిశ్చయించిరి.

శ్రీకృష్ణభగవానులు భగవద్గీతయందు - **"న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే"** అనియు, **"రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్"** అనియు, ఇంకను ఇట్టివే అనేక ప్రమాణములు జ్ఞానమును గూర్చి ఆనతిచ్చిరి. ఈ బ్రహ్మవిద్య సమస్తవిద్యలలో పవిత్రమును ఉత్తమము నైనది. ఎందుకనగా జనన మరణరూప ప్రవాహమునుండి మానవుని తరింపజేసి మోక్షసామ్రాజ్యాభిషిక్తుని జేయుట కిది యొక్కటి మాత్రమే యేకైక సాధనమై యున్నది. ఈ విషయమే పైన నిరూపింప బడినది. కాని యిది మిగుల దుర్లభమైనది; అనేక జన్మకృత సుకృత విశేషమున గాని సామాన్యముగా ప్రాప్తించునది గాదు. కావుననే **"అనేక జన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్"** అని భగవద్వాక్యము. ఇట్టి బ్రహ్మజ్ఞానమును పొందుటకు అధికారులు మానవులు ఉత్తమ మధ్యమ

కనిష్ఠ భేదములతో మూడువిధములుగా నున్నారు. సాధన చతుష్టయ సంపత్తి గలిగి సంపూర్ణ విషయవిముఖు డగువాడు ఉత్తమాధికారి. అట్టివారు అరుదుగా నుందురు. కనిష్ఠాధికారుల సంఖ్య మిగుల విస్తృతము, ఈయర్థమునే శ్రీకృష్ణభగవానులు గీతయం దిట్లు నిరూపించిరి.

**"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥"**

"అనేకమంది మనుష్యులలో మోక్షసిద్ధిని పొందవలెనని యత్నించు వాడు ఏ ఒక్కడో ఉండును. అట్లు ప్రయత్నించు వారలలో గూడ నిజముగా నన్ను తెలుసుకున్నవాడు ఒకానొకడు మాత్రమే." కావున అట్టి బ్రహ్మజ్ఞాన ప్రాప్తి అనేకజన్మ సుకృతవిశేషమున గాని లభింపదని శాస్త్రములు, అనుభవజ్ఞు లగు పెద్దలు చెప్పుచున్నారు. మలవిక్షేపావరణ దోషములు నశించని వారికి బ్రహ్మజ్ఞానప్రాప్తి కలుగదు. ఎవనికి మలవిక్షేపావరణ దోషములు సంపూర్ణముగా నశించుచున్నవో అట్టి వాడే సర్వోత్తమసాధన సంపన్నుడై బ్రహ్మజ్ఞానమున కర్హుడగును.

మఱియు బ్రహ్మనిష్ఠాగరిష్ఠు డగు సద్గురువు నాశ్రయించి "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యరూప మహామంత్రములను విశ్వాసముతో విని మననము చేయుటవలన నతి శీఘ్రముగా బ్రహ్మజ్ఞానము గలుగును. శమాది షట్కసంపత్తి గలిగి మలవిక్షేపావరణ రహితుడై ఉత్తమాధికారి యైనందుననే జనకమహారాజు బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడగు అష్టావక్ర మునీంద్రుని గురువుగా బడసి ఆ మహాత్ముని దివ్యోపదేశమువలన అచిరకాలముననే అనగా గుఱ్ఱము నెక్కుచు ఒక రికాబులో కాలుపెట్టి రెండవరికాబులో కాలు పెట్టునంత స్వల్పకాలములోనే బ్రహ్మసాక్షాత్కార

మును బడసెను అనునది యీ క్రింది కథా సంగ్రహమువలన దెలియ గలదు.

## కథాసంగ్రహము

పూర్వకాలమున గొప్ప మేధావియు, రాజకార్య ధురంధరుడును, నీతికుశలుండును, అనేక సద్గుణ సంపన్నుడును, రాజోత్తముడు నగు జనకమహారాజు రాజ్యపరిపాలనమును జేయుచున్న సమయమున నొకనాడు తనసభయందు నిత్యము శాస్త్రపఠనము చేయుచున్న ఆస్తికుడును, కులగురువు నగు నొక బ్రాహ్మణుడు ప్రసంగవశమున "రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశమును, అనుభవమును కలుగు"నని చెప్పెను. అది విని అత్యంతాశ్చర్య నిమగ్నుడై రాజు ఆ బ్రాహ్మణు నిట్లు ప్రశ్నించెను.

"స్వామీ! రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగునను శాస్త్రవాక్యము సత్యమా? లేక కల్పితమా?"

అందులకు బ్రాహ్మణు డిట్లు ప్రత్యుత్తర మొసగెను. "ఓ మహారాజా! పవిత్రమైన ఈ శాస్త్రవాక్యము యథార్థము కాకపోవునా? ఇందులకు నీవేమియు శంకింపవలదు."

జనకరాజు:- ఓ బ్రాహ్మణోత్తమా! నా బుద్ధి కీ శాస్త్రవాక్యము కేవల మసంభవమని తోచుచున్నది. ఆ వాక్యము యథార్థమే యైనచో నిప్పుడే నా గుఱ్ఱమును రప్పించెదను. ఆయశ్వమును నేనెక్కు నప్పుడొక రికాబులో కాలుపెట్టి రెండవ రికాబులో కాలు పెట్టునంతలో నాకు బ్రహ్మోపదేశ మొనరించి ఈ శాస్త్రవాక్యముయొక్క సత్యమును ప్రతిపాదన చేయుడు.

బ్రాహ్మణుడు: ఓ రాజా! ఈ శాస్త్రవాక్య మెంతమాత్రము నసత్యము

కాజాలదు. అయినను సత్యత్వమును ప్రతిపాదన చేయు సామర్థ్యము నాకు లేదు.

జనకరాజు: ఓ బ్రాహ్మణోత్తమా! విద్వాంసుడ వయ్యును నీకట్టి సామర్థ్యము లేనిదే ఈ శాస్త్రవాక్యము సత్యమని యెట్లు చెప్పుచున్నావు? ఈ శాస్త్రోక్తిని నిరూపించుట నీ కసాధ్య మగుచో నిది కేవలము కల్పనా రచితమై యుండును. ఈవాక్యముయొక్క సత్యత్వమును నిరూపింప నీవసమర్థుడ వైతివేని యీ వాక్యమును ఖండింపుము, (అనగా గ్రంథములో తుడుపు పెట్టుమని భావము)

రాజు అప్రసన్ను డైనట్లు తెలిసికొని బ్రాహ్మణుడు నమ్రతతో నిట్లనియెను- "ఓ రాజా! శాస్త్రవచనముయొక్క సత్యత్వమునుగూర్చి నాకెట్టి సందేహమును లేదు. కావున దీనిని నేను ఖండింపజాలను".

ఇది విని రాజత్యంతక్రుద్ధుడై వెంటనే ఆ బ్రాహ్మణుని కారాగార మందుండ నియమించి నగరమునందు గల పండితుల నందఱిని సభకు రప్పించి వారల సమ్ముఖమున శాస్త్ర ప్రసంగము చేయుచు "ఓ విద్వజ్జను లారా! ఈ శాస్త్రమునందు రికాబునందు కాలు పెట్టునంతలో బ్రహ్మజ్ఞా నానుభవము కల్గునని యున్నది. ఈ వాక్యము సరియైనదేనా?" అని యడిగెను. అందఱు నైక్యకంఠముతో 'సత్యం సత్య' మని ఉత్తర మిచ్చిరి.

జనకమహారాజు: అయితే యిదిగో! అశ్వము సిద్ధముగా నున్నది. ఈ శాస్త్రవాక్యముయొక్క సత్యత్వమును ప్రత్యక్షముగ ఋజువు చేయ మీలో సమర్థు లగువారలు సిద్ధముగా నుండుడు. లేదా యీ వాక్యమును ఖండింపుడు.

అది విని సకలవిద్వాంసులును తమ తమ యశక్తతను దెలుపుచు

రాజు విధించెడు శిక్షనైనను సహింపగలముగాని యీ శాస్త్ర వచనమును మేమెంతమాత్రమును ఖండింపజాలమని దృఢముగ చెప్పివేసిరి.

ఆ ప్రత్యుత్తరమును విని జనకమహారాజా విద్వాంసుల నందఱిని కారాగృహమునందుంచి పిదప నా నగరమునందు ప్రవేశించు బ్రాహ్మణుల నందఱిని తనయొద్దకు తీసికొనిరమ్మని భటుల నాజ్ఞాపించెను. అది మొదలు ఆయా ధేశములనుండి క్రొత్త క్రొత్త పండితులు మిథిలా నగరమును దర్శించుటకు వచ్చుటయు, జనకు డడిగిన యీ ప్రశ్నకు సమాధానము నొసంగజాలమిచే చెరసాలయందుంచుటయు జరుగు చుండెను. జనకుని యీ యపూర్వ దుర్భర భయంకర ప్రవర్తనము దేశదేశముల వ్యాపించెను. అందువలన విద్వాంసు లెవరును ఆ నగరమున ప్రవేశింపకుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట అదృష్టవశమున శ్రీ అష్టావక్రముని యను మహాత్ము డా నగర సమీపమునకు వచ్చి నగరము వెలువల నొక వృక్షమునీడను విశ్రమించి యుండెను. అప్పుడచట పాంథులగు వారిరువురు కూర్చొని యుండిరి. వారలను జూచి మునీంద్రుడు 'ఈ నగరమును పాలించు రాజెవ్వ'రని యడిగెను. అందుల కాబ్రాహ్మణులు- మునీంద్రా! మీరు ఇచ్చటికి వచ్చుటకు గల కారణమేమి? ఈ నగరమునకు మీరు పోదలంచితిరా?' అని యడిగిరి. మునీంద్రుడు "ఔను" అనెను. అందుల కా పాంథులు అష్టావక్రమునికి సాగిలి నమస్కరించి "మహాత్మా! మాయందు కరుణించి తమ రెన్నడును ఈ నగరమున ప్రవేశింపవలదు. కారణమేమన- ఈ నగరపాలకుడగు జనకమహారాజు అత్యంత క్రూరవర్తనుడును, దురాగ్రహుడునై అనేకమంది

పండితులను కారాగృహమున బంధించెను. దౌర్భాగ్యవశమున క్రొత్తగ నే బ్రాహ్మణుడైన నీ నగరమున బ్రవేశించుచో, 'రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగు'నని శాస్త్రము చెప్పుచున్నది, కావున నీ శాస్త్రవచనము యొక్క యథార్థమును ప్రత్యక్షముగ ఋజువు చేయుమని యాజ్ఞాపించి, అట్లు ఋజువు చేయజాలని యెడల వెంటనే వానిని కారాగారమున బంధించు చున్నాడు" అని విన్నవించి "మీ రీ నగరమునకు పోవల"దని ప్రార్థించిరి.

మునీంద్రు డీ మాటలు విని ఆ పథిక బ్రాహ్మణులతో నిట్లనెను "నన్ను ఒక డోలికయందు గూర్చుండబెట్టి ఆ జనకరాజు సమ్ముఖమునకు గొనిపొండు. ఆ శాస్త్రోక్తవాక్యముయొక్క సత్యత్వమును బ్రతిపాదించి కారాగారబద్ధులై యున్న విద్వాంసుల నందఱిని విడిపించెదను". అష్టావక్ర మునీంద్రుడు చెప్పిన గంభీర వాక్యములను విని ఆ పథిక బ్రాహ్మణులు ఈ మునీశ్వరుడు విద్వాంసుల దుఃఖములను, బాధలను తప్పక తీర్పగల డని నిశ్చయించుకొని త్వరితగతి జని ఒక డోలికను గొనివచ్చి దానిపై నష్టావక్ర మునీంద్రుని గూర్చుండబెట్టి తామే స్వయముగ మోసికొని జనకమహారాజు సమక్షమునకు నాస్థానమంటపమునకు తీసికొనిపోయిరి.

అప్పుడష్టావక్ర మునీంద్రుని దివ్యమైన తేజోవంతమగు ముఖచంద్రు నవలోకించినంతనే జనకునకు ఈ మహానుభావు డెవడో పూజనీయుడు వలె నున్నాడని మఱల మఱల చూచుచు దృఢముగా నిశ్చయించుకొని ఆతని పూజింప బుద్ధి పొడమి వెంటనే మునికి సాష్టాంగ నమస్కార మాచరించి రెండుచేతులు జోడించి వినయముతో - 'ఓ మునీంద్రా! మీరిచ్చటి కేతెంచుటకు కారణ మేమియో కృప యుంచి ఆనతీయ ప్రార్థించుచున్నాను' అనెను.

అష్టా:- ఓ రాజా! ఎట్టి అపరాధ మొనర్చిరని నీ వనేక మంది విద్వాంసులను కారాగారబద్ధుల నొనరించితివి?

జన:- మునీంద్రా! రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగునను శాస్త్రవాక్యముయొక్క సత్యత్వమును ప్రతిపాదింప నసమర్థు లగుట చేత ఈ శాస్త్రముయొక్క యాథార్థ్యగ్రహణమును గూర్చి దురాగ్రహముతో నిట్లొనరించితి.

అష్టా:- ఓ రాజా! నీ ఊహ న్యాయ మైనది గాదు. శాస్త్రవాక్యము ప్రతిపాదితము కానంతమాత్రమున నా సిద్ధాంతము కల్పితమని యన వచ్చునా? రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగునను శాస్త్ర వచనము మిథ్య కాదనియు, అందలి ప్రతి అక్షరమును సత్యమే యనియు, దానిని నేను ప్రతిపాదింతు ననియు ప్రతిజ్ఞ చేయుచున్నాను.

అష్టావక్ర మునీంద్రుని యీ మాటలు విని జనకుడు మొదట సభాసదు లందఱును ఆశ్చర్యచకితులైరి. ఈతని ఆకారము చూడగా అష్టావక్రము, అనగా శరీరము ఎనిమిది వంకరలతో గూడినది. చూచుటకు ఆకారము వికారము. ఆహా! ఇట్టి బ్రహ్మజ్ఞాన సంపన్నునికి ఇట్టి కురూపము నేల విధి కల్పించెనని అందఱును విచారమును ప్రకటించుచు ఆశ్చర్యముతో జూచుచుండిరి.

అంత జనకమహారాజు - మునీంద్రా! మీ యాజ్ఞ యగునెడల నశ్వమును రప్పించెదను. నాయందు సంపూర్ణానుగ్రహ ముంచి యీ శాస్త్రవచన ప్రకారము బ్రహ్మోపదేశ మొనరింపుడు. నమస్కార పూర్వకముగా మిమ్ములను బ్రార్థించుచున్నా, నని విన్నవించెను.

అష్టా:- ఓ రాజా! నీకు గల శుభాకాంక్షకు నేనెంతయు సంతోషించు చున్నాను. నీ జిజ్ఞాస ఎంతయు ప్రశంసనీయ మైనది. నీయెడ నేను ప్రసన్నుడ నైతిని. కాని బ్రహ్మజ్ఞాన రూప పవిత్రోపదేశము నపాత్రుల కొసగగూడదని నీవెప్పుడును వినియుండలేదా? అట్లపాత్రుల కొసంగిన యెడల నది బూడిదలో బోసిన పన్నీరే యగును. కించిత్తయినను లాభముండదు కావున రాజా! బ్రహ్మోపదేశము నొంద నీ కభిలాష గలదేని నాయెడ పూర్ణమగు శ్రద్ధ వహింపుము. నాయందు నీకు పూర్ణమగు శ్రద్ధ, విశ్వాసములు గల వేని ముందుగ కారాగృహబద్ధులై యున్న విద్వాంసుల నందరను విడుదల జేసి పిమ్మట నీ వశ్వారూఢుడవై నాతో నరణ్యమునకు రమ్ము. అప్పుడేకాంత నిర్జన ప్రదేశమునందు నీపాత్రతను బరీక్షించి శాస్త్రోక్తవచనము సత్యమగు నటుల నీకు బ్రహ్మోపదేశ మొనరించెదను.

దృఢ నిశ్చయముతో గూడిన అష్టావక్ర మునీంద్రుని మాటలు వినినతోడనే జనకున కావిషయమై మఱింత యాసక్తి గలిగెను. వెంటనే కారాగారబద్ధులగు విద్వాంసుల నందరిని విడిచిపెట్టుటకు ఆజ్ఞాపించి పిమ్మట తా నశ్వారూఢుడై శ్రీ అష్టావక్ర మునీంద్రుని శ్రేష్ఠమగు పల్లకిలో కూర్చుండబెట్టుకొని అమాత్యాదులతోడను, పురప్రముఖులతోడను వనమునకు వెడలెను.

ఇట్లు వెడలి వనమునం దొక విశాలమగు వటవృక్షము నీడను విశ్రమించి యున్నంతట తనతో వచ్చిన మంత్రి, సామంత, పురోహిత, పౌరాదులను పంపివేయుమని మునీంద్రుడు జనకున కాజ్ఞాపింప రాజు వారల నందఱిని శీఘ్రముగ పురమునకు బంపివేసెను.

అంత నిర్జనమగు నా ప్రదేశమున జనకమహారాజు అష్టావక్ర మునీంద్రుని యాజ్ఞనుగొని ఒక రికాబులో కాలు పెట్టి గుఱ్ఱము నెక్కుట కుద్యుక్తు డయ్యెను. అంతట నష్టావక్ర మునీంద్రుడు- ఆగుము రాజా! ఆగుము. ధైర్యముతో నుండు, మని ఆపి 'నీవు నీ రెండవ పాదము నెత్తక ముందు నా ప్రశ్నల కుత్తర మిమ్ము' అనెను.

జన:- ఆజ్ఞాపింపుము మహాత్మా! సిద్ధముగా నున్నాను.

అష్టా:- రాజా! శాస్త్రములో "రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశ మగును" అను వాక్య మొక్కటియే వ్రాయబడినదా! ఇంక నేమైన లిఖింపబడి యున్నదా?

జన:- ఇతర విషయములు గూడ అనేకములు వ్రాయబడియున్నవి మునీంద్రా!

అష్టా:- బ్రహ్మజ్ఞానోపదేశము నొందుటకు గురువు నొకని నేర్పరచుకొనవలెనను విధాన మేమైనను ఆ శాస్త్రమునందు వ్రాయబడి యున్నదా?

జన:- ఆహా! మహాత్మా! గురు వవశ్యముగ నుండవలెనని శాస్త్రములో విధింపబడి యున్నది.

అష్టా:-అట్లయిన నో రాజా! ఇప్పుడు నన్ను గురువుగా స్వీకరింపకయే బ్రహ్మోపదేశము నొందగోరుచున్నావా యేమి?

జన :- లేదు - మహాత్మా! లేదు. శాస్త్రవిధిపూర్వకముగా నుపదేశము నొంద నుత్సుకుడనై యున్నాను. కాన తండ్రీ! మిమ్ములనే నా గురువుగా నిపుడు నిశ్చయించుకొన్నాను.

అష్టా:- రాజా! ఉపదేశ మొందునపుడు గురుదక్షిణ సమర్పింపవలె నను విధానము శాస్త్రములో వ్రాయబడి యున్నదా?

జన:- ఆ! ఉన్నది - మహాత్మా! శాస్త్రవచనానుసారముగ నీక్షణమందే నా తను మన ధనములను మూడింటిని తమ చరణారవిందముల యందర్పించినాడను. మహాత్మా! నాయందనుగ్రహ ముంచి యిపుడు నాకు బ్రహ్మోపదేశ మొనరింపుడు.

ఇట్లు జనకుడు చేసిన ప్రార్థనను వినినతోడనే అష్టావక్ర మునీంద్రుడు అదృశ్యుడై ఒక గుహయందు దాగి యుండెను. జనక మహారాజు తన గుఱ్ఱముయొక్క రికాబులో పెట్టిన కాలు నట్లే యుంచి కదలక మెదలక యుండెను.

సూర్యాస్తమయ మయ్యెను. జనకరాజింకను నగరమునకు తిరిగి రాలేదు. అప్పుడమాత్యు లందఱు చింతాక్రాంతులై తక్షణమే వడివడిగా నటవికి జనిరి. అటుల పోయి చూడగా నొక విశాల వటవృక్షము క్రింద అష్టావక్ర మునీంద్రుని గొనిపోయిన పల్లకిమాత్ర ముండెను. మునీంద్రు డెచ్చటను కనబడకుండెను.

అచటికి కొంచెము దూరముననే జనక మహారా జొక కాలును గుఱ్ఱపు రికాబులో నుంచి చైతన్య రహితమగు ప్రతిమవలె నిశ్చేష్టుడై యుండెను. అది చూచి అమాత్యాది పరివార మంతయు భయకంపిత మయ్యెను. ప్రధాని త్వరితగతిని రాజు నొద్దకు బోయెను గాని రాజాతనిని జూడనే లేదు. ప్రధాని తన రెండు చేతులను జోడించి 'మహారాజా! ఈ స్థితికి కారణమేమి?' అని యడిగెను. కాని ప్రత్యుత్తర మేమియు లేదు. అప్పుడు వారందఱును మునీశ్వరుడు రాజున కెద్దియో మంత్ర ప్రయోగము

చేసియుండునని యనుకొనిరి. మునీంద్రుని కొఱకు కొంతసేపు వెదకిరి. కాని ముని యెచ్చటను కనబడలేదు. అమాత్యాదు లందఱు నిరాశాహతులై రాజును బల్లకిలో గూర్చుండ బెట్టుకొని నగరమునకు గొనిపోయి రాజమందిరమున నొక యుత్తమ శయ్యపై బరుండబెట్టి పరిచర్యల జేయుచు అనేకమంది ఆశ్వికులను పదాతులను రప్పించి తత్క్షణము వనమునకు బోయి మునిని వెదకి తోడి తెండనియు, మునీశ్వరుడు వచ్చునంతకు నెవరును తిరిగి రాకూడదనియు, కఠినముగ నాజ్ఞాపించి వారలను బంపిరి.

జనకమహారాజును శయ్యపై పరుండబెట్టినప్పు డేస్థితియందుండెనో యిప్పుడును అదే స్థితియందు కాలు గాని, చేయిగాని కదల్పకుండెను. నోట నొక్క మాటైనను రాకుండెను. భోజన మిడిన కొంచెమైనను గ్రహించుట లేదు. జల పాత్రమును నోటికందించినను ఇంచుకైనను జలమును పానము చేయుట లేదు. రాజుయొక్క యీ దశను జూచి రాణియు, రాజమండలియు, పరివారము అత్యంత శోకనిమగ్నులైరి.

ఈ వార్త సర్వత్ర వ్యాపింప నగరమందంతట హాహాకారములు పుట్టెను. రాత్రియంతయు దుఃఖముతో గడిచెను. అంత సూర్యోదయ మయ్యెను. మునీశ్వరు డింకను రాడయ్యెను. వారిలో ఆందోళన మఱింత యెక్కు వయ్యెను. ఇంతలో నొక భటుడు మునీంద్రుని గొనివచ్చెను. మునీశ్వరుని చూడగనే ప్రధాని కత్యంత కోపము ప్రజ్వలిత మయ్యెను. కాని మునీంద్రునకు క్రోధ మగపరచినయెడల కార్యసిద్ధి గానేర దనియును, ఇంక నేదైన విపరీతము జరుగు నేమో యనియు యోచించి నమ్రతతో నిట్లనియెను, మునివరా! మా మహారాజు కెద్దియేని మంత్ర ప్రయోగమును జేసితిరా?

అష్టా:- మీరాజుపై మంత్రప్రయోగము చేయునెడల నాకు గలుగు ప్రయోజనమేమి? అంతేగాక అతనికి నేనేమైనా విరోధినా? నేనేమియు జేయలేదు. రాజును నీ వేమియు నడుగలేదా?

ప్రధాని:- "స్వామీ! రాజు నేమి ప్రశ్నించినను ఉత్తర మీయడు. రెండు దినములనుండి ఉపవాసియై యున్నాడు"

అని రాజుయొక్క స్థితి నంతయు మునీంద్రునకు విన్నవించి 'మహాత్మా! రాజు భుజించునట్లు నగ్రహింపు' డని వేడుకొనెను.

అప్పు డష్టావక్ర మునీంద్రుడు జనకుని సమీపించి - ఏమి జనకా!

జనకుడు:- మహాత్మా! ఏమి యాజ్ఞ?

అష్టా:- నేను నీకేమి చేసితిని?

జన:- మీరేమియు చేయలేదు మహాత్మా! అట్లని యెవరు చెప్పిరి?

అష్టా:- జనకా! ఏమి అట్లు పడియుంటివి? లెమ్ము. ఆనందముగా కూర్చుండి భోజనాదికమును చేయుము.

జనకమహారా జప్పుడు లేచి నిత్యకృత్యములు తీర్చుకొని భోజనము చేసి నిశ్చలుడై యుండెను. అది చూచి యెల్లరును నానందాశ్చర్య నిమగ్నులైరి. అంత ప్రధాని అంజలిపుటబద్ధుడై 'మునివరా! మా ప్రభువు నెప్పటి స్థితికి రప్పింపు' డని ప్రార్థించెను.

అది విని మునీంద్రుడు ప్రధాన్యాది సర్వపరివారమును తమ తమ గృహములకు బొండని ఆజ్ఞాపించి తానుమాత్ర మచట నేకాకిగా లోపలి ద్వారమును బంధించి జనకరాజును సమీపించి ఆతనితో నిట్లనెను.

మునీంద్రుడు:- ఓ రాజా! నీ విట్లు చేష్టలుడిగి యుండుటకు కారణ మేమి?

జన:- గురువరా! ఈ దేహమందు నాకెట్టి స్వాతంత్ర్యమును లేదు. ఈ కాళ్ళు నావి కావు. ఈ చేతులును నావి కావు. ఈ జిహ్వా నాది కాదు. అట్లే యీ యింద్రియము లేవియు నావి కావు. ఈ రాజ్యమును నాది కాదు, ఇంతయేల? వీనిలో నాకేదియును హక్కు లేదు. తను మన ధనములను సత్యముగ మీచరణ కమలములయం దర్పించియున్నాను. మీ యాజ్ఞ లేక నేనెట్టి చేష్టలను చేయ నర్హుడనుగాను.

అత్యంత శ్రద్ధాయుక్తము లగు నా జనకమహారాజు వాక్యములు వినిన అష్టావక్ర మునీంద్రుడు అత్యంత ప్రసన్న హృదయుడై జనకరాజు మస్తకముపై తన హస్తము నుంచి యిట్లనియెను-

'కుమారా! జనకా! నీవు ముముక్షు వగుటకు తగిన జ్ఞానాధికారి వగుదువో లేదో తెలిసికొనుటకై నేనీ ప్రథమపరీక్ష చేయుట ఆవశ్యక మయ్యెను. నేను పరీక్షించి తెలిసికొంటిని. చాలసంతోషము. నీ విప్పుడు బ్రహ్మోపదేశము నొందుట కుత్తమోత్తమాధికారివి. రికాబులో కాలు పెట్టునంతలో బ్రహ్మోపదేశము నొందుటకు నీవు తగిన యధికారివి. ఇపుడు నీవు నాకు లభించితివి. పుత్రా! నిశ్చయముగ నీ విప్పుడు బ్రహ్మ స్వరూపుడవు. నీవు సర్వదా నిశ్చయముగ ముక్తుడవే, నీవు కృతకృత్యుడవు, ప్రాప్తప్రాప్యుడవు. అఖండసుఖ స్వరూపుడవు' అని మునీంద్రుడు, చెప్పగా విని జనకమహారాజు తనలో 'నేను పరిచ్ఛిన్నుడను, వికారిని, అజ్ఞానిని- నేనెట్లు బ్రహ్మస్వరూపుడ నగుదు' నని విచారించినవాడై తనకు గలిగిన యీ సందేహమును నివృత్తి జేసికొన దలచినవాడై మునీంద్రు నిట్లు ప్రశ్నించెను.

"కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి ।
వైరాగ్యం చ కథం ప్రాప్తమేతద్బ్రూహి మమ ప్రభో!

ఓ సద్గురుమూర్తీ! జ్ఞాన మెట్లు పొందబడుచున్నది? ముక్తి యెట్లు కలుగును? వైరాగ్య మెట్లు ప్రాప్తించును? దయ యుంచి దీనిని నాకు చెప్పగోరుచున్నాను.

ఇదే అష్టావక్రగీతకు బీజము. ఈ ప్రశ్నను పురస్కరించుకొనియే మునీంద్రుడు అతీతాగాధబోధను జనకునకు జేసెను. ఆ బోధలయొక్క సారమే అష్టావక్రగీత, పై కథవలన అష్టావక్ర మునీంద్రుని మహామహిమ, జనకుని బ్రహ్మజ్ఞానోపదేశార్హత విస్పష్టము కాగలదు. అట్టి మహానుభావుని చేత నొనరింపబడిన అతీతబోధ స్వరూప సంగ్రథితమగు నీ గ్రంథము యొక్క మహిమాత్కృష్టత యిట్టిదని చెప్ప నెవరితరము? అది కేవల మనుభవైక వేద్యము. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్" అన్నట్లు అట్టి మహనీయులే దానిని తెలిసికొనగలరు. కావున ముముక్షువులకు తత్త్వజిజ్ఞాసువుల కిది అత్యంతోపకారి యని వేరే చెప్పవలయునా?

ఇట్లు అష్టావక్రగీత సంభూతమై జనకమహారాజునకు పూర్ణ తత్త్వోపదేశమును చేసినట్లే జిజ్ఞాసువులగు పాఠకలోకమునకును చేయుగాక! ముముక్షువులకు పరిపూర్ణత సిద్ధించు గాక!

ఇట్లు వ్యాఖ్యాత
**చుక్కా అప్పలస్వామి.**
సాహిత్య శిరోమణి.

# అభిప్రాయములు

## నా ప్రమోద వాక్కులు

శ్రీ వ్యాసాశ్రమమువారు అష్టావక్రగీతను ఆంధ్ర టీకా తాత్పర్య సహితముగ ప్రకటించుచున్నారు. శ్రీ వ్యాసాశ్రమ మహర్షులవారు ఆంధ్రమాత నలంకరించు అన్యతమ భూషణములలో నిది యొకటి. మిత్రుడు, హిత మిత వర్తనుడు, సాహిత్య శిరోమణి చుక్కా అప్పలస్వామి గారు తెలుగు వ్యాఖ్యాతలు, శ్రీ మహర్షి మలయాళ స్వాముల వారి ఆధ్వర్యవమున రాజమహేంద్రవరమున జరిగిన చాతుర్మాస్యవ్రత సందర్భమున నేనును పాల్గొనుట తటస్థించినది. మిత్రులు అప్పలస్వామి గారు నన్ను కలిసికొని తమ రచనను ఆయా యెడల నాకు చదివి వినిపించిరి. వారి మూలమున అష్టావక్రగీత నామూలాగ్రముగ చదువు భాగ్యము నాకొదవినది. ఈ పుణ్యకార్యము నాతో చేయించిన ఆ సజ్జనునికి నా ధన్యవాదములు.

వీరి యీ రచనకు హిందీలో రాయబహదూర్ బాబూ జాలిమ్‌సింహ్ గారిచే రచించబడిన అష్టావక్రగీత చాలవరకు సహాయపడినట్లు తోచు చున్నది. అష్టావక్రగీత తెలుగున నీవరకొకటి యున్నను అది సంగ్రహముగా తాత్పర్యము మాత్రమే గలది యగుటచే నా కొరత దీర్చుటకై యీ గ్రంథ మాంధ్రభూమి కెక్కినది. ఇది టీకా తాత్పర్యములతో కూడుకొని యుండుటచే చదువరులకు విషయము సుగ్రాహ్యమై అత్యంతోపయుక్తము కాగలదు - శుభమస్తు.

ఈ అష్టావక్రగీత అష్టావక్ర మహర్షికిని జనక మహారాజునకును జరిగిన తత్త్వసంభాషణము. అష్టావక్ర మహర్షి ప్రసక్తి మహాభారతమున నున్నది. ఆ కాలమున నతడును ప్రసిద్ధజ్ఞానిగ పేర్కొనబడియుండెను. మహాతత్త్వజ్ఞాని యగు జనకుని పేరు జగత్ప్రసిద్ధము. అధికారి యగు శిష్యునకు అధికారి యగు గురువు బోధించిన అమూల్యతత్త్వసార మీ గ్రంథము.

మానవునిలోని పశుత్వమును సంస్కరించి, శివత్వమును ప్రసాదించునవి శాస్త్రములు. దేహము తాననుకొనుట పశుభావము. దేహసాక్షి యగు ఆత్మ తాననుకొనుట శివభావము. చర్మదృష్టి గలవాడు చండాలుడు. బ్రహ్మదృష్టి గలవాడు బ్రాహ్మణుడు. ఇదియే అష్టావక్రగీత యందలి మునీంద్రుని ఉపదేశసారము. దృష్టి విశాలమైనచో దర్శనము విశాలము కాగలదు. వేదాన్తము దృష్టిని సవరించుకొనుమని చెప్పును. "**దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్**" అని శ్రీశంకరాచార్యులవారానతిచ్చిరి. దృష్టి జ్ఞానాకార మైనచో సృష్టి బ్రహ్మాకారము కాగలదు. దృష్టి యనిన నిచట అంతఃకరణవృత్తి యని యర్థము. నేను పదవవాడ (దశమోఽహం) నని తెలిసికొనుట కెంతకాలము పట్టును? బహిర్ముఖుడై తన్ను మరచి వాపోవువానికి ఆప్తవాక్య మొక్కేపరి పనిచేసినది. అట్లే అధికారి యగు వానికి ఆత్మసాక్షాత్కారమును పొందుట కెంత మాత్రము కాలవ్యవధానముతో పని లేదు.

అజ్ఞానమను ఆంతర తమస్సును నివారించుటకు కోటికోటి సూర్యులు చాలరు, చంద్రులు చాలరు. విద్యుద్దీపదీప్తి అచ్చటికి చారలేదు.

మానవుల బుద్ధి గుహల నావరించిన అచ్చపు చీకటి నుచ్చాటన మొనర్చుటకు బ్రహ్మజ్ఞానుల బోధామృతము వినా "అన్యథా శరణం నాస్తి".

ఇది జ్ఞానప్రధానమైన గ్రంథము. ఉత్తమాధికారికి కావలసిన ఉత్తమజ్ఞానమే యిందు చెప్పబడినది. ఉత్తమ స్థాయికి చెందిన వేదాన్తమిది. ఇందలి శ్లోకములు యోగవాసిష్ఠముయొక్క పోకడను స్మరణకు తెచ్చుచున్నవి. మనము స్వభావతః బ్రహ్మస్వరూపులము. అవిద్యారోగ ప్రభావమున మనస్వభావము చెడినది, స్వస్థత చెడినది. అస్వస్థులమై జీవభావము దేహభావమునకు గురియై నానావెతలపాలై యున్నాము. ఈ తత్త్వ బోధౌషధమును సేవించి మనము జాడ్యవిముక్తులము, జడవిముక్తులము కావలయును. తథాస్తు!

ఓం తత్ సత్.

ఇట్లు

***స్వామి శ్రీరామకృష్ణానంద,***

***గీతావాణి సంపాదకులు.***

***మకాం: ఓంకార ధ్యానమందిరము***

***చిత్తూరు.***

***21-11-58.***

# నివేదన

'భగవద్గీత' గీతాసాహిత్యంలో అద్వితీయమైన గ్రంథం. 'గీత' అనే పేరుతో ఇంకా కొన్ని గ్రంథాలు ప్రచారములో ఉన్నవి. శివగీత, రామగీత, అనుగీత, ఉత్తరగీత ఇత్యాదులు ప్రసిద్ధాలు.

అలాంటి గీతలలో 'అష్టావక్రగీత' ఒకటి. శ్రీమలయాళసద్గురు స్వాములవారు తాము స్వయంగా అనేక గ్రంథాలు వ్రాసి ముద్రించడమే కాక పండితులచే కొన్ని గ్రంథాలకు వ్యాఖ్యలు వ్రాయించి ప్రచురింప జేశారు. అలాంటి గ్రంథాలలో శ్రీశివచరణ పండితుడు వ్రాసిన శంకర విజయవ్యాఖ్యా, వివేకచూడామణివ్యాఖ్య మొదలైనవి ప్రసిద్ధాలు.

ఆశ్రమంలో బాల్యంలో విద్యాభ్యాసం చేసి సాహిత్యశిరోమణి పరీక్షలో ఉత్తీర్ణులైన శ్రీ చుక్కా అప్పులస్వామి గారు చక్కని పండితులు. శ్రీవారు ఈయనను అష్టావక్రగీతకు వ్యాఖ్య వ్రాయమని చెప్పగా సద్గురుదేవుల ఆజ్ఞను శిరసావహించి ఆయన దానికి చక్కని వ్యాఖ్య వ్రాశారు. అంతకు పూర్వం తెలుగులో దీనికి పూర్తి వివరణ ఎవరూ వ్రాయలేదు.

1859 లో మొదిటి సారిగా ముద్రణపొందిన ఈ గ్రంథం ఆ తరువాత మూడుసార్లు ముద్రింపబడింది.

ఇటీవల శ్రీమలయాళస్వాములవారు రచించిన 57 గ్రంథాలను 10 వేల పుటలకు విస్తరించిన 20 సంపుటాలుగా శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ శుభసందర్భములో ప్రకటించిన విషయం భక్తులకు విదితమే. ఆ సంపుటాలు బహుళవ్యాప్తి పొందాయి.

# అష్టావక్రగీత

అందుబాటులో లేని ఇతరులు వ్రాసిన గ్రంథాలు గూడా ముద్రించి భక్తులకు అందజేయాలని ఆశ్రమం సంకల్పించింది. అలా అనేక గ్రంథాలు ప్రస్తుతం ముద్రణలో ఉన్నవి.

ఇప్పుడు శ్రీ చుక్కా అప్పలస్వామి ( శ్రీవిద్యానందస్వామీజీ) వ్యాఖ్యానించిన అష్టావక్రగీతను పునర్ముద్రించడం జరిగింది. భక్తులు ఈ ముద్రణకు ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

**ప్రకాశకులు**

ఓమ్

# అష్టావక్రగీత

## మొదటి ప్రకరణము

## ఆత్మానుభవోపదేశము

**ఓం సచ్చిదానందబోధైక రూపిణం సకలేప్సితమ్ ।**
**సద్గురుం తమహం వన్దే మోక్ష సామ్రాజ్యదం పరమ్ ॥**

అవతారిక। జనక మహారాజు తన సంపూర్ణ శ్రద్ధాభక్తులతో ప్రసన్నుడైన అష్టావక్ర మునీంద్రుని ప్రశ్నించుచున్నాడు.

**కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి? ।**
**వైరాగ్యం చ కథం ప్రాప్త మేతద్బ్రూహి మమ ప్రభో! ॥ 1**

హే ప్రభో!=సర్వసమర్థులరగు నో స్వామి! (పురుషః=పురుషుడు) కథం=ఎట్లు, జ్ఞానం=జ్ఞానమును, అవాప్నోతి=పొందుచున్నాడు. ముక్తిః=ముక్తి, కథం=ఎట్లు, భవిష్యతి=కలుగును. చ=మఱియు, వైరాగ్యం=వైరాగ్యము, కథం=ఎట్లు, ప్రాప్తం=ప్రాప్తించునదిగా, (భవిష్యతి=అగును), ఏతత్=దీనిని, నాకు, బ్రూహి=చెప్పుము.

మహారాజగు జనకుడు శ్రద్ధాభక్తులతో కూడుకొన్నవాడై, తన సందేహ నివృత్తికై అష్టావక్రమునీంద్రుని మొదట మూడు ప్రశ్నల నడిగెను. అందు -

1. ఓ స్వామి!, పురుషు డాత్మజ్ఞానము నెట్లు పొందగలుగును?

2. ఆతడు సంసారబంధమునుండి యెట్లు విముక్తి నొంద గలుగును?

3. వైరాగ్యము నెట్లు పొందగలుగును? దయయుంచి నా యీ సందేహమును నివర్తింపుడు.

మునీంద్రుడు వైరాగ్య జ్ఞాన మోక్షములయొక్క స్వరూప హేతు ఫలములను ప్రత్యేక ప్రత్యేకముగా వివరించుచో దానిని తెలిసికొనవలె నని జనకుని యభిమతము.

జనకమహారా జడిగిన యీ ప్రశ్నలను విని, అష్టావక్ర మునీంద్రుడు తనలో నిట్లని తలంచెను- ప్రపంచములో జ్ఞాని, ముముక్షువు, అజ్ఞాని, మూఢుడు అని జనులు నాలుగు విధములుగా నున్నారు. వీరిలో రాజు నిప్పు డేశ్రేణిలో చేర్పవచ్చును? జ్ఞాని యని యందుమా? జ్ఞాని యగుచో సంశయ విపరీతభావనా రహితుడై నిత్యానంద నిమగ్నుడై యుండ వలయును. ఈతడన్నచో సంశయముతో కూడియున్నట్లు విస్పష్ట మగుచునే యున్నది. అజ్ఞాని యని యందమా? అజ్ఞాని యగుచో విపరీత భావనా - అసంభావనాది దోషయుక్తుడై యుండవలెను. ఈతనియం దట్టి దోషము లేవియు కనుపించుట లేదు. పోనీ స్వర్గాది భోగములయం దాసక్తి గలవాడుగా నున్నాడని చెప్పుద మన్నను, యజ్ఞాదికర్మల చేయుటయందు అభిరుచి కానిపించదు. యజ్ఞాది కర్మలు గదా స్వర్గాది ప్రాపకములు. పోనీ మూఢుడని యనుకొందమా? మూఢుడగుచో అప్పుడప్పుడు మహాత్ములను దర్శించుట, వారికి సాష్టాంగ నమస్కారాదు లాచరించుట, సత్కరించుట మొదలగు క్రియ లుండవు. అంతేగాక

మూఢుడు "నే నీ జాతికి లేక యీ కులమునకు చెందినవాడను, నా కింత సంపద ఉన్నది. నేనే గొప్పవాడ"నను అభిమానముతో నిరంతరము సతమత మౌను. ఈ జనకునియం దట్టి గుణములు మచ్చునకైనను కనబడుట లేదు. ఎందుకనగా నన్ను జూచిన తోడనే మహాత్ముడని తెలుసుకొని ఉచిత మర్యాదలతో సత్కరించి వినయవినమితుడై "దుస్తరమగు ఈ సంసారబంధమునుండి నేనెట్లు విడివడగల"నని జిజ్ఞాసువై ప్రశ్నించుచున్నాడు. దీనివలన నీతడు ముముక్షు వనియు, ఆత్మవిద్యా ప్రబోధమునకు సంపూర్ణాధికారి యనియు తెలిసినది. అయితే అట్టి అధ్యాత్మజ్ఞానము సాధన వినా యెట్లు సంప్రాప్త మగును? అని తలంచి మునీంద్రుడు మొదట రాజునకు సాధనల నుద్దేశించి చెప్ప మొదలిడెను.

అష్టావక్ర ఉవాచ=అష్టావక్రమునీంద్రుడు చెప్పెను.

**ముక్తిమిచ్ఛసి చేత్తాత! విషయాన్విషవత్త్యజ ।**
**క్షమార్జవదయాతోషసత్యం పీయూషవద్భజ ॥ 2**

హే తాత!=ఓ నాయనా!, (త్వం= నీవు,) ముక్తిం=మోక్షమును, ఇచ్ఛసి చేత్=కోరుచున్నవాడ వైనట్లయితే విషయాన్=విషయములను, విషవత్=విషమువలె, త్యజ=త్యజింపుము, చ=మఱియు, క్షమా= ఓరిమిని, ఆర్జవ=ఋజుత్వమును (మంచి మార్గమున నడచుటను). దయా=భూతదయ గలిగి యుండుటను, తోష=సంతోషమును, సత్యం=సత్యమును, పీయూషవత్=అమృతమునువలె, భజ= సేవింపుము.

నాయనా! నీకు సంసారమునుండి విడివడుటకు కోరికే ఉన్నచో చక్షురాదీంద్రియములకు విషయములైన శబ్ద స్పర్శ రూపాది విషయములను విషమువలె విడిచిపెట్టుము. ఎందుకనగా విషమును తిన్నవాడు మరణించు నట్లు ఈ విషయభోగ లాలసుడుగూడ సంసారచక్రరూపమైన మృత్యువు వాతబడి నశించిపోవును. అందువలన మోక్షమును గోరువాడెవడైనను మొదట ఈ విషయములను అవశ్యము త్యాగము చేయవలెను. మఱియు ఈ విషయములను మితిమీరి అనుభవించుటచేత రోగాదులు ఉత్పత్తి అగును. అంతేగాదు బుద్ధిగూడ మలినమైపోవును. అట్లే యిది సారము, ఇది అసారమని తెలుసుకొను వివేకముగూడ నశించిపోవును. ఈ కారణమువలన ముముక్షువు అవశ్యము మొదట విషయములను పరిత్యజించవలెను.

ప్రశ్న॥ మునీంద్రా! విషయభోగములను విడిచిపెట్టినచో శరీరమే ఉండదే? అంతేగాక యెంతెంత గొప్పగొప్ప ఋషులు రాజర్షులుగూడ వీటిని విడిచిపెట్టలేదు సరిగదా! ఆత్మజ్ఞానమును పొందియే భోగముల ననుభవించియుండిరి. ఇట్లుండగా తమరు నాతో ఈ భోగముల నన్నింటిని విడిచిపెట్టుము, అని చెప్పుచున్నారు. ఈ విషయమై నాకు సందేహము కలుగుచున్నది. దీనిని నివారింపగోరెదను.

ఉ॥ ఓ రాజా! నీవు చెప్పినది సత్యమే; వస్తుతః మొదలంట ఈ విషయములను విడిచిపెట్ట నక్కరలేదు. అయితే వీటియందు గల అత్యాసక్తిని అనగా శబ్దాది పంచవిషయములలో ఏ యొక్కటి ప్రాప్తించక

పోయిన మనస్సు వ్యాకులతను పొందుచున్నదో, మఱియు మనస్సెల్లప్పుడు దానియందే లగ్నమయి ఉంటున్నదో అటువంటి ఆసక్తిని మాత్రము త్యజించుటయే విషయములను త్యజించుట. అలాగే యేది ప్రారబ్ధానుభవ రూపముగా వచ్చుచున్నదో దానితో సంతోషించవలసినదే గాని లోలువుడు కారాదు. మఱియు ఆ భోగముల ననుభవించుటకు అసత్య మాడరాదు. ఒకవేళ ప్రారబ్ధవశమున నవి ప్రాప్తించినను వాటిని దోషదృష్టితో చూచుట, దుఃఖభాజనములని తలంచుట, వాటిని తొలగించుకొనవలెనని యత్నించుట, మఱియు నా భోగముల ననుభవించుటకు ఒరులవద్ద దీనభావముతో యాచింపకుండుట- యనునదే వైరాగ్య మనబడును, ముముక్షువు మొదట దీని నాశ్రయించవలసియున్నది.

ప్రశ్న॥ స్వామీ! లోకములో దిగంబరుడుగా ఉన్నవానిని, బిచ్చ మెత్తుకొని జీవించువానిని విరాగి యని లోకులందురు. ఈవిషయమై జడభరతాదులను దృష్టాంతముగా చూపుదురు. తమరు చెప్పిన దానికిని, లోకు లనుకొనుదానికిని పరస్పర విరుద్ధ మున్నది గదా?

ఉ॥ రాజా! ప్రపంచములో మూఢజనులు మాత్రమే ఆడంబరము కొఱకు వేషము వేసికొన్న యిటువంటి దిగంబరులను, ఇంటింట బిచ్చమెత్తుకొని తిరుగువారిని విరాగులని భావింతురు. ఈ భావన యుక్తికిని, ప్రమాణమునకును, అనుభవమునకును విరుద్ధమైనది. ఒకవేళ వస్త్రధారణము చేయకనే యున్నందువలన విరాగి యైనచో పిచ్చివారుగూడ విరాగులని చెప్పవలసియుండును. కాని యీ విధముగా ప్రపంచమునం దెచ్చటను గనిపించుట లేదు. మఱియు బిచ్చమెత్తుకొని జీవించువాడు

విరాగి యని చెప్పినచో, ప్రపంచమున గల దరిద్రు లందఱున్ను విరాగులని చెప్పవలసివచ్చును. అట్లెన్నటికినీ చెప్ప వలనుపడదు. పైని చూపించిన యుక్తులవలన దిగంబరుడుగా నున్నంతమాత్రముచేతగాని, బిచ్చమెత్తుకొని జీవించినంత మాత్రముచేతగాని విరాగి కాడని తేలినది. ఒకవేళ తాను దిగంబరుడుగా నుండుటకు బుద్ధిపూర్వకముగా నిశ్చయించుకొని అట్లున్న వానిని విరాగియని చెప్పవచ్చును గదా? యనినచో నదిగూడ శాస్త్ర విరుద్ధముగనే కనబడుచున్నది. విచారణాదృష్టితో చూచిన మొదటి విషయము అపతిత మగుచున్నది.

ఎక్కడ ప్రకాశ ముంటున్నదో అక్కడ చీకటి ఉండదు. ఈ రెండును ఎట్లు పరస్పర విరుద్ధములో అట్లే - సత్య గుణముయొక్క కార్యము సత్యము. అనగా అసత్యరూప వస్తువును వివేచన చేసి తెలుసుకొనే విచారణ రూపమై యున్నది. దిసమొలతో నుండుట తమోగుణ కార్యము, చూడుము ; సంవత్సరములో పండ్రెండు నెలలుగూడ దిగంబరుల శరీరములకు ఎంతో బాధ కలుగుచున్నది. శీతకాలములో చలివలన అతని తెలివియే నశించిపోవుచున్నది. అప్పుడు వారి హృదయములో విచారణజ్ఞానము కలుగుటకు అవకాశ ముండదు. ఇట్లే వర్షకాలము నందును, వేసవికాలమునందును దోమలు మొదలైనవి కరచుటచేత నిరంతరము అతని స్థితి దుఃఖాకారముగానే తయారగు చున్నది. విచారణ గంధలేశముగూడ ఉండదు. అంతేకాదు. శ్రుతికిగూడ ఇది విరుద్ధమే.

**ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః ।**
**కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్ ॥**

తత్త్వవేత్త 'ఆత్మయే బ్రహ్మ' మనియు, 'ఆ పరబ్రహ్మస్వరూపుడను నేనే' ననియు ఆత్మ స్వరూపమును తెలిసికొన్నచో ఇక దేనికొఱకు సంకల్పించును? ఏ కోరికను దీర్చుకొనుటకొఱకు శరీరమును తపింప జేయును? అతడెప్పుడూ శరీరమును తపింపజేయడు. మఱియు "గీత" యందుగూడ భగవానుడు దీనిని తామసిక తపస్సని పేర్కొనెను. ఇందువలన దిగంబరిగా ఉన్నంతమాత్రమున విరాగి కాడనియు, వస్త్రము ధరించకయుండుట వైరాగ్యము కాదనియు ఋజు వగుచున్నది. ఏదియో కావలెనని కోరికగలవాడే యీ విధముగా వ్యవహరించును. కోరిక లేని వాడిట్లు చేయనే చేయడు. అనగా ఇట్లు వ్యవహరించడు. మఱియు జడభరతాదులకు తమ పూర్వవృత్తాంతము జ్ఞప్తియందుండెను. ఒక జింకపిల్ల పైన ప్రేమ కలవా డగుటచేత అతడు మృగాది మూడు జన్మ లెత్తవలసివచ్చినది. ఈ కారణమువల్ల అతడు సంగదోషమునుండి భయపడి నిస్సంగుడుగా నుండెను. పంచదశియందు వ్రాయబడిన విషయమును చూడుము:

> **"న హ్యాహారాది సంత్యజ్య భరతాదిః స్థితః క్వచిత్ ।**
> **కాష్ఠపాషాణవత్కింతు సంగభీత్యా ఉదాస్యతే ॥**

జడభరతాదులు తినుట, కట్టుట మొదలగు వాటిని విడిచి యెప్పుడును ఉండలేదు. అయితే ఱాయి, కఱ్ఱ మొదలగు వాటివలె జడులై సంగమమునుండి భయపడి ఉదాసీనులై యుండిరి. ఎంతవఱకు ఆత్మకు దేహతాదాత్మ్యభావ ముంటున్నదో, అనగా దేహాత్మభావ ముంటున్నదో అంతవఱకు దిగంబరిగా నుండుట దుఃఖమునకు, మూర్ఖతకు కారణ

మగుచున్నది. ఎప్పుడైతే అధ్యాస లేదో అనగా తాను గానిది తానను తలంపు లేదో, అప్పుడు ఏ దుఃఖమూ లేదు. ఆత్మసాక్షాత్కారము కలిగినందు వలన మనస్సు ఆ మహదానందములో నిమగ్నమైపోవును. అప్పుడు శరీరాదుల ధ్యాసే యుండదు. విశేషించి సంసార విషయములయందు ఆ పురుషునికి తలంపే యుండదు. కల్లు త్రాగి ఉన్మత్తు డైనవానికి వాని శరీర మేమయినదో, వస్త్రాదు లేమైనవో- ఆ సమాచారమే తెలియనట్లు జీవన్ముక్తు డగు జ్ఞానియొక్క స్థితిగూడ కేవలము ఆత్మాకారమై, ప్రపంచమునే మరచునదిగా నుండును. అయితే యీ ఉదాహరణము జీవన్ముక్తునికి మాత్రమే చెప్పబడినది గాని ముముక్షువునకు, జిజ్ఞాసువునకు చెప్పబడలేదు. ఎందుకనగా అతనికి సాంసారిక పదార్థములయందలి బుద్ధి యథాతథముగానే ఉండును. సంసార విషయములయందలి దోషదృష్టి మఱియు జుగుప్సయే గదా వైరాగ్యము? దుష్టజనుల సహవాసమునకు భయపడి వారితో చేరక సత్పురుషుల సంగమమునకు తగిన క్షమ, మృదుత్వము, దయ, సత్యభాషణము మొదలగు గుణములను అమృతము వలె పానము అనగా ధారణ చేసినటువంటివాడే విరాగి. అట్టివాడే జ్ఞానమునకు అర్హుడు, అధికారి.

**న పృథ్వీ న జలం నాగ్నిర్న వాయుర్ద్యౌర్న వా భవాన్ ।**
**ఏషాం సాక్షిణమాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే ॥ 3**

భవాన్=నీవు, న పృథ్వీ=భూమివి కావు, జలం న=జలము కావు, అగ్నిః= అగ్నివి, న=కావు, వాయుః=గాలివి, న=కావు, న ద్యౌః=ఆకాశమవు కావు, వా=అయితే, ముక్తయే=ముక్తికొఱకు, ఏషాం=వీటికన్నిటికి,

సాక్షిణం=సాక్షివిగను, చిద్రూపం=జ్ఞానస్వరూపుడవుగను, ఆత్మానం=
నిన్ను, విద్ధి=తెలిసికొనుము.

అనాదికాలమునుండి దేహాదులతో ఆత్మకు గల తాదాత్మ్య అధ్యాసమువల్లనే పురుషుడు దేహమును ఆత్మ యని తలంచుచున్నాడు. మఱియు దీనివల్లనే జనన మరణ రూపమై సంసార చక్రమునందు మాటిమాటికీ తిరుగుచున్నాడు. ఆ అధ్యాసకు కారణము అజ్ఞానము, ఆ యజ్ఞానముయొక్క నివృత్తి ఆత్మజ్ఞానమువలననే కలుగుచున్నది. అజ్ఞానము నశించినతోడనే అధ్యాసగూడ నశించుచున్నది. ఇందుకొఱకే అష్టావక్ర మునీంద్రుడు మొదట కార్యసహిత కారణ నివృత్తికి హేతువైన ఆత్మజ్ఞానమునుగూర్చి జనకునికి చెప్పుచున్నాడు.

ఓరాజా! పృథివ్యాది పంచభూతములలో నీవేదియు కావు. అంతే గాదు, పృథివ్యాది పంచభూతములయొక్క సముదాయస్వరూప మగు స్థూలశరీరముగూడ నీవు కావు. ఎందుకనగా శరీరము క్షణ క్షణమునకు పరిణామమును పొందుచూ పోవుచున్నది. బాల్యావస్థలో నున్న శరీరము కౌమారములో, కౌమారములోని శరీరము యౌవనములో, అయ్యది ముసలితనములోను ఉండుటలేదు. కాని ఆత్మమాత్రము అన్ని అవస్థల లోను యథాతథముగా ఒక్కటిగానే ఉంటున్నది. అందువలననే అతనికి (జడభరతునకు) బాల్యావస్థనుండి స్మృతి జ్ఞానము కలుగుచున్నది. నేను బాల్యావస్థలో తల్లి దండ్రుల పోషణలో నున్నాననీ, కుమారావస్థలో ఆటపాటలతో గడిపితిననీ, యౌవనములో స్త్రీలోలుడ నైతిననీ యీ మొదలగు విషయములను చెప్పుచున్నాడు. దీనివలన అవస్థలు మారినను, ఆత్మకు మాత్రము మార్పు లేదని విస్పష్ట మగుచున్నది.

ఒకవేళ శరీరముతో పాటు ఆత్మగూడ పరివర్తనమును పొందుచున్నదని చెప్పరాదా? అనినచో- అది పొసగదు. ఎందుకనగా, అనుభవించే వానికే స్మృతి జ్ఞానము కలుగుచున్నది అనే నియమ ముండుటవలన చూచువా డొకడైనచో స్మృతి జ్ఞానము గలవా డింకొక డెట్లు కాగలుగును? అట్లగుటకు వీలులేదు. దీనివలన ఆత్మ దేహాదులకంటె భిన్న మైనదని వాటికి సాక్షిగా ఉంటున్నదని తేలినది. కావున ఆ చైతన్యమునే నీవు ఆత్మనుగా తెలిసికొనుము. గృహయజమాని ఇది నాగృహము, ఇది నా మంచము, ఇది నా పడక అని చెప్పుచు వాటికంటె ఎట్లు భిన్నముగా నున్నాడో; అట్లే ఆత్మ ఇది నా శరీరము, ఇవి నా యింద్రియములు, ఇది నా మనస్సు, ఇది నా బుద్ధి- యని చెప్పుచూ వాటికంటె వేరై యున్నది. శ్రుతి చెప్పుచున్నది- **"అయ మాత్మా బ్రహ్మ"** ప్రత్యక్షముగా నున్న యీ ఆత్మయే బ్రహ్మము. ఆత్మయే ఈశ్వరుడు.*

**యది దేహం పృథక్కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి ।**
**అధునైవ సుఖీ శాన్తః బన్ధముక్తో భవిష్యసి ॥ 4**

(త్వం=నీవు) దేహం=శరీరమును, పృథక్కృత్య=వేరుచేసి, చితి= చైతన్యరూప ఆత్మయందు, విశ్రామ్య=విశ్రాంతిని బొంది (మనస్సును ఏకాగ్రపరచి) తిష్ఠసి యది=ఉంటున్నవాడ వైనట్లయితే, అధునా

---

*పృథివ్యాది పంచభూతములు, వానికార్యమగు స్థూలశరీరము, అట్లే ఇంద్రియములు, శబ్దాదివిషయములు- వీటన్నిటికంటె నీవు విలక్షణుడవు, మఱియు వీటన్నిటికిని నీవు సాక్షివై యున్నావు, ఈ విధముగా నిశ్చయించుకొనుటే ఆత్మజ్ఞానము.

ఏవ=ఇప్పుడే, సుఖీ=సుఖివిగను, శాన్తః=శాంతుడవుగను, బన్ధముక్తః= బంధమునుండి విడివడిన వాడవుగను, భవిష్యసి= కాగలవు.

ఓ రాజా! దేహముకంటె ఆత్మ వేరని విచారించి తెలుసుకొని మఱియు నీయాత్మయందే మనస్సెల్లప్పుడు లగ్న మగునట్లు చేసితివేని అప్పుడు నీవు సుఖమును, శాంతిని పొందగలవు. ఎంతవఱకు చిజ్జడగ్రంథి యొక్క నాశము కాలేదో అనగా పరస్పరాధ్యాసయొక్క నాశము కాలేదో, అంతవరకు జీవుడు బంధమునందే ఉంటున్నాడు. అధ్యాసగ్రంథి యెప్పుడు తొలగి (విడి) పోయినదో, ఆక్షణమే జీవుడు ముక్తు డగుచున్నాడు. శివగీత యందుగూడ ఈ విషయము చెప్పబడి యున్నది.

"మోక్షస్య న హి వాసోఽపి న గ్రామాన్తరమేవ వా।
అజ్ఞానహృదయగ్రంథినాశో మోక్ష ఇతి స్మృతః ॥"

మోక్ష మేదో లోకాంతరములో కాపుర ముండ లేదు. లేక యేదో యింటిలోపలగాని, గ్రామములో గాని కాపుర ముండలేదు, అయితే అది మఱెక్కడున్నది? చిజ్జడగ్రంథియొక్క నాశమే మోక్షము. అనగా జడమైన అంతఃకరణముయొక్క కర్తృత్వ భోక్తృత్వాద్యభిమాన ధర్మము ఆత్మ యందును, ఆత్మయొక్క చేతనాదిక ధర్మము, అగ్నియందును తపింప జేయబడిన లోహపిండమునకువలె జడమగు అంతఃకరణమునందును పరస్పరము ఆరోపించుటయే అధ్యాస. అదియే గ్రంథి. దాని నాశనమే ముక్తి, దీనికి మించి ముక్తి యనే వస్తువు వేరొకటి లేదు.

**న త్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః ।**
**అసఙ్గోఽపి నిరాకారో విశ్వసాక్షీ సుఖీ భవ ॥** 5

త్వం=నీవు, విప్రాదికః=బ్రాహ్మణుడు మొదలగు, వర్ణః=వర్ణము(జాతి) గలవాడవు, న=కావు, ఆశ్రమీ=నాలుగు ఆశ్రమములకు చెందిన వాడవు, న=కావు, అక్షగోచరః=ఇంద్రియ విషయము, న=కావు, పరం తు=అయితే (నీవు), అసఙ్గః=సంగరహితుడవు, నిరాకారః=నిరాకారుడవు, విశ్వసాక్షీ=విశ్వమునకు సాక్షివి, అసి=అగుచున్నావు, ఇతి=ఇట్లని, మత్వా=తలంచి, సుఖీ భవ=సుఖివి గమ్ము.

నిరాకార సచ్చిదానంద నిర్గుణబ్రహ్మ మొక్కటియే ఆకాశము వలె సర్వవ్యాపక మైనది. అయితే ఘటము. మఠము మొదలగు ఉపాధి భేదముల ననుసరించి ఘటాకాశమని, మఠాకాశమని ఆకాశమునకు భేద ప్రతీతి యెట్లు కల్పింపబడినదో, అట్లే సర్వవ్యాపకమైన ఆత్మ ఒక్కటే అయినప్పటికిని అంతఃకరణ రూపోపాధి ననుసరించి భిన్నముగా తోచు చున్నది గాని వాస్తవమునకు ఆత్మకు భేదమే లేదు. ఈవిషయమునే మునీంద్రుడు జనకునితో చెప్పుచున్నాడు

ఓ రాజా! నీవు బ్రాహ్మణాది జాతికి గాని, బ్రహ్మచర్యాద్యాశ్రమ ములకు గాని చెందినవాడవు కావు. నీవు వీటికన్నిటికి సాక్షివి, అసంగుడవు. ఆకార రహితుడవు అని తెలుసుకొని సుఖింపుము.

ఇది విని జనకుడిట్లు ప్రశ్నించెను-

ప్రశ్న॥ మునీంద్రా! వేదములు వర్ణాశ్రమ ధర్మములను విధించినవి. వర్ణాశ్రమ ధర్మములను విడిచినచో పాపి యగునని శాసించుచున్నవి. మఱి మీరు వర్ణాశ్రమములతో పనిలేదని చెప్పుచున్నారే; ఇదెట్లు?

ఉ॥ రాజా! వేదములు విధించిన వర్ణాశ్రమాది ధర్మములు- అజ్ఞాను

లగు మూర్ఖులను గూర్చిగాని, జ్ఞానులను గుఱించి ముముక్షువు లను గుఱించి కాదు. దీనిని గూర్చిన యీ ప్రమాణమును చూడుము-

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్ ॥"

జ్ఞానామృతముచేత తృప్తుడై ఆత్మజ్ఞానముచేత కృతకృత్యుడైన వానికి చేయవలసినది ఒకటి గూడలేదు. ఒకవేళ "నేను కర్మ చెయ్య వలసి యున్నది" అని తలంచెనా, అతడు జ్ఞాని కాడు. ఇట్లు జ్ఞాని చేయవలసిన దేమియు లేదని చెప్పెడి ప్రమాణములు అనేకము లున్నవి. దీనియందు గూడ జిజ్ఞాసువునకు కర్మనిషేధము.

"జిజ్ఞాసురపి యోగస్య శబ్ద బ్రహ్మాతివర్తతే"

ఆత్మజ్ఞాన జిజ్ఞాసువుగూడ శబ్దబ్రహ్మను అనగా వేదాజ్ఞను ఉల్లంఘించి యుంటున్నాడు అని భగవానుడు చెప్పుచున్నాడు. తాత్పర్య మేమనగా జిజ్ఞాసువునుగూడ కర్మకాండతో గూడిన వేదము "కర్మ చేయవలసినది" అని శాసింపలేదు. అందువలన నీవు జిజ్ఞాసువుగా నున్నావు, కాబట్టి నీకు వర్ణాశ్రమ ధర్మములతో నిమిత్తము లేదు. ఒకవేళ లోక సంగ్రహముకొఱకు కర్మలను చేయవలయు ననెడి కోరిక నీకున్నచో అవి ఆత్మకంటె భిన్నమగు అంతఃకరణ ధర్మములని జ్ఞప్తియందుంచుకొని చేయుము.

**ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని న తే విభో!**
**న కర్తాఽసి న భోక్తాఽసి ముక్త ఏవాసి సర్వదా॥ 6**

హే విభో!=ఓ సర్వవ్యాపకుడా!, మానసాని=మనస్సంబంధములైన, ధర్మాధర్మౌ=ధర్మాధర్మములున్ను, సుఖం దుఃఖం=సుఖదుఃఖములున్ను, తే=నీకు, న=లేవు , చ=మఱియు, త్వం=నీవు, కర్తా=కర్తవుగాని, భోక్తా=భోక్తవు గాని, న అసి=కావు, సర్వదా=ఎల్లప్పుడు, ముక్త ఏవ అసి= ముక్తుడవే అగుచున్నావు.

ఓ రాజా! ధర్మము, అధర్మము; సుఖము, దుఃఖము- ఇవన్నియు మనోధర్మములు ; ఆత్మధర్మములు కావు. అందువలన పరిచ్ఛిన్నమైన మనోధర్మములకు అతీతుడవై, వ్యాపకుడవైన నీవు కర్తవుగాని, భోక్తవుగాని కావు.

ఏకో ద్రష్టాఽసి సర్వస్య ముక్తప్రాయోఽసి సర్వదా ।
అయమేవ హి తే బన్ధో ద్రష్టారం పశ్యసీతరమ్ ॥ 7

ఏకః=ఒక్కడవై, సర్వస్య=సర్వమునకు, ద్రష్టా=చూచువాడవు, అసి=అగుచున్నావు, చ=మఱియు, సర్వదా=నిరంతరము, ముక్తప్రాయః= అత్యంతము ముక్తుడవు, అసి=అగుచున్నావు, ద్రష్టారం=చూచువానిని, ఇతరం=ఇతరునిగా, పశ్యసిఇతియత్= చూచుచున్నా వనునదేది గలదో, అయమేవ=ఇదియే, తే=నీకు, బంధః=బంధము, హి=నిశ్చయము.

ఓ రాజా! నీవు ఏకమై, సచ్చిదానంద స్వరూపమై పరిపూర్ణమైన ఆత్మస్వరూపుడవు. సర్వసాక్షివి, మఱియు నిరంతర ముక్తస్వరూపుడవు, నీకు మూడుకాలములయందును బంధము లేదు. త్రికాలములయందును సూర్యునియందు తమస్సు లేనట్లు నీయందు బంధము లేదు. నీవు ప్రకాశ స్వరూపుడవు, సర్వ జగద్ద్రష్టవు. అయ్యును నీకంటె భిన్ను డింకొక డున్నాడని

తలంచుటయే బంధము.

**అహం కర్తేత్యహంమానమహాకృష్ణాహిదంశితః ।**
**నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీ భవ॥ 8**

అహం=నేను, కర్తా=కర్తను, ఇతి=ఇట్లనెడి, అహంమాన=అహంకార మనెడి, మహాకృష్ణాహి=గొప్పకాలసర్పముచేత, దంశితః=కరువబడిన నీవు, నాహం కర్తా=నేను కర్తను గాను, ఇతి=ఇట్లనెడి, విశ్వాసామృతం= విశ్వాసరూపమైన అమృతమును, పీత్వా=పానము చేసి, సుఖీ=సుఖివిగా, భవ=అగుము.

ఓ రాజా! "అహం కర్తా" అనగా నేను ఈ కర్మకు కర్తను, ఈ ఫలము ననుభవించుచున్నాను అనెడి అహంకారరూప కాలసర్పముచేత కరువబడి - అనగా అహంకారరూప విషమెక్కి బాధపడుచున్నవాడు ఆవిషము దిగి సుఖముగా నుండవలె నన్నచో, అహం కర్తృత్వ రహితరూప అమృతమును పానము చేయవలెను. అప్పు డావిషము నశించి సుఖి యగును. వేరొకవిధముగా సుఖింపజాలడు.

**ఏకో విశుద్ధబోధోఽహ మితి నిశ్చయవహ్నినా ।**
**ప్రజ్వాల్యాజ్ఞానగహనం వీతశోక స్సుఖీ భవ ॥ 9**

అహం=నేను, ఏకః=ఒక్కడను, విశుద్ధబోధః=అతిశుద్ధబోధ స్వరూపుడను, ఇతి=అను, నిశ్చయవహ్నినా=నిశ్చయరూపమగు అగ్నిచేత, అజ్ఞాన గహనం=అజ్ఞానరూపారణ్యమును, ప్రజ్వాల్య= దహింపజేసి, వీతశోకః= పోగొట్టబడిన దుఃఖము గలవాడవై, సుఖీ భవ=సుఖివి కమ్ము.

ఓ రాజా! ఈవిధముగా నీవు నిశ్చయరూపమగు అమృతమును త్రాగి, నేను అద్వితీయుడను అనగా సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యుడను, శుద్ధుడను అనగా అవిద్యాది రూప రహితుడను, కేవల బోధస్వరూపుడ ననెడి నిశ్చయ రూపాగ్నిచేత అజ్ఞాన రూపారణ్యమును దహింపజేసినచో నీవు జన్మ మృత్యు రూప శోకమునుండి విడివడినవాడవై పరమానందమును పొందుచున్నావు.

**యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్ ।**
**ఆనన్దపరమానన్దః స బోధస్త్వం సుఖం చర ॥ 10**

యత్ర=ఏ యానందస్వరూపమైన ఆత్మయందు, ఇదం=ఈ, విశ్వం= ప్రపంచము, కల్పితం=కల్పించబడినదై, రజ్జుసర్పవత్= త్రాటియందు పామువలె, భాతి=తోచుచున్నదో, సః=ఆ, ఆనన్దః= ఆనందాతీత పరమానంద స్వరూపుడవును, బోధః=జ్ఞాన స్వరూపుడవును, త్వం=నీవు, అసి=అగుచున్నావు, (అందువలన), సుఖం=సుఖపూర్వకముగా, చర=సంచరింపుము.

ఓ రాజా! ఏ పరబ్రహ్మరూప ఆత్మయందు ఈ జగత్తు రజ్జువు నందు సర్పమువలె కల్పింపబడి తోచుచున్నదో ఆ యాత్మ ఆనంద స్వరూపమైనది. ఇది త్రాడు అని తెలియక పూర్వము మదాంధకారములో రజ్జువే యెట్లు సర్పముగా తోచుచున్నదో, లేక రజ్జువునందు సర్పప్రతీతి కలుగుచున్నదో, అట్లే ఆత్మజ్ఞానము గలుగుటకు పూర్వము ఆత్మయందు జగత్తు కల్పితమై జగత్ప్రతీతి గలుగుచున్నది. వాస్తవమునందు రజ్జువు సర్పము కాదు, రజ్జువునందు సర్పము పూర్వముండలేదు ; వెనుక

ఉండబోదు ; ప్రస్తుతమందును లేదు. అయితే ఇది త్రాడని తెలియక పోవుటవలన మందాంధకారము మొదలగు సహకార కారణములద్వారా భ్రాంతివలన త్రాటియందు సర్పప్రతీతి కలుగుచున్నది. ఈ మిథ్యా సర్పమును చూచియే పురుషుడు పరుగెత్తుచూ, పడుచూ, లేచుచూ భయపడిపోవుచున్నాడు. అయితే 'ఇది త్రాడు' అని తెలిసిన ఒకడు వచ్చి 'అయ్యా! ఇది పాము కాదు; త్రాడు, దీనిని చూచి మీరెందుకట్లు భయపడెదరు?' అని చెప్పినప్పుడు వానియొక్క భ్రాంతి, భయము లెట్లు దూరమై పోవుచున్నవో అట్లే ఆత్మయొక్క స్వరూపము తెలియని కారణముచేత పురుషునకు జగత్ప్రతీతి కలుగుచున్నది. అట్లే జనన మరణములయొక్క భయాదులుగూడ కలుగుచున్నవి.

ఎప్పుడు బ్రహ్మవేత్త యగు గురువు "నీవు పరబ్రహ్మస్వరూపుడవు, నీ స్వరూపమును నీవు తెలిసికొనని కారణమున ఈ మిథ్యాప్రపంచము నీకు సత్యమని తోచుచున్నది. వాస్తవమునందు మూడుకాలముల యందును ఈ ప్రపంచము లేనేలేదు." అని ఉపదేశించునో అప్పుడు జగద్భ్రాంతి నశించును. నిద్రారూపమైన దోషమువలన స్వప్నమునందు పురుషు డెట్లు సింహాది క్రూరమృగములను కల్పించుకొని వాటినుండి భయపడుచున్నాడో, నిద్రనుండి మేల్కొనిన పిదప ఆ కల్పిత సింహ వ్యాఘ్రాదులయొక్క భయమెట్లు నాశన మగుచున్నదో, అట్లే ఓ జనకమహారాజా! అజ్ఞానముచేత ఈ సమస్త జగత్తు కల్పిత మగుచున్నది. ఎప్పుడు నీ స్వరూపమును ఉన్నదున్నట్లు తెలుసుకొను చున్నావో అప్పు డీజగత్తు మిథ్య యని అనగా లేనిదని తెలిసిపోగలదు.

దీనిపై జనకు డిట్లు ప్రశ్నించుచున్నాడు 'మునీంద్రా! ఆత్మ జ్ఞానమువలన అజ్ఞానము, దాని కార్యరూప మగు జగత్తు లేకుండా పోయినచో మఱి జగత్తు ఇంతవఱకు ఉత్పత్తి కాకుండానే యుండ వలయును. ఎందుకనగా అనేకమంది జ్ఞానవంతులలో గల జ్ఞానమొకటే అయిన కారణమున దానినుండి అజ్ఞానప్రపంచమే ఉత్పన్న మయినచో ఇక నీ జగత్తే ఉండగూడదు. కాని అట్లు కనిపించుట లేదు. జగత్తు యథా తథముగానే ఉన్నది. అటువంటప్పుడు అజ్ఞాననాశమువలన జగత్తు నశించిపోవునని తమరెట్లు చెప్పగలరు?'

ఉ॥ ఓరాజా! జగత్తు లేకుండా పోవుచున్న దనగా, ఇది కనబడకుండా ఉంటున్నదని అర్థము కాదు. జగత్తు మిథ్య యని నిశ్చయము కలుగుటయే దీనియొక్క నాశము. ఆలోచించినచో స్వరూపముతో ఈ ప్రపంచమునకు నాశము లేదు. ప్రవాహరూపముగా నిది యెప్పుడును ఉత్పత్తి యగుచునే ఉన్నది. కాని నాశరూపమగు ఈ జగత్తుకంటె సచ్చిదానందరూప మగు ఆత్మ వేరని తెలిసికొని ఆ స్వరూపమునందు నిలుకడ కలిగి యుండుటయే ప్రపంచముయొక్క వినాశము. అప్పుడే జననమరణరూప బంధమునుండి బయటబడగలడు.

ప్రశ్న॥ మునీంద్రా! ఈ సంసారకారణమైన అజ్ఞానము ఏకమా? అనేకమా?

ఉ॥ అజ్ఞాన మొకటే.

ప్రశ్న॥ అజ్ఞాన మొకటియే అయినచో అది నశించిన పిమ్మట దాని కార్యరూపమైన జగత్తుయొక్క స్వరూపముగూడ నాశమై పోవలయును గదా?

ఉ॥ అట్లు గాదు. విచారించినచో అజ్ఞానకార్యము తన్మాత్రలు, ఆ తన్మాత్రలయొక్క కార్యము అంతఃకరణము. ఆ యంతఃకరణముయొక్క విభాగ మనంతము. ఆకాశ మొక్కటే అయినప్పటికీ ఘటరూపోపాధులతో గూడి అది అనేక భేదములను పొందుచూ; ఘటరూపోపాధి నష్టమైన వెంటనే ఘటాకాశము మహాకాశములో కలిసిపోయినట్లు ఏ యంతఃకరణములో జ్ఞానరూపజ్యోతి ఉదయించుచున్నదో; ఆ యంతఃకరణము నశించు చున్నది. అప్పుడు ఇంతవరకు ఆ యంతఃకరణోపాధి గల జీవుడు ముక్తు డగుచున్నాడు. తక్కిన జీవులందఱు బంధమునందే పడిఉంటున్నారు. నిద్రావస్థలో నున్నవారు ఎవరికివారే స్వప్న ప్రపంచంలో ఉంటున్నారు. అయితే అందులో ఎవరు నిద్రనుండి మేల్కొనుచున్నారో వారికి ఏ స్వప్నమును లేదు. అందువలన రాజా! నీవు గూడ అజ్ఞానరూప స్వప్నమునుండి మేలుకొని నీయొక్క నిజమైన జ్ఞానస్వరూపమును తెలుసుకొని సుఖముగా ప్రపంచములో మెలగుము.

**ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి ।**
**కిం వదంతీహ సత్యేయం యా మతిస్సా గతిర్భవేత్ ॥ 11**

ముక్తాభిమానీ=ముక్తియందు అభిమానము కలవాడు, ముక్తః= ముక్తు డగుచున్నాడు, బద్ధాభిమానీ=బంధమునందు అభిమానము గలవాడు, బద్ధః=బద్ధు డగుచున్నాడు, మతిః=బుద్ధి, యా=ఎటువంటిదో, గతిః= గతి, సా=అటువంటిది, భవేత్=అగును, ఇతి=ఇట్లని, ఇహ=లోకములో, ఇయం=ఈ, కింవదంతీ=లోక ప్రవాదము, సత్యా=సత్య మైనది.

ఓ జనకా! బంధమునకు కారణము అభిమానము. 'నేను

బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను వైశ్యుడను, నేను శూద్రుడను' అని ఎవరెవరికి ఏయే విధముగ అభిమాన ముంటున్నదో వాడు ఆ యా విధముగ కర్మలను చేసి వాటి ఫలములకు భోక్త యగుచున్నాడు. మఱియు జన్మనుండి జన్మాంతరమును పొందుచున్నాడు. ఇదే బంధమని చెప్పబడుచున్నది. లేక **"నాహం బ్రాహ్మణః, న క్షత్రియః"**=నేను బ్రాహ్మణుడను కాను, క్షత్రియుడనూ కాను. మరి "శుద్ధోఽహం, నిరంజనోఽహం, నిరాకారోఽహం, నిర్వికారోఽహం" - నేను శుద్ధుడను, మాయామల రహితుడను, ఆకార రహితుడను, నిర్వికల్పుడను, బంధమోక్షము లన్నియు మనోధర్మములు గాని ముక్తుడ నగు నాయందవి మూడు కాలములలోను లేవు. నేను అన్నిటికి సాక్షిని" అని ఇటువంటి అనుభవము గల అభిమానము ఎవనికి ఉంటున్నదో, అతడు నిత్య ముక్తుడు. ఈ విషయము. గ్రంథాంతరమునందు గూడ చెప్పబడియున్నది-

**"దేహాభిమానాద్యత్పాపం న తద్గోవధకోటిభిః ।**
**ప్రాయశ్చిత్తా ద్భవేచ్ఛుద్ధిర్నృణాం గోవధకారిణామ్ ॥**

మానవునకు దేహాభిమానముచే కలిగినంత పాపము కోటి గోవులను చంపినను కలుగదు. ఎందుకనగా గోవధ చేసినటువంటివాడు శుద్ధుడగు టకు శాస్త్రము ప్రాయశ్చిత్తమును విధించినది. అనగా కోటి గోవులను చంపిన వాడైనను ప్రాయశ్చిత్తమువలన ఆపాపమును పోగొట్టు కొనవచ్చును. కానీ దేహాభిమానము గలవారికి శుద్ధికొరకు ఏశాస్త్రము నందును చెప్పబడియుండలేదు. కావున వర్ణాశ్రమాది ధర్మములను ఆత్మయం దారోపించుకొనుటయే అభిమానము. అట్టివాడే నిత్యబద్ధుడు.

అట్లుగాక యెవడు 'ఆత్మకు వర్ణాశ్రమాది ధర్మములు లేవు ; అది నిత్య శుద్ధ, బుద్ధ, ముక్తమైన'దని తలంచునో వాడే నిత్యముక్తుడు.

ఎందుకనగా శాస్త్రములో ఒకటి శాస్త్రదృష్టి యని, రెండు లౌకికదృష్టి యని ద్వివిధ దృష్టులు చెప్పబడినవి. శాస్త్ర దృష్టిలో దేహాదిక ధర్మమును అభిమానించు వానికి చమారి అని పేరు. ఎవడు చర్మాభిమాన రహితుడో అతడు దేహాదికము కంటె భిన్నమగు ఆత్మస్వరూపుడు. అతడే ముక్తుడు. లోకము గూడ "మతి యెంతో గతి యంతే" యని చెప్పుచూ ఉంటున్నది. అనగా ఎవడు ఏ నిశ్చయముతో నుండునో వాని కాఫలము ప్రాప్త మగును. అందువలన ఓరాజా! నీవు శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపుడవని నిశ్చయించు కొనుము.

ప్రశ్న॥ మునీంద్రా! జీవునకు గల యీ బంధమోక్షములు వాస్తవములా? అవాస్తవములా? ఒకవేళ బంధము వాస్తవికమే అయినచో జీవుడు మరెప్పుడూ నివృత్తిని (మోక్షమును) పొందకుండా ఉండవలెను లేదా మోక్షమే నిత్యమైనచో బంధమెప్పుడూ ఉండదని తలంచవలెను. అను ఈ ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది.

**ఆత్మా సాక్షీ విభుః పూర్ణ ఏకో ముక్తశ్చిదక్రియః।**
**అసంగో నిస్పృహశ్శాంతో భ్రమాత్సంసారవానివ॥ 12**

ఆత్మా=ఆత్మ, సాక్షీ = సాక్షి, విభుః = వ్యాపకము. పూర్ణః= పూర్ణము, ఏకః = ఏకము, ముక్తః = ముక్తము, చిత్ = చైతన్య రూపము, అక్రియః = ఇచ్ఛారహితము, అసంగః = సంగరహితము, నిస్పృహః = ఇచ్ఛారహితము, శాంతః = శాంతము నై యున్నది, భ్రమాత్=

భ్రాంతివలన, సంసారవాన్ ఇవ = సంసారము కలదివలె తోచుచున్నది.

ఓ జనకా! బంధము గాని, మోక్షము గాని వాస్తవములో ఈ రెండునూ లేవు. అయితే కేవలము తన స్వరూపాజ్ఞానమువలన దేహమునం దభిమాన ముంచుకొని జీవుడు బద్ధుడ ననుకొని ముక్తికొఱకు ప్రయత్నించు చున్నాడు. వాస్తవములో వానికి బంధమూ లేదు, మోక్షమూ లేదు. వాస్తవములో జీవుడు నిత్యుడు, పూర్ణుడు, ముక్తుడు, అసంగుడు, నిస్పృహుడు, శాంతుడునై యున్నాడు. భ్రమమూలముననే సంసారము మూడు కాలములలోనూ లేదు.

ఈవిషయమున ఒక దృష్టాంతమును చెప్పుచున్నాను - వినుము ఒకని పేరు బేవకూఫ్ (మూర్ఖుడు), ఆతనిభార్య పేరు ఫజీతి. ఒకనాడు అతని భార్య అతనితో కలహమాడి యెక్కడికో వెళ్ళెను, తరువాత అతడు భార్యను వెదుకుతూ వెదుకుతూ, అడివిలోబడి పోవుచూ ఉండెను. అక్కడ ఒకముని కనబడి. 'ఓయీ! అడవిలో ఎందుకు తిరుగుచున్నావు?' అని అడిగెను. అప్పుడు 'అతడు- అయ్యా నా భార్య కనబడలేదు. ఆమెను వెదకుచూ తిరుగుచున్నా' నని చెప్పెను ; అది విని ఆముని - 'నీ భార్య పేరేమి? నీపేరేమి?' అని ప్రశ్నించెను. 'అయ్యా! నాపేరు బేవకూఫ్, నా భార్యపేరు ఫతీజి' అని చెప్పెను. అట్లయితే బేవకూఫ్‌నకు ఫజీతులకు ఏమి తక్కువ. వాడు ఎక్కడికి వెళ్ళితే అక్కడే అది దొరుకుతుంది అని ముని చెప్పెను. దృష్టాంతములో గూడ ఎంతవఱకు జీవుడు అజ్ఞానిగను, మూర్ఖుడుగా నుండునో, అంతవరకు అతనికి జనన-మరణ రూప ప్రమాదములకు ఏమీ కొదువ యుండదు. ఎప్పుడు జ్ఞానవంతు డగునో

ఆ క్షణమే బంధమునుండి విముక్తుడు కాగలుగుచున్నాడు.

ప్రశ్న॥ మునీంద్రా! నైయాయికులు ఆత్మకు బంధమోక్షములు వాస్తవికములే అని అనుచున్నారు. అదెంతవఱకు సమంజస మైనది.

ఉ॥ జనకమహారాజా! నైయాయికుల యీ యుక్తి వేదవిరుద్ధముగా కనబడుచున్నది. ఆత్మ వాస్తవికబంధము కలదే అయినట్లయితే యెప్పటికీ దానికి నివృత్తి ఉండదు. అంతేగాదు సాధనలన్నీ వ్యర్థము కావలయును. కాని ఆలాగున వేదము చెప్పలేదు. అది ఆత్మకు నివృత్తిమార్గమును సూచించుచూ, ఆ విషయమై పదివిధములగు హేతువులను చూపించు చున్నది.

1. అహంకారాదుల కన్నిటికి ఆత్మ సాక్షిగా నున్నది గాని కర్త గాదు.

2. ఆత్మ విభువు-అనగా సర్వాధిష్ఠానమై యున్నది.

3. ఆత్మ-ఒకే ఒకటి-అనగా సజాతీయ - విజాతీయ - స్వగత భేదరహిత మైనది.

4.ఆత్మ ముక్తము - అనగా మాయకంటె. మాయాకార్యము లగు దేహాదులకంటె విలక్షణ మైనది.

5. ఆత్మ చిత్తు, అనగా చైతన్యస్వరూపము.

6. ఆత్మ అనగా చేష్టారహిత మైనది. ఎందుకనగా పరిచ్ఛిన్నము నందే క్రియ (చేష్ట)లు కలుగును గాని వ్యాపకమునందు కలుగవు.

7. ఆత్మ అసంగము. అనగా సంపూర్ణ సంబంధరహిత మైనది.

8. ఆత్మ నిస్పృహము. అనగా విషయాభిలాషలు లేనిది.

9. ఆత్మ శాంత మైనది. అనగా ప్రవృత్తి నివృత్తిరూప దేహాద్యంతరీ కరణములు లేనిది.

10. ఆత్మ కేవల భ్రమకారణమువనే సంసారివలె తోచుచున్నది.

ఈ పదికారణములవలన వాస్తవముగా ఆత్మ సంసారి కాజాలదు. **"న జాయతే మ్రియతే వా కదాచిత్"**- ఇది గీతావాక్యము. ఇంకను అనేక శ్రుతివాక్యములుగూడ ఆత్మయొక్క అసంగత్వమును గూర్చి ప్రమాణ ములై యున్నవి.

అయితే పైన నిరూపించిన యీ పరస్పరాధ్యాస రూపభ్రమ నివృత్తి కావలయు నన్నచో, ఒకసారి "ఆత్మ అసంగ మైనది" అని ఉపదేశించినంత మాత్రమున కలుగదు. దీనినిగూర్చి వ్యాసభగవానుడు చెప్పిన సూత్రమును చూడుడు-

**సూ॥ ఆవృత్తిరసకృదుపదేశాత్** ॥

జ్ఞానోపలబ్ధికొఅకు శ్రవణ - మననాదులయొక్క ఆవృత్తి మాటి మాటికి చేయవలయును. ఎందుకనగా - ఉద్దాలకుడు తన కుమారునకు **"తత్త్వమసి"** మహావాక్యోపదేశమును అర్థసహితముగా తొమ్మిది సారులు చేసెను. పలుసారులు శ్రవణ-మననాదులు చేసినందువలన చిత్తవృత్తి విజాతీయభావనను త్యజించి సజాతీయభావన గలదియై ఆత్మాకారమును పొందుచున్నది.

**కూటస్థం బోధమద్వైతమాత్మానం పరిభావయ ।**
**ఆభాసోఽహం భ్రమం ముక్త్వా భావం బాహ్యమథాంతరమ్ ॥ 13**

అహం=నేను, ఆభాసః=ఆభాసరూపాహంకారి జీవుడను, ఇతి=ఈ ప్రకార మగు, భ్రమం=భ్రాంతిరూపమగు, బాహ్యం=బాహ్య మైనట్టియు, అంతరం=లోపల నున్నట్టియు, భావం=భావమును, ముక్త్వా=విడిచిపెట్టి, కూటస్థ=కూటస్థుడ ననియు, బోధం=జ్ఞానస్వరూపుడ ననియు, అద్వైతం=ద్వైత రహితుడ ననియు, ఆత్మానం=నిన్ను, పరిభావయ= చింతింపుము.

ఓ జనకా! "నేను ఆభాసుడను, అహంకారిని" అనెడి భ్రాంతినిన్నీ, "ఇది నా శరీరము, ఇది నా కన్ను, ఇది నా చెవి" అను ఈ మొదలగు బాహ్య భావమునున్ను, మఱియు ఆంతర అంతఃకరణ ధర్మములగు సుఖదుఃఖాదుల యందలి అహంత్వాది భావము నున్ను విడిచిపెట్టి ఆత్మ అకర్త, కూటస్థము, అసంగము, జ్ఞాన స్వరూపము, అద్వైతము మఱియు వ్యాపక మైనదని భావింపుము.

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక! ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ॥ 14**

పుత్రక! = ఓ కుమారా!, (త్వం = నీవు), దేహాభిమానపాశేన= దేహాభిమాన మనెడి త్రాటిచేత, చిరం = చిరకాలమునుండి, బద్ధః= కట్టబడినవాడవు. అసి = అగుచున్నావు, అహం = నేను, బోధః= జ్ఞానస్వరూపుడను, ఇతి=అనెడి, జ్ఞానఖడ్గేన=జ్ఞానఖడ్గముచేత తత్=ఆపాశమును, నికృత్య=ఛేదించి, సుఖీభవ=సుఖివి కమ్ము.

ఓ రాజా! నేను దేహమును అనెడి యీప్రకారమగు అభిమానము వలన నీవు చాలకాలమునుండి బంధింపబడితివి. అనగా సంసార బంధము నందు తగుల్కొంటివి. ఇప్పుడు నీవు 'నేను జ్ఞానస్వరూపుడను, నిత్య ముక్తుడను' అని నిశ్చయించుకొని ఆరూపమగు జ్ఞాన ఖడ్గముతో ఆపాశమును భేదించుము. అప్పుడు నీవు సుఖింపగలవు.

**నిస్సంగో నిష్క్రియోఽసి త్వం స్వప్రకాశో నిరంజనః।**
**అయమేవ హి తే బంధః సమాధిమనుతిష్ఠతి॥ 15**

త్వం=నీవు, నిస్సంగః=సంగరహితుడవు, నిష్క్రియః= క్రియారహితు డవు:, స్వప్రకాశః=స్వయంప్రకాశ రూపుడవు, నిరంజనః= దోష రహితుడవు,(ఇట్లుండగా) త్వం=నీవు, సమాధిం=చిత్తవృత్తి నిరోధమాత్ర రూపసమాధిని, అనుతిష్ఠసి=అనుష్ఠించుచున్నావు, (ఇతియత్=అనున దేది గలదో) అయమేవ=ఇదియే, తే=నీకు, బంధః=బంధము.

నిస్సంగుడవును, నిష్క్రియుడవును, నిర్దోషుడవును, స్వయం ప్రకాశ స్వరూపుడవు నగు నీవు పాతంజలయోగ శాస్త్రానుయాయులు చెప్పినట్లు చిత్తవృత్తి నిరోధరూపయోగము బంధనివృత్తిని కలుగజేయు నానెడి ఉపదేశ ముతో చిత్తవృత్తి నిరోధమాత్ర సమాధి ననుష్ఠించుచున్నా వనున దేది గలదో అదియే నీకు బంధము. స్వయంప్రకాశమానమైన ఆత్మయొక్క ధ్యానమును జడవృత్తిని నిరోధించి చేయుచున్నా డనుటకంటె గొప్ప బంధము మఱి యొకటి లేదు. అంతకంటె అజ్ఞానమూ లేదు. ఆత్మస్వరూప జ్ఞానముకంటె భిన్నమైన మఱిదేనినుండి మోక్షోపాయము చెప్పబడినను అవన్నియు బంధకారణములనీ, బంధరూపములనీ తెలిసికొనుము.

**త్వయా వ్యాప్త మిదం విశ్వం త్వయి ప్రోతం యథార్థత: ।**
**శుద్ధబుద్ధస్వరూపస్త్వం మా గమః క్షుద్రచిత్తతామ్ ॥ 16**

ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, త్వయా=నీచేత, వ్యాప్తం=వ్యాప్తమైనది, త్వయి=నీయందే, ప్రోతం=కూర్చబడినది, త్వం=నీవు, యథార్థతః= నిజముగా, శుద్ధబుద్ధస్వరూపః=శుద్ధచైతన్య స్వరూపుడవు, క్షుద్రచిత్త తాం=నీచమైన చిత్తవృత్తిని, మా గమః=పొందకుము.

ఓ రాజా! బంగారముచే కంకణాది భూషణములున్ను, మృత్తికవలన ఘటాదిభాండములున్ను వ్యాప్తమైనట్లు ఈ సమస్త ప్రపంచమున్ను చైతన్యరూపుడ వగు నీచే వ్యాప్త మైనది. దారమునందు పూసలు గ్రుచ్చబడినట్లు ఈ సమస్త ప్రపంచమును నీయందు కూర్చబడియున్నది. వాస్తవమునందు రజతము లేకున్నను ముత్యపు చిప్పయొక్క సత్తా ననుసరించి యెట్లు అది సత్యముగా తోచుచున్నదో, అట్లే చైతన్య సత్తాసంపర్కమున నీ జగత్తు సత్య మైనట్లు తోచును. కాని వాస్తవమున సత్యము గాదు. వస్తుతః యీ ప్రపంచము లేనిదే అయినను నీ సంకల్పము చేత ఉత్పన్న మగుచున్నది. మఱల సంకల్పము లేకపోయినచో ఈ జగత్తున్ను లేనిది యగుచున్నది. అందువలన నీవు నిజ స్వరూపమునందే నిలిచియుండుము, నీచత్వమును పొందకుము.

మదాలసగూడ తన పుత్రులకు ఈ ఉపదేశమును చేసియే సంసార బంధమునుండి విముక్తుల నొనరించినది.

**"శుద్ధోఽపి బుద్ధోఽపి నిరంజనోఽపి సంసారమాయాపరివర్జితోఽపి ।**
**సంసారస్వప్నం త్యజ మోహనిద్రాం మదాలసావాక్యమువాచ పుత్రమ్ ॥**

ఓ తండ్రీ! నీవు శుద్ధుడవు, జ్ఞానస్వరూపుడవు, మాయామల రహితుడవు. సంసారరూపమాయ నీయందు లేదు. స్వప్నసదృశమైన సంసారమను మోహనిద్రను విడువుము. ఈ ప్రకారమగు ఉపదేశము వలన వారు ముక్తు లయిరి. ఓ జనకా! నీవుగూడ ఇటువంటి విచారణ చేసి జీవన్ముక్తుడవై మెలగుము.

నిరపేక్షో నిర్వికారో నిర్భరశ్శీతలాశయః ।
అగాధబుద్ధిరక్షుబ్ధో భవ చిన్మాత్రవాసనః ॥ 17

త్వం=నీవు, నిరపేక్షః=కోరిక లేనివాడవుగను, నిర్వికారః=వికార రహితుడవుగను, నిర్భరః=చిద్ఘనరూపుడవుగను, శీతలాశయః=శాంతి ముక్తిస్థానముగను, అగాధబుద్ధిః=అగాధచైతన్య బుద్ధిరూపుడవుగను, అక్షుబ్ధః=అవిద్యాక్షోభ రహితుడవుగను, చిన్మాత్రవాసనః=చైతన్య మాత్రస్వరూప స్థితుడవుగను, భవ=అగుము.

ఓ రాజా! నీవు నిరపేక్షుడవు కమ్ము. అనగా షడూర్మిరహితుడవు కావలయును. ఆకలిదప్పులు, శోకమోహములు, జననమరణములు- వీనినే షడూర్ము లందురు. ఇందులో ఆకలిదప్పులు ప్రాణధర్మములు, శోకమోహ ములు మనోధర్మములు, జననమరణములు సూక్ష్మదేహ ధర్మములు, జాయతే అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, వినశ్యతి - అనగా పుట్టుట, ఉండుట, వృద్ధిని బొందుట, పరిణామము నొందుట, క్షీణించుట, నాశన మగుట - యీ ఆరున్ను స్థూలదేహముయొక్క ధర్మములు. ఇవి ఆత్మధర్మములు కావు. అందువలన ఈ స్థూల సూక్ష్మ దేహములకు నీవు పరుడవు. ఈరెంటికిని సాక్షివి. ఇందుచేత నీవు నిర్వికారుడవును,

సచ్చిదానందరూపుడవును, శీతల అనగా సుఖరూపుడవును, అగాధబుద్ధి గలవాడవును, అవిద్యాకృతక్షోభ లేనివాడవును, క్రియారహితుడవును, చైతన్య స్వరూప నిష్ఠుడవును అయియున్నావు.

అవ॥ అష్టావక్రమునీంద్రుడు ప్రారంభమున రెండవ శ్లోకమునందు "విషయములను విషమువలె త్యజింపుము. సత్యాదులను అమృతము వలె సేవింపుము" అని జనకునకు ఉపదేశించెను, కాని అట్లు చెప్పుటకు హేతువేమో చెప్పలేదు. దానిని ఈ క్రింది శ్లోకమున చెప్పుచున్నాడు.

**సాకారమనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్ ।**
**ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవసంభవః ॥ 18**

సాకారం=శరీరాదికములగు దృశ్యములను, అనృతం=మిథ్యగా, విద్ధి=తెలిసికొనుము, నిరాకారం=నిరాకారమగు ఆత్మతత్త్వమును, నిశ్చలం=చలనరహితమై, నిశ్చలమైన దానినిగా, విద్ధి=ఎఱుగుము, ఏతత్=ఈ, తత్త్వోపదేశేన=యథార్థోపదేశముచేత, పునః=మఱల, భవసంభవః=సంసారమునందు పుట్టుట, న భవతి=జరుగదు.

ఓ జనకమహారాజా! కనబడుచున్న యీ శరీరాదులు మిథ్యయని తెలిసికొనుము. ఏది మిథ్యయై బంధనహేతు వగుచున్నదో అది విషమువలె త్యజింపదగినదై యున్నది, దీనినిగూర్చి ఒక దృష్టాంతము చెప్పెద వినుము. ఒక గ్రామములో ఒక పెద్ద షాహుకా రుండెను. అతనికి పిల్లలు లేరు. ఒకనాటిరాత్రి భార్యాభర్తలు ఒకే మంచముపై పరుండి యుండిన సమయములో భార్య భర్తతో "ఏమండీ పరమేశ్వరుడు అనుగ్రహించి మనకొక కొడుకును ప్రసాదించినచో ఎక్కడ పరుండ బెట్టుకొందము?"

అని అడిగెను. ఆ షాహుకారు కొంచెము వెనుకకు జరిగి 'యిద్దరిమధ్య పరుండబెట్టుకొందము'' అని అనెను. మఱల ఆమె "మఱియొక బిడ్డ పుట్టు ననుకొనుడు అప్పుడో?' అనెను. మఱి కొంచెం జరిగి "ఇదిగో వానినికూడ ఈ మధ్యనే పరుండబెట్టెద'' మని ఆతడనెను. మఱల ఆమె ఊరుకొనక "మరొకడు పుట్టె ననుకొనుడు అప్పుడేమి చేయుదురు?'' అని అడిగెను. ఇదిగో వానినిగూడ ఇక్కడే పరుండబెట్టుకొంద'' మని మఱి కొంచెం జరుగబోవు సరికి క్రింద పడిపోయెను. అంతట కాలు విరిగిపోయెను. అయ్యో! అమ్మో! అని ఏడవడం మొదలుపెట్టెను. ఇరుగు పొరుగువారు వచ్చి - "ఏమయ్యా! ఏమి జరిగినది? ఎందు కేడ్చుచున్నావు? కాలెందుకు విరిగిపోయిన' దని అడిగిరి. అప్పు డా షాహుకారు - "అయ్యా! ఏమీలేని - అనగా పుట్టని మిథ్యాపుత్రుడే నా కాలును విరిచివేసెను. నిజమైన కొడుకే అయినచో మరింకేమి అనర్థములు కలుగజేసి ఉండునో'' అని అనెనట. అదే విధముగా సాకారులగు స్త్రీ పుత్రాదు లందఱు దుఃఖ కారకులు. నిరాకారమగు ఆత్మతత్త్వ మొక్కటే నిశ్చల మైనది, నిత్య మైనది. ఈ విషయమున శ్రుతి యీ విధముగా చెప్పుచున్నది.

"నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ"

అనగా ఆత్మ నిత్యము, విజ్ఞానమయము, ఆనందస్వరూపము. అట్టి ఆత్మతత్త్వమునందు స్థిరత్వమును పొందిన మఱల నీవు జనన మరణరూప సంసారమును పొందకుందువు.

**యథైవాదర్శమధ్యస్థే రూపేఽన్తః పరితస్తు సః ।**
**తథైవాస్మిఞ్ఛరీరేఽన్తః పరితః పరమేశ్వరః ॥ 19**

యథా ఏవ=ఏ ప్రకారముగానైతే ఆదర్శమధ్యస్థే=అద్దముయొక్క మధ్యభాగమునందున్న, రూపే=ప్రతిబింబమునందు, అన్తపరితః= అంతట, సః=ఆశరీరము, భాసతే=తోచుచున్నదో, తథాఏవ=అట్లే, అస్మిన్ శరీరే =ఈ శరీరమునందు, అంతఃపరితః=లోపల వెలుపలకూడ, పరమేశ్వరః=పరమేశ్వరుడు, భాసతే=భాసించుచున్నాడు.

ఓ మహారాజా! అద్దమునందు ప్రతిబింబించిన శరీరాదులు అద్దముయొక్క బయటా లోపలా - అన్నివైపులా వ్యాప్తమై యుంటున్నట్లు (అయితే ఆ ప్రతిబింబము అధ్యస్తమాత్రమే, అనగా దర్పణమునందు చూచుటకు మాత్రమే గాని సత్యముగా ఉండనట్లు) ఆత్మయందు ఆరోపింపబడిన యీ శరీరాదులు అంతట నిండి ఉన్నట్లు తోచును. అయితే కల్పిత పదార్థములకు తమ అధిష్ఠానమైన సత్తకు మించి మరేమీ ఉండదు. అధిష్ఠాన సత్తను పురస్కరించుకొని సత్య పదార్థమువలె తోచుచున్నది. ఎట్లు శుక్తియందు వెండి. దర్పణములయందు ప్రతిబింబము తోచుచున్నదో, అట్లే శరీరాదులు ఆత్మయందు దానిసత్త ననుసరించి శరీరాదికములు సత్యమువలె తోచుచున్నవి. వాస్తవమునందు ఇవి సత్యములు గావు, మిథ్యా భూతములు.

అవ॥ అద్దము పరిచ్ఛిన్న మైనట్లే ఆత్మగూడ పరిచ్ఛిన్నమోనేమో యను భ్రాంతి జనకునకు దర్పణదృష్టాంతముచే గలుగునేమో యని శంకించుకొని మునీంద్రుడు రెండవ దృష్టాంతము నిచ్చుచున్నాడు.

**ఏకం సర్వగతం వ్యోమ బహిరంతర్యథా ఘటే ।**
**నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వభూతగణే తథా ॥ 20**

యథా=ఏప్రకారము, సర్వగతం=సర్వవ్యాపక మైనట్టియు, ఏకం= అద్వితీయ మైనట్టియు, వ్యోమ=ఆకాశము, బహిః=వెలుపల, అంతః= లోపల, ఘటే=ఘటమునందు, అస్తి=ఉంటున్నదో, తథా+ఏవ=అట్లే, నిత్యం=నిత్య మైనట్టియు, నిరంతరం=నిరంతర మైనట్టియు, బ్రహ్మ=బ్రహ్మము, సర్వభూతగణే=సమస్త భూతశరీరములయందును, అస్తి=ఉంటున్నది.

సర్వగతమై, ఒక్కటియైన ఆకాశము ఘటాదికములయందు వెలుపల, లోపల, మధ్యను అంతట ఎట్లు వ్యాపించియున్నదో అట్లే నిత్యమును, అవినాశియునైన ఆత్మగూడ సమస్త భూతగణములయందు వెలుపల, లోపల, మధ్యను అంతట వ్యాప్తమై యున్నది.

**"ఏష తే ఆత్మా సర్వస్యాంతర ఇతి శ్రుతేః"**

ఈ నీ ఆత్మ సర్వభూతములయొక్క అంతరములయందును వ్యాప్తమై యున్నది - అని తెలిసికొని నీవు సుఖివై యుండుము అని శ్రుతిగూడ వచించుచున్నది.

ఇది మొదటి ప్రకరణము.



ఓమ్

# అష్టావక్ర గీత

## రెండవ ప్రకరణము

## ఆత్మానుభవోల్లాసము

అహో నిరఞ్జనశ్శాన్తో బోధోఽహం ప్రకృతేః పరః ।
ఏతావన్తమహం కాలం మోహేనైవ విడమ్బితః ॥ 1

అహం=నేను, నిరఞ్జనః=దోషరహితుడను, శాన్తః=శాంత స్వరూపుడను బోధః=జ్ఞానరూపుడును, ప్రకృతేః=ప్రకృతికి, పరః=పరుడను, (అయితే), అహో=ఆశ్చర్య మేమనగా, ఏతావన్తం=ఇంత, కాలం= కాలపర్యంతము, మోహేన+ఏవ=అజ్ఞానముచేతనే, విడమ్బితః=మోసపోతిని.

నేను దోషరహితుడను, శాంతుడను, జ్ఞానస్వరూపుడను, ప్రకృతికి పరుడనైనను ఇంతకాలము అజ్ఞానముచేత నా నిజ స్వరూపము తెలిసి కొనలేక మోసపోయితిని.

అష్టావక్ర మునీంద్రుని ఉపదేశముచేత జనకునకు ఆత్మసాక్షాత్కారము కలిగినపిమ్మట జనకుడు తన అనుభవమును ప్రకటించుచు ఇదివఱకు పూర్వము తనను బాధించిన మోహమును స్మరించుచు మిక్కిలి ఆశ్చర్యముతో దానినే ప్రకటించుచున్నాడు.

నేను సంపూర్ణోపాధి రహితుడనై, సంపూర్ణవికాస రహితుడనై మాయా రూపమైన అంధకారమునకంటె పరుడనై, జ్ఞానస్వరూపుడనై యుండియు ఇంతవరకు ఆత్మానాత్మవివేకము లేనికారణమున దుఃఖినై యుంటిని.

ఇప్పుడు ఓ సద్గురూ! తమయొక్క కృపవలన నేను ఆత్మానందమును అనుభవించుచున్నాను.

**యథా ప్రకాశయామ్యేకో దేహమేనం తథా జగత్ ।**
**అతో మమ జగత్సర్వమథవా న చ కిఞ్చన ॥ 2**

యథా=ఏ ప్రకారము, ఏనం=ఈ, దేహం=దేహమును, ఏకః= అద్వితీయుడనై, ప్రకాశయామి=ప్రకాశింపజేయుచున్నానో, తథా=ఆ ప్రకారముగానే, జగత్=ప్రపంచమును గూడ, ప్రకాశయామి=ప్రకాశింప జేయుచున్నాను. అతః=ఈ కారణమువలన, సర్వం=సంపూర్ణమైన, జగత్=ప్రపంచము నాకు, కిఞ్చన=కొంచెముగూడ, న=లేదు.

నేను ఈ దేహాదుల నెట్లు ప్రకాశింపజేయుచున్నానో అట్లే యీ ప్రపంచమునుగూడ ప్రకాశింపజేయుచున్నాను. ఇందువలన ఈ ప్రపంచ మంతయు నా సంబంధ మైనదిగానే యున్నది. లేక ఒకప్పుడు నాకు సంబంధించినది కాదు.

వి॥ పూర్వవాక్యమునందు జనకుడు మోహముయొక్క మహిమను వర్ణించెను. ఇప్పు డీశ్లోకమునందు గురుకృపచే తనకు గలిగిన దేహము మఱియు ఆత్మయొక్క వివేకజ్ఞానమును యుక్తిపూర్వకముగా చెప్పుచున్నాడు. నేను ఒక్కడనైయుండి, యీ సమస్తప్రపంచమును ప్రకాశింపజేయుచున్నాను, మఱియు స్థూలదేహమునకుగూడ ప్రకాశకుడనై యున్నాను. ఈదేహము అనాత్మ, అనగా జడమగుటవలన అప్రకాశమగు జగత్తువలె నున్నది.

జడమైన దేహమునకు, చైతన్యరూపమగు ఆత్మకు అధ్యాసిక సంబంధ మున్నది. అనగా కల్పితతాదాత్మ్యసంబంధ మున్నది. అయితే

సత్యమునకు, మిథ్యకు వాస్తవిక సంబంధము లేనందున ఈ రెంటికి పారమార్థిక సంబంధము లేదు, ముత్యపుచిప్పకు, వెండికి కల్పితతాదాత్మ్య సంబంధ మున్నట్లే దేహాత్మల సంబంధముగూడ, ఎట్లు ముత్యపు చిప్ప సత్తవలన వెండి సత్యమైనదిగా తోచుచున్నదో, అట్లే ఆత్మసత్త ననుసరించి దేహముగూడ సత్యమైనదివలె తోచుచున్నది. వాస్తవమునందు దేహము మిథ్య. ఈ విధముగానే ఆత్మసత్తను పురస్కరించుకొనియే సమస్త ప్రపంచమున్ను సత్యమైనది వలె తోచుచున్నది. ఆత్మకంటె వేరైన జగత్తు మిథ్య. అనగా ఎప్పుడును ఉండునది కాదు. ఈవిషయమును పంచదశి కారుడుగూడ చెప్పెను.

"అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకమ్ ।
ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్ ॥

అనగా "అస్తి"- ఉన్నది, "భాతి"- ప్రకాశించుచున్నది. "ప్రియం" ప్రియమైనది. రూపము(గలది) నామము (గలది)- అను ఈ ఐదు అంశములు సమస్త ప్రపంచమునందు వ్యాప్తమై యుంటున్నవి. ఈ ఐదింటిలో "అస్తి-భాతి, ప్రియం" అనునట్టి యీమూడు అంశములున్ను బ్రహ్మ (ఆత్మ) సంబంధమైనవిగా ప్రపంచమునందు స్థితి గలిగియున్నవి. నామ రూపములు ఈ రెండును జడజగత్తునకు సంబంధించినవి. నామ రూపముల రెంటిని త్రోసివేసినచో ఇక జగత్తునకు సంబంధించినవి. నామరూపముల రెంటిని త్రోసివేసినచో ఇక జగత్తునకు సంబంధించి యేదీ, మిగిలి యుండదు. నామరూపములు ఎప్పుడును ఒకేస్థితిలో నుండని కారణముచేత అవి వినాశములని చెప్పబడుచున్నవి. ఇందువలన నామ

రూపములకు సంబంధించిన యీ జగత్తు మిథ్యయని తేలిపోయినది. ఇక ఆత్మాంశములైన "అస్తి, భాతి, ప్రియ" ములచేత ఈజగత్తు సత్యమైనదివలె తోచినను ఈ మూడింటిని ప్రతి ఒక్క పదార్థమునుండి వేరుచేసినచో జగత్తు సత్యమైనదిగా తోచుటకు వలనుపడదు. ఇందువలన జగత్తు మూడు కాలములయందును మిథ్య యనియు, బ్రహ్మము త్రికాలములయందును సత్యమైనదనియు తేలుచున్నది. ఈ యుక్తి సహితానుభవము కలుగుటచేత-జనకుడు ఈదృశ్య ప్రపంచ మంతయు నాయందు కల్పిత మనియు, పరమార్థదృష్టితో చూచినచో ఈ దేహాదిక మేదియు నేను గాననియు, ఆకాశమునందు నైల్యము, మరుస్థలమునందు జలము, గొడ్రాలికి బిడ్డడు, కుందేటి కొమ్ము- ఇవి మూడు కాలముల యందును ఎట్లు లేవో, అట్లే యీ జగత్తు గూడ త్రికాలములయందును లేనిదై యున్నదనియు, నేను మాయకును మాయాకార్యమగు ఈ జగత్తునకును పరమగు జ్ఞానస్వరూపుడనై యున్నానని చెప్పెను.

1. అధ్యాసమనగా-భ్రాంతిచే అది కాని దానిని అది యని తలంచుట

2. అధ్యాసిక మనగా అధ్యాసముచేత కలిగిన సంబంధము తత్త్వజ్ఞానముచేత నశించునదే గాని, సత్యము గాకుండుట.

అవ॥ ఒక్క యీ స్థూలశరీరమునకంటె గాక, స్వప్నావస్థయందుండు సూక్ష్మశరీరముకంటెను, సుషుప్త్యవస్థయందుండు కారణశరీరముకంటెను గూడ ఆత్మ విలక్షణ మైనదని విమర్శనా పూర్వకానుభవమును చెప్పుచున్నాడు.

**సశరీరమహో విశ్వం పరిత్యజ్య మయాఽధునా ।**
**కుతశ్చిత్కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే ॥ 3**

సశరీరం=శరీరసహితమైన, విశ్వం=ప్రపంచమును, పరిత్యజ్య= విడిచిపెట్టి (తనమండి వేరుచేసి), కుతశ్చిత్=ఎక్కడనో, కౌశలాదేవ= చమత్కారము వలననే (ఉపదేశమువలననే), మయా=నాచేత, అధునా=ఇప్పుడు, పరమాత్మా=పరమాత్మ, విలోక్యతే=చూడబడుచున్నాడు, (అనునది) అహో=ఆశ్చర్యము.

లింగశరీరము మఱియు కారణశరీరసహితమైన సంపూర్ణ ప్రపంచమును విచారించుటవలనను; ఆచార్యులయొక్కయు, శాస్త్రముయొక్కయు ఉపదేశమువలనను; చమత్కారమువలనను; ఆత్మకంటె వేరైనటువంటియు ఆత్మసత్తకంటె శూన్య మైనట్టియు, ఆత్మసత్తను పురస్కరించుకొని సత్యమైనదివలె తోచునట్టి యీ జగత్తును నేను మిథ్యగా తెలుసుకొని పరిత్యజించి జ్ఞానస్వరూపమగు నా ఆత్మను అవలోకించుచున్నాను. ఎందుకనగా ఆత్మజ్ఞానమునకు అతిరిక్తమైన మరే యుపాయముచేతను ఆత్మావలోకనము గాదు, (ఆత్మసాక్షాత్కారము కలుగదు.)

**యథా న తోయతో భిన్నాస్తరంగా ఫేనబుద్బుదాః ।**
**ఆత్మనో న తథా భిన్నం విశ్వమాత్మవినిర్గతమ్ ॥ 4**

యథా=ఎట్లు, తోయతః=జలముకంటె, తరంగాః=అలలు, ఫేనబుద్బుదాః=నురుగున్ను, బుడగలున్ను, భిన్నాః=భిన్నమైనవి (వేరైనవి) కావో, తథా=అట్లే, ఆత్మనిర్గతం=ఆత్మనుండి పుట్టిన (ఆత్మ విశిష్టమైన), విశ్వం=ప్రపంచము, ఆత్మనః=ఆత్మకంటె, భిన్నం=వేరైనది, న=కాదు.

ఉపాదానకారణమైన జలముకంటె అలలు, నురుగు, బుడగలు- ఎట్లు వేరు కావో, అట్లే విశ్వోపాదాన కారణమైన ఆత్మకంటె ప్రపంచము

వేరు కాదు. ఏవిధముగా తరంగ బుద్బుదాదులయందు జలము అనుగతమై యున్నదో, అట్లే శుద్ధ చైతన్యము సంపూర్ణవిశ్వమునం దనుగతమై యున్నది. కల్పిత సర్పము తనకు అధిష్ఠానమైన రజ్జువునకంటె భిన్నముగాక, రజ్జురూపమే యైనట్లు ఈ కల్పితజగత్తుగూడ అధిష్ఠానభూత మగు చైతన్యముకంటె భిన్నము గాదు.

**తంతుమాత్రో భవేదేన పటో యద్వద్విచారతః ।**
**ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్ ॥ 5**

యద్వత్=ఏ ప్రకారము, పటః=వస్త్రము, తంతుమాత్రః ఏవ=నూలుమాత్రమే, భవేత్=అగుచున్నదో, తద్వత్=అదేవిధముగ, విచారతః=విచారణవలన, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, ఆత్మతన్మాత్ర మేవ=ఆత్మసత్తామాత్రమేయని, విచారితం=ప్రతీత మగుచున్నది (తెలియుచున్నది.)

స్థూలదృష్టికి నూలుకంటె వస్త్రము వేరైనట్లు తోచినను విచారణా దృష్టితో చూచినట్లయితే తంతురూపమే వస్త్రము గాని, దానికంటె భిన్నమైన వస్తువు మఱియొకటి లేనట్లు స్థూలదృష్టికిమాత్రమే పరబ్రహ్మమున కంటె ఈ జగత్తు విలక్షణ మైనదని తోచును. అయితే యుక్తివలన విచారణవలన ఈ ప్రపంచము ఆత్మరూపమే గాని దానికంటె భిన్నము కాదని తెలియును. తంతువు తన సత్తయగుటవలన పటమునందెట్లు అనుగతమై యున్నదో, అట్లే ఆత్మగూడ తన సత్తవలన అధిష్ఠానభూత రూపమై సమస్తజగత్తు నందును అనుయాయియై యున్నది.

**యథైవేక్షురసేక్‌ప్తా తేన వ్యాప్తైవ శర్కరా ।**
**తథా విశ్వం మయిక్లృప్తం మయా వ్యాప్తం నిరంతరమ్ ॥ 6**

యథైవ=ఏ ప్రకారమయితే, ఇక్షురసే=చెఱకురసమునందు, క్లృప్తా=ఇమిడియున్న, శర్కరా=పంచదార, తేనైవ=ఆ యిక్షురసముచేతనే, వ్యాప్తా=వ్యాప్త మగుచున్నదో, తథైవ=అట్లే, మయి=నాయందు, క్లృప్తం=ఇమిడియున్న (కల్పితమైన), విశ్వం=ప్రపంచము, మయా=నా చేతనే, వ్యాప్తమై యున్నది.

చెఱకురసమునం దిమిడియున్న చక్కెర (పంచదార) దానియొక్క మాధుర్యము చెఱకురసముచేతనే వ్యాప్తమైనట్లు నిత్యానంద స్వరూపుడ నయిన నాయందు కల్పితమైన యీ ప్రపంచము నాచేతనే వెలుపలను లోపలను, అంతటను వ్యాప్తమై యున్నది. ఇందువలన నీజగత్తు ఆత్మస్వరూపమై యున్నది.

**ఆత్మాజ్ఞానాజ్జగద్భాతి ఆత్మజ్ఞానాన్న భాసతే ।**
**రజ్జ్వజ్ఞానాదహిర్భాతి తద్జ్ఞానాద్భాసతే న హి ॥ 7**

ఆత్మాజ్ఞానాత్=ఆత్మను తెలుసుకొనకపోవుటవలన, జగత్=సంసారము, భాతి=తోచుచున్నది, ఆత్మజ్ఞానాత్=ఆత్మను తెలిసికొనుటవలన, న భాతి=తోచుట లేదు, రజ్జ్వజ్ఞానాత్=త్రాడు అని తెలిసికొనకపోవుటవలన, అహిః=సర్పము, భాతి=తోచుచున్నది, చ=మరియు, తద్జ్ఞానాత్=ఆ రజ్జుజ్ఞానమువలన, న భాసతే హి=సర్పము తోచుట లేదు గదా!

"ఇది రజ్జువు" అనే జ్ఞానము కలుగనప్పుడు, భ్రాంతివలన దానియందు సర్పమే ప్రతీయమాన మగును. ఆ భ్రాంతి తొలగి

రజ్జుజ్ఞానము గలిగినచో మఱి సర్పము తోచదు. (కనబడదు.) అట్లే ఆత్మస్వరూపజ్ఞానము వలన జగత్తు తోచుచున్నది. ఆత్మస్వరూపజ్ఞానము కలిగినచో జగత్తు లేనే లేదు. అనగా ప్రబోధమువలన స్వరూపజ్ఞానము కలిగినతోడనే ప్రపంచము మిథ్య యగుచున్నది. కాకాక్షి న్యాయము ఇచట అనుసంధేయము.

**ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః ।**
**యదా ప్రకాశతే విశ్వం తదాఽహం భాస ఏవ హి ॥ 8**

ప్రకాశః=ప్రకాశము, మే=నాయొక్క, నిజం=యథార్థమైన, రూపం=రూపముగా నున్నది, తతః=ఆ ప్రకాశస్వరూపముకంటె, అహం=నేను, అతిరిక్తః=వేఱైనవాడను, న అస్మి=కాను, యదా=ఎప్పుడు, విశ్వం=ప్రపంచము, ప్రకాశతే=ప్రకాశించుచున్నదో, తదా=అప్పుడు, తత్=ఆ ప్రకాశము, అహంభాస ఏవ హి=నా ప్రకాశమువలననే, ప్రకాశతే= ప్రకాశించుచున్నది.

ప్రకాశమే నాయొక్క నిజస్వరూపము. ప్రకాశమునకంటె నేను అతిరిక్తుడను కాను. ఈజగత్తు నావలననే ప్రకాశింపజేయబడుచున్నది.

ప్రశ్న॥ ఆత్మస్వరూపము అజ్ఞానముచే ఆవరింపబడి యున్నంత వఱకు ఆత్మకు ప్రకాశము గలుగదు గదా! ఆత్మకే ప్రకాశము లేనప్పుడు దాని నాధారపడి యున్న జగత్తున కెట్లు ప్రకాశము గలుగును?

ఉ॥ నాకు ఏప్రకారము అనగా నిత్యజ్ఞానము గలదో అది నాయొక్క స్వాభావిక స్వరూపమై యున్నది. నేను ఆ ప్రకాశముకంటె భిన్నుడను గాను.

అందువలన ఎప్పుడు జగత్తు ప్రకాశించుచున్నదో అది నా నుండియే ప్రకాశించుచున్నదని తెలియవలెను.

ప్రశ్న ॥ జ్ఞానము, అజ్ఞానము- ఈ రెండు చీకటి వెలుతురులవలె పరస్పర విరుద్ధములై యున్నందున స్వరూపభూతచేతనా ప్రకాశము దగ్గర అజ్ఞాన మెట్లు నిలువగలదు? అనగా జగత్తు ఆత్మ ప్రకాశముచేత ప్రకాశింప వీలులేదని భావము.

ఉ॥ సామాన్య చైతన్య మని, విశేష చైతన్య మని రెండు విధములు. సామాన్య చైతన్యము అజ్ఞానమునకు సాధకమును, విశేష చైతన్యము అజ్ఞానమునకు బాధకమును నైయున్నది. దృష్టాంతమునందు జూడుడు. అగ్ని సామాన్య మనియు, విశేష మనియు రెండు విధములుగా నున్నది. సామాన్యాగ్ని అన్ని కట్టెలయందున్నను వాటిని దహించుట లేదు.

పై పెచ్చు వాటిని అభివృద్ధి చేయుచున్నది. ఎట్లనగా ప్రపంచము నందలి పదార్థము లన్నియు పంచభూతాత్మకము లైయ్యే యున్నవి. అందువలన కట్టెలలో నగ్ని యుండి వానిని అభివృద్ధిని పొందించుచున్నదే గాని నాశమును జేయుటలేదు. అయితే ఆ కట్టెలు ఒకటికొకటి రాపాడినచో దానియందుత్పన్న మైన అగ్ని ఆ కట్టెలను దహించుచున్నది, ఎందువల్ల ననగా దానికది విరోధియై యున్నది. ఇదే విశేషాగ్ని. అట్లే సామాన్య చైతన్యము సర్వత్రవ్యాపక మైనదై అజ్ఞానమునకు సాధకమయ్యే యున్నది. కాని ఆత్మాకారవృత్త్యవచ్ఛిన్న విశేషచైతన్య అజ్ఞానమునకు బాధకమై యున్నది. అనగా అజ్ఞాన నాశకమై యున్నది. ఒకవేళ స్వరూపచైతన్యము అజ్ఞానమునకు విరోధియే అయినట్లయితే జడాత్మకమైన జగత్తే సిద్ధించదు.

లేక ఆత్మ ప్రకాశమే లేదని చెప్పినచో జగత్తంతా అంధకారమై పోవుననే ప్రసక్తి రాగలదు. కాన ఆత్మయొక్క స్వరూప ప్రకాశమును పురస్కరించు కొనియే జగత్తు ప్రకాశించుచున్నది గాని వస్తుతః జగత్తు మిథ్యయై యున్నది.

**అహో వికల్పితం విశ్వమజ్ఞానాన్మయి భాసతే ।**
**రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా ॥ 9**

యథా=ఏ ప్రకారము, శుక్తౌ=ముత్యపుచిప్పయందు, రూప్యం= వెండియు, రజ్జౌ=త్రాటియందు, ఫణీ=సర్పమున్ను, సూర్యకరే= సూర్యకిరణముల యందు, వారి=జలమున్ను, వికల్పితం=కల్పింపబడి, భాసతే=తోచుచున్నదో, తథైవ=అట్లే, వికల్పితం=విశేషకల్పిత మగు, విశ్వం= ప్రపంచము, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, మయి=నాయందు, భాసతే=తోచుచున్నది. అహో=ఆశ్చర్యము.

ఎట్లు వాటివాటియొక్క యథార్థ స్వరూపము తెలియని కారణమున భ్రాంతిచే, ముత్యపుచిప్పయందు వెండియు, త్రాటియందు సర్పమును, మరుమరీచికలయందు జలమును తోచుచున్నవో- అట్లే స్వప్రకాశ స్వరూపుడ నైన నాయందు మిథ్యాభూతజగత్తు ప్రతీయమాన మగుచున్నది. ఇంతకంటె ఆశ్చర్యమిం కేమున్నది?

**మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయమేష్యతి ।**
**మృది కుంభో జలే వీచిః కనకే కటకం యథా ॥ 10**

యథా=యేప్రకారము, మృది=మట్టియందు, కుంభః=కుండయు, జలే=జలమునందు, వీచిః=అలలున్ను, కనకే=సువర్ణమునందు, కటకం=కడియము మొదలగు భూషణములున్ను, లయం= లీనమును,

యాన్తి=పొందుచున్నవో, (తద్వత్=అట్లే) మత్తః=నానుండి, వినిర్గతం=ఉత్పన్నమైన, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, మయ్యేవ=నా యందే, లయం=లయమును, ఏష్యతి=పొందును.

మట్టినుండి ఉత్పన్నమైన కుండ పగిలిన పిదప మరల మట్టియందే కలిసిపోయినట్లును, జలమునుండి ఉద్భవించిన తరంగములు జలము నందే లీనమైనట్లును, బంగారమునుండి తయారయిన భూషణములు బంగారముకన్న వేరుగానట్లు నా నుండి ఆవిర్భవించిన యీ జగత్తు నాయందే లీన మగుచున్నది.

ఇచ్చట సాంఖ్యశాస్త్రజ్ఞు లిట్లు ఆశంకించుచున్నారు-

ప్రశ్న॥ ఈ జగత్తు ప్రకృతియొక్క కార్యము. ప్రకృతినుండి పుట్టి మరల ప్రకృతియందే లీనమగుచున్నది. చైతన్యమగు ఆత్మనుండి జగత్తు పుట్ట లేదు ; లయమగుట లేదు, ఎందుకనగా చేతనారూపమగు ఆత్మనుండి జడమగు జగదుత్పత్తి సంభవింపదు.

ఉ॥ సాంఖ్యులు పరిణామవాదులు, పరిణామ మనగా పూర్వముండు అవస్థ అవస్థాంతరముగా మారుట. ఎట్లు పాలయొక్క పరిణామము పెరుగు, మట్టియొక్క పరిణామము కుండ, సువర్ణముయొక్క పరిణామము ఆభరణములు, అట్లే ప్రకృతియొక్క పరిణామమే జగత్తు అని వారి సిద్ధాంతము. ఆరంభవాద మని ఇంకొక వాద మున్నది. అది నైయాయి కులది. అన్యవస్తువుచే అన్యవస్తూత్పత్తికి ఆరంభవాద మని పేరు. అన్యములైన తంతువులచేత అన్యమైన వస్త్రోత్పత్తి యగునట్లు అన్య పరమాణువులచేత జగదుత్పత్తి యగుచున్నదని వారి వాదము.

ఇక మూడవది వివర్తవాదము. ఇది వేదాన్తులది. ఒకే వస్తువు తన పూర్వావస్థ నుండి మఱియొక అవస్థ పొందినట్లు తోచుట. దీనికే వివర్త వాదమని పేరు. రజ్జువే పామువలె తోచునట్లు, ఆత్మయే ప్రకృతివలె తోచుట. ఇదే వివర్తవాదము. ఒక వేళ సాంఖ్యసిద్ధాన్త ప్రకారము జగత్తు బ్రహ్మముయొక్క పరిణామమే యని అంగీకరించినచో అప్పుడు చైతన్యమునుండి జగత్తు ఎట్లుత్పన్న మగును? ఎట్లు లయించును? అను దోషము సిద్ధమగును.

ఈదోషము వేదాన్తుల మతములో లేదు. ఎందుకనగా-'ఇది రజ్జువు' అని తెలియనప్పుడు దానియందు సర్ప ప్రతీతి కలుగుచున్నది. రజ్జుజ్ఞానము కలిగినతోడనే ఆ భ్రాంతి నశించిపోవునట్లు ఆత్మయొక్క స్వరూపము తెలియకపోవుటవలన జగత్తు ప్రతీత మగుచున్నది. స్వరూపజ్ఞానము కలిగిన తోడనే తన్నివృత్తి యగుచున్నది. పరిణామవాదమునందును, ఆరంభ వాదమునందును పెక్కు దోషములు వచ్చిపడుచున్నవి. ఉదాహరణమునకు చూడుడు- వేదమునందు పరిణామవాద మనిగాని, ఆరంభవాద మనిగాని యెక్కడను లిఖించబడి యుండలేదు. కాన ఈ మతము వేదవిరుద్ధము.

రెండవది యుక్తిచేతగూడ ఈ వాదములు సిద్ధములు గావు. ఎందుకనగా- ఘటము మృత్తికా పరిణామము గాని, కుండలము సువర్ణపరిణామము గాని కాదు. ఉత్పత్తి కాలములో గూడ ఘటము మృత్తికారూపమయ్యే యున్నది. గోళాకారమై దాని రూపము, నామము కల్పితములు. కుండనుండి మట్టిని తీసివేసినచో నిక కుండయొక్క పేరే

లేదు. అందువలన ఘటము మిథ్యయై యున్నది. ఈ విధముగా సువర్ణసంబంధమైన కుండలముగూడ మిథ్యయే, మృత్తికా సువర్ణములు అన్వయరూపముతో ఘట, కుండలములవలె తోచుచున్నవి. కాని ఘట కుండలములు మృత్తికా సువర్ణ వివర్తములై యున్నవి. ఈ తాత్పర్యము లోపల నిడికొనియే జనకుడు ఈ సమస్త ప్రపంచము నానుండియే ఉత్పన్న మైనదని, నాయందే లయించుచున్నదని చెప్పెను.

ప్రశ్న॥ దీనికి వేదవాక్యప్రమాణ మేదైన గలదా?

ఉ॥ **"యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి ఇతి శ్రుతేః"** = ఏ యాత్మరూప బ్రహ్మమునుండి యీ సమస్తభూతము లుత్పత్తి యగుచున్నవో, ఏ యాత్మ సత్తవలన జీవించుచున్నవో, మఱల దేనియందు లయించుచున్నవో దానినే నీవు నీ యాత్మనుగా తెలిసికొనుము.

**అహో అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తి మే ।**
**బ్రహ్మాది స్తంబపర్యన్తం జగన్నాశేఽపి తిష్ఠతః ॥ 11**

బ్రహ్మాదిస్తంబపర్యన్తమపి=బ్రహ్మ మొదలుకొని తృణము వఱకును, తిష్ఠతః=ఉంటున్నటువంటి, యస్య మే=యే నాకు, జగన్నాశేఽపి=జగత్తు నశించిన దైనప్పటికీ, నాశః=నాశము, న అస్తి=లేదో, అహో=ఆశ్చర్యము, (అత ఏవ=ఈ కారణమువలననే), అహం=నేను, మహ్యం=నాకొఱకు, నమః=నమస్కారమును చేయుచున్నాను.

బ్రహ్మాది స్తంబపర్యంతము నేను ఉపాదానకారణ రూపముతో

నున్నప్పటికినీ, యీ జగత్తు నశించినను నేను నశించను. ఇదే ఆశ్చర్య కరమైన విషయము. కావుననే నాశరహితుడనగు నాకు నేనే నమస్కరించు కొనుచున్నాను.

ప్రశ్న ॥ బ్రహ్మము జగత్తునకు ఉపాదాన కారణమని చెప్పినట్లయితే అప్పుడతడు వికారి కావలసివచ్చును. వికారి యైనచో నాశము తప్పదు గదా!

ఉ॥ బ్రహ్మము జగత్తునకు పరిణామరూప ఉపాదానకారణ మని అంగీకరించి నట్లయితే, అప్పుడు నీవు చెప్పినట్లు దానికి వికారము, నాశము ఉన్నవని చెప్పవచ్చును. కాని మనము బ్రహ్మమునకు వివర్తోపాదాన కారణమునే అంగీకరించుచున్నాము. కావున దానికి వికార నాశములు లేవు.

**అహో అహం నమో మహ్యమేకోఽహం దేహవానపి ।**
**క్వచిన్న గంతా నాగంతా వ్యాప్యవిశ్వమవస్థితః ॥ 12**

అహం=నేను, అహో=ఆశ్చర్యరూపుడను, మహ్యం=నాకొఱకు, నమః= నమస్కారము, అహం=నేను, దేహవానపి=దేహధారి నైనప్పటికినీ, ఏకః= అద్వితీయుడను, క్వచిత్=ఎక్కడికి, గన్తా=పోవువాడను, న=కాను, క్వచిత్=ఎక్కడికి, న ఆగన్తా=వచ్చువాడను కాను, విశ్వం=ప్రపంచమును, వ్యాప్య=ఆవరించి, అవస్థితః=ఉంటున్నాను.

నేను ఆశ్చర్యరూపుడను, కావుననే నాకు నేను నమస్కరించు కొనుచున్నాను. నేను దేహధారినయ్యు, అద్వితీయుడను. నేను ఎచ్చటికిని పోవువాడను, వచ్చువాడను గాను, గాని విశ్వము నంతయు వ్యాపించి

యున్నాను.

ప్రశ్న॥ ప్రత్యేక శరీరములయందు ఆత్మ సుఖ దుఃఖములు గలదిగా తోచుటచేత, ఆత్మ అనేకమని తెలియుచున్నది. ఒకవేళ ఆత్మ ఒక్కటే అయినచో, ఒకనికి సుఖము కలిగినచో, ఆ సుఖము అందఱికిని కలుగవలెను. ఒకడు దుఃఖి అయినచో అందఱును దుఃఖితులే కావలెను. ఒకడు నడచినచో అందఱు నడచుట, ఒకడు కూర్చొనినచో అందఱు కూర్చొనుట కావలయును. ప్రపంచమునం దట్లు కనిపించుట లేదు.

ఉ॥ ఇక్కడ ఆశ్చర్యమైన విషయ మేమనగా - ఆత్మ ఒక్కటే అయినను దేహరూపోపాధులయొక్క భేదమువలన ఆత్మయు అనేకము వలె తోచుచున్నది. ఎట్లు ఒకే జలము నానారూప ఘటోపాధులవలన నానారూపములుగా తోచుచున్నదో, ఒకే సూర్యప్రతిబింబము జలోపాధుల భేదమువలన పెక్కులుగా కనుపించుచున్నదో, ఒకే ఆకాశము ఘట మఠాద్యుపాధుల భేదమువలన అనేకములుగా తోచుచున్నదో, అట్లే సుఖదుఃఖ గమనాగమనాదికము లన్నియు దేహాద్యుపాధులయొక్క ధర్మములే గాని ఆత్మధర్మములు గావు. ఇందువలన ఒకే ఆత్మ గమనాదిక రహితమై వ్యాపకమై యుంటున్నది.

**అహో అహం నమో మహ్యం దక్షో నాస్తీహ మత్సమః।**
**అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్ ॥ 13**

యేన=ఎందుచేత, శరీరేణ=శరీరముతో, అసంస్పృశ్య=వేరయి (**అంటక**), మయా=నాచేత, (ఇదం=ఈ), విశ్వం=ప్రపంచము, **ధృతం**= ధరించబడుచున్నదో, (అతః=ఈ కారణమువలన), ఇహ = ఈ

ప్రపంచములో, మత్సమః=నాతో సమాను డయిన, దక్షః=సమర్థుడు (నేర్పరి), నాస్తి=లేడు అహో=ఆశ్చర్య రూపుడనైన, మహ్యం=నాకొఱకు, నమః=నమస్కారమును చేయుచున్నాను.

ప్రశ్న ॥ అసంగమైన ఆత్మకు శరీరాదులతో సంసర్గ మెట్లశక్య మగును? మఱియు జగత్తు నెట్లు ధరింపగలుగును?

ఎట్లు సూదంటుఱాయి సంగమము లేకనే యినుము నాకర్షించు కొనుచున్నదో, అట్లే నేనుగూడ అసంగుడనయ్యే శరీరాదికమును చేష్టావంత ముగా జేయుచున్నాను. సూదంటుఱాతియందు విలక్షణశక్తి యిమిడి యున్నట్లు ఆత్మయందును ఒక విలక్షణశక్తి యున్నది. అదియే అసంగమమై, క్రియారహితమై శరీరాదులను వాటిక్రియలలో నియోగించుచున్నది. మఱియు అగ్ని నేతిముద్దకంటె వేరుగా నుండియు ఆ నేతి నెట్లు ద్రవీభూతముగా జేయుచున్నదో, అట్లే ఆత్మకూడ అన్నిటి నంటనిదయు, క్రియారహితమయ్యు సమస్త ప్రపంచమును క్రియావంతముగా జేయు చున్నది ; ఈకారణమువల్లనే నాకు నేనే నమస్కారము చేయుచున్నాను.

**అహో అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన ।**
**అథవా యస్య మే సర్వం యద్వాఙ్మానసగోచరమ్ ॥ 14**

యస్య మే=ఏ నాకు, కించన=కొంచెముగూడ, నాస్తి= లేదో, అథవా=లేనిచో, యస్య=యే, మే=నాకు, వాఙ్మానసగోచరం= వాక్కులకు, మనస్సునకు గోచర మగుచు, యత్=యే, సర్వం= సమస్తమున్ను, (అస్తి=విషయ మగుచున్నదో అట్టి), అహో=ఆశ్చర్య రూపుడనగు, అహం=నేను, మహ్యం=నా కొఱకు, నమః=

నమస్కరించుచున్నాను.

వాస్తవమునందు ఏ పదార్థముగూడ సత్యము కానందునను, కేవలము ఒక్క పరమాత్మయే సత్యమైనందునను ఈ పదార్థము లేవియు నాకు సంబంధించినవి గావు.

"నేహ నానాస్తి కించన"

ఈ చైతన్యాత్మయందు నానారూపములతో దోచుచున్న జగత్తు వాస్తవమునందు లేదు అని శ్రుతి చెప్పుచున్నది.

"మృత్యోర్స్మె మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఎవడు అనేకాత్మలను జూచుచున్నాడో అట్టివాడు మృత్యువునుండి మృత్యువును పొందుచున్నాడు- అను ద్వైతనిషేధకములగు శ్రుతివాక్యము లెన్నియో గలవు. మఱియు వాక్కునకును మనస్సునకును విషయమగున దంతయు మిథ్యయై యున్నది. దానికి చైతన్యరూప మగు ఆత్మతో ఎట్టి సంబంధమును లేదు, ఇందువలన నేను నా ఆశ్చర్యరూపమగు ఆత్మకు నమస్కారము చేయుచున్నాను.

**జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవమ్ ।**
**అజ్ఞానాద్భాతి యత్రేదం సోఽహ మస్మి నిరఞ్జనః ॥ 15**

యత్ర=ఎచ్చట, జ్ఞానం=జ్ఞానము(తెలివి), జ్ఞేయం=తెలుసు కొనదగిన వస్తువు, జ్ఞాతా=తెలుసుకొనువాడు (అను), త్రితయం= మూడున్ను, వాస్తవం=వాస్తవముగ, నాస్తి=లేవో, చ=మఱియు, యత్ర=ఎచట, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, ఇదం=ఈ మూడున్ను, భాతి= తోచుచున్నవో, సః=ఆ, అహం=నేను, నిరఞ్జనః=నిరంజన రూపుడను,

అస్మి=అగుచున్నాను.

జ్ఞాత, జ్ఞేయం, జ్ఞానము- అను ఈ త్రిపుటి వాస్తవమునందు ఆత్మకు లేనేలేదు. అయితే అజ్ఞానమువలన ఆత్మయం దీత్రిపుటి యున్నట్లు తోచుచున్నది. వాస్తవముగా చైతన్యమునకు ఈ త్రిపుటితో నెట్టి సంబంధమును లేదు. మాయయు, మాయాకార్యమును లేని నిరంజన స్వరూపమే ఆత్మయై యున్నది.

అవ॥ ప్రపంచ సంబంధము లేని నిరంజనుడ వగు నీకు దుఃఖ సంబంధమెట్లు గలిగెను అను శంక రాగా- చెప్పుచున్నాడు.

**ద్వైతమూలమహో దుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్ ।**
**దృశ్యమేతన్మృషా సర్వమేకోఽహం చిద్రసోఽమలః ॥ 16**

దుఃఖం=దుఃఖము, ద్వైతమూలం=ద్వైతకారణముగా గలది, తస్య=ఆద్వైతమూల దుఃఖమునకు, అన్యత్=ఇతరమైన, భేషజం= ఔషధము, నాస్తి=లేదు, ఏతత్=ఈ, సర్వం=సమస్తమైన, దృశ్యం= దృశ్యము, మృషా=మిథ్య, అహం=నేను, ఏకః=ఒక్కడనే, చిద్రసః=జ్ఞానైక స్వరూపుడను, అమలః=నిర్మలుడను, (అనుజ్ఞానమే ఔషధము).

ప్ర॥ ఆత్మ నిరంజనమే అయినచో దానికి దుఃఖముతో సంబంధమే ఉండరాదు. కాని లోకవ్యవహార మట్లు లేదు. "నేను అతి దుఃఖభాజనుడ" నని చెప్పుకొనుట వినుచున్నాను.

ఉ॥ నిరంజనమగు ఆత్మకుగూడ ద్వైతభ్రమవలన దుఃఖము ప్రతీత మగుచున్నదే గాని వాస్తవమునందు లేదు.

ప్రశ్న॥ అయితే యీ భ్రమరూపమైన మహావ్యాధికి ఔషధ మేమి?

ఉ॥ ఈ ద్వైతప్రతీతి యంతయు మిథ్య యనియు, వాస్తవము నందు సత్యము గాదనియు, యథార్థమైనది సత్యబోధరూపమైన ఆత్మయే యనియు గల జ్ఞానమే యీ త్రివిధ దుఃఖనివృత్తికి దివ్యౌషధము. ఇది తప్ప మరి వేరే ఔషధము లేదు.

అవ॥ అయితే యీ ద్వైతప్రపంచప్రతీతికి నిమిత్త మేమి? అను ప్రశ్నకు సమాధానము -

**బోధమాత్రోఽహమజ్ఞానా దుపాధిః కల్పితో మయా ।**
**ఏవం విమృశ్యతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ ॥ 17**

అహం=నేను, బోధమాత్రః=జ్ఞానైక స్వరూపుడను, మయా=నాచేతనే, అజ్ఞానాత్=అవిద్యవలన, ఉపాధిః=ఉపాధి, కల్పితః= కల్పింపబడినది, ఏవం=ఈ ప్రకారము, నిత్యం=ఎల్లప్పుడు, విమృశ్యతః=విచారణ చేయుచున్న, మమ=నాకు, నిర్వికల్పే=నిర్వకల్ప సమాధియందు, స్థితిః= స్థితి, భవతి=అగుచున్నది.

ప్రశ్న ॥ ద్వైత ప్రపంచాధ్యాసమునకు ఉపాదానకారణ మేది?

నిత్యజ్ఞాన స్వరూపుడనైన నేను అజ్ఞానముద్వారా ప్రపంచమునకు ఉపాదాన కారణ మగుచున్నాను; లేక అజ్ఞానసహిత కల్పిత సమస్త ప్రపంచమునకు అధిష్ఠానరూపుడ నగుటవలనను ఉపాదానకారణ మగు చున్నాను, విచారణ లేని కారణముననే యీ మిథ్యాప్రపంచ మంతయు సత్య మైనదివలె తోచుట. విచారించినచో నిది అసత్యమని తెల్ల మగును.

ఇప్పుడు నీవు నీ స్వరూప చైతన్యమును బొంది జీవన్ముక్తుడ వగుము.

అవ॥ స్వరూపచైతన్య ప్రాప్తిరూప మగు ముక్తియు పూర్వోక్త విచారము వలన బుట్టినదే గనుక అదియు నశింపవలయును. లేనిచో అనగా పుట్టనిదే యగుచో విచారహీనులకుగూడ ముక్తి కలుగవలయు ననెడి శంకకు సమాధానము-

**అహో మయిస్థితం విశ్వం వస్తుతో న మయి స్థితమ్ ।**
**న మే బన్ధోఽస్తి మోక్షో వా భ్రాన్తిశ్శాన్తా నిరాశ్రయా ॥ 18**

మే=నాకు, బన్ధో వా=బంధము గాని, మోక్షో వా=మోక్షము గాని, నాస్తి=లేదు. అహో=ఆశ్చర్య మైనవిషయ మేమనగా, మయి=నాయందు, స్థితం=ఉన్నటువంటి, విశ్వం=జగత్తు, వస్తుతః=వాస్తవముగా, మయి=నాయందు, న స్థితం=ఉండలేదు. (ఇతి విచారతః=ఇట్లు విచారించుట వలన) భ్రాన్తిః=భ్రాంతి, నిరాశ్రయా=ఆశ్రయరహిత మైనదై, శాన్తా=శాంతిని బొందుచున్నది.

ప్రశ్న ॥ ముక్తిస్వరూప మెట్టిది?

ఉ॥ ఆనందాత్మమగు బ్రహ్మప్రాప్తికే ముక్తి యని పేరు. అదే దాని స్వరూపము.

ప్రశ్న ॥ పూర్వోక్తముక్తి విచారణచేత పుట్టిన దయినట్లయితే అది అనిత్యము కావలసివచ్చును. ఎందుచేతననగా పుట్టిన దంతయు అనిత్య మగునను నియమ మున్నది. అందువలన ముక్తి పుట్టినచో నశించును, లేదా విచారణచేత పుట్టనిచో అజ్ఞానులకుకూడ ముక్తి సిద్ధించవలెను.

ఉ॥ వాస్తవమునందు నాకు బోధయు లేదు. మోక్షమున్ను లేదు. ఎందుకనగా నేను నిత్యచైతన్య స్వరూపుడను.

ప్రశ్న॥ అయితే నీకు బంధమోక్షములు లేనప్పుడు మఱి శాస్త్ర విచారముతోను, గురూపదేశముతోను ప్రయోజన మేమి?

ఉ॥ దేహాదులయందు చిరకాలమునుండి గల ఆత్మభ్రాంతి అనగా "ఇది నాదేహము, ఇవి నా యింద్రియములు, నేను బ్రాహ్మణుడను, నేను బ్రహ్మచారిని, నేను కర్తను, నేను భోక్తను" అను భ్రాంతియొక్క నివృత్తి గలిగి దేహేంద్రియాదుల కతీతుడను, సర్వసాక్షిని, శుద్ధజ్ఞాన స్వరూపుడను అను ఇట్టి యథార్థబోధ కలుగుటయే శాస్త్ర విచారమునకును, గురూపదేశ మునకును గల ఫలము. దీనిని విని జనకుడు - "ఆహా! చాల ఆశ్చర్యము. నాయందు ఈ సంపూర్ణ ప్రపంచము మూడు కాలములయందును లేదు. అను విచారమువలన నా భ్రాంతి దూరమైపోయినది" అని చెప్పెను.

అవ॥ ఉపాదానమగు అధిష్ఠానము నశింపని కారణమున ముక్తుల కును దేహేంద్రియాదులతో సంబంధ ముండవలయు నను శంకకు ఉత్తరము.

**సశరీర మిదం విశ్వం న కించిదపి నిశ్చితమ్ ।**
**శుద్ధ చిన్మాత్ర ఆత్మా చ తత్కస్మిన్కల్పనాఽధునా ॥ 19**

సశరీరం=శరీరంతోగూడిన, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, కించిదపి= కొంచెముగూడ, న=లేదు, చ=మరేమనగా, ఆత్మా=ఆత్మ, శుద్ధచిన్మాత్రః= శుద్ధచైతన్యమాత్రము, ఇతి=ఇట్లని, యదా=ఎప్పుడు, నిశ్చితమ్= నిశ్చయింపబడుచున్నదో, తదా=అప్పుడు, కస్మిన్= ఏవిషయమునందు,

అధునా=ఇప్పుడు, కల్పనా=విశ్వకల్పన? (కల్పన అనవసరమని భావము.)

ప్రశ్న॥ రజ్జురూపాధిష్ఠానమునందున్న సర్పముయొక్క భ్రాంతి మందాంధకారమునందు ఒకప్పుడు గాకున్న ఒకప్పుడైనను కలుగుటకు అవకాశ మున్నట్లు అధిష్ఠాన చైతన్య రూప మగు ముక్తియందును జగద్భ్రాంతి కలుగవచ్చును.

ఉ॥ శరీరసహితమగు ఈ జగత్తు కొంచెమైనను సత్యమైనది గాదు, మఱియు అసత్య మైనదీ గాదు. మరేమనగా అనిర్వచనీయాజ్ఞాన కార్య మగుటవలన నిదియును అనిర్వచనీయమై యున్నది. ఈ అనిర్వచనీయ జ్ఞానముయొక్క నివృత్తి గలిగినచో దానికార్యము ప్రపంచము గూడ నివృత్త మగుచున్నది. అజ్ఞానమే కల్పితప్రపంచమునకు కారణమై యున్నది. ఆ యజ్ఞానము నాశనమైనచో మఱల ముక్తపురుషునియందు ప్రపంచోత్పత్తి కానేరదు. ఎట్లు మందాంధకారము తొలగిపోయినతోడనే సర్పభ్రాంతిగూడ నశించిపోవునో, అట్లే ప్రకాశస్వరూపమైన ఆత్మజ్ఞానమువలన మఱల ఎప్పుడును విశ్వోత్పత్తి కానేరదు.

అవ॥ ప్రపంచ మంతయు మిథ్య యగునేని వర్ణాశ్రమజాతియుక్త మగు శరీరమున్ను మిథ్యయే యగును. అప్పు డన్నియు మిథ్య కావలసివచ్చును. అనుదానికి అంగీకారపూర్వకముగా సమాధానమును చెప్పుచున్నాడు.

**శరీరం స్వర్గనరకౌ బంధమోక్షౌ భయం తథా ।**
**కల్పనామాత్రమే వై తత్కిం మే కార్యం చిదాత్మనః ॥ 20**

ఏతత్=ఈ, శరీరం=శరీరమున్ను, స్వర్గనరకౌ=స్వర్గనరకములున్ను, బంధమోక్షౌ=బంధమోక్షములున్ను, తథా=ఆ ప్రకారమే, భయం=భయమున్ను, కల్పనామాత్రమేవ=కల్పనామాత్రమే యైయున్నది. చిదాత్మనః=చిత్స్వరూపుడ నగు, మే=నాకు, (ఏతేన=దీనితో) కిం=ఏమి, కార్యం=కార్యము.

ప్రశ్న॥ ఒకవేళ సంపూర్ణప్రపంచము అవాస్తవిక మైనదని తలంచినచో అప్పుడు జాతి ఆశ్రమయుత మగు శరీరముగూడ అవాస్తవికము కావలసి వచ్చును. అప్పుడు శరీరము నాశ్రయించి ప్రవర్తించియున్న విధినిషేధ శాస్త్రముగూడ వ్యర్థ మగును. పిదప శాస్త్రములచే ప్రబోధింపబడు స్వర్గ నరకములు గూడ అనాస్తకములు కావలసివచ్చును. అప్పుడు స్వర్గము నందలి అనురాగమును, నరకమువలని భయమును లేకుండబోవును. అప్పుడు మోక్షముగూడ వ్యర్థమైపోవలసివచ్చును గదా!

ఉ॥ శరీరాదికము కల్పనామాత్రమే సచ్చిదానంద స్వరూపాత్ముడ నగు నాకు ఈ శరీరాదులతో నేమి సంబంధము? ఎందుకనగా సత్యమున కును, మిథ్యకును వాస్తవిక సంబంధము కుదుర్చుట శక్యము గాదు. మఱియు విధినిషేధ వాక్యము లన్నియు అజ్ఞానిని గూర్చియే యైయున్నవి. జ్ఞానికి వాటి ప్రసక్తే లేదు. ఇందువలన జ్ఞానిదృష్టిలో శరీరాదికములు విధినిషేధము లన్నియు అవాస్తవికములు.

అవ॥ పూర్వము స్వర్గాదులతో తనకు పనిలేదని చెప్పియుండెను. ఇప్పుడు ఇహలోకముతో సంబంధం లేదని చెప్పుచున్నాడు.

**అహో జనసమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ ।**
**అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహమ్ ॥ 21**

జనసమూహేఽపి=జన సమూహ మధ్యమునందును, ద్వైతం= ద్వైతమును, పశ్యతః=చూచుచున్నటువంటి, మమ=నాకు, అరణ్య మివ=అరణ్యమునవలె, న సంవృత్తం=కాలేదు, తస్మాత్= ఆకారణము వలన, అహం=నేను, క్వ=ఎక్కడ, రతిం= (మోహమును) రతిని, కరవాణి= చేయగలను, అహో=ఆశ్చర్యము!

తా॥ ఓగురుదేవా! జనసమూహము మధ్య ద్వైతమనే అరణ్యము నందున్నట్లున్నను నాకేమియు వారలయందు ప్రీతి గాని, వ్యామోహము గాని కలుగలేదు. ఎందుకనగా దానిని నేను మిథ్యయని తెలుసుకున్నాను. మిథ్యా వస్తువులయందు జ్ఞాని యెన్నడూ ప్రీతి నుంచడు. అజ్ఞానియే మిథ్యావస్తువులం దాసక్తు డగును. ఇదియే జ్ఞానికిని అజ్ఞానికిని గల భేదము.

అవ॥ వ్యావహారికమునకు అహంతా మమతాదు లావశ్యక మైనందున శరీరాభిమానము కలుగుచున్నది గదా? అను శంకకు సమాధానము-.

**అహం దేహో న మే దేహో జీవో నాహ మహం హి చిత్ ।**
**అయమేవ హి మే బన్ధ ఆసీ ద్యా జీవితే స్పృహా ॥ 22**

అహం=నేను, దేహః=శరీరం, న=కాను, మే=నాకు, దేహః=దేహము, న=లేదు, అహం=నేను, జీవః=జీవుడను, న=కాదు, చిత్=జ్ఞాన స్వరూపుడను, (అస్మి=అగుచున్నాను), జీవితే=జీవితమునందు, **యా=యే, స్పృహా=ఆశ (యనునదేది గలదో) అయమేవ=ఇదియే, మే=నాకు,** బంధః=బంధము.

ప్రశ్న ॥ అహంకార మమకారములు లేకుండా వ్యవహారసిద్ధి కాదు. కాబట్టి శరీరమునందు తప్పక మమకార ముంచవలసియే యున్నది గదా?

ఉ॥ నేను చైతన్యస్వరూపుడ నగుటవలన జడమగు దేహమును గాని, అనంగుడ నగుటవలన దేహముకూడ నాకు లేదు. అహంకారము కర్తృత్వధర్మము గలది. కావున నేను అహంకారమును కాను.

ప్ర॥ అయితే మరి నీవెవరు?

ఉ॥ నేను చైతన్యస్వరూపుడను. అహంకారమునకు సాక్షిని, అకర్తను, అభోక్తను.

ప్రశ్న॥ నీవు తినుట, త్రాగుట మొదలగు పనులను చేయు చున్నప్పుడు అకర్తవును, అభోక్తవు నెట్లు కాగలవు?

ఉ॥ అజ్ఞానుల దృష్టిలో నేను వ్యావహారికమునకు కర్తవలె తోచుచున్నాను. వాస్తవమునందు నేను కర్తను గాను. ఎందుకనగా కర్తృత్వ భోక్తృత్వములు అహంకారాదులయొక్క ధర్మములు. అవి ఆత్మ ధర్మములు కావు. మఱియు

"నిద్రా భిక్షే స్నాన శౌచే నేచ్ఛామి న కరోమి చ ।
ద్రష్టారశ్చేత్కల్పయన్తి కిం మే స్యాదన్యకల్పనాత్ ॥"

అనగా పరుండుకొనుట, లేచుట, భిక్ష తీసికొనుట, స్నానము చేయుట, పరిశుద్ధముగా నుండుట- ఈ మొదలగునవి నేను కోరుట లేదు. మఱియు వాటిని చేయుట లేదు. అయితే చూచేవాడు వీటిని నేను చేయుచున్నానని అనుకున్నట్లయితే దానికి నేను చేయవలసిన దేమున్నది? ఆ యారోపణవలన నాకు కలుగ గల హాని యేమి? ఇప్పు డీవిషయమై

దృష్టాంతము చెప్పబడుచున్నది.

"గుంజా పుంజాది దహ్యేత నాన్యారోపితవహ్నినా ।
నాన్యారోపిత సంసార ధర్మానేవ మహం భజే ॥

అర్థమేమనగా - శీతకాలపు దినములలో, అరణ్యములో కోతులు చలిపోవుట కొఱకు గురవింద గుత్తులను ప్రోగుచేసి అదే అగ్ని అనుకొని దానిచుట్టూ కూర్చొని ఉండును. అవన్నియును ఒకదానిపై నొకటి ఒరసుకొని కూర్చున్నందున వాటి శరీరమునుండి కలిగిన వెచ్చదనమునే అవి గురివింద కుప్పనుండి కలిగినదని అనుకొనుచున్నవి. కాని వాస్తవముగా గురివింద గింజలలో అగ్ని ఉన్నదా? ఏ విధముగా కోతులచేత కల్పన చేయబడిన గురువింద గింజల అగ్ని దేనిని కాల్చుటకూ ఎట్లు సమర్థము కాదో, అట్లే మూర్ఖులచేత కల్పింపబడిన భోజనాది కల్పనగూడ జ్ఞానికి ఏమీ హానిని చేయజాలదు, జ్ఞాని దృష్టిలో దేహాదికము లేదు, కర్తృత్వ భోక్తృత్వ ధర్మములు లేవు. మఱేమనగా అతడు నిస్సంగుడై యున్నాడు.

ప్రశ్న॥ అవివేకులకు, వివేకులకుగూడ బ్రతుకుటయం దిచ్ఛ యెందుకు కలుగుచున్నది?

ఉ॥ బ్రతుకవలె ననెడి కోరికయే బంధము. జీవించవలె ననెడి కోరిక యుండుటచేతనే అవివేకులు అనేకానర్థ కార్యములను చేయుచున్నారు, వివేకులు అట్టి పనులను చేయరు. కావుననే నాకు జీవించుటయందు కాని మరణించుటయందు గాని యిచ్ఛ లేదు. ఎందుకనగా అవన్నియు అంతఃకరణ ధర్మములై యున్నవి. అసంగచైతన్య స్వరూపుడ నగు నా ఆత్మ ధర్మములు కావు.

**అహో భువనకల్లోలై ర్విచిత్రైర్ద్రాక్సముత్థితమ్ ।**
**మయ్యనన్తమహామ్భోధౌ చిత్తవాతే సముద్యతే ॥ 23**

అనన్తమహామ్భోధౌ=అపారసుఖ సముద్రము వలెనున్న, మయి= నాయందు, చిత్తవాతే=చిత్తమను వాయువు. సముద్యతే=వీచిన దగుచుండగా, విచిత్రైః=విచిత్రములైన (నానావిధములైన), భువనకల్లోలైః=ప్రపంచ సంబంధము లగు తరంగములచేత, ద్రాక్= శీఘ్రముగా, సముత్థితమ్=పుట్టుట (తరంగము లుత్పన్నము లైనవని భావము.)

వాయువు వీచినందువలన సముద్రమునందు పెద్దవి, చిన్నవి-అనేక విధములగు తరంగము లుత్పన్నము లగుచు, వాయువు నిలిచిపోయిన తోడనే తరంగములయొక్క ఉద్భూత్తియు నెట్లు అడగి మఱల దానియందే లీనమైపోవుచున్నవో, అట్లో ఆత్మరూప మహాశాంత సముద్రమునందు చిత్తరూప వాయుచలనముచే బ్రహ్మండములగు బ్రహ్మండరూప తరంగములు లేచుచు, మరల చిత్తము శమించగానే లయ మగుచున్నవి, ఎట్లు సముద్రమునుండి ఉత్పన్నములైన తరంగములు మరల సముద్రము నందే లీన మగుచున్నవో, సముద్రముకంటె ఎట్లు భిన్నము గావో అట్లే యీ జగద్రూప తరంగములు గూడ ఆత్మనుండి ఉత్పన్నములై ఆత్మ యందే లీనమగుచున్నవి. అవి ఆత్మకంటె భిన్నములు కావు. ఎందుకనగా కల్పిత పదార్థము అధిష్ఠానముకంటె భిన్నము గాదు కదా!

**మయ్యనన్తమహామ్భోధౌ చిత్తవాతే ప్రశామ్యతి ।**
**అభాగ్యాజ్జీవవణిజో జగత్పోతో వినశ్వరః ॥ 24**

అనన్తమహామ్భోధౌ=అపారసముద్రరూపుడ నగు, మయి=నా యందు, చిత్తవాతే=చిత్తరూపమగు వాయువు, ప్రశామ్యతి=శాంతించిన దగుచుండగా, జీవవణిజః=జీవరూపుడగు వ్యాపారియొక్క, జగత్పోతః= జగద్రూపమైన నౌక (శరీరం), అభాగ్యాత్=దురదృష్టమువలన, వినశ్వరః= నశించిపోయినది.

అపారశాంత మహాసముద్రమువలె నున్న నాయందు సంకల్ప వికల్పాత్మ మగు మనోరూపవాయువు శాంతించగా జీవరూపుడగు వ్యాపారి యొక్క శరీరరూపమగు నావ నాశనమైనది. అనగా ఎప్పుడు సంకల్పా దులు నశించినవో అప్పుడు శరీర భ్రాంతియు, జీవభ్రాంతియు నుండదని భావము. ఇక్కడ ఆశ్చర్యమైన విషయ మేమనగా పెద్ద పెద్ద తుఫానులవలన నావ నాశన మగుట సహజముగాని యిచట వాయు ప్రశమనమువలననే శమించినది. మనస్సు చలనరహిత మైనప్పుడే ముక్తి సిద్ధించునని తాత్పర్యము.

**మయ్యనన్తమహామ్భోధావాశ్చర్యం జీవవీచయః ।**
**ఉద్యన్తి ఘ్నన్తి ఖేలన్తి ప్రవిశన్తి స్వభావతః ॥** 25

అనన్తమహామ్భోధౌ=అపారమహాసముద్ర రూపుడనైన, మయి= నాయందు, జీవవీచయః=జీవులను తరంగములు, ఉద్యన్తి= లేచుచున్నవి, ఘ్నన్తి=ఒకదానితో నొకటి ఒరచుకొనుచున్నవి, ఖేలన్తి= ఆడుకొనుచున్నవి, స్వభావతః=స్వభావముగానే, ప్రవిశన్తి=లయించు చున్నవి.

క్రియారహితమును నిర్వికారము నగు ఆత్మరూప మహా సముద్రమునందు జీవరూపవీచులు అనగా తరంగములు ఉత్పన్నము

లగుచున్నవి. మఱియు పరస్పరాధ్యాసమువలన ఒకదానితో నొకటి ఢీకొనుచున్నవి, ఆటలాడుకొనుచున్నవి, లయించుచున్నవి. స్వప్నావస్థ యందున్న జీవులు స్వప్నమునందు పరస్పర విరుద్ధములగు కార్యములను జేయుచు, ఎప్పుడు అవిద్యాదికము నాశమౌనో, అప్పుడు మఱల నా నిజస్వరూపమునందు లయ మగుచున్నవి. మఱియు అవిద్యాదికమువల్లనే ఉత్పన్నము లగుచున్నవి. మఱల లయించుచున్నవి. ఎట్లు ఘటరూపోపాధి ఉత్పత్తివలన ఘటాకాశోత్పత్తి చెప్పబడుచున్నదో, మఱియు ఘటరూపోపాధి నాశమువలన ఘటాకాశమే నశించినదను వ్యవహారము కలుగు చున్నదో, వాస్తవమునందు ఆకాశము ఉత్పత్తి యగుట గాని నశించుట గాని లేదో, అట్లే శరీరస్థ మగు ఆత్మకుగూడ ఉత్పత్తియు లేదు. నాశమును లేదు. జ్ఞానికి బాధితానువృత్తి వలననే జగత్ప్రతీతి కలుగుచున్నది. దానిచే అతనికి ఏమియు హాని లేదు.

ఇది రెండవ ప్రకరణము.



ఓమ్

# వక్రగీత

## మూడవ ప్రకరణము

## ప్రత్యాక్షేపద్వారోపదేశము

అవ॥ రెండవప్రకరణమునందు జనకుడు నివేదించిన దానినిబట్టి అతడు అనుభవజ్ఞానము గలవానివలె కనబడినను, లోకవ్యవహారము నందున్నవా డగుటవలన అతని విజ్ఞానము నింకను పరీక్షింప గోరినవాడై అష్టావక్ర మునీంద్రుడు ఇట్లు ప్రశ్నించుచున్నాడు.

**అవినాశినమాత్మానమేకం విజ్ఞాయ తత్త్వత: ।**
**తవాత్మజ్ఞస్య ధీరస్య కథమర్థార్జనే రతి: ॥ 1**

ఏకం=అద్వయమ్మైన, అవినాశినం=నాశరహితమైనట్టి, ఆత్మానం= ఆత్మను, తత్త్వతః=యథార్థముగా, విజ్ఞాయ=తెలుసుకొని, ధీరస్య= ధీరుడ వైనట్టియు, ఆత్మజ్ఞస్య=ఆత్మజ్ఞుడవై నట్టియు, తవ=నీకు, అర్థార్జనే=అర్థార్జనమునందు, కథం=ఎట్లు, రతిః=ఆసక్తి, (భవతి= కలుగుచున్నది.)

ఓ జనకుడా! నాశరహితమును, నిర్వికల్పమును, దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమును, ద్వైతరహితము నగు చైతన్య స్వరూపాత్మను తెలిసికొని ధీరుడవై, ఆత్మజ్ఞుడవై మఱల ధనాధిక సంగ్రహమునం దెట్లు ప్రీతి గలవాడ వగుచున్నావు? అనగా ఆత్మజ్ఞానివి అయినపిదపగూడ

ధనమునం దాసక్తుడవుగా కనబడుచున్నావు. దీనికి కారణమేమి?

**ఆత్మజ్ఞానాదహో ప్రీతిర్విషయ భ్రమగోచరే ।**
**శుక్తేరజ్ఞానతో లోభో యథా రజతవిభ్రమే ॥ 2**

యథా=ఏ ప్రకారము, శుక్తేః=ముత్యపుచిప్పయొక్క, అజ్ఞానతః= జ్ఞానము లేకపోవుటవలన, రజతభ్రమే=వెండి యనెడి భ్రాంతియందు, లోభః= లుబ్ధత గలుగుచున్నదో, తథా=అట్లే, ఆత్మజ్ఞానాత్=ఆత్మను తెలిసికొనకపోవుటవలన, విషయభ్రమ గోచరే=నశ్వరములగు దృశ్య విషయములయందు, ప్రీతిః=ప్రీతి (భవతి=గలుగుచున్నది.)

ఓ శిష్యా! ఆత్మ స్వరూపజ్ఞానము లేని కారణముచేతనే విషయము లందు అనగా భార్య, బిడ్డలు, ధనము మొదలుగా గల వాటియందు ప్రీతి కలుగుచున్నది. జ్ఞానము కలిగినచో ఆ యాసక్తి గలుగదు. ఎందుకనగా ఎప్పుడు ఆత్మజ్ఞానము కలుగుచున్నదో అప్పుడు విషయము లిట్టి వనెడి బోధ కలుగుచున్నది. దీనికి లోక ప్రసిద్ధమగు ఉదాహరణమును చెప్పెదను వినుము - ముత్యపుచిప్ప అను జ్ఞానము కలుగని కారణముచేతనే అది వెండి యనుకొని దానియందు లుబ్ధు లగుచున్నారు. ముత్యపుచిప్ప యని తెలిసినచో మఱి వెండి యనెడి భ్రాంతియే లేదు గదా!

**విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే ।**
**సోఽహమస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి ॥ 3**

యత్ర=ఏ ఆత్మరూప సముద్రమునందు, ఇదం=ఈ, విశ్వం= ప్రపంచము, తరంగా ఇవ=తరంగములవలె, స్ఫురతి=తోచుచున్నదో సః=ఆయాత్మయే, అహం=నేను, అస్మి=అగుచున్నాను, ఇతి=ఈ

ప్రకారము, విజ్ఞాయ=తెలిసికొని, కిం=ఎందుకొఱకు, దీన ఇవ= దీనునివలె, ధావసి=(విషయముల పైకి) పరుగెత్తుచున్నావు.

సముద్రమునందు బుట్టిన తరంగములకు సముద్రజలసత్తకంటె వేరుసత్త యెట్లు లేదో, అదే విధముగ ఈ జగత్తునకుగూడ ఆత్మసత్తయే గాని, తన సత్త ఏమాత్రము లేదు. అంతటికీ అధిష్ఠానమైన ఆత్మయే అంతట ఉన్నదున్నట్లున్నది- అను ఈ ప్రకారమైన ఆత్మ సాక్షాత్కార జ్ఞానము కలవాడు తృష్ణావ్యాకులచిత్తము గలవానివలె దీనుడై విషయముల మీదికి పరుగిడడు.

అవ॥ ఆచార్యుడు పైని చెప్పిన మూడు శ్లోకములను చెప్పి, జ్ఞాని యగు శిష్యునికొఱకు విషయవిషయక వ్యవహారమును నిందించుచున్నాడు.

**శ్రుత్వాఽపి శుద్ధచైతన్యమాత్మానమతిసున్దరమ్ ।**
**ఉపస్థేఽత్యంతసంసక్తో మాలిన్యమధిగచ్ఛతి ॥ 4**

అతిసున్దరం=మిక్కిలి సుందర మైనటువంటి, శుద్ధచైతన్యం= శుద్ధచైతన్య రూపమగు, ఆత్మానం=ఆత్మను, శ్రుత్వాఽపి=వినియు (తెలిసి కొనియు) ఉపస్థే=సమీపమునందున్న విషయములయందు, అత్యన్త సంసక్తః=మిక్కిలి ఆసక్తి గలవాడు, మాలిన్యం=అపరిశుద్ధతను, అధిగచ్ఛతి=పొందుచున్నాడు.

ఆత్మవేత్త యగువాడు గురుముఖమునుండియు, వేదాన్తవాక్యము వలనను, ఆత్మయొక్క శుద్ధ స్వరూపమును శ్రవణము చేయుటవలన, ఆత్మ సాక్షాత్కారమును పొందిన పురుషుడు విషయములయం దెట్లు

సంసక్తు డగును? అతడెట్లు మూఢత్వమును పొందును? ఇది గొప్ప ఆశ్చర్యకరమైన విషయముగా నున్నది.

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**మునేర్జానత ఆశ్చర్యం మమత్వమనువర్తతే ॥ 5**

సర్వభూతేషు=సమస్తభూతములయందును, ఆత్మానం= తనను, చ=మఱియు, సర్వభూతాని=సమస్తభూతములను, ఆత్మని=ఆత్మ యందును, జానతః=తెలుసుకున్నటువంటి (చూచుచున్నటువంటి) మునేః=మునికి, మమత్వం=మమకారము, అనువర్తతే=అనుసరించి వచ్చుచున్నది (అనునది). ఆశ్చర్యం=ఆశ్చర్యకర మైనది.

బ్రహ్మ మొదలుకొని స్థావరపర్యంతము గల సమస్త భూతముల యందును అధిష్ఠానమైన ఆత్మ తానే యనియును, సమస్త భూతములును తన ఆత్మయందే యున్న వనియును ఎవడు తెలుసుకొనుచున్నాడో, అటువంటి వానికి విషయములయందు మమత్వము కలిగిన దన్నచో అంతకంటె ఆశ్చర్యకరమగు విషయ మేమున్నది? ఎందుకనగా శుక్తియందు రజతము కల్పితమని తెలుసుకొన్న తరువాత మఱల రజతభ్రాంతి యుండదు గదా?

**ఆస్థితః పరమద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః ।**
**ఆశ్చర్యం కామవశగో వికలః కేలిశిక్షయా ॥ 6**

పరమాద్వైతం=పరమాద్వైతమును, ఆస్థితః=ఆశ్రయించి నటువంటివాడై, మోక్షార్థే అపి=మోక్షార్థమునందుగూడ, వ్యవస్థితః=ప్రయత్నపరుడైన

పురుషుడు, కామవశగః=కామమునకు వశుడై, కేళిశిక్షయా= క్రీడాభ్యాసములచేత, వికలః=వికలు డగుచున్నాడు (అనునది.) ఆశ్చర్యం= ఆశ్చర్యకరమైన విషయము.

సజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమైన అద్వైతాత్మయొక్క సాక్షాత్కారమును పొంది సచ్చిదానందాత్మయందు స్థితుడై యున్నవాడు మఱల కామమునకు వశుడై నానావిధ క్రీడాసక్తుడుగా (విషయ లోలుడుగా) కనబడుచున్నాడు అనుటకంటె ఆశ్చర్యకరమగు విషయ మేమున్నది?

**ఉద్భూతం జ్ఞానదుర్మిత్రమవధార్యాతిదుర్బలః ।**
**ఆశ్చర్యం కామమాకాంక్షేత్కాలమన్తమనుశ్రితః ॥ 7**

ఉద్భూతం=ఉత్పన్నమైన, జ్ఞానదుర్మిత్రం=జ్ఞానశత్రువైన కామమును, అవధార్య=ధారణచేసి, అతిదుర్బలః=మిక్కిలి దుర్బలుడై, అన్తకాలం= అంతకాలమును, అనుశ్రితః=ఆశ్రయించి నటువంటివాడు, కామం= కామమును, ఆకాంక్షేత్=కోరును, ఆశ్చర్యం=ఆశ్చర్యము!

జ్ఞాని యగువాడు కామము జ్ఞానమునకు అత్యంత విరుద్ధమని తెలిసిగూడ మఱల విషయాసక్తు డగుచున్నాడు అనుదానికంటె ఆశ్చర్య కరమగు విషయ మేమున్నది? ఎట్లు మృత్యువుచేత గ్రహించబడినవాడు విషయభోగములయం దిచ్ఛ నిడజాలడో, అట్లే వివేకబుద్ధి గలవాడు విషయభోగేచ్ఛ నెన్నడును చేయడు.

**ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్యవివేకినః ।**
**ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ బిభీషికా ॥ 8**

ఇహ=ఇహలోక భోగములనుండియు, అముత్ర=పరలోక భోగముల నుండియు, విరక్తస్య=విరక్తు డైనటువంటిన్ని, నిత్యానిత్య వివేకినః= నిత్యానిత్యవివేకము గలిగినటువంటిన్ని, మోక్షకామస్య= మోక్షమును గోరు పురుషునకు, మోక్షాదేవ= మోక్షమునుండియే, బిభీషికా=భయము (కలుగుచున్నది) అనునది, ఆశ్చర్యం=ఆశ్చర్యము!

ఆత్మ నిత్యమని, శరీరాదికము అనిత్యమని వివేచన చేసి తెలుసు కొన్నవాడే వివేకపురుషుడు. మఱియు ఆనందరూప పరబ్రహ్మ ప్రాప్తికే మోక్ష మనిపేరు. ఇటువంటి మోక్షమును గోరునటువంటి జ్ఞాని నశ్వరము లగు భార్య, బిడ్డలు, ధనాదులను విడువలేక 'అయ్యో! వీనినుండి నాకు వియోగము కలుగుచున్నదే. నేనెట్లు సహింపగలను?' అని భయపడుటకంటె ఆశ్చర్యకరమగు విషయ మేమున్నది? స్వప్నమందు కనబడిన ధనము మేలుకొన్న తర్వాత నశించినచో నెవడును చింతించడు గదా!

**ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా ।**
**ఆత్మానం కేవలం పశ్యన్న తుష్యతి న కుప్యతి ॥ 9**

ధీరస్తు=ధీరుడగు ఆత్మజ్ఞాని యయితే, భోజ్యమానోఽపి= భోగముల ననుభవించుచున్న వాడైనప్పటికిని, చ=మఱియు, పీడ్యమానోఽపి = పీడింపబడుచున్న వాడైనప్పటికిని, సర్వదా=ఎల్లప్పుడు, కేవలం=ఏకమైన, ఆత్మానం=ఆత్మస్వరూపు డగు తనను(ఆత్మను), పశ్యన్=చూచుచున్న వాడై, న తుష్యతి=సంతోషించడు, న కుప్యతి=కోపించడు.

జ్ఞానికి శోకము గాని, కోపము గాని యుండరాదు. జ్ఞాని యగువాడు లోకుల దృష్టిలో భోగము లనుభవించు వాడువలె నున్నను లేక లోకులచేత

నిందితుడై బాధింపబడుచున్నను, ఎల్లప్పుడు ఏ సమయమునందును సుఖ దుఃఖరూప భోగములనుండి రహితుడై కేవలాత్మావలోకనము చేయుచు భోగానుభవమువలన సంతోషించడు. అవి లేనిచో దుఃఖించడు. ఎందుకనగా, సంతోషము గాని, కోపము గాని ఆత్మయందుండ వీలులేదు. అందుచేత జ్ఞానియందుగూడ సంతోష కోపము లున్నవన్నచో అంతకంటె ఆశ్చర్యకర మగువిషయ మేమున్నది?

అవ॥ సంతోష రోష కారణములగు స్తుతినిందాదులు శరీర ధర్మము లగుటచేత ఆ శరీర మాత్మకంటె భిన్న మైనదని తెలిసి, యెల్లప్పుడు ఆత్మాను సంధాతయగు జ్ఞానికి నిందా స్తుతులవలన ఖేద మోదములు గలుగవని చెప్పుచున్నాడు.

**చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్యశరీరవత్ ।**
**సంస్తవే చాపి నిందాయాం కథం క్షుభ్యేన్మహాశయః ॥ 10**

చేష్టమానం=సమస్తక్రియలను చేయుచున్న, స్వం=తనయొుక్క, శరీరం=శరీరమును, అన్యశరీరవత్=ఇతరునియొుక్క శరీరమువలె, యః= ఎవడు, పశ్యతి=చూచుచున్నాడో, సః=అటువంటి, మహాశయః= మహాశయుడగు పురుషుడు, సంస్తవే=స్తుతియందును, నిందాయాం= నిందయందును, కథం=ఎట్లు, క్షుభ్యేత్ =క్షోభను పొందును?

ఎట్లు ఇతరునియొుక్క శరీరము తన ఆత్మకంటె భిన్నమైన చేష్టలకు ఆశ్రయ మైనదిగా నున్నదో, అట్లే తన శరీరముగూడ ఆత్మకంటె వేరైన చేష్టలు కలదిగా నున్నది. ఈ విధముగా చూచుచున్న జ్ఞాని స్తుతివలన గాని, నిందవలన గాని ఒకప్పుడును సంక్షుభితుడు గాడు. అనగా తబ్బిబ్బు

గాడు. సంతోషముతో పొంగి, దుఃఖముతో క్రుంగిపోయిన వాడు జ్ఞాని కాజాలడు.

**మాయామాత్రమిదం విశ్వం పశ్యన్విగతకౌతుకః ।**
**అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః ॥ 11**

విగతకౌతుకః=దూరము చేయబడిన అజ్ఞానాది కుతుకము గలిగినటువంటి, ధీరధీః=ధీరపురుషుడు. ఇదం విశ్వం=ఈ ప్రపంచమును, మాయామాత్రం=మాయామాత్రస్వరూపము గలదానినిగా, పశ్యన్=చూచుచున్నవాడై, మృత్యౌ=మృత్యువు, సన్నిహితే అపి=సన్నిహితమైనదయినప్పటికిని, కథం=ఎట్లు, త్రస్యతి=భయపడును?

కనబడుచున్న యీ ప్రపంచమంతయు మాయాకార్య మనియు, మాయాకార్యము కావుననే మిథ్య యనియు తెలిసికొనిన జ్ఞాని మఱల ఈ శరీరాదికము ఎక్కడినుండి ఉత్పన్న మైనది? మఱల దేనియందు లయ మగును? అను విచారమును చేయనే చేయడు. ఒకవేళ ఇటువంటి విచారము కలవాడైకూడ మోహము నొందెనన్నచో అతడు జ్ఞానియే కాడు. తన స్వరూపమునందు సుస్థిరుడై యుండి మృత్యు సమీపమునకు పోయినప్పుడుగూడ భయపడనివాడే నిజమగు జ్ఞాని.

**నిస్పృహం మానసం యస్య నైరాశ్యేఽపి మహాత్మనః ।**
**తస్యాత్మజ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే ॥ 12**

యస్య=ఏ, మహాత్మనః=మహాత్మునియొక్క, మానసం= మనస్సు, నైరాశ్యే అపి=మోక్షమునందుగూడ, నిస్పృహం=ఇచ్ఛారహితముగా

మున్నదో, తస్య=అటువంటి, ఆత్మజ్ఞానతృప్తస్య=ఆత్మజ్ఞానమువలన, తృప్తుడైనవానికి, తులనా=సామ్యము, కేన=ఎవనితో, జాయతే=కలుగుచున్నది (అతనితో సదృశు డెవడును లేడని భావము)

ఎవడు మోక్షముగూడ కోరడో, ప్రాపంచిక సంబంధమైన విషయములను లాభాలాభములను, శోకమోహములను, హర్షద్వేషములను పొందడో; ఎవడు అవాప్తసర్వకాముడో అనగా సమస్తకోరికలను పొందినవాడో, ఎవడు ఆత్మానందముతోనే తృప్తుడగువాడో, అటువంటి జ్ఞానికి ఎవనితో సామ్యము చెప్పనగును? ఎందుకనగా అతడు అతుల్యుడు.

**స్వభావాదేవ జానానో దృశ్యమేతన్న కించన ।**
**ఇదం గ్రాహ్య మిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః ॥ 13**

యః=ఎవడు, ఏతత్=ఈ, దృశ్యం=దృశ్య ప్రపంచము, స్వభావాత్=స్వాభావికముగనే, న కించన=కొంచెముగూడ లేదు, ఇతి=ఇట్లని, జానానః=తెలుసుకొనునో, సః=అట్టి, ధీరధీః=ధీరపురుషుడు, ఇదం=ఇది, గ్రాహ్యం=గ్రహింపదగినదని, ఇదం త్యాజం=ఇది విడిచిపెట్ట దగినదని, కిం=ఎట్లు, పశ్యతి=చూచుచున్నాడు?

తా॥ దృశ్యమగుటవలన ఈ ప్రపంచమంతయు శుక్తియందు రజతమువలె మిథ్యయై యున్నది. అనగా ముత్యపుచిప్పయందు రజతము దృశ్య మగుచున్నది. కనుకనే మిథ్య యైనట్లు ప్రపంచముకూడ దృశ్యము. కనుకనే మిథ్య. ఇట్టి నిశ్చయ జ్ఞానము గల జ్ఞాని ఇది నాకు గ్రహణ యోగ్యమగు వస్తువని, ఇది నాకు త్యజింపదగినదని యెట్లు అనుకొనును? అటువంటి దృష్టి నతడు ఎప్పుడును కలిగియుండడు.

అవ॥ ఇప్పుడు దీనికి కారణమును చెప్పుచున్నాడు.

**అన్తస్త్యక్తకషాయస్య నిర్ద్వన్ద్వస్య నిరాశిషః ।**
**యదృచ్ఛయాఽఽగతో భోగో న దుఃఖాయ న తుష్టయే ॥**

అన్తస్త్యక్తకషాయస్య=అంతఃకరణమునుండి నెట్టివేయబడిన విషయవాసనామలాది దోషములు గలిగినటువంటివాని, నిర్ద్వన్ద్వస్య=ద్వంద్వ ములగు శీతోష్ణ సుఖదుఃఖాదులు లేనటువంటివాని, నిరాశిషః=ఆశారహితు డైన వానికి, యదృచ్ఛయా= దైవయోగము వలన, ఆగతః=వచ్చినటువంటి, భోగః=భోగము (భోగవస్తువులు), దుఃఖాయ=దుఃఖముకొఱకు, న=కావు, తుష్టయే=సంతోషము కొఱకున్ను, న=కావు.

తా॥ అంతఃకరణమునందలి మలాదిదోషములను, విషయ వాసనలను దూర మొనరించి నట్టియు, శీతోష్ణాది ద్వంద్వములనుండి గలిగిన సుఖదుఃఖాదులనుండి రహితు డైనట్టియు నగు జ్ఞాని తనకు దైవయోగము వలన సంప్రాప్తమైన భోగములను ప్రారబ్దవశమున అనుభవించుచు హర్షమును గాని, శోకముగాని పొందడు.

ఇది మూడవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## నాల్గవ ప్రకరణము

## శిష్యప్రోక్తానుభవోల్లాసము

అవ॥ తృతీయ ప్రకరణమునందు గురువు శిష్యుని పరీక్షించుట కొఱకు జ్ఞానిపైన ఆక్షేపణను లేవదీసెను. ఇప్పుడు దానికి శిష్యుడు, సమాధానమును చెప్పుచున్నాడు.

**హన్తాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా ।**
**న హి సంసారవాహీకైర్మూఢైః సహసమానతా ॥ 1**

భోగలీలయా=భోగలీలలతో (లీలా భోగములతో), ఖేలతః= క్రీడించు చున్న, ఆత్మజ్ఞస్య=ఆత్మజ్ఞాని యగు, ధీరస్య=ధీరపురుషునకు, సంసారవాహీకైః=సంసారభారమును మోయుచున్న, మూఢైః సహ= మూఢులతో, సమానతా=సమానత్వము, హన్త=అయ్యో!, న హి=లేదు.

తా॥ ప్రారబ్ధవశమునను, బాధితానువృత్తివలనను, సమస్త వ్యవహారములను చేయుచున్నను జ్ఞాని దోషముల నంటడు. దానినే జనకుడు ప్రస్ఫుటము చేయుచున్నాడు. ఆత్మజ్ఞాని యగు విద్వాంసుడు సకలమునకు అధిష్ఠానము ఆత్మయని తెలిసికొనుచున్నాడు. కావుననే విషయములవలన విక్షేపము నొందడు. అనగా అట్టి జ్ఞానియొక్క చిత్తము విషయ సంబంధమువలన విక్షేపము నొందదని భావము.

ఒకవేళ జ్ఞాని ప్రారబ్ధవశమువలన భోగములయందు ప్రవృత్తుడే యగుగాక అయినను అతడు మూఢునితో సమాను డెన్నటికిని గాదు. ఎందుకనగా జ్ఞాని భోగముల ననుభవించుచున్నను వాటియందు ఆసక్తుడు గాడు. మూర్ఖుడు ఆసక్తు డగుచున్నాడు. ఈవిషయమునే "గీత" యందు శ్రీకృష్ణభగవానుడు చెప్పెను.

**తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః ।**
**గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥"**

తత్త్వవేత్తయగు పురుషుడు ఇంద్రియములు తమ తమ విషయములయందు ప్రవర్తించుచున్నను నేను వీటికి సాక్షి ననియు, నాకు వీటితో సంబంధ మేమియు లేదనియు, ఇంద్రియములయొక్కయు విషయముల యొక్కయు విభాగమును గుర్తించుచున్నాడు.

ఈ విధముగా పంచదశికారుడు గూడ జ్ఞానికిని, అజ్ఞానికిని గల భేదమును నిరూపించియున్నాడు.

**"జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్ర స మే ప్రారబ్ధకర్మణి ।**
**న క్లేశో జ్ఞానినో ధైర్యా న్మూఢః క్లిశ్యత్యధైర్యతః ॥"**

ప్రారబ్ధకర్మానుభవమునందు జ్ఞానియు, అజ్ఞానియు, ఇద్దరు సమానులే. అయితే కష్టములు సంప్రాప్త మైనప్పుడు జ్ఞాని ధైర్యముతో నెదుర్కొని క్లేశమును పొందడు. అజ్ఞానియగు మూర్ఖుడు ధైర్యము లేనివా డగుటవలన మిక్కిలి దుఃఖమును పొందుచున్నాడు. ఇదియే వారిరువురకు గల భేదము.

**యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః ।**
**అహో తత్రస్థితో యోగీ న హర్షముపగచ్ఛతి ॥ 2**

యత్ =ఏ, పదం=స్థానమును, ప్రేప్సవః=కోరుచున్నటువంటి, శక్రాద్యాః= దేవేంద్రుడు మొదలుగా గల, సర్వదేవతాః=సమస్త దేవతలును, దీనాః= దీనులై యుంటున్నారో, తత్ర=ఆ స్థానమునందు, స్థితః= ఉంటున్నటువంటి, యోగీ=యోగి, హర్షం=సంతోషమును, న ఉపగచ్ఛతి=పొందడు, అహో=ఆశ్చర్యము.

దేవేంద్రుడు మొదలుకొని సమస్తదేవతలు ఏ ఆత్మపదప్రాప్తికొఱకు ఆసక్తులై అది లభింపమి మిక్కిలి దీనులై దుఃఖమును పొందుచున్నారో, అట్టి ఆత్మపదమునందు స్థితుడై యున్న యోగి విషయ భోగములు ప్రాప్తించిన సంతోషించడు, ప్రాప్తించకున్నచో దుఃఖించడు. ఎందుకనగా ఆత్మసుఖమునకు మించిన సుఖము మఱియొకటి లేదు. అట్టి ఆత్మ సుఖము యోగికి నిత్యప్రాప్త మైయున్నది.

**తద్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శో హ్యన్తర్న జాయతే ।**
**న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానోఽపి సంగతిః ॥ 3**

తద్జ్ఞస్య=ఆత్మపదమును తెలిసికొనిన జ్ఞానికి, అంతః=అంతఃకరణ సంబంధమైన, న జాయతే=కలుగదు, హి=ఎందుకనగా, ఆకాశస్య= ఆకాశమునకు, ధూమేన=పొగతో, సంగతిః=సంబంధము, దృశ్య మానాఃఅపి=చూడబడుచున్న దైనప్పటికి (వాస్తవమునందు), న హి=లేదు గదా.

జ్ఞాని విధివాక్యములకుగూడ కింకరుడు కాడు. కావుననే అతనికి పుణ్యపాపములయొక్క స్పర్శగూడ ఉండదు. తత్పద, త్వం పదముల యొక్క అర్థమును, మహావాక్యములద్వారా భాగ త్యాగ లక్షణవలన అభేదార్థమునుగా నిశ్చయించుకొన్న జ్ఞానికి అతనియొక్క అంతఃకరణ ధర్మములగు పుణ్య పాపములతో నెట్లును (ఏవిధముగను) సంబంధము కలుగదు. ఎందుకనగా అతడు పుణ్య పాపములు ఆత్మధర్మములు కావనీ అంతఃకరణ ధర్మములనీ తెలిసికొనుచున్నాడు. ఎవడు తనకు (ఆత్మకు) పుణ్య పాపము లున్నవని తలంచుచున్నాడో వానికే పుణ్య పాపము లంటుకొనుచున్నవి. దీనికొక దృష్టాంతము గలదు.

ఒకప్పుడొక పండితు డొక గ్రామమునకు పోవుచుండెను. అలసిన వాడగుటచేత త్రోవలో పొలము దాపున నున్న యొక చెట్టుక్రింద కూర్చొని విశ్రాంతి తీసికొనుచుండెను. అప్పుడు ఆ పొలములోనే రాజపుత్ర వంశీయు డొకడు దున్నుచుండెను. ఎద్దులు ముందునకు - సాగుచూ, సాగుచూ ఎప్పు డాగిపోయినవో, అప్పుడారైతు - "మీ యజమాని కూతురు నేమోచెయ్య, మీఖామందు ముఖముమీద మూత్రం పొయ్య" అని ఇంక నేమేమో తిట్టుటకు మొదలిడెను.

ఆచెట్టు క్రింద కూర్చున్న పండితు డెద్దుల నుద్దేశించి యీవిధమగు తిట్ల నెప్పుడు వినెనో అప్పుడిట్లు ఆలోచించ మొదలిడెను. ఈ ఎద్దులకు యజమాని యితడే. ఇతడు తనను తానే తిట్టుకొనుచున్నాడు. ఈ విషయము తనకేమి అర్థమగునట్లు లేదు. ఇందువలన ఇతనికి విషయము తెలియజేయుట మంచిదని యెంచి ఆ రైతుతో పండితు డిట్లనెను. 'అయ్యా!

నీవు ఎద్దులను గూర్చి తిట్టుచున్నావే ఆ తిట్లు ఎవనికి తగులుచున్నవి?' అది విని ఆరైతు "ఈ విధమగు తిట్లను ఎవడు తెలుసుకొనుచున్నాడో వానికే అవి తగులుచున్న"వని చెప్పెను. అది విని పండితుడు కదలిపోయెను. "నేనైతే తెలిసికొన లేదు. నీవు తెలుసుకొనుచున్నావు కాబట్టి యీ తిట్లు నీకే తగులుచున్న"వని రైతుయొక్క అభిప్రాయము. అట్లే పుణ్యము గాని, పాపము గాని తనదే యని తలంచుటచేత ఆజ్ఞాని కా పుణ్య పాపము లంటుకొనుచున్నవి. పుణ్య పాపము లంతఃకరణ ధర్మములనీ అవి తనయందు అనగా ఆత్మకు లేవని తలంచుటచేత వాని నంటకున్నవి. బాలునకు గాని, పిచ్చివానికి గాని పాప పుణ్యముల జ్ఞానము లేనందున వాని కవి అంటనట్లు నిత్యానందు డగు జ్ఞానికిగూడ పాప పుణ్యముల స్పృహయే లేనందున అతనిని అవి యంటవు. ఎట్లు ఆకాశమునకు పొగతో సంబంధ మున్నట్లు తోచినను వాస్తవమునందు ధూమాకాశములకు ఎట్టి సంబంధమును లేదో అట్లే ఆత్మవేత్తకు పుణ్యాపాపములతో కొంచెమైనను సంబంధము లేదు.

అవ॥ అయితే కర్మములు చేయునపుడు (జ్ఞానికి) పుణ్యాపాపములు లేకుండుటెట్లు? అను శంక రాగా జ్ఞానికి విధి నిషేధములు లేవని చెప్పుచున్నాడు.

**ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా ।**
**యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః ॥ 4**

యేన=యే, మహాత్మనా=మహాత్మునిచేత, ఇదం సర్వం=ఈ సంపూర్ణమైన, జగత్=ప్రపంచము, ఆత్మైవ=ఆత్మయే, (ఇతి=అని), జ్ఞాతం= తెలుసుకొనబడుచున్నదో, తం=అటువంటి, యదృ

చ్ఛయా=ప్రారబ్ధవశము వలన స్వేచ్ఛగా, వర్తమానం=ఉంటున్న జ్ఞానిని, నిషేద్ధుం=నిషేధించుటకు, కః=ఎవడు, క్షమేత=సమర్థు డగును?

ప్రశ్నః జ్ఞాని యయినను కర్మలు చేసినచో పుణ్య పాపముల సంబంధము తప్పక ఉండగలదు. అంతేగాని అతడు కర్మలను చేయును, కాని పుణ్య పాపముల సంబంధ ముండదు అను విషయ మెట్లు పొసగును?

ఉ॥ ఈ దృశ్యమానమైన సమస్తప్రపంచము తన ఆత్మయే యని తెలిసికొన్న జ్ఞాని ప్రారబ్ధవశమువలన కర్మలను చేయుచున్నాడు. చేయ కున్నను అతనిని చేయుము అనిగాని, చేయకుము అని గాని విధి నిషేధము లను చేయువారెవరు?

శారీరక భాష్యముగూడ ఈ విషయమునం దిట్లు చెప్పుచున్నది.

"అవిద్యావద్విషయో వేదః"

వేదవచనము గూడ అజ్ఞానులకే విధి నిషేధములు గాని జ్ఞానులకు కాదని తెలుపుచున్నది. జ్ఞానులనుగూర్చి వేదము ఆజ్ఞాపించలేదు. స్మృతియు నిట్లు చెప్పుచున్నది.

"అబోధనీయ ఏవాసౌ సుప్తో రాజేవ వందిభిః"

వందిజను లేలాగున నిద్రించుచున్న రాజును మేలుకొలుపుటకు ఆతని చరిత్రమును వర్ణన చేయుదురో, అట్లే వేదములుగూడ జ్ఞానియొక్క చరిత్రను వర్ణించుచున్నవి. ఈ కారణమున పుణ్య పాపములు జ్ఞానిని తాకనుగూడ తాకవు.

అవ॥ ఇచ్ఛా నిచ్ఛలను మరలించుటకు శక్యము గాదు గనుక జ్ఞాని నయితము యథేష్టముగా ప్రవర్తింపడా అను శంకకు సమాధానము.

**ఆబ్రహ్మస్తమ్బపర్యంతే భూతగ్రామే చతుర్విధే ।**
**విజ్ఞస్యైవ హి సామర్థ్యమిచ్ఛానిచ్ఛా వివర్జనే ॥ 5**

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తే=చతుర్ముఖబ్రహ్మ మొదలుకొని తృణపర్యంతము గల, చతుర్విధే=నాలుగువిధములైన, (జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములను) భూతగ్రామే=భూతసమూహమునందు, విజ్ఞస్య ఏవ=జ్ఞాని కొక్కనికే, ఇచ్ఛానిచ్ఛవివర్జనే=ఇచ్ఛానిచ్ఛలను త్యజించుట యందు, సామర్థ్యం=సామర్థ్య మున్నది, హి=నిశ్చయము.

ప్రశ్న: జ్ఞానికి ప్రవృత్తి, యదృచ్ఛ అనగా దైవేచ్ఛ చేతనా లేక తన ఇచ్ఛ చేతనా కలుగుచున్నది?

ఉ॥ జ్ఞానికి ప్రవృత్తి దైవేచ్ఛచేతనే కలుగుచున్నది. తన యిచ్ఛ చేతగాదు. విచారించినచో బ్రహ్మ మొదలు తృణపర్యంతము గల ప్రాణులకు ఇచ్ఛనుగాని అనిచ్ఛనుగాని దూర మొనరించుటకు సామర్థ్యము లేదు. కాని బ్రహ్మజ్ఞానికి మాత్రము ఇచ్ఛానిచ్ఛలను తొలగించుకొనుటకు సామర్థ్య మున్నది. ఇందువలన దైవేచ్ఛ ననుసరించి భోగములయందు ప్రవృత్తుడు గానీ లేక కర్మములయందు ప్రవృత్తుడు గానీ విధి నిషేధములకు కింకరుడు కాజాలడు.

శ్రీ శుకబ్రహ్మర్షి యిట్లు చెప్పుచున్నాడు:-

**భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే**
**మాయా మోహౌ క్షయముపగతౌ నష్టసందేహవృత్తేః ।**

**శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్యతత్త్వావబోధమ్ ।**
**నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ॥**

అనగా బ్రహ్మజ్ఞానికి ఆత్మజ్ఞాన ప్రభావమువలన భేదము అభేదము ఈ రెండు వృత్తులు శీఘ్రముగా నశించి అతనిని పుణ్య పాపములు నష్టమగుచున్నవి. ఎవనికి మాయ, మాయాకార్యమగు మోహము ఈ రెండును నశించిపోయినవో, ఎవడు శబ్దాది విషయములనుండి, మూడు గుణములనుండి రహితుడో, ఎవడు ఆత్మతత్త్వమును పొందినవాడో, మఱియు నెవడు త్రిగుణ రహితుడై నిర్గుణబ్రహ్మ మార్గమునందు చరించుచున్నాడో, అట్టివాని కొక విధియు లేదు. నిషేధము లేదు.

ప్రశ్న ॥ **"అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్॥"**

అనగా చేయబడిన శుభాశుభ కర్మము లన్నియు అవశ్యము అన్ని ప్రాణులు అనుభవించవలసినదే అని అన్నచో నిక ఈ వాక్యమువలన ప్రయోజనమేమి?

ఉ॥ ఈ వాక్యము లన్నియు అజ్ఞానులకొఱకే గాని జ్ఞానుల కొఱకు గావు అని వేదము చెప్పుచున్నది.

**"తస్య పుత్రా దాయముపయన్తి"**
**సుహృదః సాధు కృత్యం ద్విషన్తః పాపకృత్యమ్"**

అనగా శుభాశుభకర్మములను చేయుచున్న జ్ఞానియొక్క ధనమును, అతని పుత్రులును, పుణ్యకర్మలను (పుణ్యమును) అతని మిత్రులును, పాపకర్మలను (పాపములను) అతని శత్రువులును తీసుకొనుచున్నారు.

జ్ఞాని పుణ్య పాపములచే రహితుడై ముక్తు డగుచున్నాడు.

"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే"

అనగా ఎంతవఱకు జ్ఞాని ప్రారబ్ధ కర్మానుభవమునుండి విడివడడో కేవల మంతకాలము వఱకు మాత్రమే అతనికి మోక్షమునందు విలంబ మగుచున్నది.

"అథ సంపత్స్యే"

ఎప్పుడతడు ప్రారబ్ధకర్మమునుండి విడివడుచున్నాడో; అప్పుడు శరీర రూపోధినుండి రహితుడై బ్రహ్మముతో, నభేద ప్రాప్తిని పొందుచున్నాడు.

"తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి"

అనగా శరీరమును విడిచిపెట్టిన వెంటనే జ్ఞాని పుణ్య పాపముల నుండి రహితుడై మఱియు భావిజన్మ కర్మములనుండి రహితుడై బ్రహ్మమునందు లీన మగుచున్నాడు.

"న తస్య ప్రాణాః ఉత్క్రామన్తి"

మఱియు జ్ఞానియొక్క ప్రాణములు లోకాంతర గమనమును చేయవు.

"అత్రైవ సమవలీయ న్తే"

తనకు కారణమైన స్థానమునందే లీనుడగుచున్నాడు. ఇట్లే జ్ఞానికి కర్మఫలనిషిద్ధములగు శ్రుతివాక్యము లెన్నో యున్నవి. మఱియు గీతయందు గూడ శ్రీకృష్ణభగవానుడు జ్ఞానరూపాగ్నివలన ఇతని

సర్వకర్మములు దగ్ధమగుచున్నవి అని చెప్పెను.

ప్రశ్న॥ కారణనాశన మైనందున కార్యనాశముగూడ కలుగుచున్నది. తంతువులు నశించుచో పటముగూడ నశించునట్లు ఆత్మజ్ఞానమువలన అజ్ఞాననాశము కాగా అజ్ఞానకార్య మగు జ్ఞాన శరీరముగూడ నశించ వలయును గదా?

ఉ॥ కారణమైన అజ్ఞాననాశముతోపాటే జ్ఞానియొక్క శరీరేంద్రియ ములుగూడ నాశ మగుచున్నవి. అనగా జ్ఞానరూపమైన అగ్నిలో జ్ఞానియొక్క సమస్త దేహేంద్రియాదులు భస్మ మగుచున్నవి. అయితే దగ్ధమయికూడ వాటి పనిని అవి చేయుచునే యున్నవి. మహాభారతమునందు-బ్రహ్మాస్త్రము వలన అర్జునుని రథము భస్మమైపోయినను, ఏ విధముగ శ్రీకృష్ణపరమాత్మ శక్తివలన నది మరల నడచుచూ, తిరుగుచూ నుండెనో అదేవిధముగ ఆత్మజ్ఞానమువలన కారణసహిత దేహాదికము లన్నియు భస్మము లైనను ప్రారబ్ధరూపశక్తివలన తమ తమ కార్యములను చేయుచునే యున్నవి.

లేక నైయాయికుల సిద్ధాంతప్రకారము కారణనాశమైన తరువాత ఒక్కక్షణములో కార్యనాశ మగుచున్నది. ఏవిధముగా తంతువులు నశించిన పిమ్మట ఒక్కక్షణములో పట నాశన మగుచున్నదో, అదేతీరున అజ్ఞానరూప కారణము నశించిన ఒక్కక్షణములో జ్ఞానియొక్క దేహాదికములుగూడ నశించుచున్నవని చెప్పవచ్చును. ఒకవేళ జ్ఞానోత్పత్త్యనంతరము అనేక సంవత్సరములవఱకు దేహాదికము లుంటున్నవని చెప్పవచ్చును గాని అట్లు గాదు. అల్పకాలమువఱకు మాత్రమే యుంటున్న పటాదుల నాశముగూడ

అల్పమే యైనట్లు అనాదికాల సంబంధమైన అజ్ఞానమువలన గలిగిన దేహాదికములయొక్క నాశమునకు దీర్ఘకాలము పట్టుచున్నది. పూర్వోక్తసూక్తులవలనను, ప్రమాణములవలనను జ్ఞానిపైన విధి నిషేధముల ఆజ్ఞ లేదనియు, అజ్ఞానికే విధి నిషేధము లనియు సిద్ధ మగుచున్నది.

**ఆత్మానమద్వయం కశ్చిద్జ్ఞానాతి జగదీశ్వరమ్ ।**
**యద్వేత్తి తా కురుతే న భయం తస్య కుత్రచిత్ ॥ 9**

కశ్చిత్=ఒకానొకడు, ఆత్మానం=ఆత్మను(జీవుని), చ=మఱియు, జగదీశ్వరం=జగదీశ్వరుని, అద్వయం=అద్వైతమునుగా (వేరు కాని వారినిగా) జానాతి=తెలిసికొనుచున్నాడు, సః=అట్టివాడు, యత్=దేనిని, వేత్తి=తెలుసుకొనుచున్నాడో, తత్=దానిని, కురుతే= చేయుచున్నాడు, తస్య=అట్టి ఆత్మజ్ఞానికి, భయం=భయము, కుత్రచిత్= ఎక్కడగూడ, న=లేదు.

తా॥ అద్వైతజ్ఞానమువలననే ద్వైతమునకు బాధ కలుగుచున్నది. మఱియు ద్వైతమునకు బాధ కలుగుటచేతనే భయకారణమైన అజ్ఞానము జ్ఞానికి లేకున్నది. తత్పద త్వంపదార్థములయొక్క లక్ష్యార్థమును బాగ త్యాగ లక్షణచేతను, మహావాక్యములవలనను అభేదముగా దేనిని తెలుసు కొనుచున్నాడో, అదే అద్వైతజ్ఞానము. ఎవని కీయద్వైత జ్ఞానము ప్రాప్తించినదో అతడే జ్ఞాని. అతడు బాధితానువృత్తివలన సంపూర్ణముగా వ్యవహారములను చేయుచున్నను, అతనికి ఎవనియొక్క భయమును లేదు. ఎందుకనగా అతనికి భయముయొక్క అనగా ద్వైతజ్ఞానముయొక్క బాధ కలిగిపోయినది. ఈ విషయమును శ్రుతిభగవతిగూడ చెప్పుచున్నది.

**"ద్వితీయాద్వై భయం భవతి"**

ద్వైతమువలన నిశ్చయముగా భయము కలుగుచున్నది.

**"ఉదరమంతరం కురుతేఽథ తస్య భయం భవతి"**

కొంచెమైనను భేదదృష్టి గలవానికి భయము కలుగుచున్నది.

**"అన్యోఽసావహమన్యోఽస్మి న స వేద యథా పశుః"**

ఎవడు తనకంటె బ్రహ్మము భిన్నమని తలంచి ఉపాసించుచున్నాడో వాడు పశువువలె బ్రహ్మము నెఱుంగజాలడు.

**"బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి"**

బ్రహ్మవేత్త బ్రహ్మరూపుడే యగుచున్నాడు.

**"తరతి శోకమాత్మవిత్"**

ఆత్మవేత్త సంసారరూప శోకమునుండి తరించుచున్నాడు. ఈ శ్రుతి వాక్యమువలన గూడ జ్ఞానికి రెండవది యగు దేనినుండి గూడ భయము లేదనియు, ఎందుకనగా అతని దృష్టిలో రెండవ వస్తు వేదియు లేదనియు సిద్ధమగుచున్నది.

ఇది నాలుగవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## ఐదవ ప్రకరణము

## ఆచార్యోక్త లయచతుష్కము

అవ॥ జనకమహారాజు చెప్పిన ఉల్లాస త్రయమువలన శిష్యుని పరీక్షించినవాడై అష్టావక్ర మునీంద్రుడు ఇప్పుడు జనకునకు లయ యోగము నుపదేశించుచున్నాడు.

**న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధః త్యక్తుమిచ్ఛసి ।**
**సంఘాత విలయం కుర్వన్నేవమేవ లయం వ్రజ ॥ 1**

తే=నీకు, కేనాపి=దేనితోగూడ, సంగః=సంగమము, నాస్తి=లేదు, (అతః=ఈ కారణమువలన), శుద్ధః=శుద్ధుడవైన నీవు, కిం=దేనిని, త్యక్తుం=విడుచుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు, ఏవమేవ=ఈ ప్రకారముగానే, సంఘాతవిలయం=దేహాద్యభిమాన సంఘాత త్యాగమును, కుర్వన్=చేయుచున్నవాడవై, లయం=మోక్షమును, వ్రజ=పొందుము.

తా॥ ఓ శిష్యా! నీవు శుద్ధ స్వరూపుడవు. అహంకార మమకారములకు ఆస్పదరూపులైన దేహగేహాదులతో నీకెట్టి సంబంధమును లేదు. ఎప్పుడు నీవు అసంగుడవును, శుద్ధుడవును ఐతివో, అప్పుడు మఱల నీయందు త్యాగగ్రహణము లెక్కడ నున్నవి? ఇందువలన నీవు దేహాది సంఘాతమును

లయపరచి అనగా "నేను దేహమును లేక నా దీ దేహము" అను ఈ ప్రకారమగు అహంకారమును దూర మొనరించి నీ స్వస్వరూపమునందు నిలుపుము.

**ఉదేతి భవతో విశ్వం వారిధేరివ బుద్బుదః ।**
**ఇతి జ్ఞాత్వైకమాత్మానమేవ మేవ లయం వ్రజ ॥ 2**

వారిధేః=సముద్రమునుండి, బుద్బుద ఇవ=బుడగవలె, భవతః= నీనుండి, విశ్వం=ప్రపంచము, ఉదేతి=పుట్టుచున్నది, ఇతి=ఇట్లని, ఏకం=ఒకటియైన, ఆత్మానం=ఆత్మను, ఏవమేవ=ఈ ప్రకారముగానే, జ్ఞాత్వా=తెలిసికొని, లయం=శాంతిరూప మోక్షములను, వ్రజ=పొందుము.

ఎట్లు సముద్రమునందు బుద్బుదములు, తరంగములు ఉత్పన్నములై మఱల సముద్రమునందే లయ మగుచున్నవో, సముద్రమున కంటె భిన్నములు గావో, అట్లే మనస్సంకల్పమువలన ఈ జగత్తు ఉత్పత్తి యగుచున్నది. మఱల మనస్సు లయ మగుటతోడనే జగముకూడా లయ మగుచున్నది. దేవీ భాగవతమున చెప్పిన దానిని చూడుము.

"శుద్ధో ముక్తస్సదై వాత్మా న వై బధ్యేత కర్హిచిత్ ।
బంధ మోక్షౌ మనస్సంస్థౌ తస్మిం శ్శాంతే ప్రశామ్యతి॥"

ఆత్మ యెల్లప్పుడు శుద్ధమై మఱియు ముక్తమై యున్నది. అది యొకప్పుడును బంధమును పొందియుండ లేదు. బంధమోక్షములు రెండును మనోధర్మములు. మనస్సు ప్రశాంతి నొందినచో బంధ మోక్షముల

పేరే యుండదు. ఆత్మయందు మనస్సును లయ మొనరించినచో సమస్త ప్రపంచముకూడ లయ మగుచున్నది.

**ప్రత్యక్ష మప్యవస్తుత్వాద్విశ్వం నాస్త్యమలే త్వయి ।**
**రజ్జుసర్ప ఇవ వ్యక్తమేవ మేవ లయం వ్రజ ॥ 3**

వ్యక్తం=దృశ్యమాన మగు, విశ్వం=సంసారము, ప్రత్యక్షమపి= ప్రత్యక్ష మైనప్పటికిని, అవస్తుత్వాత్=వాస్తవముగా లేనిదైనందున, అమలే= మలరహితుడవగు, త్వయి=నీయందు, రజ్జుసర్ప ఇవ=రజ్జువునందు సర్పమువలె, నాస్తి=లేదు, ఏవమేవ=ఈప్రకారముగానే, లయం= శాంతిని, వ్రజ=పొందుము.

ప్రశ్న॥ ప్రత్యక్ష ప్రమాణమువలన రజ్జువునందు సర్పాదికమునకు భేదప్రతీతి కలుగుచున్నది. ఏ వస్తువు ప్రత్యక్ష ప్రమాణమునకు విషయమో అది లయము నొందదు అని యున్నందున దానకి లయమెట్లు సాధ్య మగును?

ఉ॥ ప్రత్యక్ష ప్రమాణమునకు విషయ మైనదానికిగూడ శాస్త్రమువలన బాధ కలుగుచున్నది. ఎట్లనగా చంద్రమండలము ప్రత్యక్ష ప్రమాణము వల్లనైతే ఒక బెత్తెడు స్థలములో చూపించబడుచున్నది. అయితే జ్యోతిష శాస్త్రమునందు అది పదివేల యోజనముల పరిమితి గలదని లిఖింపబడి యున్నది. ఆ శాస్త్రముచేత బెత్తెడు అంగీకరింపబడ లేదు. అదే విధముగా ప్రత్యక్ష ప్రమాణమునకు విషయమైన యీ జగత్తుగూడ శ్రుతివాక్యములచే బాధిత మగుచున్నది. ఎందుకనగా జగత్తు వాస్తవముగా మూడు కాలముల యందును లేదు. ఎట్లు స్వప్నసృష్టియు గంధర్వ నగరాదికములను మూడు

కాలముల యందును లేవో అట్లే యీ జగత్తుగూడ ఏ కాలమునందును లేదు. అవి యీ ప్రకారమగు చింతనయే జగల్లయమునకు హేతు వగుచున్నది.

**సమదుఃఖసుఖః పూర్ణ ఆశా నైరాశ్యయోః సమః ।**
**సమజీవితమృత్యుస్సన్నేవమేవ లయం వ్రజ ॥ 4**

సమదుఃఖసుఖః=సుఖదుఃఖములయందు సమతత్త్వము గలవాడవై, పూర్ణః=పరిపూర్ణుడవై, ఆశానై రాశ్యయోః=ఆశానిరాశలయందు, సమః=సమభావము గలవాడవై, సమజీవితమృత్యుః=జీవిత మృత్యువుల యందు తుల్యుడవై, ఏవమేవ సన్=ఈ ప్రకారముగా అయినవాడవై, లయం=బ్రహ్మదృష్టిని, వ్రజ=పొందుము.

ఓ జనకుడా! నీవు ఆత్మానంద స్వరూపుడ వగుటవలన పూర్ణుడవు. దైవయోగమువలన శరీరమునం దుత్పన్నములైన సుఖదుఃఖముల యందును సమానుడవు. ఆశ నిరాశలయందును సముడవు. జీవించుట మరణించుటయందును సమానుడవు. నీవు నిర్వికారుడవు, సుఖదుఃఖాది కము లన్నియు అనాత్మ ధర్మములు, మఱియు మిథ్యాభూతములు. వీటికి కారణభూతమగు దేహాదికముగూడ మిథ్యయే, ఉత్పత్తికంటె పూర్వమెట్లు దేహాదికము లేదో అట్లే నాశానంతరముగూడ దేహము లేదు, కాని మధ్యయందు మాత్రము ప్రతీత మగుచున్నది. ఏవస్తువు ఉత్పత్తికంటె పూర్వము, నాశానంతరము లేదో, అది మధ్యయందుగూడ వాస్తవముగ లేదు. కేవలము ప్రతీతము మాత్రము అగుచున్నది. స్వప్న పదార్థము లెట్లు మిథ్యాభూతములో అట్లే యీ జగత్తుకూడ మిథ్యయై యున్నది. వాస్తవము

నందు మూడుకాలములయందును లేదు. కేవలబ్రహ్మము బ్రహ్మమే యై యున్నది.

"సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఈ సంపూర్ణజగత్తు నిశ్చయముగా బ్రహ్మరూపమే యై యున్నది. ఈ విధమగు చింతనకే లయచింతన యని పేరు.

ఇది ఐదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్ర గీత

## ఆరవ ప్రకరణము

## ఉత్తర చతుష్కము

అవ॥ ఈ విధముగా తనను పరీక్షించుటకు గురువు లయ యోగము నుపదేశింపగా శిష్యుడు పూర్ణాత్ము డగువానికి లయాదులతో పనిలేదని మనవి చేయుచున్నాడు.

**ఆకాశ వదనన్తోఽహం ఘటవత్ప్రాకృతం జగత్ ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥ 1**

అహం=నేను, ఆకాశవత్=ఆకాశమువలె, అనన్తః=అంతము లేనివాడను, జగత్=ప్రపంచము, ఘటవత్=ఘటమువలె, ప్రాకృతం=ప్రకృతి జన్యమైనది, తథా=ఆ కారణమువలన, ఏతస్య= దీనికి, త్యాగః=త్యాగము, న=లేదు, న గ్రహః=గ్రహణము లేదు, న లయః=లయము లేదు, ఇతి జ్ఞానం= ఇదియే జ్ఞానము.

తా॥ లయ చింతనారూపమైన యోగముకూడ నాయందు సంభవింపదు. ఏది పుట్టుచున్నదో అదియే లయ మగుచున్నది. ఏ పదార్థమునకు మూడుకాలములయందును ఉత్పత్తి లేదో దానికి లయము కూడ లేదు. ఎట్లు వంధ్యాపుత్రుడు శశశృంగము- ఈ మొదలగు వాటికి ఉత్పత్తి లయములు గూడ లేవో అదేవిధముగ ఈ జగత్తు ఉత్పన్నమై యుండలేదు ; ఇక కాబోదు ; ఇప్పుడున్నూ (వర్తమానకాలమునందు) లేదు.

అటువం టప్పుడు జగత్తుయొక్క లయచింతన యెట్లు సాధ్య మగును? ఎప్పుడును సాధ్యపడదు.

ప్రశ్న॥ జగత్తునకు ఉత్పత్తియే లేనిచో నది ఎట్లు ప్రతీత మగు చున్నది?

ఉ॥ దీనికి సమాధానము మాండూక్య కారికలలో చెప్పిన దానిని చూడుము:

"ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ।
వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః ॥

స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం తథా ।
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః ॥

అనగా ఏ పదార్థము ఉత్పత్తికి ముందుగను, నాశనమునకు అనంతరమునను లేదో అది వర్తమానకాలమునందును లేదు. అయితే లేనిదియయ్యే ఉన్నదానివలె వర్తమానకాలమునందు ప్రతీత మగుచున్నది. ఎట్లు స్వప్నమునందు దృష్టములగు ఏనుగు, గుఱ్ఱము మొదలగునవి, యింద్రజాలముచేత సృష్టించబడిన వస్తువులు, మఱియు గంధర్వనగరము ఇవన్నియు లేనివియయ్యు ప్రతీతము లగుచున్నవో, అట్లే యీ ప్రపంచముకూడ లేనిదయ్యే తోచుచున్నది. జ్ఞానుల యిటువంటి అనుభవముచేతనే కేవలాద్వైతానంత స్వరూప పరబ్రహ్మ మొక్కటియే సత్య మైనదనియు, మఱియు నీ సమస్త ప్రపంచము ప్రతీతమాత్రమేగాని వాస్తవమునందు లేనిదనియు వేదాన్తశాస్త్రముల ద్వారా తెలుసుకొను చున్నారు.

ప్రశ్న॥ అనంత స్వరూపాత్మకు దేహాదులయం దెట్లు ఉనికి సాధ్య మగును? పెద్దవస్తువు చిన్నవస్తువునం దెట్లు ఇమిడియుండగలదు?

ఉ॥ ఘటము, మఠము మొదలగునవి ఆకాశముయొక్క ఉనికి కెట్లు స్థానములగుచూ దానినుండి భిన్నములుగూడ నగుచున్నవో, అట్లే దేహాదికములుగూడ అనంత స్వరూపాత్మకు నివాసస్థానము లగుచూ, దానినుండి భిన్నములుగూడ నగుచున్నవి. వాస్తవమునందు ఈ జగత్తు మిథ్యాభూతమగు మాయాకార్య మగుటవలన అదియు మిథ్యయే. ఈ ప్రకారముగా వేదాన్తమువలన సిద్ధమైన జ్ఞానమే అనుభవరూపమై జగత్తు యొక్క మిథ్యాత్వమునందు ప్రమాణ మగుచున్నది. ఇందువలన జగత్తునకు లయచింతనాదికము కాజాలదు.

అవ॥ ఘటాదికములు భిన్నము లైనట్లు దేహాత్మలు భిన్నములగు నానెడి శంక కలుగును గాన నట్టి సందేహనివృత్తికై యింకొక దృష్టాంతము.

**మహోదధిరివాహం స ప్రపంచో వీచిసన్నిభః ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥ 2**

అహం=నేను, మహోదధిరివ=సముద్రసదృశుడనుగా నున్నాను, సః= ఆ, ప్రపంచః=ప్రపంచము, వీచిసన్నిభః=తరంగములతో తుల్యమైనది, తథా=ఆ కారణమువలన ఏతస్య=దీనికి, త్యాగః= త్యాగము, న=లేదు, గ్రహః=గ్రహణము, న=లేదు, లయః= లయము, న=లేదు.

తా॥ ప్ర॥ ఘటాకాశ దృష్టాంతమువల్లనైతే దేహమునకు ఆత్మకు భేదశంక ఉత్పన్న మగుచున్నది. ఎట్లు ఘటముకంటె ఆకాశము, ఆకాశము కంటె ఘటమున్ను భిన్నములో, అట్లే దేహముకంటె ఆత్మయు, ఆత్మకంటె

దేహమున్ను భిన్న మగుచున్నది. రెండింటికి భిన్నత్వ మున్నప్పుడే ద్వైత ప్రమాణ మగును. అద్వైతాత్మకు ప్రమాణము లేదు గదా?

ఉ॥ ఆత్మ గొప్పసముద్రమువలె నున్నది. దానియందు ప్రపంచము తరంగములవలె నున్నది. ఈ ప్రకారమగు ఆత్మానుభవరూప జ్ఞానమే అద్వైతమునకు ప్రమాణమై యున్నది.

**అహం స శుక్తి సంకాశో రూప్యవద్విశ్వకల్పనా ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥ 3**

సః=ఆ, అహం=నేను, శుక్తిసంకాశః=ముత్యపుచిప్పతో సమానుడను, విశ్వకల్పనా=ప్రపంచ కల్పనము, రూప్యవత్=వెండితో సమానముగా నున్నది. తథా=ఆకారణమువలన, ఏతస్య=దీనికి, త్యాగః న=త్యాగము లేదు, గ్రహః=గ్రహణము, న=లేదు, లయః=లయము, న=లేదు.

ప్ర॥ ఎట్లు తరంగము లన్నియు సముద్రముయొక్క వికారములో, సముద్రము వికారియో అట్లే దేహము ఆత్మయొక్క వికారము, ఆత్మ వికారి యని సిద్ధించుచున్నది గదా?

ఉ॥ వికార - వికారి భావము సావయవ పదార్థములకే గాని నిరవయవ పదార్థములకు లేదు. ఇందువల్ల నీ దృష్టాంతము సార్థక మగుట లేదు. కాన నేను దృష్టాంతమును చెప్పుచున్నాను వినుము. ఎట్లు శుక్తి సత్యరూపమై దానియందు ప్రతీతమగు రజతము మిథ్యయో అట్లు దేహాదిక సమస్త ప్రపంచమునకు అధిష్ఠానభూతుడనైన నేను సత్యస్వరూపుడను. ఈ ప్రపంచమంతయు శుక్తియందు రజతమువలె నాయందు కల్పిత

మైనది. కావున ద్వైతము త్రికాలములయందును సిద్ధము కాజాలదు.

**అహం వా సర్వభూతేషు సర్వభూతాన్యథో మయి ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥ 4**

అహం=నేను, వా=నిశ్చయముగా, సర్వభూతేషు=సమస్త భూతముల యందును, అథో=మఱియు, సర్వభూతాని=సకల భూతములును, మయి=నాయందును, (సన్తి=ఉంటున్నవి), తథా=ఈ కారణమువలన, ఏతస్య=దీనికి, న త్యాగః=త్యాగము లేదు, న గ్రహః= గ్రహణము లేదు, న లయః=లయమున్ను లేదు, ఇతి=ఈ ప్రకారమైనదే, జ్ఞానం=జ్ఞానము.

ప్ర॥శుక్తియందు రజతదృష్టాంతమువల్ల కూడా ఆత్మకు పరిచ్ఛిన్నతా శంక కలుగుచున్నది. ఎందుకనగా ఎట్లు శుక్తి పరిచ్ఛిన్నమును ఏకదేశవర్తియునై యున్నదో, అట్లే ఆత్మయు పరిచ్ఛిన్నమును ఏకదేశ వర్తియు కావలసివచ్చును గదా?

ఉ॥ నేనే సకలభూతములయందును వ్యాపకతారూపముతో మణులయందు సూత్రమువలె ఉంటున్నాను. నేనే అంతటికి అధిష్ఠాన రూపుడనై సత్తను, మఱియు స్ఫూర్తిని నిచ్చువాడనుగా నున్నాను. నాయందే ఈ సర్వప్రపంచమును ఆకాశమునందు నీలిమమువలె అధ్యస్తమై యున్నది. (అధ్యస్త మనగా లేనిది ఉన్నట్లు తోచుట) ఈ ప్రకారములగు వేదాన్తవాక్యములచేత సిద్ధమైన జ్ఞానము- అనగా అనుభవము- ఆత్మే అద్వైత మగుట యందు (అనుటయందు) ప్రామాణికమై యున్నది. 'నేనే'

ఉన్నప్పుడు ఇక నాయందు త్యాగము, గ్రహణము, లయ, చింతనాదికము కూడ ఉండజాలదు.

ఇది ఆరవ ప్రకరణము.





ఓమ్

# అష్టావక్ర గీత

## ఏడవ ప్రకరణము

## అనుభవ పంచకము

అవ॥ ఐదవ ప్రకరణమునందు చెప్పినట్లు లయయోగము లేని యెడల సంసార విక్షేపము తప్పదను శంక రాగా లయము లేకున్నను లోపము లేదని శిష్యుడు తన యనుభవమును చెప్పుచున్నాడు.

**మయ్యనన్తమహామ్భోధౌ విశ్వపోత ఇత స్తతః ।**
**భ్రమతి స్వాన్తవాతేన న మమాస్త్యసహిష్ణుతా ॥ 1**

అనన్తమహామ్భోధౌ=అపార మహాసముద్రమువలెనున్న, మయి= నాయందు, విశ్వపోతః=ప్రపంచరూపనావ, స్వాన్తవాతేన= మనోరూప వాయువుచేత, ఇతస్తతః=ఇటునటు, భ్రమతి=తిరుగుచున్నది. (పరంతు= అయితే) మమ=నాకు, అసహిష్ణుతా=అసహనశీలత, నాస్తి=లేదు.

తా॥ ప్ర॥ లయచింతనము లేనిచో సాంసారిక విక్షేపములు కలుగును. ఒకప్పుడుగూడ అవి దూరము కావు కదా?

ఉ॥ ఆ విక్షేపములు ఉండునుగాక, వాటినుండి నా కేమి హాని? అనంత మహాసముద్రరూపుడ నగు నా (ఆత్మ) యందు ఈ విశ్వరూప నౌక, మనోరూపవాయువుచే ఇటు నటు తిరుగుచున్నది. దాని భ్రమణము వలన నాకేమియు అసహిష్ణుత్వము లేదు. అనగా నేనేమియు క్షుభితుడను కాలేదు. సముద్రమునందు ఝంఝామారుతముచేత ఇటునటు

కొట్టుకొనుచున్న నౌక సముద్రము నెట్లు క్షుభితము చేయజాలదో, అట్లే మనోరూపవాయువుచే అటు నిటు భ్రమించుచున్న విశ్వరూపనౌకగూడ సముద్రరూప ఆత్మను సంక్షోభ పెట్టజాలదు.

అవ॥ జగద్వ్యాపారమువలన తనకొట్టి లోపమును లేదని చెప్పి యున్నాడు. ఇప్పుడు జగదుత్పత్తిలయములవలన గూడ ఏ లోపమును లేదని నిరూపించు చున్నాడు.

**మయ్యనన్తమహామ్భోధౌ జగద్వీచిః స్వభావతః ।**
**ఉదేతు వాஉస్తమాయాతు న మే వృద్ధిర్న చ క్షతిః ॥ 2**

అనన్తమహామ్భోధౌ=అపారమహాసముద్రరూపుడ నగు, మయి= నా యందు, జగద్వీచిః=జగద్రూపమగు కల్లోలము, ఉదేతు= ఉదయించును గాక! వా=లేనిచో, అస్తం=లయమును, ఆయాతు=పొందును గాక, మే=నాకు, వృద్ధిః=వృద్ధియు, న=లేదు, క్షతిః=హానియును, న=లేదు.

వినాశరహిత మైనట్టియు, వ్యాపక మైనట్టియు నగు ఆత్మరూప మహాసముద్రమునందు జగద్రూపములగు అనేక తరంగములు ఉదయించుచున్నవి. మఱల దానియందే లయించుచున్నవి. తరంగోదయమువలన గాని, అస్తమయమువలన గాని సముద్రున కెట్టి హాని, వృద్ధులు లేనట్లు జగదుత్పత్తివలన ఆత్మకు వృద్ధియు లేదు, దానిలయమువలన ఆత్మకు హానియు లేదు.

అవ॥ పైన చెప్పిన దృష్టాంతమువలన ఆత్మవికారమే జగత్తు అనెడు భ్రమ కలుగవచ్చునని, తన్నివృత్తికై ప్రకారాంతముగా చెప్పుచున్నాడు.

**మయ్యనన్తమహామ్భోధౌ విశ్వం నామ వికల్పనా ।**
**అతిశాన్తో నిరాకార ఏతదేవాహమాస్థితః ॥ 3**

అనన్త మహోమ్బోధౌ=అనంత మహాసముద్రమువలె నున్న, మయి=నాయందు, నామ=నిశ్చయముగా, విశ్వం=ప్రపంచము, వికల్పనా= కల్పనామాత్రమై యున్నది, అహం=నేను, అతిశాన్తః= అత్యంత శాంత స్వరూపుడను, నిరాకారః=నిరాకారుడను, చ= మఱియు, ఏతదేవ=ఈ ఆత్మకు, ఆస్థితః=ఆశ్రయుడనై యున్నాను.

అనంత మహాసముద్రరూపుడ నగు నాయందు కల్పింపబడిన యీ విశ్వము భ్రమమాత్రమై యున్నది గాని వాస్తవమునందు లేదు. ఎందుకనగా నా యనంతస్వరూపము నిరాకారమై యున్నది. నిరాకారమునుండి సాకారోత్పత్తి పొసగదు. ఆత్మయందు జగత్తుయొక్క వాస్తవోత్పత్తియే లేనప్పుడు నేను ప్రపంచరహితమైన శాంతస్వరూపుడనై యుంటున్నాను. కాన నాయందు లయ యోగాదికమునుగూడ కల్పించుట ఉచితము గాదు.

**నాత్మా భావేషు నో భావస్తత్రానన్తే నిరఞ్జనే ।**
**ఇత్యసక్తోఽస్పృహశ్శాన్త ఏతదేవాహమాస్థితః ॥ 4**

ఆత్మా=ఆత్మ, భావేషు=దేహాదిభావములయందు, న=లేదు, భావః= దేహాదికభావము, తత్ర=ఆ, అనన్తే=అనంతమైన, నిరఞ్జనే=నిరఞ్జన (నిర్ద్వంద్వ)మైన ఆత్మయందు, నో=లేదు, ఇతి=ఈ ప్రకారముగా, అసక్తః=సంగరహితుడనైన, శాన్తః=శాంతుడనైన, అహం=నేను, ఏతదేవ= ఈ యాత్మస్వరూపుడనయ్యే, ఆస్థితః=ఉంటున్నాను.

ఆత్మ దేహాదులయందు ఆధేయ (ఆశ్రిత) రూపముగా నుండలేదు ఎందుకనగా ఆత్మ వ్యాపకము, దేహము పరిచ్ఛిన్నమై యున్నది. వ్యాపకము పరిచ్ఛిన్నమునకు ఆశ్రితము కాదు. ఆత్మ సత్యమైన దగుటచేతను,

దేహము మిథ్య యగుటచేతను నిరాకారమైన ఆత్మ దేహాదులకు ఉపాధి కాజాలదు. సత్యవస్తువు మిథ్యావస్తువునకు ఉపాధి కాజాలదు. మఱియు ఆత్మ అనంతమును, నిరంజనమును అగుటవల్లను, దేహము అంతము గలది, నాశము గలది, యగుటచేతను దేహేంద్రియములు ఆత్మకు ఉపాధి కాజాలవు. ఈ కారణమువలన ఆత్మసంబంధ రహిత మైనది, ఇచ్ఛాదిక రహిత మైనది, మఱియు శాంతస్వరూపమై యున్నది.?

**అహో చిన్మాత్రమేవాహ మిన్ద్రజాలోపమం జగత్ ।**
**అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా ॥ 5**

అహం=నేను, చిన్మాత్రం=చైతన్యమాత్ర స్వరూపుడను, జగత్=ప్రపంచము, ఇన్ద్రజాలోపమం=ఇంద్రజాలముతో సమాన మైనది, అతః=ఈ కారణమువలన, మమ=నాకు, హేయోపాదేయ కల్పనా- హేయ=త్రోసివేయుట, ఉపాదేయ=తీసికొనుట యనెడి, కల్పనా=కల్పన, కుత్ర=దేనియందు, కథం=యెట్లు (క్రియతే=చేయబడుచున్నది.)

నాయొక్క అనగా ఆత్మయొక్క సత్తతోను, బలముతోను, ప్రతీతమై స్వకీయసత్త కించిత్తైనను లేని యీ సంపూర్ణజగత్తు ఇంద్ర జాలముతో సమానమై యున్నది. నేనో చైతన్యస్వరూపుడను. ఈ కారణమువలన జగత్తునకు తన సత్త కొంచెమైనను లేనందున నాకు ఏ పదార్థమునందును ఎటువంటి త్యాగబుద్ధి గాని, గ్రహణబుద్ధి గాని చేయ నక్కరలేదు. ఎవడు జగత్పదార్థములు సత్యమైనవని తలంచుచున్నాడో, అతనికే వాటియందలి త్యాగబుద్ధి గాని, గ్రహణబుద్ధి గాని కలుగుచున్నది.

ఇది ఏడవ ప్రకరణము

ఓమ్

# అష్టావక్ర గీత

## ఎనిమిదవ ప్రకరణము

## బంధమోక్ష వ్యవస్థా చతుష్కము

అవ॥ ముందటి ఏడు ప్రకరణములద్వారా అష్టావక్ర మునీంద్రుడు అన్నివిధముల జనకుని అనుభవమును పరీక్షించెను. ఇప్పుడు ఈ ఎనిమిదవ ప్రకరణమునందు నాలుగు శ్లోకములద్వారా శిష్యుని ఆత్మానుభ వమును శ్లాఘించుచున్నాడు.

**తదా బన్ధో యదా చిత్తం కించిద్వాఞ్ఛతి శోచతి ।**
**కిఞ్చిన్ముఞ్చతి గృహ్ణాతి కిఞ్చిద్ధృష్యతి కుప్యతి ॥ 1**

యదా=ఎప్పుడు, చిత్తం=మనస్సు, కిఞ్చిత్=ఏ కొంచెము నైనను, వాఞ్ఛతి=కోరుచున్నదో, శోచతి=దుఃఖించుచున్నదో, ముఞ్చతి= విడుచు చున్నదో, గృహ్ణాతి=గ్రహించుచున్నదో, హృష్యతి=సంతోషించుచున్నదో, కుప్యతి=కోపించుచున్నదో, తదా=అప్పుడు, బన్ధః=బంధము, (భవతి= అగుచున్నది.)

ఓ జనకుడా! అనంతాత్మస్వరూపుడ నగు నాయందు రాజ్య గ్రహణముల కల్పనయే లేదని నీవు పూర్వము చెప్పిన దెంతో బాగున్నది. అదియే సరియైనది. ఎందుకనగా మనస్సు విషయేచ్ఛ గలదియై ఒకానొక పదార్థమును పొందుటకు ఇచ్ఛయించి, అది లభ్యము కానిచో దుఃఖించు చున్నది, కష్టపడుచున్నది. అప్పుడు దానిని త్యజించుటకుగూడ సంకల్పించు

కొనుచున్నది. మఱల లబ్ధత్వ ముత్పన్న మైనప్పుడు దానిని గ్రహింప గోరుచున్నది. వస్తువు లభ్యమైనచో సంతోషించుచున్నది. లభ్యము గానిచో కోపోద్రిక్త మగుచున్నది. ఈ ప్రకారముగా మనస్సెప్పుడు అనేక వాసనలతో యుక్త మగుచున్నదో, అప్పుడు జీవునకు బంధము కలుగుచున్నది. యోగవాసిష్ఠమునందుగూడ ఈవిషయము చెప్పబడినది-

**"స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్ ।**
**ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్ ॥"**

అనగా భార్యాబిడ్డల యందలి స్నేహముచేతను, ధనము నందలి లోభముచేతను, మణులు స్త్రీలు మొదలగు వాటియొక్క ప్రాప్తివలనను చిత్తము పొంగిపోవుచున్నది. వాటి వియోగమువలన క్రుంగిపోవుచున్నది.

**"బన్ధో హి వాసనాబన్ధో మోక్షస్స్యాద్వాసనాక్షయః ।**
**వాసనా స్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ॥"**

చిత్తమునందలి అనేక ప్రకారములగు భోగములయొక్క వాసనలే పురుషునికి బంధకారణము లగుచున్నవి. సమూలముగా వాసనాక్షయమై పోవుట పేరే మోహము. ఓ రామా! ఎప్పుడు నీవు వాసనాత్యాగమును చేయుదువో, మఱియు మోక్షేచ్ఛనుగూడ చేయవో అప్పుడు నీవు సుఖివి కాగలవు.

ప్రశ్న॥ "మనస్సు వాసనలతో నిండిపోయినప్పుడు మఱి ముక్తి కలుగదు" అని గదా తమరు చెప్పుచున్నారు. అట్లే యైనచో మరి ఈ ప్రపంచములో నిర్వాసనిక పురుషుడే కనబడడు. ఎందుకనగా గృహస్థ

లెంద ఱున్నారో; అందఱి మనస్సులు స్త్రీయో, పుత్రులో, ధనమో-వీటియొక్క ప్రాప్తికొఱకు గాని, ప్రాప్తవస్తు రక్షణకొఱకు గాని గల వాసనలతో నిండింపబడియే యుండును. ఒకవేళ ఎవడైన ఈశ్వరధ్యానము గలిగి, దానధర్మాది పుణ్యకార్యములు చేయువా డైనచో అతని మనస్సులో కూడ "ఈశ్వరా! నా కీ సంపదలు ఎల్లప్పుడు ఉండు గాక! ఏ కోరికయు లేక ఏమియు లేక చేయున దేమున్నది?" అను వాసన యుంటున్నది. మఱియు ఎంతమందో త్యాగులు, సాధువులు, సన్న్యాసులు, మహాత్ములైనవారు గూడ 'మా హృదయములలో గూడ ఇంకా ఎన్నో కోరికలున్న'వని చెప్పుచున్నారు,

కొందఱు మఠములను నిర్మించుచున్నారు. కొందఱు పరివారమును, శిష్యగణమును అభివృద్ధిపరచుచున్నారు. మఱికొందఱు సంచారకార్య క్రమములను ఏర్పరచుకొనుచున్నారు. కాని నిర్వాసనిక (వాసనారహితు డగు) పురుషుడు వీరలలో నొక్కడును కనబడడు. మఱి వీరు వాసనా రహితులే యైనచో ఈ వేషములు ఈ యాడంబరములు, ఈ మఠములు, ఈ శిష్యబృందములు ఎందుకు? వీటి నభివృద్ధిపరచు టెందులకు? ఎందు కీ సంసారమును ఉత్పత్తి చేయుట? అందఱూ ఏదో ఒకరూపమైన సంసారమును ఉత్పత్తి జేసి, అభివృద్ధిపరచినచో నిక నిందులో సన్న్యాసి యెవడు? సంసారి యెవడు? ఈ స్థితిలో మనకు ఒక్కడుగూడ జ్ఞాని లభింపడు, జ్ఞానియే లేనిచో మఱి ముక్తి మాటనే యెత్త నక్కరలేదు. అనగా మఱి ముక్తియే లేదని చెప్పవచ్చును.

ఉ॥ ఒక వనములో ఒకే సింహము మఱియు లక్షలాది నక్కలు, ఇతర మృగము లుండునట్లు ఈ సంసారరూపమైన లేక గృహస్థాశ్రమ

రూపమైన లేక సన్న్యాసాశ్రమరూపమైన అరణ్యములో వాసనలనుండి రహితుడైన పురుషుడు ఏ ఒక్కడో విరళముగా నుండును. అయితే వాసనలతో నిండినవా రనేకు లుందురు. సింహముచేత చంపబడిన జంతు శవము నెట్లు నక్కలు మొదలగునవి భక్షించుచున్నవో, అట్లే వాసనా రహితుడగు పురుషుని (విరాగి) చిహ్నములను ధరించుకొని అనగా జ్ఞానసంబంధమైన మాటలను వినిపించును. వైరాగ్యాదులను చూపుచు ఈ వంచక సన్న్యాసులు, గృహస్థులై యున్న ఆచార్యపురుషులు అనేకమంది మూఢజనులను వంచించుచున్నారు, వారే సంసారము (ప్రపంచము) నందు నక్కలవంటివారు.

ఈ విషయమై ఒక దృష్టాంతము చెప్పబడుచున్నది. ఒక గ్రామమునందు కొందఱుసాలె(నేత)వాండ్రుండిరి. ఒక దినమున వారందఱు "పదండి, యీ రాత్రి క్షత్రియుల గ్రామాలు లూటీ చేయుదము" అని వారిలో వారనుకొని అదేవిధముగ వారందఱు కలసి రాత్రి క్షత్రియ గ్రామములను కొల్లగొట్టుటకై వెళ్లిరి. అది తెలుసుకొని క్షత్రియులు ఆయుధములను తీసికొని వీరిని కొట్టుటకు ఎప్పుడు వెంటబడిరో అప్పుడు ఈ సాలెవాండ్రందఱు పారిపోయిరి. అప్పుడందులో నొకడు "సోదరులారా! మనము ఏలాగూ పారిపోతూనే ఉన్నాము. కాన పరుగెత్తుచు 'కొట్టు బాగా' అంటూ పరుగెత్తండి" అని అనెను. అది విని వారందఱున్ను, అట్లే చెప్పుకుంటూ పరుగెత్తిపోయిరి. అదేవిధముగ పెక్కుమంది ఆడంబర జ్ఞానులు జ్ఞానసాధనలనుండి దూరముగా పారిపోవుచూ ఇతరులతో మాత్రము "వాసనలను విడిచిపెట్టండి, జ్ఞానధారణను చెయ్యండి, ఈ ప్రపంచమంతా మిథ్య, వట్టిదే" అని చెప్పుచున్నారు. కాని దంభజ్ఞాను

లగువారు మాత్రము జ్ఞాన సాధనలను చేయజాలరు. ఎవడు సమస్తవాసనా రహితుడో, అతడే నిజమగు జ్ఞాని. వాసనా వాసితుడే బద్ధుడు.

**తదా ముక్తి ర్యదా చిత్తం న వాఞ్ఛతి న శోచతి ।**
**న ముఞ్చతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి ॥ 2**

యదా=ఎప్పుడు, చిత్తం=మనస్సు, న వాఞ్ఛతి=కోరదో, న శోచతి= దుఃఖించదో, న ముఞ్చతి=విడిచిపెట్టదో, న గృహ్ణాతి= గ్రహించదో, న హృష్యతి=సంతోషించదో, న కుప్యతి=కోపించదో, తదా=అప్పుడు, ముక్తిః= ముక్తి, (భవతి=అగుచున్నది)

ఎంతవఱకు ఒకని మనస్సు భోగప్రాప్తికొఱకు ఆశించదో, ఒక వస్తువును గ్రహించుటయందుగాని, విడుచుటయందుగాని ఇచ్ఛ నిడదో, అదేవిధముగ ఒక పదార్థము లభించునపుడు సంతోషమును, ప్రీతిపాత్రు లగువారు పోయినను, వియోగము కలిగినను దుఃఖమును పొందదో, మఱి ఒకే విధముగ ఉన్నదున్నట్లుగా ఏకరసమై యుంటున్నదో, అప్పుడే అనగా ఆ కాలమునందే ఆ పురుషుడు ముక్తు డగుచున్నాడు.

**తదా బన్ధో యథా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు ।**
**తదా మోక్షో యదా చిత్త మసక్తం సర్వదృష్టిషు ॥ 3**

యదా=ఎప్పుడు, చిత్తం=మనస్సు, కాసు=ఎటువంటి, దృష్టిషు= విషయములయందు, సక్తం=అసక్త మగుచున్నదో, తదా=అప్పుడు, బంధః=బంధ మగుచున్నది, అపి చ=మఱియు, చిత్తం=మనస్సు, యదా=యెప్పుడు, సర్వదృష్టిషు=సమస్త విషయములయందును, అసక్తం=సక్తము కాదో, తదా=అప్పుడు, మోక్షః=మోక్షము కలుగుచున్నది.

మొదట ఒక వాక్యమువలన బంధ లక్షణమును, మఱల రెండవ వాక్యము వలన మోక్ష లక్షణమును చెప్పి, యిప్పుడు ఒకే వాక్యమువలన బంధమోక్షములు రెండింటిని చెప్పుచున్నాడు. మనస్సెప్పుడు అనాత్మ పదార్థములయందు అనాత్మాకార వృత్తి గలది యగుచున్నదో, అదే బంధము. మనస్సెప్పుడు విషయాకారము కాదో, అనగా ఆసక్తిచే రహిత మైనదై ఆత్మదృష్టి గలది యగుచున్నదో, అప్పుడే జీవుడు ముక్తు డగుచున్నాడు.

ప్రశ్న॥ ఎప్పుడు మనస్సు విషయాసక్తము కాదో అప్పుడు మోక్ష మనియు, విషయాసక్త మగునప్పుడు బంధ మనియు తమరు సెలవిచ్చితిరి. ఒకే మనస్సు కాలభేదముచేత బంధ మోక్షములకు కారణ మగుచున్నదని చెప్పినచో, అప్పుడు ముక్తిగూడ అనిత్యమని చెప్పవలసి వచ్చునుగదా!

ఉ॥ ఆ మాటకు ఇది తాత్పర్యము గాదు. ఆత్మ జ్ఞాన ప్రాప్తికి పూర్వము పురుష డెంతవఱకు విచారశూన్యుడై విషయాసక్తుడై ఉంటున్నాడో, అంతవఱకు జీవుడు బంధమునందే పడి యుంటున్నాడు. మఱల నెప్పుడు విచారణాయుక్తుడై దోషదృష్టిని తొలగించి విషయములం దాసక్తు డగుచున్నాడో, మఱియు విషయవాసనలయొక్క బీజముకూడ హృదయమునందు లేదో, అప్పుడాజీవుడు ముక్తుడై యెప్పటికిని మఱల బంధమును పొందడు. వేయించిన విత్తనము మొలకెత్తుటకు సమర్థము గానట్లు, నిర్వాసనికచిత్తము గల పురుషుడు ఒకప్పుడు గూడ పునర్జన్మ నొందడు.

**యదా నాహం తదా మోక్షో యదాఽహం బన్ధనం తథా ।**
**మత్వేతి హేలయా కిఞ్చిన్మా గృహాణ విముఞ్చ మా॥ 4**

యదా=ఎప్పుడు, అహం=నేను (అహంకారము ఉన్నదో) తదా=అప్పుడు, బన్ధః=బంధము, (భవతి=అగుచున్నది) యదా=ఎప్పుడు, అహం= అహంకారము, న=లేదో, తదా=అప్పుడు, మోక్షః=మోక్షము, (భవతి= అగుచున్నది) ఇతి=ఈ ప్రకారముగా, మత్వా=తలంచి, హేలయా= లీలగా, మా గృహాణ=గ్రహించకుము, మా విముంచ=విడిచిపెట్టకుము.

ఎంతవఱకు పురుషుడు అహంకారయుతుడై నేను బ్రాహ్మణుడననీ, నేను జ్ఞానిననీ, నేను త్యాగిననీ అనుకొనుచున్నాడో, అంతవఱకు అతడు ఒకప్పుడును ముక్తుడు కాజాలడు. ఆ విషయమే యిచట చెప్పబడుచున్నది.

"యావత్స్యాత్స్వసంబంధోఽహంకారేణ దురాత్మనా ।
తావన్న లేశమాత్రాఽపి ముక్తి వార్తా విలక్షణా ॥

అనగా ఎంతవఱకు జీవునకు దుష్టమగు అహంకారముతో సంబంధ మున్నదో అంతవరకు ముక్తి లేశమాత్ర మైనను అతనికి ప్రాప్తించదు. అదే విషయమును దృఢపరచుచున్నాడు- శరీరాదులతో అహంకారధ్యాస చేయుచున్నంతవఱకు జీవుడొకప్పుడును ముక్తుడు కాజాలడు. అహంకార ధ్యాస నివృత్తియైన వెంటనే పరిశ్రమ లేకనే అకర్తయు, నభోక్తయునై ముక్తు డగుచున్నాడు.

ఇది ఎనిమిదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## తొమ్మిదవ ప్రకరణము

## నిర్వేదాష్టకము

అవ॥ మొదట శిష్యుడు గురువునకు చెప్పిన అనుభవమునే దృఢ పరచుటకు ఇప్పుడు ఎనిమిది శ్లోకములతో వైరాగ్యమును చూపించుచున్నాడు.

**కృతాకృతే చ ద్వంద్వాని కదా శాన్తాని కస్య వా ।**
**ఏవం జ్ఞాత్వే హ నిర్వేదాద్భవ త్యాగపరోఽవ్రతీ ॥ 1**

కృతాకృతే=కర్తవ్యాకర్తవ్యములును, ద్వంద్వాని=సుఖ దుఃఖ శీతోష్ణాది ద్వంద్వములును, కస్య=ఎవనికి, కదా=యెప్పుడు, శాన్తాని= శాంతించు చున్నవి, ఏవం=యీ ప్రకారము, వా=నిశ్చయముగా, జ్ఞాత్వా= తెలిసికొని, ఇహ=ఈ ప్రపంచమునందు, నిర్వేదాత్=హేయత్వ బుద్ధివలన, అవ్రతీ=ఆగ్రహము లేనివాడవై, త్యాగపరః=త్యాగపరుడవుగా, భవ=అగుము.

"ఇది నాకు కర్తవ్యము, ఇది నా కకర్తవ్యము" అనుదానికే కృతాకృతమని పేరు. అనగా అవశ్యము ఇది నాకు చేయదగినది, ఇది చేయదగదు అను నీ రెంటియందును అభినివేశము (పట్టుదల)ను కలిగియుండకుము. మఱియు ద్వంద్వములగు సుఖదుఃఖాదులనుండి దూరుడ వగుము. ఎందుకనగా ఆ రెండు ఎప్పుడును ఎవనికిని శాంతిని కలుగజేయవు. ఇందువలన ఓ జనకమహారాజా! నీవు కృతాకృతాదికము

లను త్యజించుటద్వారా వైరాగ్యమును పొందుము. ఆగ్రహమును (పట్టుదలను లేక హఠమును) దేనియందును జూపకుము.

అవ॥ చిత్తధర్మత్యాగరూప మగు వైరాగ్యము వేలకొలది జనులలో ఏ ఒక్కనికి మాత్రమో కలుగునని చెప్పుచున్నాడు.

**కస్యాపి తాత! ధన్యస్య లోకచేష్టావలోకనాత్ ।**
**జీవితేచ్ఛా బుభుక్షా చ బుభుత్సోపశమం గతా ॥ 2**

హేతాత!=ఓ నాయనా! లోకచేష్టావలోకనాత్=ఉత్పత్తి వినాశ రూపమగు లోకస్వరూప క్రియలను చూచుటవలన, కస్య=ఒకానొక, ధన్యస్యాపి=ధన్యునకుమాత్రమే, జీవితేచ్ఛా=జీవించవలెననెడి, బుభుక్షా=భోగేచ్ఛ, బుభుత్సా=జ్ఞానము సంపాదింపవలె ననెడి అభిలాష, ఉపశమం=శాంతిని, గతా=పొందుచున్నది.

ఓ జనకా! వేలకొలది జనులలో బాగ్యవంతు డగు ఏ ఒక్కనికో మనస్సునందు వైరాగ్య ముత్పన్న మగుచున్నది. అట్టివానికి జీవించుట యందుగాని, బోగించుటయందుగాని, కోరిక నశించిపోవుచున్నది. ఎందుకనగా ప్రాపంచిక భోగములయందు ఏహ్యము, దోషదృష్టియే గదా వైరాగ్యము. ప్రపంచములో ఉత్పత్తి వినాశములు గల ప్రతివస్తువునందు దోష ముండనే యున్నది. భార్య, బిడ్డలు, ధనము, శరీరము మొదలగునవి ప్రీతిపాత్రములై యున్నవి. వారలను సుఖపెట్టవలెననీ, తద్వారా సుఖపడ వలెననీ పురుషుడు అనేకానర్థములను చేయుచున్నాడు. మఱియు వీరందఱు జీవునికి బంధకారణములై యున్నారు. ఇందువలన వీటియందు వైరాగ్యము కలుగకుండా పురుషు డొకప్పుడును ముక్తిని పొందజాలడు.

ఈ హేతువువలన ప్రాపంచిక విషయములందు దోషదృష్టిని కలిగి యుండు టెంతయు అవసరము. యోగవాసిష్ఠమునందుగూడ చెప్పబడినది-

**"గర్భే దుర్గంధభూయిష్ఠే జఠరాగ్ని ప్రదీపితే ।**
**దుఃఖం మయాఽఽప్తం యత్తస్మాత్కనీయః కుంభిపాకజమ్ ॥**

గొప్ప దుర్గంధభూయిష్టమును, జఠరాగ్ని ప్రదీప్తము నగు మాతృ గర్భమునందు జీవుడు పడిన దుఃఖమునకంటె కుంభీపాక నరకయాతన గూడ తక్కువే. ఇట్లు గర్భోపనిషత్తునందు గూడ గర్భదుఃఖము వర్ణింప బడినది. జీవుడు దుర్భరమగు గర్భదుఃఖము ననుభవించుకాలమున ఓ ప్రభూ! ఈసారి జన్మలో నేను తప్పక జ్ఞానసాధనలను చేయగలను అని భగవంతుని ప్రార్థించును. కాని జన్మించిన తరువాత జీవుడు మఱల సంసార భోగములయందే పడిపోవుచు గర్భదుఃఖమును మరచిపోతున్నాడు. ఈ కారణమువలన మాటిమాటికి జనన మరణములను పొందుచున్నాడు. శివగీతయందుగూడ మరణ దుఃఖమును చూపించుచున్నాడు.

**"హా కాంతే! హా ధనం పుత్రాః క్రందమానః సుదారుణమ్ ।**
**మండూక ఇవ సర్పేణ మృత్యునా గీర్యతే నరః ॥"**

ప్రాణములను విడిచిపెట్టుచున్న సమయమునందు జీవుడు హా ప్రియురాలా! అయ్యో! ధనమా! ఓ పుత్రులారా! నన్నీ మృత్యువునుండి తప్పించుడు అని సర్పమువాతపడిన కప్పవలె భయంకరముగా నరచుచు, మృత్యువువాత పడిపోవుచున్నాడు.

**"అయఃపాశేన కాలస్య స్నేహపాశేన బంధుభిః ।**
**ఆత్మానం కృష్యమాణస్య వ ఖల్వస్తి పరాయణమ్ ॥**

అనగా మరణకాలమునందు జీవుడు ఒకవంక యముని కాల పాశముచేతను, ఇంకొకవంక సంబంధుల స్నేహపాశములచేతను లాగబడుచున్నాడు. కాని ఒకడు గూడ మృత్యువునుండి రక్షించుటకు సమర్థుడు కాజాలడు.

**"యా మాతా సా పునర్భార్యా యా భార్యా జననీ హి సా ।**
**యః పితా స పునః పుత్రో యః పుత్రస్స పునః పితా ॥**

పూర్వజన్మమునందు తల్లియే పుత్రప్రేమ కారణమున ఉత్తర జన్మమునందు భార్య యగుచున్నది. పూర్వజన్మమునందు తండ్రి యగువాడు ఉత్తర జన్మమునందు కొడు కగుచున్నాడు. పుత్రుడే తండ్రి యగుచున్నాడు.

"ఏకో యదా వ్రజతి కర్మ పురస్సరోఽయం
విశ్రామవృక్షసదృశః ఖలు జీవలోకః ।
**సాయం సాయం వాసవృక్షం సమేతః**
**ప్రాతః ప్రాతస్తేన తేన ప్రయాన్తి ॥**

సాయంకాల మగుసరికి ఎక్కడెక్కడ నుండియో యెగిరివచ్చి పక్షులు రాత్రంతయు విశ్రాంతి కొఱకు ఒకే వృక్షమునందు గుమిగూడుచు మఱల తెల్లవారగనే ఇటూ - అటూ ఎగిరి పోవునట్లు ఈ సంసార రూప వృక్షమునందు జీవులు కర్మవశులై ఒకచోటకూడి, ప్రారబ్ధకర్మానుభవము పూర్తి కాగానే మఱల ఎవరికివారు వేరై పోవుచున్నారు. అంతేగాని భార్య గాని, బిడ్డలు గాని, ధనము గాని ఏదియు వచ్చినప్పుడు వెంట లేదు, పోయినప్పుడు కూడా పోదు- అని విచారించి వీటిపై నెప్పుడును మోహ ముంచకుము.

"నరస్య బన్ధనార్థాయ శృంఖలా స్త్రీ ప్రకీర్తితా ।
లోహబద్ధోఽపి ముచ్యేత స్త్రీ బద్ధో నైవ ముచ్యతే ॥

పురుషునకు బంధహేతువైన స్త్రీని శృంఖలమునుగా వర్ణించిరి. ఇనుపగొలుసులచేత బద్ధుడగువా డొకవేళ తప్పించుకొనినను తప్పించు కొనవచ్చుగాని స్త్రీ స్నేహరూప పాశములచే బద్ధుడగువా డొకప్పుడును తప్పించుకొనజాలడు. ఈ విషయమై యొక దృష్టాంత మున్నది.

ఒక పిల్లవాడు బాల్యావస్థలోనే సన్న్యాసియైపోయెను. రాను రాను అతనికి యౌవనావస్థగూడ ప్రాప్తించెను. ఒకదిన మాతడు తీర్థయాత్రకై పోవుచుండగా దారిలో అతని కెదురుగా కొందఱు పెండ్లివా రెదురైరి. ఆ సన్న్యాసి నిలువబడి 'ఇది ఏమి?' అని అడిగెను. ఇది వివాహపు సన్నాహమని ఆ గుఱ్ఱముమీద ఉన్న కుఱ్ఱవానికి ఒక అమ్మాయితో వివాహ మగునని వారు చెప్పిరి. "అయితే అప్పు డేమగును?" అని సన్న్యాసి అడిగెను. "పెండ్లి అయిన తరువాత ఇతని భార్య యింటికి రాగానే ఇద్దరికి విషయానందము కలుగును. తరువాత ఆమెకు పిల్లలు పుట్టుదురు." అని వారు చెప్పగా విని సన్న్యాసి తన దారిని పోయెను. త్రోవలో అలసటచేత ఆ సన్న్యాసి వృక్షముక్రింద నున్న ఒక నూతి గోడపై నిద్రపోయెను. వెంటనే అతడొక కల గనెను. తనకొక స్త్రీతో పెండ్లి అయినట్లు, ఆమె తనతో గూడ ఒకే మంచము పైన పండుకొన్నట్లు, ఆమె కొంచము జరగండి అని చెప్పగా విని తాను కొంచము వెనుకకు జరుగుటకు ప్రయత్నించుసరికి అత డా నూతిలో పడిపోయెను. ఆ శబ్దము విని పరిసర ప్రాంతీయులు పరుగెత్తుకొని వచ్చి, ఎవరు నిన్ను నూతిలో పడద్రోసిరని ప్రశ్నించిరి? అప్పుడతడు

'అయ్యో! స్వప్న స్త్రీ యే నన్నీ నూతిలో పడద్రోసినది. ఇక నిజమైన స్త్రీ పురుషుల నెట్టి దుర్దశలపాలు చేయునో ఎవరు చెప్పగలరు?' అని అనెను.

ప్రశ్న॥ మహాత్మా! కర్మఠు లగువారు "పుత్రులు లేని వారికి గతి లేదనియు, అందువలన ఏదో యొక ఉపాయము చేత సంతానమును బడయవలయునని దేవీ భాగవతాది గ్రంథములలో వ్రాయబడి యున్న దనియు చెప్పుచున్నారు. ఇది నిజమా?

ఉ॥ పుత్రులు లేనివారికి గతి లేదని మీరు చెప్పిన దానిలో గల గతి శబ్దమున కర్థమేమి? గతి శబ్దమున కర్థము మోక్షమందువా? లేక ఉభయలోక సుఖమందువా? మోక్షమనియే చెప్పినచో నప్పుడు పుత్రులు గలవారందఱు ముక్తులు గావలయును. మఱియు మనుష్యులు, పశువులు మొదలుగా గల వన్నియు జ్ఞానము లేకనే ముక్తిని పొందవలసియున్నది. అంతేగాక శుక, వామ దేవాదులకు చెప్పిన శాస్త్రములుగూడ వ్యర్థ మగును. ఎందుకనగా వారు నైష్ఠిక బ్రహ్మచారులు, ఇందువలన పుత్రులవల్ల గతి గలదని చెప్పిన వాక్యము అర్థవాదరూపమని చెప్పవలసి యున్నది. లోకులు పుత్ర సంబంధము వలన గొప్ప దుఃఖముల ననుభవించుచున్నారు. దశరథ మహారాజు శ్రీరామచంద్రమూర్తి వియోగమువలన ప్రాణత్యాగమును చేసెను. మొదట పుత్రులు కలుగవలె ననెడి చింత, తరువాత వారు జీవించవలెననీ, పిదప వారికి వివాహాదులు కావలెననీ, అటుపిమ్మట వారికి పుత్రులు కలుగవలయునని- ఈ విధమగు చింత జన్మాంతము ఉండును. మఱియు పుత్రుడు పెద్దవాడైన పిదప తండ్రి వృద్ధావస్థలో తండ్రి సంపాదించిన ధనాదులను ఇచ్ఛానుసారము వెచ్చించుచున్నాడు. మఱియు

సేవాది కార్యముల నేమియు చేయడు. అందువలన పుత్రుడు గూడ వివేకవంతులకు దుఃఖహేతువే యగుచున్నాడు. ఈ విధముగా విషయము లన్నియు దుఃఖకారణములే యగుచున్నవి. వివేకచూడామణి యందు చెప్పబడినది జూడుడు:

"విషయాశామహాపాశాత్ యో విముక్తస్సుదుస్త్యజాత్ ।
స ఏకః కల్పతే ముక్త్యై నాన్యే షట్‌శాస్త్రవేదినః ॥

అనగా స్త్రీ పుత్ర ధనాదిక విషయములు గొప్పపాశములు. వాటిని త్యజించుట గొప్ప కష్టము. ఆ పాశములనుండి తప్పించుకొన్నవాడే ముక్తికి అధికారి. అంతేగాని షట్ శాస్త్రములను తెలిసిన వాడైనను ఆ పాశముల నుండి విడివడనిచో ముక్తికి అధికారి కాజాలడు. అందువలననే ప్రపంచములో సంపూర్ణ విషయవాసనలనుండి రహితుడగు విరాగి జీవన్ముక్తుడు ఏ లక్షలలోనో ఒక్క డుండునని అష్టావక్రమునీంద్రుడు చెప్పెను.

**అనిత్యం సర్వమేవేదం తాపత్రితయదూషితమ్ ।**
**అసత్యం నిందితం హేయ మితి నిశ్చిత్య శామ్యతి ॥ 3**

ఇదం=ఈ, సర్వం=సమస్త ప్రపంచము, అనిత్యం=అనిత్య మైనది, తాపత్రితయదూషితం=తాపత్రయముచేత దూషిత మైనది, అసత్యం=అసత్య మైనది, నిందితం=నిందిత మైనది, హేయం=హేయమైనది, ఇతి=ఇట్లని, నిశ్చిత్య=నిశ్చయించి, శామ్యతి=శాంతిని పొందుచున్నాడు.

ప్రశ్న॥ జ్ఞానికి సర్వత్ర యిచ్ఛోపశమనము గలుగుటకు కారణమేమి?

ఉ॥ దృశ్యప్రపంచము అనిత్య మని, అనగా చైతన్యమునందు అధ్యస్తమై యున్నదని తెలుసుకొనుటవలన,

ప్ర॥ ఈ ప్రపంచ మెట్లున్నది?

ఉ॥ ఆధ్యాత్మికాది తాపములవలన దూషితమై యున్నది. వాత పిత్త శ్లేష్మాది నిమిత్తముగా గాని లేక కామ క్రోధ లోభ మోహాదులనుండి గాని కలిగిన మానసిక దుఃఖమునకు ఆధ్యాత్మిక తాప మని పేరు. మనుష్య, పశు, పక్షి, సర్పాదులవలన కలిగిన దుఃఖము ఆధిభౌతికము. యక్ష, రాక్షస, పిశాచాదులవలన కలిగిన తాపము ఆధిదైవికము. ఈ త్రివిధములగు దుఃఖమువలన పురుషుడు నిరంతరము సంతప్తు డగుచున్నాడు. కావున ఈ సమస్త ప్రపంచము సారహీనము, తుచ్ఛము, విడవదగినదిగా నున్నది అని తెలిసికొనిన జ్ఞాని ఏ పదార్థము నైనను ఇచ్ఛగింపడు.

అవ॥ సుఖదుఃఖాది ద్వంద్వములు ప్రారబ్ధవశమున సంభవించునవి. కావున వాని నవశ్య మనుభవించవలెను. కావున వానియందు కోరిక లేక, ద్వేషమును లేక సమబుద్ధితో అనుభవించువాడు జ్ఞాని యని చెప్పుచున్నాడు.

**కోఽసౌ కాలో వయః కిం వా యత్ర ద్వంద్వాని నో నృణామ్ ।**
**తాన్యుపేక్ష్య యథా ప్రాప్తవర్తీ సిద్ధిమవాప్నుయాత్ ॥ 4**

యత్ర=దేనియందు, నృణాం=మనుష్యులకు, ద్వంద్వాని=సుఖ దుఃఖ ద్వంద్వములు, నో=లేవో, అసౌ=ఈ, కాలః=కాలము, కః=ఏది?, వయః= వయస్సు, కిం=ఏది?, అపి తు=అయితే, న కోఽపి=ఏమియు లేదు,

(ఇతి=ఇట్లని), తాని=వాటినన్నిటిని, ఉపేక్ష్య=ఉపేక్షించి, యథా ప్రాప్తవర్తీ= యాదృచ్ఛికముగా వచ్చిన భోగముల ననుభవించుచూ, సిద్ధిం=సిద్ధిని, అవాప్నుయాత్=పొందుచున్నాడు.

పురుషుడు సుఖ దుఃఖాది ద్వంద్వములను ప్రత్యేక కాలములో గాని, ప్రత్యేకావస్థలోగాని అనుభవించవలెనని ఏమీ లేదు. మరి అన్ని కాలములలోను, అన్ని అవస్థలలోను సుఖదుఃఖాది ద్వంద్వములను అనుభవించుచున్నాడు. ఈ విషయమై శ్రీరామచంద్రుడు అధ్యాత్మ రామాయణమునం దిట్లు చెప్పుచున్నాడు:-

"సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానన్తరం సుఖమ్ ।
ద్వయ మేతద్ది జన్తూనా మలంఘ్యం దివరాత్రివత్ ॥"

రాత్రింబవళ్ళవలె సుఖానంతరము దుఃఖము, దుఃఖానంతరము సుఖము నియతమై యున్నది. నిశ్చయముగా జీవున కీరెండును అలంఘ్యములై యున్నవి. అనగా అడ్డుకొనుటకు శక్యము గాకున్నవి.

**"సుఖ మధ్యే స్థితం దుఃఖం దుఃఖ మధ్యే స్థితం సుఖమ్ ।**
**ద్వయమన్యోన్యసంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్ ॥"**

సుఖమునందు దుఃఖము, దుఃఖమునందు సుఖము మిళితమై యున్నవి, అనగా క్షణమాత్ర సుఖము నిచ్చునట్టి విషయమువలన అనేక దుఃఖము లుత్పన్నము లగుచున్నవి. ఉపవాసాది వ్రతములు మొదట కష్టమును కలుగజేసినను తుదకు అభీష్టప్రాప్తిరూప సుఖమును కలుగజేయుచున్నవి. జల పంకములవలె సుఖ దుఃఖములు రెండును

మిళితమై యున్నవి. దేహధారియగు ఎవనిచేతనైనను, ఏ కాలమునందైనను సుఖ దుఃఖములు త్యజింప వలనుపడవు. కాన వివేకవంతుడు సుఖ దుఃఖాది ద్వంద్వముల యందలి కోరికను విడిచి శరీరమును ప్రారబ్ధమునకే వదలిపెట్టుచున్నాడు.

అవ॥ ప్రతివాది జిగీషాది దోషదూషితము లగు తర్కాది శాస్త్రముల యందును, కర్మహేతువులగు యాగాదులయందును, ప్రాణ నిరోధము లగు యోగాదులయందును ముముక్షువున కాసక్తి తగదని చెప్పుచున్నాడు.

**నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా ।**
**దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః ॥ 5**

మహర్షీణాం=మహర్షులయొక్కయు, సాధూనాం=సాధు పురుషుల యొక్కయు, తథా=అదే విధముగ, యోగినాం=యోగులయొక్కయు, నానామతం=భిన్నభిన్నములగు మతములను, దృష్ట్వా=చూచి, నిర్వేదం= వైరాగ్యమును, అపన్నః=పొందినవాడై, కః మానవః=ఏ మానవుడు, న శామ్యతి=శాంతిని పొందడు?

మహర్షులు, సాధువులు, యోగులు -ఈ మొదలగు మహాత్ములు ఒకరిమతము నొకరు అంగీకరించుట లేదు. మఱల వీరిలోనే వీరికి భేదము గనిపించుచున్నది. అందువలన ఇట్టి భిన్న భిన్న మతములను చూచి వాటియందు విసుగు జనించినవాడు తప్పక ఆత్మశాంతిని బొందగోరును. ఓ శిష్యా! నీవు తర్కశాస్త్రాదులను, కర్మకాండయందలి యాసక్తిని విడిచి కేవలాత్మజ్ఞాన నిష్ఠనే చేయుచుండవలయును. ఎందుకనగా తర్కాది శాస్త్రములు బుద్ధి భ్రమ కారకములు. గౌతమాదుల మతము వేదమునకును

మఱియు యుక్తి ప్రమాణములకును విరుద్ధమై యున్నది. కేవలము భ్రమ జలములో ముంచివేయునదిగా నున్నది. గౌతమాదుల మతానుయాయులగు నైయాయికులు జీవాత్మను, ఈశ్వరాత్మను రెంటిని జడములని అభిప్రాయపడుచున్నారు. మఱియు జ్ఞానము, ఇచ్ఛ మొదలగునవి ఆత్మగుణము లనియును, ఈశ్వరాత్మగుణములు నిత్య మనియును, జీవాత్మగుణములు అనిత్య మనియును, సమస్త జీవాత్మలు వ్యాపకము లనియును, ఆత్మ సంయోగమే జ్ఞాన కారణ మనియును పరమాణువులవలన జగదుత్పత్తి నిరవయవము లనియును తలంచు చున్నారు.

ఉ॥ ప్రథమములో జీవాత్మ పరమాత్మలు జడములు కాజాలవు. ఎందుకనగా - "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" = ఆత్మ సత్యరూపము, జ్ఞాన స్వరూపము, ఆనంద స్వరూపమై యున్నది అను ఈ శ్రుతితో విరోధము వచ్చిపడుచున్నది. రెండవది- జీవ ఈశ్వరాత్మలకు జడత్వమును భావించినచో జగదంధకార ప్రసంగము కలుగును. ఒకవేళ కర్మ జడము, ఆత్మయు జడమే, ఈశ్వరాత్మయు జడమే నని తలంచినచో, అప్పుడు భోక్త గాని, కర్త గాని ఫలప్రదాత గాని ఉండనేరడు. ఎందుకనగా జడమునందు కర్తృత్వ, భోక్తృత్వాది శక్తి లేదు. మఱియు జడ సంబంధములగు గుణములు జ్ఞానమును మఱియు చైతన్యమును కలుగజేయజాలవు. అగ్ని -ఉష్ణము, జలము-శీతలము. భిన్నము ఏమీా కానట్లు గుణికంటె గుణము భిన్నము గాదు. అగ్నినుండి ఉష్ణతను, ప్రకాశమును తీసివేసినచో అగ్ని మఱి యేమీా మిగిలి యుండదు. ఉష్ణము, ప్రకాశము అగ్నికి స్వరూపము లైనట్లు, జ్ఞానము- చైతన్యమే ఆత్మ

స్వరూపములై యున్నవి ఆత్మ ధర్మములు కావు, ఎందుకనగా గుణ గుణిభావము ఆత్మకు కలదనీ, చైతన్యము జడధర్మమనీ ఎక్కడా వ్రాయబడియుండలేదు. మఱియు దృష్టాంతముగూడ దొఱుకుట లేదు. కావున నైయాయికుల కథనము అసంగతమని తెలియుచున్నది.

మఱియు ఈశ్వరునకు ఇచ్ఛాదిగుణములు నిత్యములని తలంచి నచో, అప్పుడు ఈశ్వరుని ఇచ్ఛానుసారమే ఈ జగదుత్పత్తియు, ప్రళయమును ఎల్లప్పుడు నయి యుండవలెను. అనగా రెంటిలో నొకటి గాని లేక ఆరెండు గాని లేకుండ ఉండవలెను. అట్లు గాక రెండింటికి ఎప్పుడో సృష్టి యెప్పుడో ప్రళయము అని చెప్పినచో ఈశ్వరుని ఇచ్ఛయే అనిత్యము కావలసివచ్చును.

జీవాత్మ వ్యాపకుడు అనునదియు పొసగదు. ఒకవేళ జీవాత్మ సర్వవ్యాపకుడని తలంచినచో, ఒకే శరీరమునందు జగత్పూర్ణులగు జీవాత్మలు ఉంటున్నారు. మఱియు అన్ని జీవాత్మలతో అతనికి మనస్సంయోగము కలుగుటవలన అతనికి సర్వజ్ఞత కలిగియుండవలెను. ఇందువలన అతనికి సమస్తమును గూర్చిన సర్వజ్ఞత కలిగియుండవలెను. కాని ప్రపంచమున నట్లేమియు కనబడుటలేదు. దీనివలన జీవాత్మలకు వ్యాపకమును చెప్పుట యుక్తికి ప్రమాణమునకు విరుద్ధమని సిద్ధమైనది.

మఱియు నిరవయవములగు పరమాణువులకు సంయోగము కలుగదనీ, సావయవములకే సంయోగము కలుగుననీ చెప్పబడినందునను, మఱియు యుక్తికి, ప్రమాణమునకు సరిపడనందునను పరమాణువుల నుండి గూడ జగదుత్పత్తి కాజాలదు. ఈ కారణమువలన వివేకవంతులకు

నైయాయికమతము విడిచిపెట్టదగినదిగా నున్నది.

ఇదేవిధముగ కర్మ నిష్ఠాపరుల మతమునందును నానా ప్రకారము లగు జగడము లుండుట వలన వివేకవంతుడు దానియందును ఆసక్తి నిడదగదు. కర్మఠులు కొందఱు హెూమాదులే ముఖ్యము లని తలంచు చున్నారు, మఱికొందఱు మంత్రోపాధులనే ప్రధానములని తలంచు చున్నారు. ఇంక కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు చేయుటయే ధర్మమని అనుకొను చున్నారు. కొందఱు మూర్తి పూజలను, కొందఱు యజ్ఞాదులయందు పశువధలను, కొందఱు తీర్థాటనములను ప్రధానము లనుగా తలంచు చున్నారు. ఇట్లు ఈ కర్మజాలము - ఒక మనుష్యుడు దినమున కొక కర్మ చొప్పున తన జీవితమంతయు చేసినను సమాప్తము కానంతటి గొప్పదై యున్నది. మఱియు ఘటీయంత్రమువలె క్రిందికి మీదికి తిరుగుటకు అనగా స్వర్గ నరకములకు హేతువైన కర్మరూపజాలమై (వలయై) యున్నది.

ఈ విషయమై శాస్త్ర మిట్లు చెప్పుచున్నది.

**"కర్మణా బధ్యతే జంతుర్విద్యయా చ విముచ్యతే ।**
**తస్మా త్కర్మ న కుర్వన్తి యత్తప: పారదర్శిన: ॥"**

జీవుడు కర్మవలన బంధమును, ఆత్మవిద్యవలన మోక్షమును పొందుచున్నాడు. ఇందువలన వివేకియగు ఆత్మజ్ఞానకర్మఠుడు గానొల్లడు, మరేమన ఆత్మనిష్ఠయందే మగ్ను డగుచున్నాడు.

జైమిన్యాచార్యులయొక్క మతముగూడ శ్రుతివిరుద్ధమై యున్నది. ఎందుకనగా జైమిని ఆత్మ జడచేతన ఉభయరూపమని తలంచుచున్నాడు. మఱియు స్వర్గ ప్రాప్తినే మోక్షమని తలంచుచున్నాడు.

ఒకే పదార్థము జడచేతనోభయాత్మకమై యుండజాలదు. ఎందు కనగా ఈ విషయమై ప్రమాణ మేమియు కనబడుటలేదు, మఱియు చేతనము నిరవయవము, జడము సావయవమును అనిత్యమునై యున్నది. శీతోష్ణము లెట్లు పరస్పర విరుద్ధములో అట్లే జడచైతన్యము గూడ విరుద్ధములు మఱియు ఆత్మ ఉభయ రూపాత్మక మైనదనియు, స్వర్గమే మోక్ష మనియు వేదమునందు ఎక్కడగూడ వ్రాయబడియుండలేదు.

**"తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర**
**పుణ్యచితో లోకః క్షీయతే ॥"**

ఈ ప్రపంచములో కర్మతులవలన పొందబడిన ఫలము నరకాదు లను గలిగించి మఱల ఎట్లు నశించుచున్నదో, అట్లే పుణ్యకర్మల వలన గలిగిన ఫలము స్వర్గమును పొందించి మఱల నశించుచున్నది అని శ్రుతి చెప్పుచున్నది. ఈ శ్రుతివాక్యములవలన స్వర్గముయొక్క అనిత్యత సిద్ధమైనది. ఎప్పుడు స్వర్గమే అనిత్యమో, అప్పుడు మోక్షముకూడ అనిత్యము కావలసివచ్చును. ఇందువలన జైమిని మతమును ఆత్మజ్ఞాననిష్ఠ గలవారు త్యజింపవలసియున్నది.

అవ॥ కర్మాదుల నుపేక్షించి కేవల జ్ఞాననిష్ఠయే గలిగియుండవలెనని చెప్పుచున్నాడు.

**కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః ।**
**నిర్వేదసమతాయుక్త్యా యస్తారయతి సంసృతేః ॥ 6**

నిర్వేదసమతాయుక్త్యా-నిర్వేద=వైరాగ్యము, సమతా=సమత్వము, యుక్త్యా=యుక్తులచేత, చైతన్యస్య = చైతన్యముయొక్క, మూర్తి

పరిజ్ఞానం=ఆకార శేషజ్ఞానమును, కృత్వా=చేసి, యః=ఎవడు, సంసృతేః= సంసారమునుండి, (స్వం=తనను) తారయతి=తరింపజేసి కొనుచున్నాడో, సః=అట్టివాడు, గురుః=గురువు, న కిం=కాడా యేమి? (అగుచున్నాడని భావము.)

ఓ జనకుడా! ఎవడు విషయవాసనలను త్యజించి శత్రువునందును, మిత్రునియందును సమబుద్ధి గలిగి శ్రుత్యనుకూల యుక్తులవలన సచ్చిదానందరూప మగు తన ఆత్మసాక్షాత్కారమును చేసికొనుచున్నాడో, ఎవడు తనను సర్వభూత స్వరూపునిగా అనుభవ పూర్వకముగా తెలిసికొనుచున్నాడో, అతడు సంసారమునుండి తనను తరింపజేసి కొనుచున్నాడు. తదితరుడు తరింపజాలడు. ఓ జనకా! నీవు నీ పురుష ప్రయత్నమువలననే ముక్తుడవు కావలయును, ఇతరునివలన కాజాలవు.

ప్రశ్న॥ గురుదేవా! ప్రపంచములో కొందఱు "గురువే శిష్యుని ముక్తునిగా చేయుచున్నాడు" అని చెప్పుచున్నారు. ఇప్పుడు తమరు దానికి విరుద్ధముగా శిష్యుడు తనకు తానే స్వప్రయత్నమువలన ముక్తుడు కావలయునని చెప్పుచున్నారు, ఇది నా కర్థ మగుట లేదు.

ఉ॥ శాస్త్రతాత్పర్యమును గురు, శిష్య శబ్దార్థములను తెలియనివారే తఱచుగా నిట్లు చెప్పుదురు. ఎందుకనగా వారు కామనాబుద్ధి గలవారు. ముసల్మాను లెట్లు పైగంబరులు (ఈశ్వర సందేశహరులు) మనలను పాపములనుండి విముక్తులనుగా చేయుచున్నారని తలంచుచున్నారో, క్రైస్తవులు ఏసుప్రభువే మనలను పాపములనుండి విముక్తిని పొందించు చున్నాడని నమ్ముచున్నారో, అట్లే సంసారజనులు గురువే మనలను

పాపములనుండి తప్పించి మోక్షమును కలుగజేయుచున్నాడని తలంచు చున్నారు.

ఈవిధముగా వారితలంపు ఒకవిధముగా ఉత్తమ మైనదే ఎందుకనగా వేదమునందును, శాస్త్రమునందును ఈ రహస్యము మంత్రములద్వారా గురువు అవసరమని చెప్పబడియున్నది. ఎవడు అజ్ఞానమునుండి అజ్ఞాన కార్యమగు జనన మరణరూప సంసారమునుండి ఆత్మజ్ఞానోపదేశముద్వారా విముక్తులను చేయుచున్నాడో, మఱియు మనస్సునందలి సకల సందేహములను నివృత్తి చేయుచున్నాడో, అతడే గురువు. అయితే గురూపదిష్టమార్గము ననుసరింపజాలని శిష్యులు ఉత్తమగతిని పొందజాలనిచో లోప మెవరిది? అది శిష్యులదే గాని గురుదేవునిది కాజాలదు. రామచంద్రమూర్తి వసిష్ఠమునీంద్రుని పెక్కు సందేహములను గూర్చి ప్రశ్నించెను. వసిష్ఠమునీంద్రు డన్ని ఆశంకలకును సమాధానము నొసంగి సందేహనివృత్తి నొనరించి రామచంద్రున కాత్మ ప్రబోధమును జేసెను. అప్పుడాతడు వసిష్ఠమునీంద్రుని గురువుగా భావించెను. అర్జునుడు శ్రీకృష్ణభగవానునిగూర్చి వేలకొలది శంకలను చేసెను. భగవానుడు ఆ శంకల కన్నింటికి సమాధానమును చెప్పి విరాడ్రూప మును చూపించినప్పుడు అర్జునుడు శ్రీకృష్ణభగవానుని గురువుగా తలంచెను.

ఈవిధముగా పూర్వమునందున్న శ్రేష్ఠపురుషులు చిత్త సందేహ మును దూరమొనరించువారినే గురువులుగా భావించుచుండిరి. అదిగూడ వ్యవహార దృష్టితోనేగాని, ఆత్మదృష్టితో నట్లు తలంచుట లేదు. ఎందుకనగా ఆత్మదృష్టియందు ఆత్మకు భేదమే లేదుగదా! ఆత్మజ్ఞానియే పరమార్థ

గురువై యున్నాడు. అటువంటి గురువులు ప్రపంచములో చాల తక్కువ.

**పశ్యభూతవికారాంస్త్వం భూతమాత్రాన్ యథార్థతః ।**
**తత్క్షణా ద్బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి ॥ 7**

భూతవికారాన్=భూతవికారములైన దేహేంద్రియాదులను, యథార్థతః= వాస్తవముగా, భూతమాత్రాన్=భూతమాత్రములనుగా, త్వం=నీవు, పశ్య=చూతువుగాక! తత్క్షణాత్=అట్లు చూచినవెంటనే, బంధ నిర్ముక్తః= బంధమునుండి విడివడినవాడవై, స్వరూపస్థః=స్వరూపస్థితియందున్న వాడవుగా, భవిష్యసి=కాగలవు.

ఓ జనకా! భూతవికారములగు దేహేంద్రియాదులను, వాటి యథార్థ రూపములగు భూతములుగానే చూడుము. అనగా అవి పంచభూతముల కంటె భిన్నములు గావని తెలిసికొనుము. ఈవిధముగా నీవు చూడగలిగిన తత్క్షణమే దేహాదులకంటె వేరైనవాడవై ఆత్మస్వరూపమునందు స్థితుడవు కాగలవు. మఱియు వాటికి సాక్షిభూతమగు ఆత్మకూడ నీకు కరతలామలకమువలె ప్రత్యక్షము కాగలదు.

**వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచ తాః ।**
**తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా ॥ 8**

వాసనా ఏవ=వాసనలే, సంసారః=సంసారము, ఇతి=ఇట్లని, జ్ఞాత్వా= తెలిసికొని, తాః సర్వాః=ఆ వాసనల నన్నింటిని, విముంచ= విడువుము, వాసనాత్యాగాత్=వాసనాత్యాగమువలన, తత్త్యాగః=ఆ సంసార త్యాగము గూడ అగుచున్నది, అద్య=ఇట్లయిన పిదప, యథా= ప్రారబ్ధ మెట్లున్నదో, తథా=తదనుసారమే, స్థితిః=శరీరస్థితి యగుచున్నది.

ప్రశ్న॥ పూర్వోక్తయుక్తిచేత పురుషుడు ఆత్మను తెలిసికొన్నను దానియందు నిష్ఠ కలుగు టెట్లు?

ఉ॥ అనేక విషయవాసనలే సంసారము. అనగా అదే బంధము. యోగవాసిష్ఠమునందు ఈ విషయము చెప్పబడినది.

**"లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాఽపి చ ।**
**దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే ॥"**

వాసనలు మూడువిధములు (1) లోకవాసన - అనగా స్వర్గాది ఉత్తమ లోకప్రాప్తి నాకు కావలయును అనునదే లోకవాసన. (2) శాస్త్రములను చదివి నాతో సమానుడగు పండితు డింకొకడు లేని స్థితిని పొందుదును అనునదే శాస్త్రవాసన. (3) నా శరీర మందరి శరీరములకంటె సుందర మైనది, దీనినెల్లప్పుడు తగ్గకుండ నేను పరిపోషింతును అనునదే దేహవాసన. ఈమూడు వాసనలను విడిచిపెట్టినప్పుడే పురుషుడు బంధనమునుండి విముక్తు డగుచున్నాడు. అప్పుడే అతని చిత్తము ఆత్మయందు నిలకడ గలిగియుంటున్నది.

ప్రశ్న॥ సమస్త వాసనలను విడిచిపెట్టినచో శరీర మెట్లుండును?

ఉ॥ పాలు త్రాగుచున్న బాలునియొక్కయు, ఉన్మత్తుడు అనగా పిచ్చివానియొక్కయు శరీరస్థితి ప్రారబ్ధకర్మవశమున ఎట్లు గడచిపోవు చున్నదో, అదే విధముగ వాసనా రహితుడగు జ్ఞానియొక్క శరీరస్థితియు ప్రారబ్ధవశమువల్లనే ఉంటున్నది. అయితే యీ వాసన అనగా శరీర మెట్లు సిద్ధించినదో (వచ్చినదో) అదే విధమున దానిని విడుచుటగూడ ఉచిత మైనదే.

ప్ర॥ ఒకవేళ పురుషుడు అన్ని విషయవాసనలను త్యజించి

నట్లయినచో అప్పుడు ఆత్మజ్ఞానమునుగూడ అతడు పొందజాలడు. ఎందుకనగా ముముక్షువులు ఆత్మజ్ఞానమును పొందుటకుగూడ వాసన యెల్లప్పుడు ఉండియే తీరవలెను. మఱియు జ్ఞానులకుగూడ చిత్తనిరోధము వాసనల నుండియే కలుగుచున్నది. ఇంకను జీవన్ముక్తు డగుటకుగూడ ఈ వాసనయే ముఖ్యసాధనమై యున్నది. సమస్త వాసనలను త్యజించుట యెవనికిని శక్యము కాజాలదు.

ఉ॥ వాల్మీకి రామాయణమునం దిట్లు లిఖింపబడియున్నది.

"వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।
మలినా జన్మహేతు స్స్యాచ్ఛుద్ధా జన్మ వినాశినీ ॥

శుద్ధవాసన యనియు, మలినవాసన యనియు వాసన రెండు విధములుగా చెప్పబడినది. "నేనెట్లు ముక్తిని పొందగలను? ఆత్మ సాక్షాత్కార మెట్లు కలుగును?" అని. అందుకొఱకు ఆ వృత్తులను నిరోధించుటయే శుభవాసన. విషయభోగముల ననుభవించవలయునని తలంచుటయే మలినవాసన. ఈ రెండింటిలో మలినవాసన జన్మ హేతువును, శుద్ధవాసన జన్మనాశకము నగుచున్నవి. చతుర్థ (నాల్గవ) భూమికలో నున్నటువంటి వానికిని, ముముక్షువునకును శుద్ధవాసనలను త్యజింపవలసిన పనిలేదు. అశుభవాసనలను త్యజింపవలసియున్నది. ఎందుకనగా విదేహముక్తియందు ఆత్మజ్ఞానమే ప్రధానమై యున్నది. శుభవాసనలయొక్క నాశ మక్కడ ఉపయోగము కాదు. అయితే జీవన్ముక్తి కొఱకు సమగ్రవాసనా త్యాగము, మనోనాశము, ఆత్మజ్ఞానము- ఈ మూడును ఉపయుక్తములై యున్నవి.

ఇది తొమ్మిదవ ప్రకరణము.

ఓమ్

# అష్టావక్రగీత

## పదవ ప్రకరణము

## ఉపశమాష్టకము

అవ॥ ముందు ప్రకరణములందు విషయసంబంధము లేని సంతోషరూప వైరాగ్యము చెప్పబడినది, ఇప్పు డీ ప్రకరణమునందు తృష్ణా త్యాగ నిరూపణము చేయబడుచున్నది.

**విహాయ వైరిణం కామమర్థం చానర్థ సంకులమ్ ।**
**ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరం కురు ॥ 1**

వైరిణం=శత్రురూపమగు, కామం=కామమునున్ను, చ=మఱియు, అనర్థసంకులం=అనర్థములతో నిండిన, అర్థం=అర్థమునున్ను, విహాయ=విడిచిపెట్టి, ఏతయోః=ఈ రెండింటికి, హేతుం= కారణమైన, ధర్మమపి=ధర్మమునున్ను, విహాయ=విడిచిపెట్టి, సర్వత్ర=ధర్మార్థ కామములయందును, వాటికి నిమిత్తములగు కర్మములయందును, అనాదరం=అనాదరమును, కురు=చేయుము.

ఓ జనకా! కామమే శత్రువు, ఈ కామమే సంపూర్ణానర్థములకు మూలమును దుర్జయమునై యున్నది. దీనిని గూర్చి ఆత్మపురాణము నందిట్లు చెప్పబడినది.

**"కామేన విజితో బ్రహ్మా కామేన విజితో హరః ।**
**కామేన విజితో విష్ణుః శక్రః కామేన నిర్జితః ॥"**

కామదేవుడు బ్రహ్మను జయించెను. విష్ణువును, ఈశ్వరుని, ఇంద్రుని కూడ జయించెను. కావుననే సర్వానర్థములకు మూలమని చెప్పబడెను. ధనము నార్జించుటయందును, రక్షించుటయందును, నాశమునందును గల దుఃఖమునకు మూలము కామమే. మఱియు నో జనకమహారాజా! కామమునకు కారణమగు ధర్మమును, సకామ కర్మములను త్యజింపుము. ఎందుకనగా అవి జీవన్ముక్తికి ప్రతిబంధ ములుగా నున్నవి.

అవ॥ అనేక ప్రకారములగు సుఖములకు కారణభూతులగు మిత్ర పుత్ర-కళత్రాదులయందెట్లు ఉపేక్ష చేయ నగు నను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**స్వప్నేంద్రజాలవత్పశ్య దినాని త్రీణి పంచ వా ।**
**మిత్రక్షేత్రధనాగార దారదాయాది సంపదః ॥ 2**

మిత్ర క్షేత్ర ధనాగార దార దాయాది సంపదః=మిత్రులు, క్షేత్రములు, ధనములు, భవనములు, స్త్రీలు, సోదరులు మొదలగు సంపద లన్నియు, స్వప్నేంద్రజాలవత్=స్వప్నమువంటి వనియు, ఇంద్రజాలము వంటి వనియు, త్రీణి=మూడు గాని, వా=లేక, పంచ=ఐదు గాని, దినాని= దినములవరకే ఉండుననియు, పశ్య=చూడుము.

ఓ శిష్యా! స్త్రీ, ధన, మిత్ర, పుత్ర, క్షేత్రాది భోగ సాధన లన్నియు స్వప్నము లేక యింద్రజాలమువంటివని తలంచుము. ఎందుకనగా ఇవన్నియు మూడు లేక నాలుగు దినము లుండిపోవునవి. అందువలన వీటిపైన గల మమత్వమును విడిచిపెట్టుట ఉత్తమము.

అవ॥ అప్పుడు ప్రౌఢవైరాగ్యముచేత ముక్తినొందుమని చెప్పుచున్నాడు.

**యత్ర యత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై ।**
**ప్రౌఢవైరాగ్యమాశ్రిత్య వీతతృష్ణ స్సుఖీ భవ ॥ 3**

యత్ర యత్ర=ఏయే విషయములయందు, తృష్ణా=ఆశ (కోరిక) భవేత్=అగునో, తత్ర=అచ్చట, సంసారం=సంసారము (ఉన్నదని), విద్ధి వై=నిశ్చయముగా తెలిసికొనుము, ప్రౌఢవైరాగ్యం=అసాధారణ వైరాగ్యమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, వీతతృష్ణః=తృష్ణారహితుడవై, సుఖీ భవ=సుఖవంతుడ వగుము.

ఓ జనకమహారాజా! ఏయే విషయ భోగములందు మనస్సునకు ఆశ జనించునో, ఆ యా విషయములను నీవు సంసార కారణములని తెలిసికొనుము. ఎందుకనగా విషయ తృష్ణయే కర్మలద్వారా సంసార హేతు వగుచున్నది. ఈ విషయము యోగవాసిష్ఠమునందుగూడ వ్రాయబడి యున్నది.

**"మనోరథరథారూఢం యుక్తమింద్రియవాజిభిః ।**
**భ్రామ్యత్యేవ జగత్కృత్స్నం తృష్ణాసారథిచోదితమ్ ॥"**

మనోరథరూపమైన రథము ఇంద్రియములను గుఱ్ఱములచే పూన్చబడియున్నది. ఆ రథముపైని సమస్త ప్రపంచము అధిరోహించి యున్నది. తృష్ణారూపుడగు సారథి దానిని నడుపుచున్నాడు.

**"యథా హి శృంగం గోఃకాలే వర్ధమానేన వర్ధతే ।**
**ఏవం తృష్ణాఽపి చిత్తేన వర్ధమానేన వర్ధతే ॥**

గోవు శరీరముతోపాటు గోవుకొమ్ములుగూడ పెరుగునట్లు, మనస్సుతోగూడ ఆశ పెరుగుచున్నది. ఇదివఱకే ప్రాప్తమై యున్నచో మఱల మరింత యెక్కువ లభించవలెననీ, ప్రాప్తము కానిచో కావలయు ననెడి కోరిక లేనివాడై ఆత్మనిష్ఠయం దున్నవాడు సుఖవంతు డగును.

అవ॥ ఈ యర్థమునే మఱియొకరీతిని జెప్పుచున్నాడు.

**తృష్ణామాత్రాత్మకో బన్ధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే ।**
**భవాసంసక్తిమాత్రేణ ప్రాప్తితుష్టిర్ముహుర్ముహుః ॥ 4**

తృష్ణామాత్రాత్మకః=తృష్ణామాత్రస్వరూపమే, బంధః=బంధము, తన్నాశః= ఆ తృష్ణానాశమే, మోక్షః=మోక్షమని, ఉచ్యతే=చెప్పబడుచున్నది, భవాసంసక్తిమాత్రేణ=సంసారమునందాసక్తి లేకపోవుటచేత, ముహుర్ముహుః=మాటిమాటికి, ప్రాప్తితుష్టి=ఆత్మప్రాప్తియు, తృప్తియు కలుగుచున్నది.

తృష్ణామాత్రమే బంధ మనియు, దాని నాశమే మోక్ష మనియు చెప్పబడుచున్నది. యోగవాసిష్ఠమునందు

**"చ్యుతా దంతాః సితాః కేశా దృఙ్ నిరోధః పదే పదే ।**
**యాతసజ్జమిమం దేహం తృష్ణా సాధ్వీ న ముంచతి ॥"**

పురుషునకు దంతములు ఊడిపోయినవి. వెంట్రుకలు తెల్లబడి పోయినవి. నేత్రదృష్టి తగ్గిపోయినది. అడుగడుగునకు పాదములు తొట్రుబడిపోవుచున్నవి. ఇట్టి తరుణమున గూడ తృష్ణ అనెడి సాధ్వి అతనిని విడిపోలేదు.

**"తృష్ణే! సాధ్వి! నమస్తుభ్యం ధైర్యవిప్లవకారిణీ ।**
**విష్ణుస్త్రైలోక్యపూజ్యోఽపి యత్త్వయా వామనీకృతమ్ ॥**

ఓ తృష్ణాదేవీ! పురుషధైర్య విఘాతకారిణివగు నీకు నమస్కారము. ముల్లోకములలో పూజ్యుడగు శ్రీ మహావిష్ణువునే నీవు వామనునిగా - అనగా పొట్టివానినిగా జేసితివి. నీ మహిమ నేమని వర్ణింపవచ్చును! కావున నోజనకా! తృష్ణాత్యాగమే ముక్తిహేతువై యున్నది.

అవ॥ అయితే బుభుత్సారూపమగు తృష్ణ (బోధగొన నిచ్ఛ) విడుచుటెట్లు అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**త్వమేకశ్చేతనః శుద్ధో జడం విశ్వ మసత్తథా ।**
**అవిద్యాఽపి న కించిత్సా కా బుభుత్సా తథాఽపి తే ॥ 5**

త్వం=నీవు, ఏకః=ఒకడవు (అద్వితీయుడవు), శుద్ధః=శుద్ధుడవు, చేతనః= చైతన్య స్వరూపుడవు, విశ్వః=ప్రపంచము, జడం=జడస్వరూపము, చ=మఱియు, అసత్=అసత్తు, తథా=అ ప్రకారము, సా=ఆ, అవిద్యా=అవిద్య, అపి=కూడ, న కించిత్=ఏమియు లేనిది, తథా అపి=అట్లయినప్పటికిగూడ, తే=నీకు, బుభుత్సా=బోధగొనవలె ననెడి యిచ్ఛ, కా=ఎక్కడిది?

తా॥ ప్ర॥ "తృష్ణామాత్రము బంధమునకు హేతువు" అని తలంచినచో ఆత్మజ్ఞానప్రాప్తికి హేతువైన తృష్ణగూడ బంధనహేతువు కావలెను.

ఉ॥ ఓ జనకుడా! ఈ ప్రపంచమునందు ఆత్మ, జగత్తు, అవిద్య అని మూడు పదార్థము లున్నవి. మొదట ఆత్మలక్షణమును చూడుము-

"స్థూలసూక్ష్మ కారణ శరీరాద్వ్యతిరిక్తోఽవస్థాత్రయసాక్షీ ।
సచ్చిదానందస్వరూపో యస్తిష్ఠతి స ఆత్మా ॥"

స్థూల, సూక్ష్మ కారణములను మూడు శరీరములకును, జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలకును భిన్నమై, సాక్షియై, సచ్చిదానంద మగునదియే ఆత్మ. దానిని (యాత్మను) పొందుటకు గల కోరిక ఉచిత మైనది.

"అనాది భావత్వే సతి జ్ఞాననివర్త్యత్వ మజ్ఞానత్వమ్ ।"

అనాదిభాసరూపమై ఆత్మజ్ఞానముచే నివృత్తి గలదే యజ్ఞానము, అనగా అవిద్య.

"గచ్ఛ తీతి జగత్॥"

(నదీప్రవాహమువలె) నిరంతరము పోవుచున్నది. కావుననే జగత్తు అని చెప్పబడియున్నది. ఓ జనకా! నీవు ఈ మూడింటిలో ఆత్మస్వరూపుడవై యున్నావు. శుద్ధచైతన్యరూపమగు ఆత్మనే పూర్ణస్వరూపమని నిశ్చయించు కొనుము. జగత్తును అసద్రూపమని తెలిసికొనుము. అవిద్య సదసద్వి లక్షణమును అనిర్వచనీయమునై యున్నది. ఆ యవిద్యా కార్య మగుటవలన జగత్తుకూడ అనిర్వాచ్యమే. అందువలన ఈ రెంటియందును తృష్ణ నుంచుట యనుచితము. ఎందుకనగా ఆరెండును మిథ్యాస్వరూప ములు, మిథ్యావస్తువులయందు కోరిక గలవాడు మూర్ఖుడు. అజ్ఞాని తప్ప జ్ఞాని యగువా డెన్నడును అట్టికోరికను గలిగియుండడు. (సర్వ పరిపూర్ణైక నిర్మల చిదాత్మవే నీవే యుండ బుభుత్సయు లేదని భావము.) ఇచ్చట.

"యస్మిన్నస్మిన్నస్తి లోకే బోధ సత్తదుపేక్షణే ।
యద్బోధమాత్రం తద్బ్రహ్మేత్యేవం ధీర్బ్రహ్మనిశ్చయః ॥"

అనెడి విద్యారణ్యస్వాములవారి వచనము ప్రమాణము. బోధాత్మ, ఏకమును పూర్ణమునని తెలియుము. భూత భవిష్య ద్వర్తమాన కాలము లును, వాటియందు గలిగెడు విషయములును మారుచున్నను, అది యనెడి బోధ మాత్రము నిలుచును.

అవ॥ జగత్తు మిధ్య యనియు, అసత్తనియు జెప్పిన విషయమును దృఢపరచుచున్నాడు.

**రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖాని చ ।**
**సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని ॥ 6**

రాజ్యం=రాజ్యము, సుతాః=పుత్రులు, కళత్రాణి=భార్యలు, శరీరాణి=దేహములు, చ=మఱియు, **సుఖాని**=సుఖములు, సంసక్తస్య= ఆసక్తి గలవానికి, నష్టాని=నష్టము **లగుచునే** యున్నవి. తే అపి= నీకుగూడ, ఏతే=ఇవన్నియు, జన్మని=ప్రతిజన్మమునందును, నష్టాని= నశించుచున్నవి.

తా॥ ఓ జనకుడా! రాజ్యభోగములు, భార్యలు, బిడ్డలు, ధనము మొదలగున వన్నియు నీ కనేక జన్మములనుండి లభ్యమగుచు మఱల నశించుచున్నవి. పూర్వజన్మమునందు నీకు భార్య బిడ్డలుగా నున్నవారు ఈ జన్మమున కెక్కడో, వారిజాడయే కనిపించదు. ఈజన్మమున నీభార్యా బిడ్డలుగా నున్నవారు మరుజన్మమున వారేమగుదురో, వారి పేరు ఊరైనను ఉండదు. ఇందువలన అంతయు అసత్తని అనగా మిధ్యయని సిద్ధమగు చున్నది. జాగ్రద్దశలో కనిపించు వస్తువు స్వప్నములో నెట్లు అసత్య మగుచున్నదో, స్వప్నావస్థలో నున్న పదార్థము జాగ్రద్దశలో నెట్లు అసత్యమగు

చున్నదో, యీ రెండును అనగా జాగ్రత్స్వప్నములు రెండును సుషుప్తిలోను, సుషుప్తి జాగ్రత్స్వప్నములలోను ఎట్లు లేదో అట్లే మానవుడు అజ్ఞానరూప స్వప్నావస్థనుండి మేలుకొని జ్ఞానరూప జాగ్రదవస్థను పొందినప్పుడు అతని కీ సర్వ ప్రపంచమున్ను లేదు. అనగా మిథ్య యని తోచును.

ప్ర॥ అయ్యా! సాంఖ్యవాదులు జగత్పదార్థములు నిత్యమని తలంచు చున్నారు. మఱియు కారణకార్యములు రెండును, అనగా కారణమగు మృత్తిక దాని కార్యమగు ఘటము రెండును సత్యములే యని వారు చెప్పుచున్నారు. ఘటము మృత్తికయందు సత్యపూర్వమై సూక్ష్మరూపముతో ఉండి ఉండనిచో, దాని ఉత్పత్తిగూడ కాజాలదు. ఎందుకనగా అసత్యవస్తువు సత్యవస్తువునుండి ఉత్పన్నము కాదు. కాన ఘటము సత్యమే. ఇదే విధముగ ప్రపంచమునందలి సమస్త పదార్థములును సత్యములే. మిథ్యా వస్తు వొక్కటియు లేదు. కారణసామగ్రినుండి ఘటము ప్రాదుర్భవించుచున్నది. సామగ్రి లేనిచో ఘటరూప కార్యమునకు కారణరూప మృత్తికయందే తిరోభావము గలుగుచున్నది. ఘటము మిథ్య కాదు కదా?

ఉ॥ "త్రికాలాబాధ్యత్వే సత్యత్వమ్॥"

త్రికాలాబాధ్యమైన దానికే సత్య మనిపేరు. అయితే ప్రపంచము నందు అట్టి పదార్థ మేదీ కనిపించదు. "కార్యము తన కారణమునందు సత్యరూపముతో నుండును. కాన నిది సత్యము" అని నీవు చెప్పిన యుక్తి అంతయుక్తముగా లేదు. ఎందుకనగా - వస్త్రమునకు కారణము తంతువు. తంతువులే కాలిపోయినచో నిక వస్త్ర మెక్కడ నుండును? కారణ మక్కడ లేదు. అనగా కారణము నశించిపోయినతోడనే కార్యముగూడ నశించి

పోయినది. ఒకవేళ కాల్చివేయబడిన తంతువులనుండియే వస్త్రోత్పత్తి యగుచో, నప్పుడు వస్త్రముయొక్క ప్రాదుర్భావ తిరోభావములు కారణ రూపమగు తంతువులయందే గలవని యనుకొనవచ్చును. అసలు తంతువే లేదు. ఇక ప్రాదుర్భావ తిరోభావము లెక్కడ?

ఒకవేళ ఆ వస్త్రము తనకు కారణమైన తంతువులకు కారణమైన పరమాణువులలో కలిసిపోయినదని చెప్పుట గూడ సరిపడదు. ఎందుకనగా తంతువులు కాలిపోయినప్పుడే వాటి పరమాణువులు గూడ వాయు చలనము వలన స్థానాంతరమునకు పోయి పృథివీ పరమాణువులతో మిళితమయి కార్యాంతరమునకు సంసిద్ధ మగుచున్నవి. అనగా ఘటాదులను కలుగజేయుచున్నవి. ఎట్లనగా తంతువెట్లు పృథివీ కార్యమో, ఘటముగూడ నట్లే పృథివీకార్యము. పటము కాల్చివేయబడిన తత్క్షణమే దాని భస్మమునుండి అనేక వస్తువు లుత్పన్నములు కాజాలును.

అయితే పటసంబంధమైన భస్మమునందు పటమే తిరోభావ రూపముతో నుంటున్నదని చెప్పినచో రెండవ వస్తువు ఉత్పత్తి యగుటకే యవకాశ ముండదు. మఱియు ప్రపంచమున నట్లు చూడబడలేదు. ఆ బూడిదను పొలములో వేసినచో పైరు గడ్డి మొదలగునవి వృద్ధి యగుచున్నవి, మఱియు నిట్లే అనేక పదార్థములు నశించుట, ఉత్పన్నము లగుట జరుగుచున్నవి. అంతయు సత్యమే యైనచో దానికి నాశ మెన్నటికినీ ఉండరాదు. కాని అవశ్యము నాశమగుచునే యున్నది. దీనివల్ల అన్ని పదార్థములును అనిర్వచనీయ అసత్యము లనియును, నిరూపకుని సత్య కార్యవాదముగూడ అసంగత మనియును సిద్ధమగుచున్నది.

అవ॥ బుభుత్స (తెలిసికొన నిచ్ఛ) కూడదని చెప్పబడెను, ఇప్పుడు

ధర్మార్థకామములయం దిచ్ఛ కూడదని చెప్పుచున్నాడు.

**అలమర్థేన కామేన సుకృతేనాపి కర్మణా ।**
**ఏభ్యః సంసారకాంతారే న విశ్రాన్తమభూన్మనః ॥ 7**

అర్థేన=అర్థముచేతను, కామేన=కామముచేతను, సుకృతేన కర్మణా= పుణ్యకర్మముచేతను, అలం=చాలును, తథా౽పి= అయినప్పటికీ, ఏభ్యః=ఈ మూడింటినుండియు, సంసార కాంతారే=సంసారారణ్యము నందు, మనః=మనస్సు, విశ్రాంతం= విశ్రాంతిని పొందునదిగా, నాభూత్=కాలేదు.

ఓ జనకా! ధర్మార్థకామములయందలి యిచ్ఛ పూర్తిగా లేకుండు టయే జీవన్ముక్తికి కారణము, మఱియు వీటి యందలి దోషములను జూడుము.

**"పృథివీం ధనపూర్ణాం చేదిమాం సాగరమేఖలామ్ ।**
**ప్రాప్నోతి పునరప్యేష స్స్వర్గమిచ్ఛతి నిత్యశః॥"**

ధనపూర్ణమై సముద్రపర్యంతము గల భూమి యొకనికి లభ్యమైనను మఱల వాడు నిత్యమును స్వర్గసుఖమును కోరుచున్నాడు.

**"న పశ్యతి చ జన్మాన్ధః కామాన్ధో నైవ పశ్యతి ।**
**మదోన్మత్తా న పశ్యన్తి హ్యర్థీ దోషం న పశ్యతి॥"**

జన్మాంధునకు, కామాంధునకు, మదిరాపానోన్మత్తునకు, ధనార్థికి ప్రపంచమున నేమియు కనిపించదు. కావున నో జనకా! ధనాదుల యందలి కోరికను త్యజించుటయే వివేకికి ఉత్తమ మార్గము, ఎందుకనగా సంసారరూప మహారణ్యమున పరిభ్రమించుచున్న పురుషుని మనస్సు, ధర్మార్థకామములవలన

వ్యాకులము నొందినదై ఒకప్పుడును శాంతిని బడయజాలదు.

అవ॥ ఇట్లు తృష్ణోపశమమును నిరూపించి యిప్పుడు క్రియోపశమ మును చెప్పుచున్నాడు.

**కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా।**
**దుఃఖమాయాసదం కర్మ తదద్యాప్యుపరమ్యతామ్ ॥ 8**

కతి=ఎన్ని, జన్మాని=జన్మముల నుద్దేశించి, (జన్మలనుండి), కాయేన=శరీరముచేతను, మనసా=మనస్సుచేతను, గిరా=వాక్కుచేతను, దుఃఖం=దుఃఖమును కలుగజేయు నట్టియు, ఆయాసదం=శ్రమను కలుగజేయునట్టియు, కర్మ=కర్మ, న కృతం=జేయబడలేదు? ఇతి=ఇట్లని (నిశ్చయించి), తత్=ఆ కర్మ, అద్యాపి=ఇప్పుడైనను, ఉపరమ్యతాం= విరమింపబడుగాక!

ఓ జనకా! శరీరమునకును, మనస్సునకును, ఇంద్రియములకును శ్రమ నొసగునట్టి కర్మ లెన్నింటినో చేయుచునే వచ్చుచున్నావు. మఱియు నా కర్మ ఫలమగు జనన మరణరూప చక్రమునందు పరిభ్రమించుచున్నావు. ఇప్పుడుగూడ దినదినమున కెన్నియో దుఃఖము లుత్పన్నము లగుచునే యున్నవి. కొంచెముగూడ శాంతి లభించుటలేదు. కావున నీవు కర్మలనుండి ఉపరతిని బొందుము. ఎందుకనగా పురుషుడు ఉపరతి పొందుటవలన తప్ప మఱి దేనినుండియు జీవన్ముక్తి సుఖమును పొందజాలడు.

ఇది పదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదునొకండవ ప్రకరణము

## జ్ఞానాష్టకము

అవ॥ చిత్తశాంతి ఆత్మజ్ఞానమువలననే కలుగుచున్నది. ఆత్మ జ్ఞానము వినా మరేయుపాయముచేతను మనశ్శాంతి కలుగదు. కాన ప్రథమమున ఆత్మజ్ఞాన సాధనములను చెప్పుచున్నాడు.

**భావాభావవికారశ్చ స్వభావాదితి నిశ్చయీ ।**
**నిర్వికారో గతక్లేశః సుఖేనైవోపశామ్యతి ॥ 1**

భావాభావవికారః=భావముయొక్కయు అభావముయొక్కయు వికారము, స్వభావాత్=స్వభావమువల్లనే, (భవతి=అగుచున్నది.) ఇతి=ఈ ప్రకారము, నిశ్చయీ=నిశ్చయము గలవాడు, నిర్వికారః=వికార రహితుడును, గతక్లేశః=క్లేశరహితుడునై, సుఖేన=సుఖముగా, ఉపశామ్యతి=శాంతిని పొందుచున్నాడు.

భావాభావ - అనగా స్థూల సూక్ష్మ రూపములుగా నుండు వికారము (కార్యము) లన్నియు మాయ లేక మాయా సంస్కారమువలననే ఉత్పన్నము లగుచున్నవి. అంతేగాని నిర్వికారమగు ఆత్మనుండి యేదియు పుట్టుట లేదు.

ప్రశ్న॥ మాయ జడము, ఆత్మ చేతనము, కేవల జడమగు మాయనుండి కార్యోత్పత్తి కాజాలదు. మఱియు కేవల చైతన్యము నుండియు కాదు. ఎందుకనగా నిరవయవ మగు ఆత్మనుండి సావయవ

మగు కార్యము ఉత్పత్తి కాజాలదు. చైతన్య సంబంధము లేని కేవల జడమగు మాయనుండి కార్యోత్పత్తి కాజాలదు. చైతన్యసంబంధము లేనిదే కార్యోత్పత్తి జరుగునని చెప్పినచో, కుమ్మరి లేకనే కుండ తనంతట అదే మృత్తికనుండి ఉత్పత్తి కావలసివచ్చును. ఇట్లుండగా స్థూల సూక్ష్మరూప కార్యము లన్నియు మాయనుండియే ఉత్పన్న మగుచున్న వనియు, చైతన్యమునుండి కాదనియు మీరెట్లు చెప్పుదురు?

ఉ॥ ఓ జనకా! ఎట్లు సూదంటుఱాతియొక్క శక్తిచేత లోహము చలించుచున్నదో, సూదంటుఱాయి చలించుట లేదో, అట్లే చైతన్యము యొక్క శక్తిచేతనే మాయవలన కార్యోత్పత్తి యగుచున్నది. చైతన్యమువలన యగుట లేదు. జీవాత్మ సత్తవలన శరీరమునందు నఖ రోమాదు లుత్పన్నము లగుచున్నవి. కాని ఆత్మయందు లేదు. ఆత్మ అసంగము, నిర్వికారము ; శరీరము వికారి , నశ్వరము ; ఆత్మ నిత్యము, చేతనము ; శరీరము అనిత్యము, జడము అని నిశ్చయముగా తెలిసికొను పురుషుడు శ్రమ లేకయే శాంతిని పొందుచున్నాడు. అన్యుడు పొందజాలడు.

అవ॥ అయితే మాయ జడము కదా! అట్టి జడమునుండి భావాభావము లుత్పన్నమగు టెట్లు? అను శంకకు సమాధానము-

**ఈశ్వరస్సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ ।**
**అంతర్గళిత సర్వాశః శాంతః క్వాపి న సజ్జతే ॥ 2**

ఇహ=ఈ ప్రపంచమునందు, సర్వనిర్మాతా=సమస్తమును ఉత్పత్తి చేయువాడు, ఈశ్వరః=ఈశ్వరుడు, అన్యః=ఇతరు డెవడును, న=కాడు, ఇతి=ఇట్లని, నిశ్చయీ=నిశ్చయము గల పురుషుడు, అంతర్గళితసర్వాశః=

అంతఃకరణమునందు నశించిపోయిన సమస్తాశలు గలవాడై, శాంతః= శాంతుడై, క్వ అపి=యెక్కడను, న సజ్జతే=ఆసక్తుడు కాడు.

తమరు ఆత్మ సత్తవల్లనే భావాభావ వికారము లుత్పన్నము లగుచున్నవని సెలవిచ్చితిరే, ఆ యాత్మ రెండు విధములుగా నున్నది. ఒకటి జీవాత్మ, రెండవది పరమాత్మ. ఈ రెంటిలో దేని సత్తవల్ల భావాభావ వికారము లుత్పన్నము లగుచున్నవి?

ఉ॥ ఈశ్వర సత్తవలన సంపూర్ణ జగత్పదార్థము లుత్పన్నము లగుచున్నవి. జీవాత్మ సత్తవలన శరీరసంబంధమైన నఖ-రోమాదు లుత్పన్నము లగుచున్నవి. ఎందుకనగా ఆ జీవాత్మ తన శరీరమాత్ర వ్యాప్తమై యున్నది. ఈ కారణమువల్ల అది పరిచ్ఛిన్న మగుటచే దాని సత్తవలన జగత్పదార్థము లుత్పన్నములు కాజాలవు. మఱి ఈశ్వరుడో సర్వవ్యాపకుడు. సమస్త జగత్తున కంటె నధికుడు. ఈశ్వరోపాధి యగు మాయకూడ గొప్పదే యగుటవలన సర్వత్ర ఈశ్వరసత్తవలన జగత్పదార్థోత్పత్తి యగుచున్నది. జీవోపాధియగు అంతఃకరణము అల్పశరీర మాత్రమునం దుండుటవలన ఆ శరీరావయవములను మాత్రమే అది వృద్ధిని బొందించుచున్నది. అల్పోపాధి గలవా డగుటవలన జీవు డల్పజ్ఞుడును, అల్పశక్తిమంతుడును, సర్వోపాధి గలవా డగుటవలన ఈశ్వరుడు సర్వజ్ఞుడును సర్వశక్తిమంతుడును అగుచున్నాడు. ఇందువల్లనే ఈశ్వరుని జగత్కర్తగా లోకులు తలంచుచున్నారు. వాస్తవమునం దతడు కర్త గాడు. కేవల మాయోపాధివలన కర్తృత్వవ్యవహారము ఈశ్వరునియందు గౌణముగా నున్నది, ముఖ్యముగా లేదు. నిజమునకు ఈశ్వరుడు జీవుడు గూడ అకర్తలే.

ప్రశ్న॥ తమరు చైతన్య మొకటే యని పూర్వము చెప్పితిరి. ఇప్పుడు జీవాత్మ - పరమాత్మ భేదమువలన చైతన్యము రెండని చెప్పుచున్నారే?

ఉ॥ వాస్తవమునకు చైతన్య మొకటే. కాని కల్పితోపాధుల భేదము వలన చైతన్యముగూడ భేద మగుచున్నదివలె కన్పట్టుచున్నది. ఓ రాజా! **"అవిద్యా తత్కార్య రహిత శ్శుద్ధః"** = అవిద్యా, తత్కార్యములనుండి రహిత మైనదే శుద్ధచైతన్యము. దీనినే నిర్గుణబ్రహ్మ మనియు చెప్పుదురు.

**"సర్వనామరూపాత్మక ప్రపంచాధ్యాసాధిష్ఠానత్వం బ్రహ్మత్వమ్॥"**

సంపూర్ణ నామరూపాత్మక ప్రపంచముయొక్క అధ్యాసమునను అధిష్ఠానమే బ్రహ్మము. ఈ శుద్ధచైతన్య పరబ్రహ్మమునందే నామ రూపాత్మకమైన సమస్తప్రపంచము అధ్యస్తమై యున్నది.

మాయయందు ప్రతిబింబించిన చైతన్యమునకు ఈశ్వరు డనియు అంతఃకరణమునందు ప్రతిబింబించిన చైతన్యమునకు జీవు డనియు చెప్పుదురు. మాయ ఒక్కటియే గాన దానియందు ప్రతిబింబించిన ఈశ్వరుడుగూడ ఒక్కడే. అవిద్యాంశమగు అంతఃకరణము అనేకము గాన దానియందు ప్రతిఫలించిన చేతనముగూడ అనేకమే. చేతనము - (1) విషయచేతనము, (2) ప్రమాణచేతనము, (3) ప్రమాతృచేతనము అని మూడు విధములు.

**1. ఘటావచ్ఛిన్న చైతన్యం విషయచైతన్యమ్ ।**

**2. అంతఃకరణ వృత్త్యవచ్ఛిన్న చైతన్యం ప్రమాణచైతన్యం**

**3. అంతఃకరణావచ్ఛిన్నం చైతన్యం ప్రమాతృ చైతన్యమ్ ॥**

ఘటాది విషయ మనంతము. దానికి సంబంధించి యున్న అంతఃకరణ వృత్తులుగూడ అనంతములే. అంతఃకరణములును అనంతములే. ఈ ఉపాధిభేదములవలన చైతన్యముగూడ అనంతభేదము లయి పోయినది. వాస్తవమునకు చేతనము మహాకాశము వంటిది. నిజ మాలోచించినచో ఎట్లు మహాకాశమునకు ఘట మఠాద్యుపాధులతో నెట్టి సంబంధమును లేదో, అట్లే కల్పితోపాధులతోకూడ చైతన్యమున కెట్టి సంబంధమును లేదు. ఇట్టి నిశ్చయము గల పురుషుడు నిశ్చలచిత్తము గలవాడై దేనియందును సంసక్తుడు కాడు.

అవ॥ అయితే యీశ్వరుడే సర్వనిర్మాత యగుచో, కొందఱు దరిద్రులుగను, కొందఱు ధనికులుగను, కొందఱు దుఃఖవంతులుగను, కొందఱు సుఖవంతులుగ నుండుటకు కారణ మేమి? యను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**ఆపదః సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయీ ।**
**తృప్తః స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి ॥ 3**

కాలే=కాలమునందు (ఆ కాలము వచ్చునప్పుడు), ఆపదః=ఆపదలును, సంపదశ్చ=సంపదలును, దైవాత్ ఏవ=అదృష్టమువల్లనే (భవంతి= కలుగుచున్నవి) ఇతి=ఈ ప్రకారముగా, నిశ్చయీ=నిశ్చయము గలవాడు, నిత్యం తృప్తః=ఎల్లప్పుడు సంతోషము గలవాడై, స్వస్థేంద్రియః= ఉపశమించిన యింద్రియములు గలవాడై, న వాంఛతి=అప్రాప్త వస్తువులను కోరడు, న శోచతి=నష్టమైన వస్తువులను గూర్చి దుఃఖింపడు.

ప్రశ్న॥ ఈశ్వరుడే సర్వజగత్ సృష్టికర్త యని తలంచినచో, అప్పుడు

ఒకనిని దరిద్రునిగను, ఒకనిని ధనికునిగను, ఒకని దుఃఖిగను, ఒకనిని సుఖిగను చేసియుండకూడదు. కాని యిది ప్రత్యక్షముగా కనిపించు చున్నది. అందువలన ఈశ్వరునికి గూడ విషమ (పాక్షిక) దృష్టి మొదలగు దోషములు వచ్చుచున్నవి.

ఉ॥ ఓ రాజా! నీ వన్నట్లు ఈశ్వరుడే ఏవైన కర్మలు చేసి యున్నచో, ఆతనియం దా దోషములు ఆరోపించుట యుక్తమే. కాని ఈశ్వరు డట్లు చేయలేదు. చూడుము గీతయం దేమి చెప్పబడియున్నదో -

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥"

ఈశ్వరుడు జీవులకు కర్తృత్వమును గాని, కర్మలను గాని సృజించుట లేదు. కర్మఫల సంయోగమునుగూడ కల్పించుట లేదు. ఇవి అనాది కాలమునుండి ఆ యా సంస్కారముల ద్వారా వచ్చుచున్నవి. ఇందువలన ఈశ్వరునియం దెట్టి దోషమున్ను లేదు.

ప్రశ్న॥ జడరూపమైన కర్మ స్వతస్సిద్ధముగా ఫలము నీయజాలదు, అసమర్థుడగు జీవుడు తనంతట తాను ఫలము ననుభవింపజాలడు. ఇక ఫలదాత యగు ఈశ్వరునియందు దోష మెందు కారోపింపబడదు?

ఉ॥ ఈశ్వరుడు జీవులచేత శుభాశుభ కర్మలను చేయించి వాటి ఫలితముల నిచ్చుట గాని లేక జీవులను పుట్టించి వాటిచేత కర్మలను చేయించుట గాని చేసియుండినచో ఈశ్వరునియం దా దోషము సంక్రమించి యుండెడిది. కాని అట్లు లేదు. ప్రవాహరూపముగా అనాదినుండి యీ

ప్రపంచము వచ్చి పోవుచునే యున్నది. నూతనమగు వస్తువును దేనినిగూడ జీవుడు గాని, యీశ్వరుడు గాని ఉత్పత్తి చేయుట లేదు.

భూమిమీద సమస్త వృక్షములయొక్క బీజములున్నను, సహకారి కారణసామగ్రి లేనిదే అంకురముల నెట్లు ఉత్పత్తి చేయజాలవో, అట్లే మాయయందు సమస్త పదార్థములు సూక్ష్మముగా బీజరూపముతో నున్నను, సహకారి కారణము లేక ఉత్పత్తి కాజాలవు. ఎప్పుడు వాటియొక్క సహకారి కారణ సామగ్రి యేకత్ర సమకూరుచున్నదో, అప్పుడే వాటి ఉత్పత్తియు జరుగుచున్నది.

ఒకరైతు పొలమును దున్ని వేరువేరు క్షేత్రములలో వేరు వేరు విత్తనములను చల్లినను, అనగా ఒక పొలమునందు శెనగలు, వేరొకదానియందు గోధుమలు, ఇంకొక క్షేత్రమునందు వడ్లు చల్లినను తడి (నీరు) లేకుండా బీజము లెట్లు ఫలము నివ్వజాలవో, విత్తనములు వేసిన పిమ్మట వర్షము కురిసినచో అప్పుడు బీజము లెట్లు ఫలవంతము లగుచున్నవో, వర్షమంతటా కురిసినప్పుడు ఆ యా క్షేత్రములపై విత్తిన బీజములు ఆ యా ఫలములను గలుగజేయుచున్నవో, కేవలము క్షేత్రముగాని లేక కేవలము బీజముగాని ఎట్లు ఫలమును కలుగజేయజాలవో, క్షేత్రము, బీజము మఱియు జలము ఈ మూడును ఫలమున కెట్లు హేతువులో; అట్లే మేఘస్థానాపన్నుడగు ఈశ్వరుడు, క్షేత్రస్థానీయ మగు అంతఃకరణము, బీజస్థానము లగు కర్మలు- ఈమూడు చేరినప్పుడే ఆ యా రూప ఫల ముత్పన్న మగుచున్నది.

ఈశ్వరసత్తారూప మగు వర్షము అంతటా తుల్యమై యున్నది. ఆ

యా క్షేత్రములలో వారు ఏయే రూపమగు విత్తనములను పెట్టుచున్నారో ఆ యా రూప ఫలములనే పొందుచున్నారు. ఈశ్వరుడు స్వతంత్రుడు, కర్మానుగుణముగా ఫలము నిచ్చువాడు. అట్లు చేయనిచో అతనిపై పాక్షికదోషము రావచ్చును. ఇందువలన ఈశ్వరుడు న్యాయకారి.

ప్రశ్న॥ ఈశ్వరుడు న్యాయకారి అని చెప్పినచో అప్పుడు దయాళుత్వము మొదలగు గుణములు అతనియందు లేకుండ ఉండవలెను గదా?

ఉ॥ దయాళుత్వము మొదలగు గుణములే ఉండవలె నన్నచో నతడు న్యాయకారియే కాజాలడు. ఎందుకనగా ఆ రెండింటికి పరస్పర విరోధము.

ఒక అధికారి న్యాయకారి యగుచో నతనికి దయాళుత్వ ముండదు. దయాళుత్వమే యున్నచో నతడు న్యాయకారి కాజాలడు. ఎందుకనగా దయగలవాడు చంపదగిన వానిని చంపుటకు ఆజ్ఞ నొసంగజాలడు. ఒకవేళ ఒసంగెనేని ప్రాణములపై గల తీపిచేత వాడు రోదనము చేయుచు అరచెనేని ఆ దుఃఖమును చూడజాలక అధికారికి వానిపై దయ గలిగి విడిచిపెట్టును. అప్పుడు తన న్యాయకారిత్వ మేమైనట్లు? అదే విధముగా భగవంతుడు పాపుల పాపఫలమును దుఃఖమును వారి కంటగట్టక, దయగలిగి విడిచిపెట్టినచో నప్పుడు జగత్తులో దుఃఖియే యుండడు. కాని లోకమున నట్లు కనుపించుట లేదు. ప్రపంచమున నెందరో జనులు గొప్ప గొప్ప రోగములతో బాధపడుచూ, రాత్రింబవళ్లు కుయ్యో! మొర్రో! యని అరచుచూ మరణించుచున్నారు.

అయితే వారి దుఃఖము దూరమగుట లేదు. లక్షలకొలది జనులు

అన్నము లేక అకాలములో మరణించుచున్నారు. అయితే జీవుని కర్మ ఫలమగు దుఃఖము ననుభవించి పరిశుద్ధు లగుచున్నారు. పలువిధము లగు కర్మలకు పలువిధము లగు ఫలములు కలుగుచున్నవి. అనుభవము వినా కర్మము విడిచిపెట్టదు. దీనివలన ఈశ్వరుడు న్యాయకారి యని, దయాళువు కాడని సిద్ధ మగుచున్నది.

ప్ర॥ అయితే భక్తు లగువారు ఈశ్వరుని భజించు సమయమున- "ఓ పరమేశ్వరా! నీవు దయామూర్తివి. కృపాళుడవు, న్యాయకారివి" అని ప్రార్థించుచున్నారే?

ఉ॥ గుణారోపము లేనిదే భక్తిగాని, ఉపాసన గాని చేయ సాధ్యపడదు. మిథ్యా కల్పితమగు మూర్తిధ్యానము చేయుటవలన అనగా మూర్తియందు మనస్సును నిలుపుటవలన చిత్తశాంతియు, ఆనందము నెట్లు కలుగు చున్నదో, అట్లే మిథ్యాదయాళుత్వాది గుణములను ఈశ్వరునియందు ఆరోపించుటవలన గూడ ఈశ్వరునియందు ప్రేమయు, ఆ ప్రేమవలన ఆనందమును కలుగుచున్నవి. అట్టి ప్రేమకే భక్తియని పేరు. దయాళుత్వాది గుణములు ఈశ్వరునియం దారోపించుట వ్యర్థము కాదు.

వాస్తవమునకు ఈశ్వరుడు గుణాతీతుడు. గుణము మాయా కార్యము, మాయా సంబంధము వలననే ఈశ్వరుడు గుణి యని చెప్పబడుచున్నాడు. ప్రపంచమునందలి సమస్త ప్రాణులకు సంపదలు గాని, ఆపదలు గాని ప్రారబ్ధకర్మానుసారమే కలుగుచున్నవని నిశ్చయము గలిగి భోగములయం దాసక్తి లేనివాడై సమస్తేంద్రియ నిగ్రహము గలవాడై, ఏ వస్తువునందును కోరిక లేనివాడై, ప్రాప్తవస్తు నాశమునకై యెవడు

దుఃఖించడో వాడే నిత్యసుఖమును పొందుచున్నాడు.

అవ॥ అట్టి దృఢనిశ్చయ జ్ఞానము గలవారలుకూడ కర్మములను చేయుచున్నవారై కనుపించుచున్నారే! కర్మఫలము వారికి కలుగునా లేదా యనుదానికి సమాధానము-

**సుఖదుఃఖే జన్మమృత్యూ దైవాదేవేతి నిశ్చయీ ।**
**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే ॥ 4**

సుఖదుఃఖే=సుఖదుఃఖములును, జన్మమృత్యూ=జనన మరణములును, దైవాదేవ=దైవమువలననే, (భవన్తి=అగుచున్నవి) ఇతి=ఇట్లని, నిశ్చయీ= నిశ్చయము గలవాడు, సాధ్యాదర్శీ=సాధ్యకర్మలను చూచుచున్నవాడై, నిరాయాసః=శ్రమరహితుడై, కుర్వన్=కర్మలను చేయుచున్నవాడై, న లిప్యతే=దేనినీ అంటడు.

యథార్థ జ్ఞానము గలవానికి కర్మఫల మంటదు. ఎందుకనగా,

మొదటిది - వారు ఫలకామనా రహితులై కర్మలను చేయుచున్నారు.

రెండవది- వారు శిష్టాచారముకొఱకు కర్మను చేయుచున్నారు.

మూడవది- వారు కర్మలను దేహేంద్రియ ధర్మములనుగా తలంచుచున్నారు.

నాల్గవది- అహంకార రహితులై కర్మలను చేయుచున్నారు. ఈ నాలుగు కారణములచేత వారికి కర్మఫల మంటదు. గీతయందుగూడ చెప్పబడినది-

**"యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాఽపి స ఇమాన్లోకాన్న హన్తి న నిబధ్యతే ॥**

ఎవనికి దేహేంద్రియాదులపైన అహంకార మమకారభావము లేదో, అనగా "నేను దేహమును లేక యిది నా దేహ" మను భావము ఎవనికి లేదో; కర్తృత్వ, భోక్తృత్వాది బుద్ధి ఎవనికి అంటజాలదో అట్టివాడు ప్రారబ్దవశమువలన శరీరాదుల ద్వారా మూడులోకములను వధించినను అట్లు చేసినందువలన గలుగు ఫల మతనిని అంటదు. ఎవ డీప్రకార మగు నిశ్చయము గలవాడై సుఖదుఃఖములు జీవుల ప్రారబ్ద కర్మ ననుసరించియే కలుగుచున్నవని తెలిసికొనినచో అట్టి జ్ఞాని శ్రమ లేకనే ప్రారబ్దవశమువలన కర్మలను చేయుచు ఫలాసక్తుడు కాడు.

అవ॥ కర్మలను చేయువాడు కర్మఫలముతో నెందుకు లిప్తుడు గాడు? ఎవడు కర్తయో అతడు అవశ్యము భోక్త యగుచున్నాడు కదా? అను శంకకు సమాధానము.

**చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ ।**
**తయా హీన స్సుఖీ శాంతః సర్వత్ర గళితస్పృహః ॥ 5**

ఇహ=ఈ ప్రపంచమునందు, చింతయా=చింతచేత, దుఃఖం=దుఖము, జాయతే=కలుగుచున్నది, అన్యథా=వేరొకవిధముగా, న=కలుగదు, ఇతి=ఇట్లని, నిశ్చయీ=నిశ్చయము గలవాడు, సుఖీ= సుఖవంతుడును, శాంతః=శాంతుడును, సర్వత్రగళితస్పృహః=అంతట నశించిన కోరిక గలవాడై, తయా=ఆ చింతనుండి, హీనః=రహితు డగుచున్నాడు.

ఈ ప్రపంచమునందు పురుషునికి చింతామూలముననే దుఃఖము కలుగుచున్నది. ఈ విషయమును గ్రహించిన జ్ఞాని చింతను దూర మొనరించుచున్నాడు. అందువలన నతడు శాంత చిత్తమును, స్థిరాంతఃకరణమును గలవాడై శ్రమలేకనే కర్మల జేయుచు, కర్మ ఫలము

ననుభవించుచున్నాడు.

**నాహం దేహో న మే దేహో బోధోఽహమితి నిశ్చయీ ।**
**కైవల్యమివ సంప్రాప్తో న స్మరత్యకృతం కృతమ్ ॥ 6**

అహం=నేను, దేహః=దేహమును, న=కాను, మే=నాకు, దేహః=దేహము, న=లేదు, అహం=నేను, బోధః=జ్ఞానస్వరూపుడను, ఇతి=ఈ ప్రకారమగు, నిశ్చయీ=నిశ్చయము కలవాడు, కైవల్యం=విదేహముక్తిని, సంప్రాప్తః=పొందినవాడై, అకృతం=అకృతమును (చేయబడనిదానిని) కృతం=చేయబడిన దానిని, న స్మరతి=స్మరింపడు,

జ్ఞానికి "నాహం దేహః=నేను దేహమును గాను, న మే దేహః=ఈ దేహము నాది కాదు. నేను నిత్యబోధ స్వరూపుడ" నను నిశ్చయము కలుగుచున్నది. ఎవనికి ఆత్మజ్ఞానమువలన దేహేంద్రియాదులయందలి అహంతా మమత్వా ద్యభిమానము నశించి దేనియందును కర్తృత్వా కర్తృత్వాదికము మిగిలియుండదో, మఱియు కృతాకృతస్మరణముగూడ ఉండదో అతడే జ్ఞాని యనియు, జీవన్ముక్తు డనియు చెప్పబడుచున్నాడు.

దీనినిగూర్చి యొక దృష్టాంత మున్నది. ఒక మఠములో నొక మహాత్ము డుండెను. ఆత్మవిద్యాభ్యాసము చేయగా చేయగా ఆతని దశ మిక్కిలి అభివృద్ధిని పొందెను. శరీరసంబంధమగు క్రియలన్నియు నతనిని వదలిపోయినవి. అందువలన ఎవరైన భక్తులు భోజనము వారి నోటియం దుంచినచో తినుట, నీరు త్రాగించినచో త్రాగుట చేయుచు ఒకచోట కూర్చొని యెవరితోను మాట్లాడుట గాని, ఎక్కడికి తిరుగుట గాని లేక తన ఆత్మానందములో నిమగ్నుడై యుండెను.

ఒక దినమున కొందఱు బాలురు ఆడుకొనుటకై అచటికి వచ్చిరి. అందులో నొక పిల్లవాడు ఈ మహాత్ముని చూచి యీతనిపైన మనము ఆడుకొనిన బాగుండు ననెను. వెంటనే మఱియొక పిల్లవాడు చాకుతో నెత్తిపైన గీతలు గీయ ప్రారంభించెను. వెంటనే దానినుండి రక్తము స్రవింప మొదలిడెను. పిల్లవాండ్రిది చూచి భయపడి యెక్కడి వారక్కడ పఱుగిడిపోయిరి. మహాత్ముడెప్పటి యట్లే యుండెను. కొంచెము సేపటికి ఆ మందిరములోని కొకడు వచ్చి మహాత్ముని తలనుండి రక్తము ప్రవహించుట చూచి యిది యెవరివలన కలిగినదని విచారింపగా తుదకు పిల్లలు చేసి యుందురని తెలియవచ్చెను.

ఇంతలో నచటికి కొందఱు చేరిరి, వారిలో నొకడు శస్త్రచికిత్సకుని పిలుచుకొనివచ్చెను. చికిత్సకుడు వచ్చి చీలినభాగమును మఱల కుట్టుటకు ప్రయత్నించగా అతడట్లు చేయనివ్వలేదు. కొంతకాలమునకు అచ్చట పురుగులు పట్టినవి. అప్పుడుగూడ ఆ మహాత్ముడు దాని చింత కలిగియుండ లేదు.

ఆ పట్టణమునందే అచటికి కొంచెము దూరమున మఱియొక మహాత్ముడు ఈ స్థితిని విని ఒక మాటకారితో నిట్లు సందేశ మంపెను. "సోదరా! ఎంతవఱకు ఇల్లు ఉన్నదో అంతవఱకు ఇంటిని శుభ్రపరచుకొనవలసిన అవసరము ఉండనే యుండును".

ఎప్పుడీవిధమగు సందేశము తనకు చేరెనో వెంటనే ఆ మహాత్ము డిట్లు జవాబు నొసంగెను. "తమరు తీర్థయాత్రలకు పోవుచున్నప్పుడు త్రోవలో ననేక సత్రములలో రాత్రులు గడిపియుందురు. ఆ ధర్మశాలలు ఇప్పుడు పడిపోయినవి. ఇప్పుడు తమరు వెళ్ళి ఆ మందిరములను

మరమ్మత్తు చేయించుడు. మాకైతే శరీరరూపమగు ధర్మశాలయందు ఆయురూప రాత్రి పూర్ణమై యున్నది. ఇప్పు డా రాత్రి గడచిపోవుచున్నది. ఇప్పు డీ శరీరరూప ధర్మశాలకు మరమ్మత్తు చేసే దెవరు?" అని ఆతడూరకుండెను. కొలది దినములకు పిమ్మట ఆ మహాత్ముడు పరమపదించెను. ఇదియే జీవన్ముక్తావస్థ.

అవ॥ జీవన్ముక్తుని లక్షణములను తెలుపుచున్నాడు.

**ఆబ్రహ్మస్తంబపర్యన్తమహమేవేతి నిశ్చయీ ।**
**నిర్వికల్పశ్శుచిశ్శాన్తః ప్రాప్తాప్రాప్తవినిర్వృతః ॥ 7**

ఆబ్రహ్మస్తంబపర్యన్తం=బ్రహ్మమొదలుకొని తృణము వఱకును, అహమేవ=నేనే ఉంటున్నాను, ఇతి=ఇట్లని, నిశ్చయీ=నిశ్చయము గలవాడు, నిర్వికల్పః=సంకల్పరహితుడై, శుచిః=నిర్మలుడై, చ=మఱియు, శాన్తః=శాంతుడై, ప్రాప్తాప్రాప్త వినిర్వృతః=ప్రాప్తాప్రాప్తములకు సంతుష్టుడై, (సుఖీ భవతి=సుఖవంతు డగుచున్నాడు.)

బ్రహ్మ మొదలుకొని తృణ పర్యంతము గల సంపూర్ణ జగత్తు నాయొక్క రూపమే యై యున్నది. అనగా నేనే స్వరూపుడనై యున్నాను అను నిశ్చయ జ్ఞానము కలవాడే నిర్వికల్పసమాధియందుండు జీవన్ముక్తుడు. అతడే విషయరూప మల సంబంధమునుండి రహితుడైన వాడు. అతడే శాంతచిత్తుడు. అతడే ప్రాప్తాప్రాప్తములయందలి ఇచ్ఛా రహితుడు. అతడే పరమసంతోషి, అతడే ఆత్మానంద పరిపూర్ణుడు.

అవ॥ ఇప్పుడు బ్రహ్మజ్ఞానియొక్క మనస్సంకల్పము లెట్లు నశించు చున్నవో చెప్పుచున్నాడు.

**నానాశ్చర్యమిదం విశ్వం న కించిదితి నిశ్చయీ ।**
**నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి ॥ 8**

ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, నానాశ్చర్యం=అనే కాశ్చర్యములు గలది, న కించిత్=కొంచెముగూడ లేనిది, ఇతి=ఇట్లని, నిశ్చయీ= నిశ్చయము గలవాడు, నిర్వాసనః=వాసనారహితుడై, స్ఫూర్తిమాత్రః= పరిపూర్ణబోధ స్వరూపుడై, న కించిదివ=సకల వ్యవహార రహితుడై, శామ్యతి=శాంతిని పొందుచున్నాడు.

తా॥ ప్రశ్న ॥ ఓ సద్గురూ! బ్రహ్మజ్ఞానియొక్క సంకల్పము లెట్లు స్వతస్సిద్ధముగా నశించును?

ఉ॥ అధిష్ఠాన చైతన్యసాక్షాత్కార మగుటవలన అధ్యస్తమునకు బాధ కలుగుచున్నది. అనగా ఆత్మ సాక్షాత్కార మైనచో నానాప్రకార ఆశ్చర్యరూప జగత్తుయొక్క నిజస్వరూపము తెలిసిపోవుచున్నది. అందువలన జ్ఞానికి సమస్త సంకల్పములును నశించిపోవుచున్నవి.

ప్రశ్న॥ ఓ ప్రభూ! ఆత్మ సాక్షాత్కార మగుటవలన జగద్బాధ - అనగా నాశము అయిపోయినచో మఱల పంచభూతాత్మక ప్రపంచము గూడ నశించిపోవుచున్నది. జగత్తే లేనిచో జ్ఞానికి దేహాదికముగూడ ఉండదు గదా! కాని ప్రపంచమున నట్లు కనుపించుట లేదు. ఆత్మసాక్షాత్కారమైన పిమ్మటగూడ ప్రపంచ మున్నదున్నట్లే యున్నదని తెలియవచ్చుచున్నది.

ఉ॥ ఇక్కడ నాశము రెండువిధములు. ఒకటి బాధ రూప నాశము, రెండవది నివృత్తిరూపనాశము.

**"ఉపాదానేన సహ కార్యవినాశో బాధః ।"**

ఉపాదాన కారణముతో సహ కార్యనాశ మగుటయే బాధ.

**"విద్యమానే ఉపాదానే కార్యవినాశో నివృత్తిః ॥"**

ఉపాదాన కారణముండగనే కార్యనాశ మగుటకు నివృత్తి యని పేరు.

జ్ఞానదృష్టివలన అజ్ఞానరూప కారణసహిత కార్యరూప జగత్తు నాశనమై పోవుచున్నది. జగత్తునకు నాశరూప బాధ కలుగుచున్నది. కాని బాధితానువృత్తివలన మాత్రము ప్రతీత మగుచున్నది. మఱియు స్వప్న ప్రపంచమునకు నివృత్తి రూప బాధ జాగ్రద్దశయందు కలుగుచున్నది. ఎందుకనగా దానికి ఉపాదాన కారణమైన అవిద్య దానిని కలుగజేయు చున్నది. కారణరూప అవిద్య యుండినను స్వప్నరూపకార్యము నాశమగుచున్నది. ఇందువలన అది నివృత్తిరూపబాధ యని చెప్పబడు చున్నది. అజ్ఞానము అనేక విధములుగా నున్నది. ఏ జ్ఞాని అంతఃకరణ రూపాంశమగు అజ్ఞానకార్యమును నశింపజేయుచున్నాడో, అతనికి తన ఆత్మసాక్షాత్కారము కలుగుచున్నది. తక్కిన ప్రాణులకు కలుగుట లేదు. వారికి జగత్ప్రతీతియే కలుగుచున్నది. పదిమంది పండుకొని నిద్రపోవు చున్నప్పుడు వారి వారి స్వప్న ప్రపంచములందు విహరించుచున్నారు. వారిలో నెవడు మేల్కొనుచున్నాడో, వానికి స్వప్న ప్రపంచము నష్టమై పోయినట్లు ఎవడు ఈ జగత్తు స్వతస్సిద్ధమగు సత్తాశూన్య మైనదనియు, పరబ్రహ్మ సత్తవల్లనే సత్యమైనదానివలె తోచుచున్నదనియు, వాస్తవము నందు లేనిదనియు తెలిసికొనుచున్నాడో వాడు శాంతిని ఆనందమును పొందుచున్నాడు.

ఇది పదునొకండవ ప్రకరణము.

ఓమ్

# అష్టావక్రగీత

## పండ్రెండవ ప్రకరణము
## ఏవమేవాష్టకము

అవ॥ ఇదివఱకు పూర్వాష్టకమునందు ఆత్మసత్తకంటె అన్యసత్త దృశ్యవస్తువునకు లేదని గురువు చెప్పినదాని యనుభవము తనకు కలిగినదని శిష్యుడు చెప్పుచున్నాడు.

**కాయకృత్యాసహః పూర్వం తతో వాగ్విస్తరాసహః ।**
**అథ చిన్తాసహ స్తస్మాదేవమేవాహమాస్థితః ॥ 1**

పూర్వం=పూర్వము, కాయకృత్యాసహః=శరీరసంబంధమగు కార్యములను సహింపనివాడనై (అనిష్టము గలవాడనై), తతః=తరువాత, వాగ్విస్తరాసహః=జపాది నిందాస్తుతిరూప కర్మలను సహింపనివాడనై, అథ=తరువాత, చిన్తాసహః=మానసికకర్మలను సహింపనివాడనై (అనిష్టము వలన విడిచి పెట్టినవాడనై), తస్మాత్=ఆ కారణమువలన, అహమేవ=నేనే, ఆస్థితః=ఉంటున్నాను.

ఓ సద్గురూ! మొదట శరీరసంబంధమైన క్రియలు అనగా యజ్ఞాదులను నేను సహింపజాలకపోతిని, అనగా వాటిని విడిచిపెట్టితిని. పిదప వాక్కర్మములను అనగా నిందాస్తుత్యాది కర్మలను విడిచిపెట్టితిని. పిదప మానసిక కర్మ అనగా సంకల్పాదులను విడిచిపెట్టితిని. అనగా శారీరక, వాచిక, మానసిక కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టి యేకాకినై యున్నాను.

అవ॥ ఇప్పు డీ త్రివిధములగు కర్మత్యాగమునకు హేతువును చెప్పుచున్నాడు.

**ప్రీత్యభావేన శబ్దాదేరదృశ్యత్వేన చాత్మనః ।**
**విక్షేపైకాగ్రహృదయ ఏవమేవాహమాస్థితః ॥ 2**

శబ్దాదేః=శబ్దాదులయొక్క, ప్రీత్యభావేన=ప్రీతి లేకపోవుటవలనను, ఆత్మనః=ఆత్మ, అదృశ్యత్వేన=అదృశ్య మగుటచేతను (కనబడక పోవుటచేతను,), విక్షేపైకాగ్రహృదయః=విక్షేపములనుండి యేకాగ్రమగు హృదయము కలవాడనై, అహం=నేను, ఏవమేవ=ఈ ప్రకారముగా, ఆస్థితః=ఉంటున్నాను.

కాయిక, వాచిక, మానసికములగు ఈ మూడు విధము లగు కర్మలు చిత్త విక్షేపకారకములుగా నున్నవి. లోకాంతర ప్రాప్తిని కలుగజేయు యజ్ఞాదికములవలన శరీర విక్షేపమును, నిందా స్తుత్యాది కర్మలవలన వాగ్విక్షేపమును, వీనివలన మానసిక విక్షేపమును కలుగుచున్నది. అందువలన నీ మూడువిధములగు కర్మలయందు గల ప్రీతిని త్యజించుట ఆవశ్యకమై యున్నది. ఆత్మ చేతనము, మనోబుద్ధ్యాదులు అచేతనములు, అనగా జడములు, జడము చేతనక్రియల నెట్లు చేయగలుగును? అందువలన ఆత్మ ధ్యానము చేయుటకు చింతా రూపమగు విక్షేపముగూడ నాకు లేదు, నేను సంపూర్ణ విక్షేపరహితుడనై నా స్వరూపస్థితిలో నున్నాను. అనగా నశ్వరములును ఆత్మకంటె విలక్షణములు నగు మనో వాక్కాయములు గాక తద్భిన్నుడ నగు సచ్చిదానంద స్వరూపుడనై యున్నాను.

అవ॥ ఏదోవిధముగా విక్షేపము లేకపోయినను, సమాధికొఱకు మానసాది వ్యాపారము కొంచెమైనను అవసరమే కాగలదు అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**సమాధ్యాసాదివిక్షేపౌ వ్యవహారస్సమాధయే ।**
**ఏవం విలోక్య నియమమేవ మేవాహమాస్థితః ॥ 3**

సమాధ్యాసాదివిక్షేపౌ=అధ్యాసాదులవలన విక్షేపము కలుగు చుండగా, సమాధయే=సమాధికొఱకు, వ్యవహారః=వ్యవహారము (భవతి= అగుచున్నది.)ఏవం=ఇటువంటి, నియమం=నియమ మును, విలోక్య=చూచి, ఏవమేవ=ఇట్లే (సమాధి రహితుడనై), అహం=నేను, అస్థితః=ఉంటున్నాను.

కర్తృత్వభోక్తృత్వాద్యనర్థములకు హేతువగు అధ్యాసమూలముననే విక్షేపము కలుగుచున్నది. అట్టి విక్షేపమును దూర మొనరించుటకే సమాధికొఱకు మానసాది వ్యాపారము లవసర మగుచున్నవి. ఇట్టి నియమమును చూచియే మొదటనే నేను అధ్యాసమును దూర మొనరించితిని. ఇందువలన సమాధికొఱకు మనస్సు మొదలగునవి అక్కరలేదు. మరేమనగా నేను సమాధిరహితుడనై స్వస్వరూపానంద స్థితిలో నిమగ్నుడనై యున్నాను.

**హేయోపాదేయవిరహాదేవం హర్షవిషాదయోః ।**
**అభావాదద్య హే బ్రహ్మన్నేవమేవాహమాస్థితః ॥ 4**

హేబ్రహ్మన్=ఓ పరబ్రహ్మస్వరూపా! హేయోపాదేయ విరహాత్=

త్యాజ్యగ్రాహ్య వస్తువులయొక్క వియోగమువలన, ఏవం=ఇట్లే, హర్షవిషాదయోః=సంతోష దుఃఖములయొక్క, అభావాత్=అభావము వలన, అద్య=ఇప్పుడు, అహం=నేను, ఏవమేవ=యథార్థస్వరూపుడుగానే, ఆస్థితః =ఉంటున్నాను.

ఓ సద్గురుదేవా! త్యజించుటకుగాని, గ్రహించుటకుగాని యోగ్యమైన వస్తువులేని కారణమున అనగా ఆత్మజ్ఞానము కలిగిన పిదప కించిత్తైనా హేయము, ఉపాదేయము అను భావమే లేని కారణమున హర్షవిషాదములు గూడ నాకు లేవు. ఇందువలన నేను నా స్వరూపస్థితియందే ఉంటున్నాను.

**ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృతవర్జనమ్ ।**
**వికల్పం మమ వీక్ష్యైతైరేవమేవాహ మాస్థితః ॥ 5**

ఆశ్రమానాశ్రమం=ఆశ్రమ - అనాశ్రమములను, ధ్యానం= ధ్యానమును, చిత్తస్వీకృతవర్జనం=మనస్సుచేత స్వీకరింవబడిన వస్తు త్యాగమును, మమ=నాయొక్క, వికల్పం=వికల్పమును, వీక్ష్య=చూచి, అహం=నేను, ఏవమేవ=ఈ మూడింటికంటె భిన్నుడనై, ఆస్థితః= ఉంటున్నాను.

ఆశ్రమ సంబంధములగు ధర్మములనుండి, వాటి ఫలములనుండి నేను రహితుడను. అనాశ్రమ - అనగా ఆశ్రమ రహితమైన సన్న్యాసాశ్రమ ధర్మాదులనుండి కూడ నేను భిన్నుడను. యోగధర్మములగు ధ్యానాదుల నుండిగూడ నేను రహితుడను. ఎందుకనగా ఇవన్నియు అజ్ఞాన విలసితములై యున్నవి. నేను వీటికన్నింటికిని సాక్షినై, చిద్రూపుడనై యున్నాను.

"యశ్శరీరేంద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణమ్ ।
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం చ స్వప్రభమ్ ।
పరం తత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్" ॥

ఎవడు శరీరేంద్రియాదులనుండి భిన్నమైనట్టియు, దేహేంద్రియములకు సాక్షియైనట్టియు విజ్ఞాన స్వరూపమును, సుఖస్వరూపమును, స్వయం ప్రకాశమగు పరమతత్త్వమును తన ఆత్మనుగా తెలిసికొనుచున్నాడో అతడు అత్యాశ్రమి అని చెప్పబడుచున్నాడు. అందువలన నేను సమస్త వర్ణాశ్రమములకు అతీతుడను, సర్వసాక్షిని, చిద్రూపుడనై యున్నాను.

కర్మానుష్ఠానమజ్ఞానాద్యథైవోపరమస్తథా ।
బుద్ధ్వా సమ్యగిదం తత్త్వమేవ మేవాహమాస్థితః ॥ 6

యథా=ఎట్లు, కర్మానుష్ఠానం=కర్మానుష్ఠానము, అజ్ఞానాత్=అజ్ఞానమువలన (భవతి=అగుచున్నదో), తథా=అట్లే, ఉపరమః ఏవ=కర్మ త్యాగము కూడ (అగుచున్నది), ఇదం=ఈ, తత్త్వం=తత్త్వమును, సమ్యక్=బాగుగా, బుద్ధ్వా=తెలుసుకొని, అహం=నేను, ఏవమేవ=కర్మను చేయుటయందుగాని, చేయకుండుటయందు గాని యిచ్ఛను త్యజించి, ఆస్థితః=ఉంటున్నాను.

అజ్ఞానమువల్లనే కర్మానుష్ఠాన మగుచున్నది. అనగా ఆత్మానుభవము లేనివాడు స్వర్గాది ఫల హేతువు లగు యజ్ఞాది కర్మములను చేయుచున్నాడు. ఆత్మజ్ఞానమువల్లనే అనగా ఆత్మజ్ఞానము కలిగినప్పుడే కర్మలను త్యజించుచున్నాడు. ఆత్మసాక్షాత్కారము గలవాడు మతి కర్మలను చేయడు, ఉండడు. ప్రారబ్ధవశమువలన శరీరాది సంబంధ

కర్మలను చేయును లేక చేయకుండును అని యిట్లు తెలిసికొనిన జ్ఞాని తన నిత్యానంద స్వరూపమునందు స్థితుడై యుండును.

**అచిన్త్యం చిన్త్యమానోఽపి చిన్తారూపం భజత్యసౌ ।**
**త్యక్త్వా తద్భావనం తస్మాదేవమేవాహమాస్థితః ॥ 7**

అచిన్త్యం=చింతించుటకు శక్యముగాని బ్రహ్మమును, చిన్త్యమానః అపి=చింతించుచున్న వాడైనప్పటికిని, అసౌ=ఈ పురుషుడు, చిన్తారూపం=చింతారూపమును, భజతి=పొందుచున్నాడు, తస్మాత్= ఆకారణమువలన, తద్భావనం=ఆచింతారూప భావమును, త్యక్త్వా= విడిచిపెట్టి, అహం=నేను, ఏవమేవ=భావనారహితుడనయ్యే, ఆస్థితః= ఉంటున్నాను.

బ్రహ్మము అచింత్యమైనది. అనగా మనస్సుచేత గాని, వాక్కుచేత గాని చింతన చేయుటకు శక్యము గానిది. అయినను అట్టి పరబ్రహ్మమును చింతించుచు నేను చింతాపరుడ నగుచున్నాను. కాన చింతారూప భావనను గూడ నేను విడిచి సచ్చిదానంద స్వరూపమగు ఆత్మయందు స్థితుడనై యున్నాను.

**ఏవమేవ కృతం యేన స కృతార్థో భవేదసౌ ।**
**ఏవమేవ స్వభావో యః స కృతార్థో భవేదసౌ ॥ 8**

యేన=ఎవనిచేత, ఏవమేవ=ఈప్రకారముగా క్రియారహితముగా, (సాధనవశాత్=సాధనమూలముగా), కృతం=చేయబడినదో, సః అసౌ=అట్టి యితడు. కృతార్థః=కృతార్థుడుగా, భవేత్=అగును, యః= ఎవడు, ఏవమేవ=ఈ ప్రకారము స్వతస్సిద్ధముగానే, స్వభావః=

స్వభావము గల వాడగుచున్నాడో, సః=అతడు, కృతార్థః=కృతకృత్యుడు, భవేత్=అగును.

ఈ విధముగా సంపూర్ణ క్రియారహితు డగువాడు తన నిజ స్వరూపమును తెలిసికొని కృతార్థు డగుచున్నాడు. అనగా జీవన్ముక్తు డగుచున్నాడు.

ప్రశ్న ॥ జీవన్ముక్తుని లక్షణము లేవి?

ఉ॥ **"బ్రహ్మైవాహమస్మీత్యపరోక్షజ్ఞానేన నిఖిలకర్మబద్ధవినిర్ముక్తో జీవన్ముక్తః ॥"**

"నేను బ్రహ్మమును" అను ఏతత్ప్రకారమగు అపరోక్షజ్ఞానము వలన సంపూర్ణ కర్మబంధములనుండి విడుదలను పొందినవాడే జీవన్ముక్తుడు.

**"దేహపాతానన్తరం ముక్తిః విదేహముక్తిః ॥"**

శరీర పతనానంతరము గలుగు ముక్తి విదేహముక్తి. తాత్పర్య మేమనగా సాధనలద్వారా యెవడు శరీరసంబంధ మైనట్టియు, మనస్సంబంధ మైనట్టియు, ఇంద్రియములయొక్కయు క్రియలను సంపూర్ణముగా రహిత మొనర్చుకొనునో అతడు ఆత్మానందానుభవము గల జీవన్ముక్తుడు.

ఇది పంద్రెండవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదమూడవ ప్రకరణము

## యథాసుఖ సప్తకము

అవ॥ ఇప్పుడు జీవన్ముక్తునియొక్క సుఖావస్థను శిష్యుడు గురువునకు నివేదించుచున్నాడు.

**అకించనభవం స్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్ ।**
**త్యాగాదానే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్ ॥ 1**

అకించనభవం=(బ్రహ్మము తప్ప) మరేమియు లేదనెడి విచారణవలన పుట్టిన, స్వాస్థ్యం=చిత్తముయొక్క స్థిరత, కౌపీనత్వేఽపి= కౌపీనధారణము చేసినప్పటికినీ, దుర్లభం=దుర్లభము, అస్మాత్=ఈ కారణమువలన, త్యాగాదానే=త్యాగ గ్రహణములను, విహాయ=విడిచి పెట్టి, అహం=నేను, యథాసుఖం=సుఖపూర్వకముగా, ఆసే= ఉంటున్నాను.

విషయములయందు సంపూర్ణముగా ఆసక్తిని విడుచుటవలన చిత్తస్థైర్య మేర్పడును. అట్టి చిత్తస్థైర్యము కౌపీనధారణ మాత్రముచేత లభించునది గాదు. ఇటువంటి స్థిరత్వము అతిదుర్లభము, ఈకారణమువల్ల ఓ సద్గురూ! పదార్థములను గ్రహించుటయందును, త్యజించుటయందును గల ఆసక్తిని విడిచి ఆత్మానందమునందు స్థితుడనై యుంటున్నాను.

**కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే ।**
**మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితః సుఖమ్ ॥ 2**

కుత్రాపి=ఎక్కడనో ఒక్కొక్క విషయమై, కాయస్య=శరీరమునకు, ఖేదః= దుఃఖము, (భవతి=కలుగుచున్నది.) కుత్రాపి=ఒకచోట, జిహ్వా=జిహ్వ, ఖిద్యతే=దుఃఖించుచున్నది. కుత్రాపి=ఎక్కడనో, మనః=మనస్సు, ఖిద్యతే=దుఃఖించుచున్నది. అతః=ఈకారణమువలన, తత్ = ఆమూడింటిని, త్యక్త్వా=విడిచిపెట్టి, పురుషార్థే=పరమపురుషార్థమైన ఆనందమునందు, స్థితః=ఉంటున్నాను.

శరీరసంబంధమైన కర్మలు - అనగా వచ్చుట, పోవుట, నిద్రించుట, మేల్కొనుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, గ్రహించుట, విడిచిపెట్టుట- యీ మొదలగు కర్మలను చేయుటవలన శరీరమునకు దుఃఖము కలుగుచున్నది. సత్యాసత్య భాషణాదులవలనను; కటు, తిక్త, ఆమ్ల రసముల యందలి యిష్టానిష్టముల వలనను జిహ్వ ఖేదపడుచున్నది. సంకల్ప వికల్పాదుల వలన గాని లేక ధ్యాన ధారణాదులవలన గాని మనస్సు కష్టపడుచున్నది. ఇందువలన ఈ త్రివిధములగు కర్మలను త్యజించి, స్వస్వరూపమగు ఆత్మానందములో స్థితుడనై యున్నాను.

**కృతం కిమపి నైవ స్యాదితి సంచిన్త్య తత్త్వతః ।**
**యదా యత్కర్తుమాయాతి తత్కృత్వాఽఽసే యథాసుఖమ్ ॥3**

కిమపి=ఏకొంచెమైనను, కృతం=శరీరాదులచేత చేయబడిన కర్మ, ఆత్మకృతం=ఆత్మవలన చేయబడినది. నైవ స్యాత్=కానేకాదు, ఇతి=ఇట్లని, తత్త్వతః=యథార్థముగా, సంచిత్య=విచారించి, యదా=

ఎప్పుడు, యత్=ఏ కొంచెము కర్మమైనను, కర్తుం=చేయుటకు, ఆయాతి= (అవసరము) వచ్చుచున్నదో, తదా=అప్పుడు, తత్=దానిని, కృత్వా=చేసి, యథాసుఖం=సుఖపూర్వకముగా, ఆసే=ఉంటున్నాను.

ప్రశ్న॥ కాయిక, వాచిక మానసిక కర్మలను విడిచినచో శరీరమును గూడ విడిచిపెట్టవలసి వచ్చును. ఎందుకనగా కర్మలు చేయనిచో భోజనాదులు ఉండవు. భోజనము లేనిచో శరీరమును ఉండదు కదా?

ఉ॥ శరీరమువలనను, ఇంద్రియముల వలనను చేయబడుచుండు కర్మలు వాస్తవమునందు ఆత్మచేత చేయబడుటలేదు అని విచారించి నిశ్చయము చేసికొన్న జ్ఞాని శరీరాదుల సంబంధములగు అన్ని పనులు చేసినను, అహంకార రహితు డైనందువలన ఆ కర్మఫలము లతనిని అంటవు. కావుననే నిరంతరము తన ఆత్మానంద సుఖస్వరూపములోనే నిమగ్నుడై యుంటున్నాడు.

అవ॥ కర్మలు చేయుటయందుగాని, లేక కర్మలు మానుట యందుగాని- యీ రెండింటిలో ఏదో యొకదానిపైననే నిష్ఠ గలిగియుండ వీలగును. రెండింటియం దెట్లు నిష్ఠగలిగి యుండనగును? అను శంకకు సమాధానము-

**కర్మనైష్కర్మ్యనిర్బంధభావా దేహస్థయోగినః ।**
**సంయోగాయోగవిరహాదహమాసే యథాసుఖమ్ ॥ 4**

కర్మనైష్కర్మ్యనిర్బంధభావాః=కర్మలయొక్కయు, నైష్కర్మ్య ముల యొక్కయు బంధనమువలన మిళితమైన భావములు గలవారు, దేహస్థయోగినః=దేహమునందు ఆసక్తిగల యోగులుగా (ఉన్నారు), అహం=నేను, సంయోగ వియోగ విరహాత్ =దేహసంయోగ

వియోగాదులు లేనివాడ నగుటవలన, యథాసుఖం= సుఖ పూర్వకముగా, ఆసే= ఉంటున్నాను.

కర్మలు చేయవలెనని లేక చేయననీ యీ రూపమైన హఠము దేహాభిమానము గలవానికే ఉండును. ఎవనికి దేహాదులయం దాసక్తి లేదో అతనికి హఠ ముండదు. ఓ ప్రభూ! నాకీ దేహసంయోగమునందు గాని, వియోగమునందు గాని హఠ మేమియు లేదు. సంయోగమునం దాసక్తి యున్నచో, వియోగము దాని వెంబడే కనిపెట్టుకొనియుండును. అందువలన నేను అహంకారమును హఠమును విడిచిపెట్టి ఆనంద స్వరూపమగు ఆత్మయందు స్థితుడ నైతిని.

అవ॥ మఱియు లోకసంబంధ వ్యవహారమునందును నాకెట్టి ప్రతిబంధమును లేదని చెప్పుచున్నాడు.

**అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా వా శయనేన వా ।**
**తిష్ఠన్ గచ్ఛన్ స్వపం స్తస్మాదహమాసే యథాసుఖమ్ ॥ 5**

మే=నాకు, స్థిత్యా=ఉండుటచేతగాని, గత్యా=వెళ్ళుటచేతగాని, వా=లేక, శయనేన=పండుకొనుటచేతగాని, అర్థానర్థౌ= అర్థానర్థములు (ప్రయోజనా ప్రయోజనములు), న=కొంచెముగూడ లేవు, తస్మాత్=ఆ కారణమువలన, అహం=నేను, తిష్ఠన్=కూర్చొన్న వాడనైనను, గచ్ఛన్=నడచు చున్నవాడనైనను, స్వపన్=శయనించు వాడనైనను, యథాసుఖం=సుఖ పూర్వకముగా, ఆసే=ఉంటున్నాను.

గురుదేవా! పోవుట, వచ్చుట, కూర్చొనుట, పండుకొనుట మొదలగు

లౌకిక వ్యాపారములయందుగూడ నాకేమియు లాభ నష్టములు లేవు. ఎందువల్లననగా లౌకిక వ్యవహారములయందలి యభిమానముగూడ నశించిపోయినది. పండుకొననీ, కూర్చుండనీ, తిరుగనీ, మరేపని చేయనీ- యివన్నీ చేయుచున్నను ఆనంద స్వరూపమగు ఆత్మయందే స్థితుడనై యుంటున్నాను.

అవ॥ ఈ అర్థమునే మఱొకవిధముగా స్పష్టపఱుచుచున్నాడు.

**స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా ।**
**నాశోల్లాసౌ విహాయాస్మాదహమాసే యథాసుఖమ్ ॥ 6**

స్వపతః=నిద్రించుచున్న, మే=నాకు, హానిః=హాని, నాస్తి=లేదు, వా=లేక, యత్నవతః=ప్రయత్నించుచున్న, మే=నాకు, సిద్ధిః=సిద్ధి, న=లేదు, అస్మాత్=ఈ కారణమువలన, అహం=నేను, నాశోల్లాసౌ= హానివృద్ధుల రెంటిని, విహాయ=విడిచిపెట్టి, యథాసుఖం= సుఖపూర్వకముగా, ఆసే= ఉంటున్నాను.

యత్నవిరహితుడనై నిద్రపోవునప్పుడును నాకేమి హాని లేదు. లేక ప్రయత్నపరుడనై యున్నను విశేష ఫల సిద్ధి ఏమియు లేదు. ఈ కారణము వలన యత్నా యత్నముల యందలి హర్ష శోకములను విడిచి సుఖపూర్వక ముగా ఆత్మానందుడనై యున్నాను. ఎందుకనగా యత్నాయత్నము లన్నియు దేహధర్మములై యున్నవి.

**సుఖాదిరూపానియమం భావేష్వాలోక్య భూరిశః ।**
**శుభాశుభే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్ ॥ 7**

భావేషు=భావములయందలి (అనేక జన్మలయందలి), సుఖాది రూపానియమం=సుఖాది స్వరూపముయొక్క అనిత్యతను, భూరిశః= పలుసారులు, ఆలోక్య=చూచి, అస్మాత్=ఈ కారణమువలన, శుభాశుభే=శుభాశుభ కర్మలను, విహాయ=విడిచి, యథాసుఖం=సుఖ పూర్వకముగా, ఆసే=ఉంటున్నాను.

పశువులు, మనుష్యులు మొదలగు అనేక ప్రాణుల జీవితములలో సుఖ దుఃఖములు సమానముగా నుండుట చూచుచున్నాము. ఈ విషయము ప్రపంచమున స్థూలముగా కనిపించుచునే యున్నది. ఎల్లప్పుడును సుఖముగా నుండు జీవి ప్రపంచమున కనబడుట అరుదు. కొంతకాలము సుఖము, కొంతకాలము దుఃఖము జీవులకు నియతమై యున్నది లేక సుఖము అత్యల్పము, దుఃఖము బహుళముగా కన్పించు చున్నది. ప్రథమమున జన్మకాలములో దుఃఖము, తరువాత బాల్యములో రోగాది జన్యములగు అనేక దుఃఖములు, యువావస్థలో భోగాదికములకొఱ కగు దుఃఖము, పిదప స్త్రీ పురుషులకు మోహ సంబంధముగా గలుగు దుఃఖ పరంపరలు, ఇక వార్ధక్యమునందు దుఃఖ ఖనిజమే సిద్ధ మగుచున్నది. అందువలన అనేక ప్రకారములుగా విషయజన్యములగు సుఖ దుఃఖాదుల అనిత్యత్వమును తెలిసికొని దానికి హేతువగు శుభాశుభ కర్మలను విడిచి స్వస్వరూపమగు ఆత్మానందము నందు స్థితుడనై యున్నాను.

ఇది పదమూడవ ప్రకరణము.

ఓమ్

# అష్టావక్రగీత

## పదునాల్గవ ప్రకరణము

## శాంతిచతుష్టయము

అవ॥ పై ప్రకరణమునందు శిష్యుడు తన సుఖావస్థను నిరూపించి యిప్పుడు శాంతావస్థను నాలుగు శ్లోకములతో చెప్పుచున్నాడు.

**ప్రకృత్యా శాన్త చిత్తో యః ప్రమాదాద్భావభావనః ।**
**నిద్రితో బోధిత ఇవ క్షీణసంసరణో హి సః ॥ 1**

యః=ఏపురుషుడు, ప్రకృత్యా=స్వాభావికముగనే, శాన్తచిత్తః= శాంతచిత్తుడై యున్నాడో, నిద్రితః=పండుకొనినవాడు, బోధిత ఇవ= మేల్కొలుపబడినవాడువలె, ప్రమాదాత్=ప్రమాదమువలన, భావభావనః= పూర్వవిషయములను భావించు వాడైనను, సః=అట్టివాడు, క్షీణ సంసరణః= క్షీణించిన సంసారము గలవాడే, (సంసార రహితుడు).

ఎవడు స్వభావముగా విషయశూన్యమైన చిత్తము గలవాడో, ఎవడు రాగద్వేష రహితుడో అట్టివాడు ప్రారబ్ధవశమువలన విషయచింతన గలవాడైనను, భోగానుభవము గలవాడైనను అతనికి లాభ నష్టము లేవియు నుండవు.

ఈ విషయమున నొక దృష్టాంతమును చెప్పుచున్నాను. నిద్రాపరవశు డగు నొక పురుషుడు ప్రశాంతముగా నిద్రపోవుచున్నా డనుకొనుము, మఱియొకడు వచ్చి అతనిని మేలుకొలిపి "నీవీ పని చేయుము" అని చెప్పి పోయెను, ఈతడైతే ఆ పనిచేయుచున్నాడు. కాని అది తన

ఇచ్ఛాపూర్వకముగా గాదు, రెండవవాని ప్రేరణచేత ఆ పనిని చేయుచున్నాడు. ఇదేవిధముగా ప్రశమనచిత్తుడుగూడ భోగముల ననుభవించుచున్నాడు, కాని తన ఇచ్ఛాపూర్వకముగా గాదు. ఒకానొక పురుషుడు తన ఆనందములో తాను మునిగియుండగా వేరొక సిపాయి వచ్చి తనకు ఇష్టము లేకున్నను మెడలో గుడ్డవేసి లాగి ఆతని నెత్తిపైన ఒకమూట ఉంచి పద అనినచో నతడు ఆమూటను పట్టుకొని లేచిపోవును. ఎందుకనగా అట్లు లేవనిచో సిపాయి అతనిని కొట్టగలడు, భయముచేత ఇట్లాతడు చేయునేగాని తన బుద్ధిపూర్వకముగా సంతోషముతో చేయుట లేదు. అట్లే జ్ఞాని స్వయముగా భోగముల ననుభవింపడు. అయితే ప్రారబ్ధరూప సిపాయియొక్క ప్రేరణవలన అనుభవించుచున్నాడు. ఇందువలన అతనికి నష్టము గాని, లాభము గాని యేమియు ఉండదు.

**క్వ ధనాని క్వమిత్రాణి క్వ మే విషయదస్యవః ।**
**క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గళితా స్పృహా॥ 2**

యదా=ఎప్పుడు, మే=నాయొక్క, స్పృహా=కోరిక, గళితా= జారిపోయినదో, తదా=అప్పుడు, మే=నాకు, ధనాని=ధనములు, క్వ=ఎక్కడ, మిత్రాణి=మిత్రులు, క్వ=ఎక్కడ, విషయదస్యవః= విషయములనే దొంగలు, క్వ=ఎక్కడ, చ=మఱియు, శాస్త్రం=శాస్త్రము, క్వ=ఎక్కడ, విజ్ఞానం= విజ్ఞానము, క్వ=ఎక్కడ?

విషయములనుండి, విషయ భావములనుండి శూన్యమైన చిత్తము గలవాడ నగుటవల్లనే, పూర్ణాత్మదర్శనుడ నగు నాకు విషయభోగేచ్ఛ నశించగా నిక ధన మెక్కడ? మిత్రు లెక్కడ? శాస్త్రాభ్యాస మెక్కడ?

మఱియు నిదిధ్యాసాదిక మెక్కడ? విజ్ఞాన మెక్కడ? నాకు దేనియందును ఆసక్త బుద్ధి లేదు. నేను నిరంజనుడను, నిర్వికారుడను.

**విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే ।**
**నైరాశ్యే బన్ధమోక్షే చ న చిన్తా ముక్తయే మమ ॥ 3**

సాక్షిపురుషే=సాక్షిమాత్రుడను (ప్రత్యగాత్మస్వరూపుడును,) పరమాత్మని=పరమాత్మయు నగు, ఈశ్వరే=ఈశ్వరుడు, విజ్ఞాతేసతి= తెలియబడిన వాడగుచుండగా, నైరాశ్యే=ఆశారహితమైన, బంధమోక్షే= బంధముయొక్క విముక్తియందు, మమ=నాకు, ముక్తయే=ముక్తికొఱకు, చిన్తా=చింత, లేదు.

దేహేంద్రియాదులకు సాక్షి యగు "త్వం" పదవాచ్యుడగు జీవుని తత్పదార్థమగు పరమాత్మను ఈ రెంటియొక్క లక్ష్యార్థమును, "తత్త్వమసి" మహావాక్యములద్వారా భాగత్యాగ లక్షణములయందు ఇచ్ఛయే యుండదు. అట్టి యిచ్ఛ లేనివానికి మఱి చింత యెక్కడిది?

ప్రశ్న॥ మహావాక్యములయొక్క లక్షణము ఎటువంటిది? మఱియు లక్షణ అనగా నేమి?

ఉ॥ వేదమునందు - అవాంతరవాక్య మని మహావాక్య మని వాక్యము రెండుప్రకారములుగా నున్నది. ఈ దిగువ వాటి లక్షణము చూపబడు చున్నది.

"స్వరూపబోధకం వాక్యమవాంతరవాక్యమ్ ॥"

ఆత్మయొక్క స్వరూపబోధకమగు వాక్యమునకు అవాంతర వాక్యమని పేరు. ఉదాహరణమునకు

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

ఆత్మ సత్య స్వరూపమును, జ్ఞాన స్వరూపమును, అనంత స్వరూపమునై యున్నది. ఈ వాక్యము కేవల మాత్మయొక్క స్వరూపమును మాత్రమే బోధించుచున్నది. ఇందువలన దీనికి అవాంతరవాక్య మని పేరు.

"అభేదబోధకం వాక్యం మహావాక్యమ్"

అభేదమును బోధించు వాక్యమునకు మహావాక్య మని పేరు. ఉదాహరణమునకు "అహం బ్రహ్మాస్మి"=నేనే బ్రహ్మమును. "అయమాత్మా బ్రహ్మ"=యీ నీ యాత్మయే బ్రహ్మము, "తత్త్వమసి"=త్వం=జీవుడవగు నీవు, తత్=అదియే. అనగా ఆ పరబ్రహ్మస్వరూపుడవే, అసి=అగుచున్నావు. ఈ వాక్యము లన్నియు జీవునికిని, ఈశ్వరునికిని అభేదమును బోధించు చున్నవి. కాన నివి మహావాక్యములని చెప్పబడుచున్నవి.

ఇప్పుడు లక్షణావృత్తి నిరూపింపబడుచున్నది. శబ్దముయొక్క అర్థజ్ఞానము రెండువిధములుగా కలుగుచున్నది. ఒకటి అభిధావృత్తి (శక్తి) మూలము. ఉదాహరణము- ఒకానొకడు ఒకనితో 'ఘటమానయ' (అనగా ఘటమును తీసికొని రమ్ము) అని చెప్పెను. ఇందులో 'ఘట' పదమునకు శక్తి కంబుగ్రీవాదులు గల వస్తువునందున్నది. అనగా కుండయందు ఉన్నది. తీసికొనివచ్చువానికి రెండవవాడు నన్ను తీసికొనిరమ్మనుచున్నాడను జ్ఞానముగూడ కలుగుచున్నది. కాన అతడు "ఘటమానయ" అను శబ్దమును వినినతోడనే కుండను తీసికొని వచ్చుచున్నాడు. ఇచ్చట శక్తి (అభిధా) వృత్తివలన పదమునకు అర్థబోధ కలుగుచున్నది. ఎచ్చట అభిధావృత్తి వలన బోధ కలుగదో అచ్చట లక్షణావృత్తివలన బోధ

కలుగుచున్నది. ఎట్లనగా-

**"శక్యసంబంధో హి లక్షణా"**

శక్తిని ఆశ్రయించునదే శక్యార్థము అనగా పదము ఏ యర్థమును బోధించునో అదే శక్యార్థము.

ఒకడు ఒక గొల్లవానితో "మీ పల్లెక్కడ" అని అడిగెను. వెంటనే వాడు "గంగాయాం ఘోషః"= అనగా మాపల్లె గంగయం దున్నది అని చెప్పెను. ఇచ్చట శక్తివృత్తివలన అర్థబోధ కలుగదు. ఎందుకనగా ఇచ్చట గంగాశబ్దమున కర్థము జలప్రవాహము. ఘోషశబ్దమునకు గొల్లపల్లె యని అర్థము. అయితే ప్రవాహమునందు ఊరు ఉండుట సంభవించునా? అందువలన శక్తివృత్తి నాశ్రయించి ప్రవాహమునందు పల్లె ఉన్నదని చెప్పినచో నది సమంజసము గాదు. అది సరిపడదు. అందుచేత ఇచ్చట లక్షణావృత్తి నాశ్రయించవలసియున్నది. తాత్పర్యానుపపత్తియే లక్షణకు బీజము. పెక్తకు తాత్పర్యసిద్ధి గలుగనిచోట లక్షణావృత్తి యగుచున్నది. ఇచ్చట గంగయందు గొల్లపల్లి ఉండుట సంభవింపదు. కాన "గంగా" పదమునకు 'గంగాతీర'మని అర్థము లక్షణావృత్తిచేత చెప్పుకొనవలెను. ఇప్పుడు 'గంగాతీరమునందు గొల్లపల్లె యున్నది' అనుచో సమంజసముగా నున్నది. లక్షణ మూడువిధములు, జహల్లక్షణ, రెండు అజహల్లక్షణ, మూడు జహదజహల్లక్షణ అని.

**(1) "వాచ్యార్థమశేషతయా పరిత్యజ్య తత్సంబంధిన్యర్థాంతరే వృత్తిర్జహల్లక్షణా"**

ఎచ్చట వాచ్యార్థము సమగ్రముగా విడిచిపెట్టబడి తత్సంబంధమగు అర్థాంతరమునందు వృత్తి కలుగుచున్నదో దానికి జహల్లక్షణ యని పేరు. ఉదాహరణము:

"గంగాయాం ఘోషః-ఇచ్చట గంగాపదమునకు గల వాచ్యమగు ప్రవాహరూపార్థమును సమగ్రముగా విడిచిపెట్టి దానితో సంబంధము గల తీరమునందు గంగా శబ్దమునకు లక్షణ చెప్పబడుచున్నది. అనగా గంగాతీరమునందు గొల్లపల్లె యున్నది అని ఇచ్చట గంగాపదమునకు వాచ్యార్థమగు ప్రవాహమును విడిచిపెట్టి తీరమును గ్రహించినందున ఇది జహల్లక్షణ అని చెప్పబడుచున్నది. 'జహత్' అనగా విడిచిపెట్టుట.

(2) **"వాచ్యార్థాపరిత్యాగేన తత్సంబంధిన్యర్థాంతరే వృత్తి రజహల్లక్షణా"**

వాచ్యార్థమును విడిచిపెట్టకనే తత్సంబంధార్థమును గ్రహించుటకు అజహల్లక్షణ యనిపేరు. ఉదాహరణము:

ఒకానొక గృహస్థుని ఇంటిలో దండిసన్న్యాసులకు నిమంత్రణ మివ్వబడినది. అచ్చటికి వెళ్ళి ఆ దండిసన్న్యాసులు వెలుపల కూర్చున్నారు. ఇంతలో భోజనము తయారైనది. ఆ యజమాని నౌకరులతో "యష్టీః ప్రవేశయ" అనెను. ఇచ్చట యష్టి పదమున కర్థమేమి? కట్టె యని అర్థము కట్టెలను లోపల ప్రవేశపెట్టుమని యర్థము. అయితే కట్టెలు లోపల ప్రవేశింప శక్యమగునా?

కాన వక్తయొక్క అభిప్రాయ మిదికాదు. మరి దండము ధరించు వారలను లోపల ప్రవేశింపజేయవలసినదని వక్తయొక్క తాత్పర్యము.

ఇందుకొఱకు యష్టి పదముయొక్క వాచ్యార్థమగు యష్టిని విడువకయే తత్సంబంధమగు పురుషునియందు లక్షణ చేయబడినది. దీనికే అజహల్లక్షణమని పేరు.

(3) "వాచ్యార్థైకదేశ పరిత్యాగే నైకదేశవృత్తిర్జహదజహల్లక్షణా"

అనగా వాచ్యార్థముయొక్క ఏకదేశమును విడిచి ఏకదేశమును గ్రహించుటకు జహదజహల్లక్షణ యని పేరు. ఉదాహరణము: "తత్త్వమసి" ఆ బ్రహ్మము నీవే యగుచున్నావు. ఇచ్చట "తత్" పద వాచ్యార్థము సర్వజ్ఞత్వాది గుణములతో కూడుకొనియున్న ఈశ్వరచైతన్యము. 'త్వం' పద వాచ్యార్థము అల్పజ్ఞత్వాది గుణములతో యుక్తుడగు జీవచైతన్యము, "తత్పద" వాచ్యార్థ మగు సర్వజ్ఞత్వాది గుణములు గల ఈశ్వరులకును, "త్వం" పద వాచ్యార్థ మగు అల్పజ్ఞత్వాది గుణములు కల జీవునకును. తత్పదత్వం పద వాచ్యార్థమువలన అభేదాన్వయము కుదురదు. అయితే అక్కడ లక్షణావృత్తివలన సర్వజ్ఞత్వ అల్పజ్ఞత్వాది గుణములను త్యజించి కేవల చైతన్యములను మాత్రము తీసికొన్నచో రెంటికిని అభేదము కుదురును. ఆ యభేదము జహత్ అజహత్ అనగా భాగత్యాగ లక్షణావలన కలుగుచున్నది. తత్పద వాచ్యార్థమునందు ఏకదేశ మగు అల్పజ్ఞత్వాదులను తొలగించినచో రెంటికి లక్ష్యార్థమగు చైతన్యము మాత్రము మిగులుచున్నది. దీనిని గ్రహించినందువలన జీవేశ్వరులకు అభేదము కేవల చైతన్యమునందు కలుగుచున్నది. ఎవడు మహావాక్యముల వలనను, భాగత్యాగ లక్షణావలనను జీవేశ్వరులకు అభేదమును తెలిసికొనుచున్నాడో అతడే ముక్తుడు. అతనికి ముక్తిని గూర్చిన యెట్టి చింతయు లేదు.

**అంతర్వికల్పశూన్యస్య బహిఃస్వచ్ఛందచారిణః ।**
**భ్రాంతస్యేవ దశాస్తాస్తాదృశా ఏవ జానతే ॥ 4**

అంతర్వికల్పశూన్యస్య=అంతఃకరణమునందు వికల్పములు లేనటువంటిన్ని, బహిః=వెలుపలకు మాత్రము, భ్రాంతస్య ఏవ= భ్రాంతునివలె నున్నటువంటిన్ని, స్వచ్ఛందచారిణః=స్వతంత్రముగా సంచరించుచున్న అతనియొక్క, తాస్తాః=ఆయా, దశాః=అవస్థలను, తాదృశాఏవ=అటువంటివారే, జానతే=తెలుసుకొనుచున్నారు.

తా॥ ఎవనియొక్క అంతఃకరణము సంకల్ప వికల్పములనుండి రహిత మైనదో, అనగా ఎవనికి లోపలినుండి ఏ విషయవాసనయు స్ఫురించదో, అయితే బయటికి ఉన్మత్తునివలె ఎవడు సంచరించునో అతడే జ్ఞాని. అట్టివానిని అట్టి జ్ఞానులే తెలిసికొనుచున్నారు. అజ్ఞానులు తెలిసికొనజాలరు.

ఇది పదునాలుగవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదునైదవ ప్రకరణము

## తత్త్వోపదేశ వింశతికము

అవ॥ ప్రథమమున శిష్యున కాత్మ తత్త్వోపదేశము చేసియు, అయ్యది దురవగాహ మైనది గనుక, ఛాందోగ్యోపనిషత్తునందు దయానిధియగు ఉద్దాలకుడు తన పుత్రుడును, శిష్యుడు నగు శ్వేతకేతువునకు "తత్త్వమసి" యను మహావాక్యమును దృఢబోధకొఱకు మఱల మఱల తొమ్మిదిసారు లుపదేశించినట్లు, ఇప్పుడు శిష్యుడగు జనకునికి అష్టావక్రమునీంద్రు డుపదేశించుచున్నాడు. దానికై ముందు అధికారి లక్షణమును జెప్పు చున్నాడు.

**యథా తథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్ ।**
**ఆజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి ॥ 1**

సత్త్వబుద్ధిమాన్=సాత్త్వికబుద్ధి గలవాడు, యథాతథోపదేశేన=ఏకొద్ది (సామాన్య) ఉపదేశమువలననే, కృతార్థః=కృతార్థుడుగా, భవతి-అగుచున్నాడు, పరః=అసత్పురుషుడు, ఆజీవం=జీవితపర్యంతము, జిజ్ఞాసురపి=తెలిసికొనుటకు ఇచ్ఛగలవా డగుచున్నను, తత్ర=ఆ విషయమునందు, విముహ్యతి=మోహమును పొందుచున్నాడు.

సాత్త్వికబుద్ధి గల ఉత్తమశిష్యుడు సామాన్యోపదేశమువలననే ఆత్మ బోధను పొందుచున్నాడు. అనగా కృతార్థు డగుచున్నాడు. సత్యయుగము నందు కేవల ఓంకార మాత్రోపదేశమువలననే ఉత్తమ శిష్యులు కృతార్థు

లగుచుండెడివారు. మందబుద్ధి గల శిష్యులు మరణపర్యంతము ఉపదేశమును వినుచున్నను వారికి యథార్థబోధము గలుగదు. ఎట్లన నామదేవాదులు మాతృగర్భస్థు లయ్యును కేవల సత్త్వమూర్తులు గావున ఒక్కసారి ప్రణవోపదేశ మాత్రమున జ్ఞానులై ముక్తినొందిరి. విరోచనాదులు రజస్తమోమూర్తు లగుటవలన పలుసారులు తత్త్వోపదేశ మొందినను మోహవశులై కృతార్థులు కాజాలకపోయిరి.

ప్రపంచమునందు మూడు విధములగు అధికారు లున్నారు. మొదటివాడు ఉత్తముడు, ఇతనికి ఒక్కసారి గురుముఖతః తత్త్వమస్యాది మహావాక్య శ్రవణము చేసినందు వలన జ్ఞానోత్పత్తి యగుచున్నది. రెండవవాడు మధ్యమాధికారి. అతనికి మాటి మాటికి శ్రవణమననాదులు చేయుచున్నందున బోధ కలుగును. మూడవవాడు కనిష్ఠాధికారి, ఇతడు చిరకాలము శాస్త్రశ్రవణాదులు చేయుటవలనను, ఉపాసనాదులవలనను బోధ నొందగలడు. మోక్షాధికారి లక్షణములను వినుము -

**శాంతో దాంతః క్షమీ శూరః సర్వేంద్రియ సమన్వితః ।**
**అసక్తో బ్రహ్మజిజ్ఞాసుః సదా సాధుసమాగమః ॥**

**సాధుబుద్ధి స్సదాచారీ యోఽభేదః సర్వదైవతే ।**
**ఆశాపాశ వినిర్ముక్తస్స్యే తే మోక్షాధికారిణః ॥**

శాంతచిత్తుడు, ఇంద్రియ దమనము గలవాడు, ఓరిమి గలవాడు, శూరుడు, సర్వేంద్రియ విషయము లుపశమించినవాడు, ఏపదార్థముల యందును ఆసక్తి లేనివాడు, బ్రహ్మజ్ఞాన జిజ్ఞాసువు, మహాత్ముల సాంగత్యము కలవాడు, ఉత్తమబుద్ధి గలవాడు, శ్రేష్ఠమగు ఆచారము

గలవాడు, సమస్తదేవతలయందును ఒకేచైతన్యం గలదని గుర్తెఱింగినవాడు, విషయాశా రూపపాశమునుండి విముక్తు డగువాడు, మోక్షమునకు అధికారి-ఈపై జెప్పిన గుణములలో ఏ ఒక్క గుణము లేనివాడైనను మోక్షాధికారి కాజాలడు.

అవ॥ ఇప్పుడు బంధమోక్షోపాయములను సంగ్రహముగా చెప్పుచున్నాడు.

**మోక్షో విషయవైరస్యం బన్ధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥ 2**

విషయ వైరస్యం=విషయములయందు గల వైరాగ్యమే, మోక్షః=మోక్షము, వైషయికః=విషయ సంబంధమైన, రసః=రసము, బన్ధః=బంధము, విజ్ఞానం=విజ్ఞానము,ఏతావదేవ=ఇంతమాత్రమేను, యథేచ్ఛసి =ఎట్లు అభిలషించుచున్నావో, తథా=ఆ ప్రకారము, కురు=చేయుము.

విషయములయందలి యనురాగ త్యాగమే మోక్షము, అనురాగమే బంధము. ఇట్లుగూడ చెప్పబడుచున్నది.

**"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః ।**
**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥"**

మానవుల బంధమోక్షములకు మనస్సే కారణము. విషయమందాసక్తమగు మనస్సు బంధమును, విషయాసక్తి రహితమగు మనస్సు మోక్షమును కలుగజేయుచున్నది. ఓ జనకా! ఇదియే బంధమోక్షముల యొక్క విశేషజ్ఞానము. దీనిని నీవు బాగుగా తెలిసికొని నీకెట్లు ఇష్టమో అట్లు చేయుము.

అవ॥ ఈ విషయాసక్తి తత్త్వబోధమువలన గాక అన్యమగు మఱి దేనివలనను పోదని చెప్పుచున్నాడు.

**వాగ్మిప్రాజ్ఞ మహోద్యోగం జనం మూక జడాలసమ్ ।**
**కరోతి తత్త్వబోధోఽయమతస్త్యక్తో బుభుక్షుభిః ॥ 3**

అయం=ఈ, తత్త్వబోధః=తత్త్వజ్ఞానము, వాగ్మిప్రాజ్ఞ మహోద్యోగం= అతివక్త, పండితుడు, గొప్ప ఉద్యోగి యగు, జనం=జనుని, మూక జడాలసం=మూగవానినిగను, జడునిగను, అలసునిగను, కరోతి= చేయుచున్నది, అతః=ఈకారణమువలన, బుభుక్షుభిః=భోగేచ్ఛ గలవారలచేత, అయం=ఈబోధము, త్యక్తః=విడిచిపెట్టుచున్నది.

తత్త్వజ్ఞానము వినా మరి దేనివల్లను విషయాసక్తి నశించదు. ఈ తత్త్వబోధము మాటలాడుటయందు మిక్కిలి చతురు డగువానిని మూగవానినిగను, పండితుని జడునిగను, గొప్పఉద్యోగిని క్రియారహితుని గను అనగా ఉద్యోగమునం దిష్టము లేనివానిగను చేయుచున్నది. మనస్సు అంతరాత్మ ముఖ మగుచో ఇంద్రియము లన్నియు శిథిలము లగుచున్నవి. అనగా తమ తమ విషయగ్రహణములయం దసమర్థము లగుచున్నవి. ఈ తత్త్వబోధము సంపూర్ణముగా ఇంద్రియములకు ఏ పనియు లేకుండ చేయుచున్నది. ఈ కారణమువలన విషయభోగేచ్ఛ గల వారలు తత్త్వబోధము నాదరించరు. పైగా ఆత్మబోధ సాధనల నుండి వేలకొలది మైళ్లదూరము పరుగెత్తుకొనిపోవుదురు.

అవ॥ తత్త్వజ్ఞాన ప్రాప్తికొఱకు అష్టావక్ర మునీంద్రుడు మఱల ఉపదేశించుచున్నాడు.

**న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్ ।**
**చిద్రూపోఽపి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర ॥ 4**

త్వం=నీవు, దేహః=శరీరము, న=కావు, తే=నీకు దేహః=దేహము, న=లేదు, వా=అయితే, భవాన్=నీవు, భోక్తా=భోక్తవు గాని, కర్తా= కర్తవు గాని, న=కావు, (కిం తు=మరేమనగా), చిద్రూపః=జ్ఞానస్వరూపు డవును, సదా=ఎల్లప్పుడు, సాక్షీ=సాక్షివి, నిరపేక్షః=కోరిక లేనివాడవు, అపి=అగుచున్నావు, సుఖం=సుఖముగా, చర=మెలగుము.

ఓ జనకా! నీవు పంచభూతాత్మక మగు దేహము కావు. దేహము జడమును అనిత్యమునై యున్నది. చైతన్యస్వరూపుడ వగు నీకు దేహముతో నెట్టి సంబంధమును లేదు.

**'అసంగో హ్యాయం పురుష' ఇతి శ్రుతేః ॥**

ఈపురుషుడు అనగా జీవుడు అసంగుడు. అనగా దేహాదులతో సంబంధము లేనివాడు. ఈ శ్రుతి ప్రమాణమువలన నీవు సంయోగాది సంబంధమునుండి రహితుడ వగుము. మఱియు కర్తృత్వ, భోక్తృత్వములు అంతఃకరణ ధర్మము లగుటవలన నీవు కర్తవు గావు, బోక్తవు గావు. ఈ రెంటికిని సాక్షివి. సాక్షి యగువాడు సాక్ష్యవిషయమునకంటె నెట్లు భిన్నుడో, అట్లే కర్తయు, భోక్తయు నగు అంతఃకరణముకంటె ఆత్మ భిన్నమైనది.

దీనికి ఒక దృష్టాంతమున్నది. ఒక నాట్యశాలయందున్న దీపము ఆ శాలను, యజమానుని, సభాసదులను, నర్తకిని సమానముగా నెట్లు ప్రకాశింప జేయుచున్నదో, అట్లే శరీరమను నృత్యశాలయందు అహంకారమే సభాపతి, విషయములే సభ్యులు, బుద్ధియే నర్తకి, ఇంద్రియగణములు

ఆ నర్తకి ననుసరించి తాళాదులు వేయు సహచారులుగా నున్నవి. చైతన్యరూపమగు ఆత్మ అన్నింటికి సాక్షియై, అన్నిటిని ప్రకాశింప జేయునదిగా నున్నది. ఎట్లు దీపము తన స్థానమునందుండియే అన్నిటిని ప్రకాశింపజేయుచున్నదో, అట్లే చైతన్యాత్మ అచలమై, సాక్షిగా నుండియే అన్నిటిని ప్రకాశింప జేయుచున్నది. ఓ జనకా! దేహము, ఇంద్రియములు, మనస్సు మొదలగు వాటికి నీవు సాక్షివని తలచి సుఖపూర్వకముగా మెలగుము.

అవ॥ రాగద్వేషములు మనోధర్మములని చెప్పుచున్నాడు.

**రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన ।**
**నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికారస్సుఖం చర ॥** 5

రాగద్వేషౌ=రాగద్వేషములు, మనోధర్మౌ=మనోధర్మములు, తే=నీకు, మనః=మనస్సు, కదాచన=ఒకప్పుడును, న=లేదు, (త్వం=నీవు) నిర్వికల్పః=వికల్పరహితుడవు, నిర్వికారః=వికార రహితుడవు, బోధాత్మా= జ్ఞాన స్వరూపుడవును, అసి=అగుచున్నావు, (అతః=ఇందువలన), సుఖం=సుఖపూర్వకముగా, చర=మెలగుము.

రాగద్వేషాదు లన్నియు మనోధర్మములు, ఆత్మ స్వరూపుడ వగు నీ ధర్మములు గావు. ఈ విషయము అన్యత్రగూడ చెప్పబడినది.

**"శత్రుర్మిత్రముదాసీనో భేదాస్సర్వే మనోగతాః ।**
**ఏకాత్మత్వే కథం భేదః సంభవేద్ద్వైత దర్శనమ్ ॥"** 6

ఇతడు శత్రు వని, ఇతడు మిత్రు డని, ఇతడు తటస్థు డని తలంచుటయు, వాటి ధర్మములున్ను మనోధర్మములు. అద్వైత దృష్టిలో

భేద మెక్కడిది? లేనే లేదు. ద్వైతదృష్టిలో మాత్రమే ఈ భేదము గోచరించు చున్నది. ఓ జనకా! ఒకప్పుడు గూడ మనస్సునకు నీకు సంబంధము లేనే లేదు. అందువలన రాగద్వేషాదులు మనోధ్యాసములు. కాన నీవు రాగద్వేషాద్యధ్యాసమును ఒకప్పుడును చేయకుము.

ప్రశ్న ॥ రాగద్వేషాదులు ఆత్మధర్మము లెందుకు కావు?

ఉ॥ రాగద్వేషాదులు ఆత్మస్వరూపుడవగు నీ ధర్మములు కావు. ఎందుకనగా నీవు జ్ఞానస్వరూపుడవై యున్నావు. ఒకవేళ రాగద్వేషాదులాత్మ ధర్మములే యని యభినివేశముతో చెప్పినచో ఆత్మ కవి స్వాభావిక ధర్మములా? లేక ఆగంతుకములా? లేక ఆధ్యాత్మిక ధర్మములా? అవి స్వాభావిక ధర్మములు కావు. ఎందుకనగా శ్రుతిస్మృతులు ఆత్మ నిర్ధర్మకము అనగా ఏ ధర్మములును లేనివని చెప్పుచున్నవి.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం
తథాఽరసన్నిత్యమగంధవచ్చ యత్ ।
అనాద్యనన్తం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥

ఆత్మ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులనుండి రహిత మైనది. దానికి ఆదియు లేదు, అంతమును లేదు. అది మహత్తత్త్వముకంటె పరమైనది. ఇట్లు ఆత్మను తెలిసికొనినవాడు మృత్యు ముఖమునుండి బయటపడుచున్నాడు.

ఈ విధముగా అనేక శ్రుతులు ఆత్మ నిర్ధర్మక మైనదని చెప్పుచున్నవి.

"శుద్ధో ముక్తస్సదైవాత్మా న వై బధ్యేత కర్హిచిత్।
బన్ధమోక్షౌ మనః సంస్థౌ తస్మిఞ్ఛాంతే ప్రశామ్యతి ॥"

ఆత్మ శుద్ధము, ముక్తము, బంధరహితము. బంధమోక్షాదిక ధర్మము లన్నియు మనస్థితములు. మనస్సు శాంతించినచో అన్నియు శాంతిని బొందుచున్నవి. ఈవిధముగా అనగా పైజెప్పిన విధముగా అనేక స్మృతులుగూడ ఆత్మ రాగ ద్వేషాది రహిత మైనదని చెప్పుచున్నవి. మఱియు ఆత్మకు రాగ ద్వేషములు స్వాభావిక ధర్మములని చెప్పినచో, మోక్ష మెవని చేతను ఒకప్పుడును పొందబడియుండరాదు. ఎందుకనగా స్వాభావిక ధర్మనివృత్తి దేనివలనను కాదు. కేవలాధ్యాసికధర్మము మాత్రమే ఉపాయముచేత నాశమగుచున్నది, అధ్యాసికధర్మ మనగా ఒకవస్తువు యొక్క గుణము ఇంకొక వస్తువునందు తోచుట. ఆ సంబంధము నాశమగుటతోడనే దానికిగూడ నాశము సంభవించుచున్నది, స్ఫటికరాతి సమీపమున ఎఱ్ఱని పువ్వు లుంచినచో ఆ పుష్పములయొక్క ఎరుపురంగు ఈ స్ఫటికరాతియందు ప్రతిఫలించుచున్నది. కాని ఆ పుష్పములను దూరముగా తీసివేసినచో ఆ స్ఫటికమునందు రంగు కనిపించదు. అట్లే ఆత్మయందు అంతఃకరణ ధర్మములగు రాగద్వేషాదులు అధ్యాసితములై యున్నవి. కాని అవి స్వాభావికములు కావు. కావున దూర మొనరించుటకు శక్యమైనవిగా నున్నవి.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
విజ్ఞాయ నిరహంకారో నిర్మమస్త్వం సుఖీ భవ ॥ 6

సర్వభూతేషు=సమస్తభూతములయందును, ఆత్మానం=ఆత్మను

(తనను), ఆత్మని=తనయందు, సర్వభూతాని=సమస్త భూతములకు, విజ్ఞాయ=తెలిసికొని, నిరహంకారః=అహంకార రహితుడవై, నిర్మమః= మమత్వము లేనివాడవై, త్వం=నీవు, సుఖీ భవ=సుఖివి కమ్ము.

ఓ జనకుడా! బ్రహ్మమొదలుకొని పిపీలికాపర్యంతము సమస్త భూతములయందును, కారణరూపమై అనుస్యూతముగా నున్నది. ఆ యాత్మ యొకటియే యని తెలిసికొని మఱియు సకల భూతాత్మల యందును అధ్యస్తమైన అనగా కల్పితమైన అహంకార మమకారములను దూరమొనరించి సుఖముగా మెలగుము.

**విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే ।**
**తత్త్వమేవ న సందేహ శ్చిన్మూర్తె విజ్వరో భవ ॥ 7**

యత్ర=ఏ స్థానమునందు, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, సాగరే=సముద్రమునందు, తరంగా ఇవ=అలలవలె, స్ఫురతి=తోచు చున్నదో, తత్=అది, త్వమేవ=నీవే (అగుచున్నావు.) న సందేహః= సందేహము లేదు, చిన్మూర్తె=జ్ఞానస్వరూపమైన ఆత్మ విషయమై, విజ్వరః= సంతాపరహితుడవుగా, భవ=అగుము.

ఓ జనకుడా! ఏ అధిష్ఠాన చైతన్యమునందు ఈ సమస్త ప్రపంచము సముద్రమునందు తరంగములవలె అభిన్నముగా స్ఫురించుచున్నదో, ఆ చేతనమే నీ యాత్మ. కావుననే నేను చైతన్యస్వరూపుడననీ, సంతాప రహితుడననీ తెలిసికొని విగత జ్వరుడవై యీ ప్రపంచమున సుఖముగా మెలగుము.

**శ్రద్ధత్స్వ తాత! శ్రద్ధత్స్వ నాత్ర మోహం కురుష్వ భోః ।**
**జ్ఞానస్వరూపో భగవానాత్మా త్వం ప్రకృతేః పరః ॥ 8**

భోఃతాత!=ఓ నాయనా!, శ్రద్ధత్స్వ=శ్రద్ధ నుంచుము, శ్రద్ధత్స్వ= శ్రద్ధ నుంచుము, అత్ర=ఈ విషయమై, మోహం=మోహమును, న కురుష్వ= చేయకుము, త్వం=నీవు, జ్ఞానస్వరూపః=జ్ఞానస్వరూపుడవు, భగవాన్= ఈశ్వరుడవు, ప్రకృతేః=ప్రకృతికి, పరః=పరుడవుగా నున్నావు.

ఓ నాయనా! చిద్రూపమగు ఆత్మయందు అసంభావనా, విపరీత భావనారూప మోహమును పొందకుము. ఆత్మజ్ఞాన స్వరూపమును ప్రకృతికి పరమునై యున్నది.

ప్రశ్న ॥ చిత్పదమునకును, జ్ఞానపదమునకును గల అర్థమేమి?

**ఉ॥ "సాధనాంతరనైరపేక్ష్యేణ స్వయం ప్రకాశ మానతయా ఇతర పదార్థావభాసకం యత్ ॥"**

తనకంటె భిన్నమైన ఏ సాధనాపేక్షయు లేక తన ప్రకాశముచేతనే ఇతరములగు సమస్త పదార్థములను ప్రకాశింపజేయుచుండుదానికి చిత్తనిపేరు.

**"అజ్ఞాననాశకత్వే పతి స్వాత్మబోధకత్వం జ్ఞానమ్ ॥"**

అజ్ఞాననాశ మొనరించి ఆత్మ స్వరూపమును ప్రకాశింపజేయుదానికి జ్ఞాన"మని పేరు.

**"అర్థప్రకాశో హి జ్ఞానమ్"**

అర్థమును ప్రకాశింపజేయునదే జ్ఞానము. అందువలననే ఆత్మ చైతన్యరూపమును జ్ఞానరూపమునై యున్నది. జడము మఱియు చైతన్యముయొక్క భేదము సుగమమగు రీతిని చూపించబడుచున్నది. తనను తనకంటె భిన్నమగు సమస్త పదార్థములను తెలిసికొనునదే చైతన్యము. తనను తనకంటె భిన్నమగు పదార్థములను తెలిసికొనజాలనిదే జడము,

**గుణైః సంవేష్టితో దేహస్తిష్ఠత్యాయాతి యాతి చ ।**
**ఆత్మా న గన్తా నాగన్తా కి మేనమనుశోచసి ॥ 9**

గుణైః=గుణములతో, సంవేష్టితః=చుట్టబడినదై, దేహః= దేహము, తిష్ఠతి=ఉంటున్నది, సః=అది, ఆయాతి=వచ్చుచున్నది, యాతి= పోవుచున్నది, ఆత్మా=జీవాత్మ, న గన్తా=పోవునది కాదు, న ఆగన్తా= వచ్చునది కాదు, కిం=ఎందుకొఱకు, ఏవం=దీనినిగూర్చి, అనుశోచసి= దుఃఖించుచున్నావు.

ఓ శిష్యా! ఇంద్రియములచే పరివేష్టింపబడి యీ లింగ శరీరము ఈ లోకమునందుంటున్నది. మఱియు కొంతకాలమునకు తరువాత లోకాంతరమునకు పోవుచున్నది. మఱల అక్కడినుండి తిరిగివచ్చుచున్నది. ఆత్మ లోకాంతరమునకు గాని, దేశాంతరమునకు గాని పోవునది గాదు, మఱల వచ్చునది గాదు. స్థూలశరీరమునకే జననమరణములు ఆ శరీర ధర్మములను ఆత్మయం దారోపించుకొని నీవు దుఃఖించుట ఉచితమైన పని కాదు. అధ్యస్తవస్తువు నాశనమైనను అధిష్ఠానమునకు నాశము లేదు.

ప్రశ్న ॥ ఆత్మ లోకాంతరమునకు పోదనియు, లింగశరీరము

మాత్రమే లోకాంతరమునకు, దేశాంతరమునకు పోవుచు వచ్చుచున్న దనియు గదా తమరు చెప్పుచున్నారు. అట్లయినచో ఆత్మ లేకుండా కేవల లింగశరీరము మాత్రము గమనాగమనములను ఎట్లు చేయగలుగును? ఎందుకనగా లింగశరీరము జడము కదా! జడమగు లింగశరీరమునందు సుఖదుఃఖానుభూతి గూడ ఎట్లు కలుగును?

ఉ॥ గమనాగమనములు పరిచ్ఛిన్న (అవ్యాపక)వస్తువులకే కలుగును. వ్యాపకమునందు గమనాగమనములు లేవు. లింగశరీరము పరిచ్ఛిన్న మైన దగుటవలన దానికి గమనాగమనములు సంభవించును. ఆత్మ అపరిచ్ఛిన్నము. కావు దానియందు గమనాదు లుండవు. ఎట్లనగా - జలముతో నిండింపబడిన యొక కుండను ఒకచోటినుండి మరియొక చోటికి తీసికొనిపోవచ్చును కాని ఆకాశమును తీసికొనిపోగలమా! ఎందుకనగా ఆకాశ మంతట వ్యాపించియున్నది. ఎక్కడెక్కడికి ఘటమును తీసికొనిపోవుచున్నారో అక్కడక్కడ ఆకాశము ఉండనే యున్నది. అట్లే ఎక్కడెక్కడికి లింగ శరీరము పోవుచున్నదో అక్కడంతయు ఆత్మ ప్రతిబింబము దానియందు పడుచునే యున్నది. ఈ చేతనప్రతిబింబ ముతో కూడుకొనియున్న అంతఃకరణమే సుఖదుఃఖములకు కర్త యనియు, భోక్త యనియు చెప్పబడుచున్నది. ఈ యంతఃకరణమునందు ప్రతిబింబించిన చైతన్యమునే జీవు డందురు. లింగశరీర లక్షణమును పంచదశికారు డిట్లు చెప్పెను. లింగశరీరము (అంతఃకరణము), దానియందలి చైతన్యప్రతిబింబము, దానికాశ్రయమైౖ అధిష్ఠానము- ఈమూడును కలిసి జీవు డనియు, మఱియు మాయా-మాయయందలి ప్రతిబింబము, మాయాధిష్ఠానము- ఈ మూడు కలిసి ఈశ్వరు డనియు

చెప్పిరి. జీవునకును, ఈశ్వరునకును భేదము ఉపాధులవల్లనేగాని వాస్తవము నందు లేదు. ఉపాధి కల్పితము, చేతనము నిత్యము. ఆ చైతన్యమే నీ రూపము, నీవై యున్నావు అని తెలిసికొనినచో మతి దుఃఖింపవు.

అవ॥ చిద్రూపమైన ఆత్మ స్వరూపుడ వగు నీకు దేహముయొక్క హాని వృద్ధులవలన నేమియు లేదని చెప్పుచున్నాడు.

**దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వా పునః ।**
**క్వ వృద్ధిః క్వ చ వా హానిస్తవ చిన్మాత్ర రూపిణః ॥ 10**

దేహః పునః=దేహమయితే, కల్పాంతం=కల్పాంతమువఱకు, తిష్ఠతు=ఉండుగాక!, వా=లేక, అద్యైవ=ఇప్పుడే, గచ్ఛతు=పోవుగాక!, చిన్మాత్ర రూపిణః=జ్ఞానమాత్ర స్వరూపుడ వగు, తవ=నీకు, వృద్ధిః=వృద్ధి, క్వ=ఎక్కడ, హానిః=హాని, క్వ=ఎక్కడ?

ఓ జనకా! ద్రష్ట ద్రవ్యమునకంటె వేరు అను నియమ మున్నది. దేహము ద్రవ్యము, నీవు ద్రష్టవు, దేహముతో నీకెట్టి సంబంధమును లేదు. నీ స్థూలదేహము కల్పాంతమువఱకు ఉండవచ్చును లేదా యిప్పుడే పోవచ్చును. దేహ మున్నందున నీకు స్థితియు, దేహము నశించినందున నీకు నాశమును కలుగదు. దేహ మనిత్యము, నీవు నిత్యుడవు. దేహమునకు సత్తాస్ఫూర్తిని కలుగజేయువాడవు నీవు. దేహమునకు నీవు సాక్షివి. ఇట్టి నిశ్చయమువలన నీవు జీవన్ముక్తుడవై చరించుము.

అవ॥ తరంగములయొక్క ఉత్పత్తి నాశములవలన సముద్రమునకు హాని వృద్ధులు లేనట్లు ప్రపంచముయొక్క ఉత్పత్తి నాశములవలన ఆత్మకు వృద్ధి క్షయములు లేవని చెప్పుచున్నాడు.

**త్వయ్యనన్త మహామ్భోధౌ విశ్వవీచిః స్వభావతః ।**
**ఉదేతు వాఽస్తమాయాతు న తే వృద్ధిర్న వా క్షతిః ॥ 11**

అనన్తమహామ్భోధౌ=అపార మహాసముద్రుడవగు, త్వయి= నీయందు, విశ్వవీచిః=ప్రపంచరూప తరంగములు, స్వభావతః=స్వాభావికముగనే, ఉదేతు=ఉదయించు గాక!, వా=లేక, అస్తం ఆయాతు= అస్తమించు గాక! తే=నీకు, వృద్ధిః=వృద్ధి, న=లేదు, క్షతిః=నాశమున్ను, న=లేదు.

ఓ జనకా! నీ స్వరూపము అనంత చిన్మాత్రరూప సముద్రము వంటిది. దానియందు అవిద్యా కామ్యకర్మలవలన విశ్వరూప తరంగము లుత్పన్నము లగుచున్నవి. నీ స్వరూపమునందే యీ విశ్వరూప తరంగము లుదయించుచున్నవి, అస్తమించుచున్నవి. దీనివలన నీకు లాభము గాని, నష్టము గాని యేమియు లేదు. ఎందుకనగా నీవు అధిష్ఠానచైతన్య స్వరూపుడవై యున్నావు. అధిష్ఠానమునకు కల్పితవస్తువు హాని నెన్నడును చేయజాలదు. ఏది యెప్పుడూ లేనిదో, అది రెండవదాని కెట్లు హానిని కలుగజేయును?

అవ॥ చిన్మాత్రరూపుడవగు నీయందు విశ్వకల్పన మాయికమే గాని, వాస్తవము గాదని చెప్పుచున్నాడు.

**తాత! చిన్మాత్ర రూపోఽసి న తే భిన్నమిదం జగత్ ।**
**అతః కస్య కథం కుత్ర హేయోపాదేయ కల్పనా ॥ 12**

తాత=నాయనా!, (త్వం=నీవు), చిన్మాత్రరూపః=చైతన్యమాత్ర స్వరూపుడవు, అసి=అగుచున్నావు, ఇదం=ఈ, జగత్=ప్రపంచము,

తే=నీకంటె, భిన్నం=భిన్నమైనది, న=కాదు, అతః=ఈకారణమువలన, హేయోపాదేయ కల్పనా=త్యాజ్య గ్రహణములయొక్క కల్పన, కస్య=ఎవనికి?, కథం=ఎట్లు? కుత్ర=ఎక్కడ?

ఓ నాయనా! నీవు చిన్మాత్ర స్వరూపుడవు, నీయందు హేయోపాదేయములు ఏ వస్తువునకును సంభవింపవు. ఎందుకనగా నీకంటె జగత్తు భిన్నము గాదు. కల్పితవస్తువు అధిష్ఠానమునకంటె భిన్నముగా లేదు. కనుకనే హేయోపాదేయములు ఎట్లు సాధ్యమగును?

**ఏకస్మిన్నవ్యయే శాన్తే చిదాకాశేఽమలే త్వయి ।**
**కుతో జన్మ కుతః కర్మ కుతోఽహంకార ఏవ చ ॥ 13**

ఏకస్మిన్=ఒకటి అయినటువంటినీ, అమలే=నిర్మల మైనటువంటినీ, అవ్యయే=అవినాశి అయినటువంటినీ, శాన్తే=శాంతుడ వైనటువంటినీ, చిదాకాశే=చిదాకాశరూపుడవునైన, త్వయి=నీయందు, జన్మ=జన్మము, కుతః=ఎక్కడనుండి?, కర్మ=కర్మ, కుతః=ఎక్కడనుండి అహంకారః ఏవ చ= అహంకారముకూడ, కుతః=ఎక్కడనుండి? (భవతి=కలుగు చున్నది.)

ఓ జనకా! సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యుడవును, నాశరహితుడవును, వికారరహితుడవును, చిదాకాశరూపుడవును అగు నీయందు జననము గాని, మరణము గాని, కర్మ గాని, అహంకారము గాని లేదు. ఇవన్నియు ద్వైతమునందు కలుగుచున్నవి. ద్వైతము మూడు కాలములయందును నీకు లేదు. జన్మ కర్మ వికారాభావము గల వా డగుటవలన నీకు కర్తృత్వాదికములు గూడ లేవు. శుద్ధుడ వగుటవలన

నీయందు అహంకారముగూడ లేదు. నీ రూపము ఉన్నదున్నట్లు ఏక రసమును, శాంతమునై యున్నది.

**యత్త్వం పశ్యసి తత్రైక స్త్వమేవ ప్రతిభాససే ।**
**కిం పృథగ్భాసతే స్వర్ణాత్కటకాంగదనూపురమ్ ॥ 14**

త్వం=నీవు, యత్=దేనిని, పశ్యసి=చూచుచున్నావో, తత్ర=అచ్చట, ఏకః= ఒకడవైన, త్వమేవ=నీవే, ప్రతిభాససే=ప్రతిభాసించుచున్నావు, కటకాంగదనూపురం=కడియములు, భుజకీర్తులు, అందెలు మొదలగు ఆభరణములు, స్వర్ణాత్=బంగారము కంటె, పృథక్=వేరుగా, భాసతే కిం=భాసించునా?

ఓ జనకుడా! ఏ ఏ కార్యమును నీవు చూచుచున్నావో, అదంతయు కారణరూపమే యైయున్నది. ఛాందోగ్యోపనిషత్తు నందలి ఆఱవ ప్రపాఠకమున నీ విషయము చెప్పబడినది. ఆరుణికుడను నామాంతరముగల ఉద్దాలక మహర్షి పండ్రెండు సంవత్సరముల ప్రాయము గల తన కుమారుడగు శ్వేతకేతువును జూచి 'కుమారా! నీవు గురుకుల వాసము చేసి అచట సంపూర్ణముగా వేదాధ్యయనమును చేయుము. ఇంత వఱకు మన వంశమునందు బ్రహ్మచర్యమును శీలించనివాడు గాని ఒకడును లేడు.'

తండ్రియాజ్ఞను శిరసా వహించి శ్వేతకేతువు గురుకులమునకు పోయి అచట బ్రహ్మచర్యవ్రతమును పాలించుచు పండ్రెండు సంవత్సరములు వేదాధ్యయనమును చేసెను. అధ్యయనము పూర్తియైన పిమ్మట గుర్వాజ్ఞను పొంది ఇంటికి బయలుదేరెను. త్రోవలో నాతని మనస్సునందొక

యభిమాన ముత్పన్న మయ్యెను. "నాతండ్రి నాతో సమానుడైన విద్వాంసుడు కాడు. కావున వారికి నమస్కరించవలసిన అవసర మేమున్నది?" ఈయభిమానముతోనే అతడు గృహమునకు వచ్చి తండ్రికి నమస్కరించలేదు. తండ్రి దీనిని చూచి వీనికి విద్యామదము పట్టినదని తలంచి ఆ మదమును దూరము చేయ నిశ్చయించుకొనెను.

ఇట్లు నిశ్చయించుకొని ఉద్దాలకుడు శ్వేతకేతువును దగ్గరకు పిలిచి 'కుమారా! నీ వింత విద్య నభ్యసించితివి గదా! అందు దేనిచేత అశ్రుతముగూడ శ్రుతమౌనో, అజ్ఞాతము జ్ఞాతమౌనో- ఆ విద్యను తెలిసికొనియుంటివా? నీ గురువు దీనిని నీ కుపదేశించెనా?' అని అడిగెను. శ్వేతకేతువు తెల్లబోయిన మొగముతో తండ్రిని చూచి 'తండ్రీ! ఈ విద్యను నేనెన్నడును వినియుండలేదు, మా గురువుగారుకూడ చెప్పియుండలేదు. బహుశః యిది వారికిని తెలిసియుండకపోవచ్చును. తెలిసియే యుండినచో నాకు చెప్పకుండ నుండరు. ఎందుకనగా వారికి తెలిసిన విద్య లన్నియు నాకు చెప్పియుండిరి. కావున నో తండ్రీ! నాయందు దయయుంచి నా తప్పు మన్నించి, ఆ విద్యను నా కుపదేశింపు'మని నమస్కరించెను. పుత్రుని యీ నమ్రతను చూచి ఆరుణిఋషి యిట్లుపదేశించెను.

**సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతమ్ ।**
**స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్॥**

ఓ సౌమ్యా! ఒక్క మృత్తికాపిండమువలన సంపూర్ణ మృత్తికాకార్య మంతయు మృత్తికారూపమని తెలియబడుచున్నది. ఎందుకనగా కారణము కంటె కార్యము భిన్నమైనది కాదు. ఎన్నిపేర్లు గల విషయ వికారము లున్నవో

అవన్నియు కేవలము వాఙ్మాత్రకథితములే గాని వాస్తవమునకు మృత్తిక యొకటి మాత్రమే సత్యమైనది. యథా -

"సౌమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతమ్ ।
స్యాద్వాచారంభణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యమ్॥"

ఓ సౌమ్య! ఎట్లు వర్ణజ్ఞానమువలన తత్కార్యరూపమగు కటకకుండలాదు లన్నియు స్వర్ణరూపములని తెలియబడుచున్నవో అందువలననే కార్యము కారణముకంటె భిన్నము కాదని తెలియుచున్నది.

నామమునకు విషయ మగు సువర్ణకార్యము లన్నియు వాగ్విశేష వర్ణితములే. కాని సత్యములు కావు. ఒకసువర్ణము మాత్రమే సత్యమైనది. అదేవిధముగా - ఓకుమారా! "అనేక శ్రుతివాక్యముల ద్వారా బోధితుడవై నేను కార్యకారణరూపమువలననే స్థితుడనై యున్నా"ననియు, 'నేను సచ్చిదానంద స్వరూపాత్మ' ననియు తెలిసికొనుచున్నావు.

**అయం సోఽహమయం నాహం విభాగమితి సంత్యజ ।**
**సర్వమాత్మేతి నిశ్చిత్య నిస్సంకల్పస్సుఖీ భవ ॥ 15**

సః=ఆ, అయం=ఇతడు, అహం=నేనే, అయం=ఇతడు, నాహం= నేను కాను, ఇతి=ఈ ప్రకారమగు, విభాగం=విభాగమును, సంత్యజ= విడిచిపెట్టుము, సర్వం=సమస్తమును, ఆత్మా=ఆత్మ స్వరూపము, ఇతి=ఇట్లని, నిశ్చిత్య=నిశ్చయించి, త్వం=నీవు, నిస్సంకల్పః=సంకల్ప రహితుడవై, సుఖీ భవ=సుఖింపుము.

ఓ జనకా! వీడే వాడు, వాడే నేను, నేనే వీడు కాను అనెడి యట్టి

భేదమును విడిచిపెట్టి సర్వరూపములును ఆత్మయే యై యున్నదని నిశ్చయించుకొనుము. ఇట్లు నిశ్చయించుకొన్నచో సుఖింతువు. ఎందుకనగా ద్వైతదృష్టినుండి గదా భయ ముత్పన్న మగుచున్నది. ఒక్క అద్వైతమునందు మాత్రమే తననుండి తనకు గాని, మఱిదేనినుండి తనకు గాని, తననుండి దేనికి గాని భయము కలుగకున్నది. ద్వైతదృష్టియే దుఃఖమునకు కారణము. దానిని విడచినచో నీవు సుఖివి కాగలవు. ఏకాంతప్రదేశమున స్థితుడై యున్నవాడు ఎంతవఱకు తన అంతఃకరణమునందు ప్రపంచభావనా వృత్తి రాలేదో, అంతవఱకు మాత్రమే ఆనందమయుడై ఉంటున్నాడు. ఎప్పుడు భూతసంబంధమగు ద్వైత వృత్తి ఉత్పన్న మగునో అప్పుడే భయము పొడసూపును. అదేవిధముగా ఎంతవఱకు నీ హృదయములో 'నేను వేరు, జగము వేర'నెడి భావము కలిగిఉంటున్నదో, అంతవఱకు భయము నశించదు. ఆ దుఃఖ భయరహితుడ వైనచో నీవు నిత్యానందాద్వైత స్వరూపుడ వగుదువు.

**తవై వాజ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః ।**
**త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాపంసారీ చ కశ్చన॥ 16**

తవ=నీయొక్క, అజ్ఞానత ఏవ=అజ్ఞానమువల్లనే, విశ్వ=ప్రపంచము, (భవతి=అగుచున్నది) పరమార్థతః=యథార్థముగా, త్వం=నీవు, ఏకః= అద్వితీయుడవు, అతః=ఈకారణమువలన త్వత్తః=నీకంటె, అన్యః= అన్యుడు, కశ్చన=ఒకానొకడు, సంసారీ=సంసారి, నాస్తి=లేడు, అసంసారీ=ఈశ్వరుడున్ను, అన్యః=ఇతరుడు, న=లేడు.

ఓ శిష్యా! నీయొక్క అజ్ఞానమువలననే జగత్తు ప్రతీత మగుచున్నది.

నీ ఆత్మజ్ఞానమువలన ఈ జగత్తు నశించుచున్నది.

ప్రశ్న॥ అజ్ఞానస్వరూప మెటువంటిది? జ్ఞానస్వరూప మెటువంటిది?

ఉ॥ **" అనాదిభావత్వే సతి జ్ఞాననివర్త్యత్వ మజ్ఞానమ్ ॥"**

అనాదియై, భావరూపమై జ్ఞానమువలన నివర్తింపబడునది అజ్ఞానము.

**"అజ్ఞాననాశకత్వే సతి స్వాత్మబోధకత్వం జ్ఞానమ్"**

అజ్ఞానమును నశింపజేయుచు, స్వాత్మబోధక మగుదానికి జ్ఞాన మనిపేరు. జ్ఞానోదయ మైనపిమ్మట యథార్థముగా నీవొకడవే. నీకంటె భిన్నమైన వస్తువింకేదియు లేదు. సంసారి యని మఱియు అసంసారి యనే భేదము నీకు లేనే లేదు. అజ్ఞానమువలన సంసారిని అనుకొనుచున్నావు.

భ్రాన్తిమాత్రమిదం విశ్వం న కించిదపి నిశ్చయీ ।
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి ॥ 17

ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, భ్రాంతిమాత్రం=భ్రాంతి మాత్రము, కించిత్=కొంచెమైనను, న=లేనిది, ఇతి=ఇట్లని నిశ్చయము గలవాడు, నిర్వాసనః=వాసనారహితుడై, స్ఫూర్తిమాత్రః=ప్రకాశ స్వరూపుడై, న కించిదివ=ఏమియు లేనివానివలె (ఏ వికారము లేనివాడై) శామ్యతి శాంతిని పొందుచున్నాడు.

ఓ శిష్యా! ఈ జగత్తంతయు భ్రాంతిమూలమై యున్నది. ఈ ప్రపంచమునకు తన సత్తా యేమియును లేదు అను నిశ్చయజ్ఞానముతో నీవు వాసనారహితుడవై ఆనందపూర్వకముగా ప్రపంచమున మెలగుము. (సర్వదా ఆత్మజ్ఞప్తి గలిగి సంకల్ప వికల్పాదులు లేనివాడు ముక్తుడని భావము).

**ఏక ఏవ భవామ్భోధావాసీదస్తి భవిష్యతి ।**
**న తే బన్ధోఽస్తి మోక్షశ్చ కృతకృత్యస్సుఖం చర ॥ 18**

భవామ్భోధౌ=సంసారరూప సముద్రమునందు, ఏక ఏవ=ఒక్కడే (ఆత్మ), ఆసీత్=ఉండెను, అస్తి=ఉంటున్నాడు, భవిష్యతి=ఉండగలడు, తే=నీకు, బంధః=బంధము, న=లేదు, మోక్షశ్చ=మోక్షమున్ను, న=లేదు, త్వం=నీవు, కృతకృత్యః=కృతకృత్యుడవు, సుఖం=సుఖపూర్వకముగా, చర=సంచరింపుము.

తా॥ ఓ జనకా! ఈ సంసారరూప సముద్రమునందు నీవెల్లప్పుడు ఒంటరిగానే యుంటివి. ఇప్పుడున్నావు. ఇటుపైని ఉండగలవు.

ప్రశ్న ॥ నేను భవసాగరమునందే నిరంతరము ఉన్నవాడ నగుచో మఱి ముక్తిని బొందుటెప్పుడు? ఎల్లప్పుడు బంధమునందే ఉండిపోవుదునేమో?

ఉ॥ ఓ కుమారా! ఇంతవరకు నిన్ను నీవు తెలిసికొనలేక బంధ మోక్షములనే సుడిగుండములలో పడిపోతివి. ఇప్పుడు నీ నిజస్వరూపమును తెలిసికొనిన పిదప సంసారసముద్రమునందు అసంగుడవై, సాక్షివై ఉంటున్నావు, ఉంటివి, ఉండగలవు. ఎందుకనగా నీయందే యీ ప్రపంచ మంతయు రజ్జువునందు సర్పమువలె కల్పితమై యున్నది. ఇప్పుడు నీకు బంధమూ లేదు, మోక్షమూ లేదు. నీవు కృతకృత్యుడవు, ధన్యుడవు.

**మాసంకల్ప వికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ! ।**
**ఉపశమ్య సుఖం తిష్ఠస్వాత్మన్యానందవిగ్రహే ॥ 19**

చిన్మయ=జ్ఞానస్వరూపా! సంకల్పవికల్పాభ్యాం=సంకల్ప వికల్పముల చేత, చిత్తం=మనస్సును, మా క్షోభయ=కలతపెట్టకుము, ఉపశమ్య= మనశ్శాంతి పొంది, ఆనందవిగ్రహే=ఆనందపూర్ణమయిన, ఆత్మని= ఆత్మ స్వరూపమునందు, సుఖం=సుఖముగా, తిష్ఠ=ఉండుము.

తా॥ ఓ చైతన్యస్వరూపా! సంకల్ప వికల్పములవలన నీచిత్తమును క్షోభ నొందింపకుము, విశేషించి సంకల్ప వికల్ప రహితుడవై నీ స్వస్వరూపా నందమునందు స్థితుడవై యుండుము.

**త్యజైవ ధ్యానం సర్వత్ర మా కించిద్ధృది ధారయ ।**
**ఆత్మా త్వం ముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి ॥ 20**

సర్వత్ర ఏవ=సకలమునం దంతటను, ధ్యానం=ధ్యానమును, త్యజ=విడువుము, హృది=హృదయమునందు, కించిత్=కొంచెముగూడ, మా ధారయ=ధరింపకుము, ఆత్మా=ఆత్మస్వరూపుడ వగు, త్వం=నీవు, ముక్త ఏవ=ముక్తుడవే, అసి=అగుచున్నావు, విమృశ్య=విమర్శించి (విచారించి), కిం=దేనిని, కరిష్యసి=చేయగలవు.

తా॥ ఓ సద్గురూ! తన సహజానందస్థితిలో నిలకడ కలిగి యుండ వలయు నన్నచో ధ్యానము తప్ప వేరేసాధనము కనిపించదు. అందువలన ధ్యానము అవశ్యము ఉండవలెననియే అనుకున్నాను.

ఉ॥ ధ్యానమును గూడ త్యజింపుము. ఎందుకనగా ధ్యానము భేదవాదియై యున్నది. ఎవనికి ఆత్మబోధము కలుగ లేదో, ఎవడు భేదవాదియో- అట్టివాడు ధ్యానమును చేయుగాక! ధ్యానము చేయుటగూడ మనోధర్మము. నీవు సాక్షివగు ఆత్మస్వరూపుడవు, అనాత్మ యగు మనో

బుద్ధీంద్రియములు నీవు కావు. నీవు సదా ముక్తరూపుడవు. ధ్యానము వలన నీకు కలుగు ప్రయోజన మేమి? నీవు దీనినుండి రహితుడవు. అనగా ధ్యానమును గూడ దాటి ధ్యేయైక స్వరూపమునందు నిలకడ కలిగినప్పుడే తన స్వరూపానందస్థితిలో నున్నాడని అర్థము. త్రిపుటి (అనగా ధ్యాత, ధ్యానము, ధ్యేయము) ఉన్నంతవఱకు అద్వైతసిద్ధిని, ఏకత్వమును పొందలేదని తెలిసికొనుము.

ఇది పదునైదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదునాఱవ ప్రకరణము
## విశేషోపదేశము

అవ॥ ఇక నీ ప్రకరణమునందు తత్త్వజ్ఞానముచేత సర్వప్రపంచము నకును ఆత్మసత్తకంటె పృథక్సత్తా లేదను నిశ్చయము గలిగి తృష్ణా రహితాది వైరాగ్యముతో సర్వవిస్మరణము కలిగిననే ముక్తి కలుగును గాని లేనిచో మఱి యే యుపాయముచేతను ముక్తి కలుగదని యుపదేశించుచున్నాడు.

**ఆచక్ష్వ శృణు వా తాత! నానాశాస్త్రాణ్యనేకశః ।**
**తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥ 1**

తాత=ఓ నాయనా! అనేకశః=అనేక ప్రకారములుగా, నానా శాస్త్రాణి=అనేకవిధములగు శాస్త్రములను, ఆచక్ష్వ=చెప్పుము, వా= లేక, శృణు=వినుము, తథాఽపి=అట్లయి చెప్పుము, వా=లేక, శృణు=వినుము, తథాఽపి=అట్లయినను, సర్వవిస్మరణాత్ ఋతే= సమస్తమును విస్మరించకుండా, తవ=నీకు, స్వాస్థ్యం= స్వస్థత (శాంతి), న=కలుగదు.

ఓ నాయనా! నీవు అనేక శాస్త్రములను అనేక సారులు శిష్యులకు బోధింతువు గాక! లేక గురువులవద్ద అధ్యయన మొనరింతువు గాక! సకల విస్మరణము వినా నీకు శ్రేయస్సు చేకూరదు. పంచదశియందుకూడా-

**"గ్రంథమభ్యస్య మేధావీ విచార్య చ పునః పునః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః ॥**

అని చెప్పబడియున్నది. బుద్ధిమంతు డగువాడు మొదట గ్రంథము నభ్యసింపవలయును, పిదప మననము చేయవలయును. తరువాత ధాన్యార్థి యగువాడు ధాన్యమును మాత్రము తీసికొని పొట్టును విడిచి పెట్టునట్లు జీవన్ముక్తసుఖమును గోరువాడు అభ్యాసానంతరము సమస్తమును విడిచి పెట్టవలయును.

ప్రశ్న ॥ సుషుప్తియందు అందరికినీ స్వతస్సిద్ధముగానే విస్మృతి కలుగుచున్నది. మీరనునట్లు సమస్తమును విస్మరించుటే ముక్తి అయినచో అన్ని ప్రాణులు మోక్షమును పొందవలసియున్నది. అయితే వ్యవహారమునం దట్లు కనిపించుట లేదు. దీనివలన విస్మరణ వ్యర్థమని తెలియుచున్నది.

ఉ॥ సుషుప్తిలో విస్మరణము కలుగుట నిజమే గాని అన్నిటియొక్క విస్మరణము కలుగుట లేదు. అందఱికి అంతఃకరణములో అజ్ఞానము ఉంటున్నది. ఆ యజ్ఞానము సుషుప్తియందు పోవుట లేదు. జీవన్ముక్తున కయితే అజ్ఞానముతో గూడ సంపూర్ణముగా అధ్యస్తవస్తువులయొక్క విస్మరణము కలుగుచున్నది. ఇందువలన జీవన్ముక్తిని కోరువాడు సమస్త మును విస్మరించుట ఉచిత మైనదే.

అవ॥ సర్వవిస్మరణము కలుగగా మాయికములగు సమస్తవస్తువు లను చూచుచున్నను, వాటియందు జీవన్ముక్తునకు భ్రాంతి కలుగదని నిరూపించు చున్నాడు.

**భోగం కర్మ సమాధిం వా కురు విజ్ఞ! తథాఽపి తే ।**
**చిత్తం నిరస్తసర్వాశ మత్యర్థం రోచయిష్యతి ॥ 2**

విజ్ఞ!=ఓజ్ఞానస్వరూపా!, (త్వం=నీవు), భోగం=భోగమును గాని, కర్మ వా=కర్మను గాని, వా=లేక, సమాధిం=సమాధిని గాని, కురు= చేయుము, తథా అపి=అట్లయినను, తే=నీయొక్క, చిత్తం=మనస్సు, నిరస్తసర్వాశం=తిరస్కరింపబడిన సమస్తకోరికలు గలదై, (త్వాం= నిన్నుగూర్చి,) అత్యర్థం=మిక్కిలి, రోచయిష్యతి=అభిరుచి గలిగి యుండగలదు.

తా॥ నాయనా! నీకు ఇష్టమున్నచో భోగముల ననుభవింపుము లేదా కర్మలను చేయుము, లేదా సమాధి నిమగ్నుడవు కమ్ము. ఏమి చేసినను సర్వాశారహితమై నీ చిత్తము శాంతిని బొందినదైనచో, అనగా ఆశారహిత మైనదై యేకర్మలను చేసినను నీకు కించిత్తుగూడ బంధము లేదు. ఎందుకనగా ఆశయే గదా బంధము. ఇందువలన సర్వమునందు నిరాశ గలవాడవై, సర్వాసక్తి రహితుడవై మెలగినచో నీవు సుఖివి కాగలవు.

అవ॥ సర్వశారహితుడగు జ్ఞాని కర్మలను చేసినను, అవి దుఃఖ హేతువులును, ఆయాసకరములును కానేరవని నిరూపించుచున్నాడు.

**ఆయాసాత్సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన ।**
**అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ ॥ 3**

ఆయాసాత్=(శరీర నిర్వాహార్థ) పరిశ్రమవలన, సకలః=సమస్త జనము, దుఃఖీ=దుఃఖము గలది, (భవతి=అగుచున్నది), ఏనం=దీనిని, కశ్చిత్= ఒకానొకడును, న జాతి=తెలిసికొనజాలకున్నాడు, అనేన=ఈ, ఉపదేశేనైవ=ఉపదేశముచేతనే, ధన్యః=ధన్యుడగు పురుషుడు, నిర్వృతిం= పరమసుఖమును, ప్రాప్నోతి=పొందుచున్నాడు.

తా॥ జనకా! లోకులందఱు శరీరనిర్వాహమునందే దుఃఖమును పొందుచున్నారు. శరీరనిర్వాహపరిశ్రమము నందే దుఃఖము లుత్పన్నము లగుచున్నవి. అయితే శరీర పోషణార్థమగు పరిశ్రమయే దుఃఖమునకు కారణమను విషయమును తెలిసికొనుట లేదు. దీనిని తెలిసికొనిన మహాపురుషులు శరీరనిర్వహణ కొఱకు అతిశ్రమ చేయరు. ఎందుకనగా శరీరముయొక్క రక్షణను ప్రారబ్ధకర్మమే చేయుచున్నది. ఆవిషయమై ప్రయత్నముయొక్క ఆవశ్యకత కొంచెమైనను లేదు. ఇట్లు తెలిసికొని నీవు నిరంతరము సుఖివై యుండుము.

అవ॥ ఇంద్రియాది వ్యాపారములం దిచ్ఛ లేకుండుటయే సుఖ హేతువని చెప్పుచున్నాడు.

**వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి ।**
**తస్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ ॥ 4**

యః=ఎవడు, నిమేషోన్మేషయోః=కంటియొక్క తెరచుట, మూయుట యొక్క, వ్యాపారే=వ్యాపారమునందుగూడ, ఖిద్యతే=దుఃఖించుచున్నాడో, ఆలస్యధురీణస్య=నిస్పృహులలో శ్రేష్ఠుడగు, తస్య=అతనికి, సుఖం= సుఖము, (భవతి=అగుచున్నది), అన్యస్య= ఇతరుడగు, కస్యచిత్=ఎవనికి గూడ, న=లేదు.

తా॥ ప్రవృత్తియం దనాసక్తియే సుఖహేతువు. జీవన్ముక్తు డగువానికి తన నేత్రములను తెరచుట, మూయుట గూడ కష్టముగానే తోచును. ఉదాసీనుడును సంపూర్ణముగా విషయములనుండి విరక్తు డగువాడే సుఖమును పొందుచున్నాడు. ప్రపంచ వ్యవహారములయం దెక్కువ ఆసక్తి,

ప్రవృత్తి గలవానికి దుఃఖముగూడ అధికమే. ప్రపంచవ్యవహార ప్రవృత్తి నెంతవఱకు తగ్గించుకొనుచున్నాడో, అంత అధికసుఖమును పొందు చున్నాడు. ఎందుకనగా వృత్తియొక్క వృద్ధిచేత దుఃఖప్రాప్తియు, వృత్తిరహితత్వమువలన సుఖప్రాప్తియు కలుగుచున్నది.

అవః తృష్ణ సంపూర్ణముగా నశించిపోయిన పిమ్మట శీతోష్ణ సుఖ దుఃఖాది ద్వంద్వములుగూడ ఇతని నేమియు చేయజాలవని నిరూపించు చున్నాడు.

**ఇదం కృత మిదం నేతి ద్వంద్వైర్ముక్తం యదా మనః ।**
**ధర్మార్థకామమోక్షేషు నిరపేక్షం తథా భవేత్ ॥ 5**

ఇదం=ఇది, కృతం=చేయబడినది, ఇదం=ఇది, న కృతం= చేయబడలేదు, ఇతి=ఇట్లనెడి, ద్వంద్వైః=ద్వంద్వములనుండి, యదా= ఎప్పుడు, మనః=మనస్సు, ముక్తం=ముక్తమైనదో, తదా=అప్పుడు, తత్=అది, ధర్మార్థకామమోక్షేషు=ధర్మార్థ కామమోక్షములయందు, నిరపేక్షం=నిరపేక్ష మైనదిగా, భవేత్=అగును.

తా॥ "ఈపనిని నేను చేసితిని, దీనిని నేను చేయలేదు." అనెడి యీ ప్రకారమగు ద్వంద్వములనుండి యెప్పుడు మనస్సు విముక్త మగుచున్నదో, అప్పుడే అది ధర్మార్థ కామ మోక్షములయందు ఆసక్తిని విడుచుచున్నది. ఈప్రకారముగా సంపూర్ణ ద్వంద్వములనుండియు, మఱియు కోరికల నుండియు నెవడు విముక్తు డగుచున్నాడో అతడే జీవన్ముక్తి సుఖము ననుభవించుచున్నాడు.

అవ॥ ఇప్పుడు సకామ పురుషునికంటె నిష్కామి విలక్షణుడని చెప్పుచున్నాడు.

**హేయోపాదేయతా తావత్సంసారవిటపాంకురః ।**
**స్పృహా జీవతి యావద్వై నిర్విచార దశాస్పదమ్ ॥ 6**

యావత్=ఎంతకాలము, స్పృహా=తృష్ణయున్ను, యావత్=ఎంతకాలము, నిర్విచారదశాస్పదం=అవివేకదశాస్థితియు, జీవతి=జీవించుచున్నదో, తావత్=అంతవఱకు, హేయోపాదేయతా=త్యాజ్యగ్రహణ భావమున్ను, సంసారవిటపాంకురః=సంసారరూప వృక్షముయొక్క అంకురమున్ను, జీవతి=జీవించుచున్నది.

తా॥ విచారశూన్యదశకు ఆస్పదీభూత మగుటయే తృష్ణకు నామాంతరము. ఎంతవఱకు విచారణ జ్ఞానము కలుగదో, భోగేచ్ఛయే యుత్పన్న మగుచున్నదో అంతవఱకు తృష్ణ పురుషుని విడువలేదని తెలిసికొనవలయును. అందువలన తృష్ణాళు డగువాడు జీవించి యున్నంతవఱకు త్యాగగ్రహణములను చేయుచునే యుండును. సంసార రూప వృక్షమునకు అంకురము తృష్ణయే. అయితే ప్రారబ్ధ రూపకర్మవలన జీవన్ముక్త దశయందు గ్రహణత్యాగములయొక్క వ్యవహారములు కలిగినను జీవన్ముక్తునకు ఎట్టి హానియు లేదు.

అవ॥ విషయములం దెప్పుడు రాగపూర్వక ప్రవృత్తి కలుగుచున్నదో, అప్పుడు ఉత్తరోత్తర విషయములందు రాగమే ఉత్పన్న మగుచున్నదనియు, విషయములం దెప్పుడు ద్వేషదృష్టి గలుగుచున్నదో, అప్పుడు ఉత్తరోత్తర విషయములయందు ద్వేషదృష్టియే గలుగుచున్న దనియు నిరూపించుచున్నాడు.

**ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేష ఏవ హి ।**
**నిర్ద్వన్ద్వో బాలవద్ధీమానేవమేవ వ్యవస్థితః ॥ 7**

ప్రవృత్తౌ=ప్రవృత్తియందు, రాగః=రాగము, జాయతే=కలుగుచున్నది. నివృత్తౌ=విషయనివృత్తియందు, ద్వేషః=ద్వేషమున్ను, జాయతే= కలుగుచున్నది. నిర్ద్వన్ద్వో=ద్వంద్వము లేనివాడై, బాలవత్=బాలునివలెనే, ధీమాన్=బుద్ధిమంతు డగువాడు, ఏవమేవ=ఈ ప్రకారమే, వ్యవస్థితః= ఉంటున్నాడు.

తా॥ ఎప్పుడు విషయభోగములయందు దోషబుద్ధి కలిగినదో, అప్పుడు విషయములయందు రాగపూర్వకప్రవృత్తి మఱి కలుగదు, రాగద్వేషాది రహితుడైన జ్ఞాని బాలకునివలె శుభాశుభ కర్మరహితుడై కేవల ప్రారబ్ధకర్మవశమువలన ఒకప్పుడు ప్రవృత్తి గలవాడైనప్పటికీ, నివృత్తి గలవాడైనప్పటికీ రాగద్వేషాదులకు లోబడడు. ఈ విషయమున నొక కథ గలదు.

ఒకరాజొకప్పుడు విదేశమునకు వెళ్ళెను. అతని కచట ఒక సంవత్సరము గడచిపోయినది. ఇక్కడ ఆ రాజు భార్య యగు రాణి తన భర్త్రాగమనమునకై నిరీక్షించుచు ఏమియు తోచక మేడపై అటునిటు తిరుగుచుండెను. ఇంతలో నక్కడ యువావస్థలో నుండు సుందరాకారుడగు నొక షరాబు ఆమె కంటబడెను. వానిని చూడగానే రాణికి వానిపై మనస్సు లగ్నమయ్యెను. వెంటనే రాణి తన చెలికత్తెను వానిని పిలుచుటకు పంపెను. చెలికత్తె వానిని పిలుచుకొనివచ్చెను. రాణి వానితో సరససల్లాపము లాడ ప్రారంభించెను. కొంతసేపగుసరికి చెలికత్తె తొందరగా వచ్చి రాజుగారు వచ్చుచున్నారని చెప్పెను. అప్పు డాయువకుడు భయముతో నన్నెక్కడనైన దాచిపెట్టుము అనెను, రాణి వానిని పాయిఖానా దొడ్డియందు దాచి

యుంచెను. ఇంతలో రాజు లోపల ప్రవేశించి నౌకరుతో "తొందరగా నీళ్లు తీసికొనిరమ్ము నేను పాయిఖానా దొడ్డికి పోవలసియున్నది." అని అనెను. నీళ్లు తెచ్చి నౌకరు ఇచ్చిన వెంటనే రాజు దొడ్డికి పోయెను. రాజా సాహెబుకు విరేచనము లగుచున్నందున ఆ మలమంతయు దానిక్రింద దాగుకొని యున్న ఆయువకుని శిరస్సు, ముఖము మొదలుకొని శరీరమునం దంతటను అలముకొనెను. ఆ యువకుని శిరస్సు, శరీరము, వస్త్రములు అన్నియు దుర్గంధముతో నిండిపోయెను. రాజు తన పనిని ముగించుకొని పోయెను. దాసి అప్పు డాయువకుని ఒక దుర్గంధపు సందులోనుండి బయటకు పంపివేసెను.

ఆయువకుడు నదికి పోయి స్నానముచేసి బట్టలు శుభ్రముగా ఉతుకుకొని మఱల ఇంటికి పోయెను. రెండవ దినము మఱల రాణి దాసి ద్వారా అతనిని పిలువ నంపెను. అప్పు డాయువకుడు దాసితో "ఒక్కదినము రాణి దగ్గరకు వెళ్ళి ఐదు, పది మాటలు ఆడినంత మాత్రముచేతనే యిట్టిగతి పట్టినదే అనగా నా శిరస్సుపైన రెండవవాని మలము పడినదే! ఇక ప్రతిరోజు ఆమె సంబంధము కలిగినచో వానిగతి యేమగునో నేనూహించలేకున్నాను. నేను ఆ పాయిఖానా దొడ్డిని మఱచిపోలేదు, మఱచిపోజాలను. కావున నేనెన్నడు మరి రాను" అని చెప్పి పంపివేసెను. ఈవిధముగా విషయముల యందు దోషదృష్టి గలవానికి మఱల నావిషయముల ననుభవించవలెననెడి కోరిక యెన్నటికిని పుట్టదు.

**హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా ।**
**వీతరాగో హి నిర్దుఃఖస్తస్మిన్నపి న ఖిద్యతి ॥ 8**

రాగీ=రాగసహితుడగు పురుషుడు, దుఃఖజిహాసయా=దుఃఖ నివృత్తియం దిచ్ఛ గలవా డగుటచేత, సంసారం=సంసారమును హాతుం= విడిచిపెట్టుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు, వీతరాగః=రాగరహితుడగు పురుషుడు, నిర్దుఃఖః=దుఃఖము లేనివాడై, తస్మిన్నపి=ఆ సంసార విషయమై, న ఖిద్యతి హి=దుఃఖింపడు గదా!

తా॥ విషయములయందు రాగము గలవానికే విషయ సంబంధ మగు దుఃఖములు గలుగును. ఆ దుఃఖములను తొలగించుకొన నిచ్ఛ గలవాడగుటచేతనే అట్టివాడు సంసారమునుగూడ విడుచుటకు ఇచ్ఛగించుచున్నాడు. ఎవడు రాగరహిత పురుషుడో అతడు సంసారము నందున్నను దుఃఖమును పొందడు. ఆవిషయము పంచదశియందుగూడ చెప్పబడియున్నది.

**"రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు ।**
**కుతో వై శాద్వలస్తస్య యస్యాగ్నిః కోటరే తరోః ॥"**

ఏచెట్టుయొక్క కోటరము అనగా తొర్రయందు అగ్ని యుత్పన్న మగుచున్నదో ఆచెట్టు ఎన్నటికినీ పచ్చదనము కలిగియుండదు. అట్లే యెవని చిత్తమునందు అజ్ఞానచిహ్న మున్నదో ఆతడెన్నటికిని శాంతి నొందజాలడు.

**యస్యాభిమానో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా ।**
**న చ యోగీ న వా జ్ఞానీ కేవలం దుఃఖభాగసౌ ॥ 9**

యస్య=ఎవనికి, మోక్షే=మోక్షమునందు, అభిమానః=అభిమానము గలదో, తథా=అట్లే, యస్య=ఎవనికి, దేహేఽపి=దేహమునందు గూడ,

మమతా=మమత్వ మున్నదో, సః=అట్టివాడు, యోగీ వా=యోగిగాను, న=కాదు, జ్ఞానీ చ=జ్ఞాని గాని, న=కాజాలడు, (కిం తు=మరేమనగా) అసౌ=ఇతడు, కేవలం=కేవలము, దుఃఖభాక్=దుఃఖభాజనుడు.

తా॥ "నేను జ్ఞానిని, నేను త్రికాలదర్శిని, నేను ముక్తుడను"- ఈ ప్రకారమగు అభిమానము గలవాడు జ్ఞాని కాడు. 'నేను యోగాభ్యాసిని, నిత్యము ధౌతి, నేతి, వస్తి మొదలగు క్రియలను చేయుచున్నాను'' అను అభిమానము కలవాడు యోగి కాడు. దేహాభిమానము, మమత్వము గలవాడు జ్ఞాని కాజాలడు. మఱి అట్టివాడు కేవలము దుఃఖభాజనుడే. దుఃఖహేతువు లగు అహంభావము, మమత్వము నివృత్తి కానందున అట్టివాడు కేవలము దుఃఖియే యగును. అనగా సర్వవిస్మరణము కలుగనివాడు జ్ఞాని కానేరడని భావము.

అవ॥ సర్వ విస్మరణోపాయము నుపసంహరించుచున్నాడు.

**హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా ।**
**తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥ 10**

తే=నీకు, హరః=శివుడు, ఉపదేష్టా యది=ఉపదేశకు డైనప్పటికినీ, హరిర్వా=విష్ణువుగాని, కమలజోఽపి వా=బ్రహ్మదేవుడు గాని (ఉపదేశకుడైనను) తథాఽపి=అట్లయినను, సర్వవిస్మరణాత్ ఋతే= సర్వవిస్మరణము కలుగకుండా (త్యాగము లేక), తవ=నీకు, స్వాస్థ్యం= శాంతి, న=కలుగదు.

ఓ జనకా! నీకు సాక్షాత్ ఆ ఈశ్వరుడే వచ్చి ఉపదేశించనీ లేక

ఉపదేశించుటకు ఆ విష్ణువు గానీ, బ్రహ్మదేవుడు గానీ రానీ, విషయత్యాగము చేయనంతవఱకు సుఖము గానీ, శాంతి గానీ, ఆనందము గాని లభింపదు. ఆత్మ తత్త్వోపదేశమునకు పూర్వము విషయములను త్యజించుట మిక్కిలి అవసరమై యున్నది.

ఇది పదునాఱవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదునేడవ ప్రకరణము

## తత్త్వజ్ఞస్వరూప వింశతికము

అవ॥ బ్రహ్మవిద్యయం దెల్లరకు ప్రవృత్తి గలుగుటకై, మఱియు ఆత్మజ్ఞానఫలమును చూపుటకై మొదట ఆత్మజ్ఞాని లక్షణమును చూపుచున్నాడు.

**తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తథా ।**
**తృప్తః స్వచ్ఛేంద్రియో నిత్యమేకాకీ రమతే తు యః ॥ 1**

యః=యెవడు, నిత్యం=ఎల్లప్పుడు, తృప్తః=తృప్తుడై ఉంటున్నాడో, స్వచ్ఛేంద్రియః=ఇంద్రియశుద్ధి గలవాడై, ఏకాకీ=ఎట్టి సంగమము లేనివాడై, రమతే=రమించుచున్నాడో, తేన=వానిచేత, జ్ఞానఫలం= జ్ఞానఫలము, తథా =ఆ ప్రకారమే, యోగాభ్యాసఫలం=యోగాభ్యాస ఫలము, ప్రాప్తం= పొందబడుచున్నది.

ఎవడు విషయభోగములను విడిచి తనలో తానే తృప్తుడై యుండునో అతడే ఆత్మజ్ఞానఫలమును, యోగాభ్యాసఫలమును పొందుచున్నాడు. ఎవని ఇంద్రియములకు విషయభోగకామనాలేశముగూడ లేదో అట్టివాడే స్వచ్ఛేంద్రియములు కలవాడు. ఎవడు నిత్యము ఏకాకిగా సంచరించు చున్నాడో అతడే ఆత్మయందు నిలకడ గలవా డగుచున్నాడు. దత్తాత్రేయ మునీంద్రుడుకూడ ఈ విషయమై యిట్లు చెప్పెను.

**"వాసో బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి ।**
**ఏకాకీ విచలేద్విద్వాన్ కుమార్యా ఇవ కంకణః ॥**

ఒకానొకడు సన్న్యాసి ఒక బ్రాహ్మణ గృహమునకు భిక్షకొఱకు వచ్చెను. అదే సమయమున ఆ ఇంటికి వివాహము నిమిత్తమై కన్య నడుగుటకు పెద్దలరుదెంచిరి. అప్పు డాకన్యక తప్ప ఇంటివారెవరును లేరు. వారిని సత్కరించుటకు, అనగా భోజనాదులు తయారుచేయుటకు ఇంటివద్ద బియ్యము లేకుండెను. తల్లిదండ్రులు వచ్చువఱకు ఉండిన ఆలస్య మగునని యెంచి తానే స్వయముగా ధాన్యమును దంచి బియ్యము చేయుటకు మొదలిడెను. అయితే ఆమె దంచుచున్నప్పుడు తన చేతి యందున్న గాజులు ఘల్లు, ఘల్లు మని శబ్దించుచుండెను. ఇది వినినచో పెండ్లి పెద్దలు "వీరు ఏ పూట కాపూట దంచుకొని తిని జీవించు నిరు పేద" లని దలంతురేమో యని వారి కాయనుమానము కలుగకుండుటకై తన చేతియందలి గాజులను ఒక్కటొక్కటిగా తీసివేయుటకు మొదలిడి అన్నింటిని తీసివేసి ఒక్కొక్కచేతికి ఒక్కొక్క గాజును మాత్రమే యుంచెను. అప్పుడెట్టి ధ్వనియు లేకుండెను.

ఇదంతయు కనిపెట్టి చూచుచున్న సన్న్యాసి, "ఆహా! ఇప్పుడు నేను మంచి గుణపాఠము చూచితిని. అనేకమంది కలియుచోట తప్పక జగడములు కలుగును. ఒక్కరొక్కరే యేకాంతముగా నున్నచో మరెట్టి కలహములును పొడసూపవు." ఇట్లని నిశ్చయించుకొని ఆ సన్న్యాసి తన ఆశ్రమమునకు పోయెను. కావున జ్ఞాని యగువాడు కుమారి (కన్యక) యొక్క గాజులవలె ఏకాకియై ప్రపంచమున సంచరించవలయును.

జీవన్ముక్తిని గోరువాడు ఏకాకియయ్యే యుండవలయును, కావున సన్న్యాసి అనేక జనులమధ్య ఉండుటను సంగమును నిషేధించవలెను. ఈ విషయమై దక్షస్మృతి యిట్లు చెప్పుచున్నది.

"త్రయో గ్రామస్సమాఖ్యాత ఊర్ధ్వం తు నగరాయతే ।
నగరం హి న కర్తవ్యం గ్రామో వా మైథునం తథా ॥
ఏతత్త్రయం తు కుర్వాణః స్వధర్మాచ్ఛ్యవతే యతిః ।
రాజవార్తాది తేషాం తు భిక్షావార్తా పరస్పరమ్॥"

ఎక్కడ ముగ్గురు భిక్షువులు కలుసుకొనుచున్నారో, అక్కడది గ్రామ మగుచున్నది. ముగ్గురికంటె ఎక్కువ యున్నచో నది నగర మగును. కాన బుద్ధిమంతు లగువారు నగరమును గాని, గ్రామమును గాని చేరరాదు. మఱియు రెండవవానితో గూడ కలిసి యుండరాదు. ఒంటరిగానే యుండవలయును, ఎవడు గ్రామమును గాని, నగరమును గాని, మిథునమును గాని కలిగియున్నాడో, అనగా ఇద్దరితో గాని, ముగ్గురితోగాని, అంతకు ఎక్కువ మందితో గాని సంబంధము గలిగియుండునో అతడు తన ధర్మము నుండి తప్పక జారిపోవును.

"సత్కారమానపూజార్థం దండకాషాయధారణః ।
స సన్న్యాసీ న వక్తవ్యః సన్న్యాసీ జ్ఞానతత్పరః ॥"

జనులు సత్కరింతురని, గౌరవింతురని, పూజింతురని తలంచి ఎవడు సన్న్యసించుచున్నాడో, అనగా కాషాయవస్త్ర దండ కమండలాదులను ధరించుచున్నాడో, అతడు నిజమైన సన్న్యాసి గాడు. ఎవడు ఆత్మజ్ఞాని పరాయణుడై, ఏకాకియై, వాసనారహితుడై ఉంటున్నాడో అతడే శాంతిని

పొందుచున్నాడు. ఇతరులు పొందజాలరు.

**న కదాచిజ్జగత్యస్మిం స్తత్త్వజ్ఞో హంత ఖిద్యతి ।**
**యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండమండలమ్ ॥ 2**

తత్త్వజ్ఞః=తత్త్వజ్ఞాని, అస్మిన్=ఈ, జగతి=ప్రపంచమునందు, కదాచిత్=ఒకానొకప్పుడుగూడ, న ఖిద్యతి=ఖేదమును పొందడు, హంత =ఇది నిశ్చయము, యతః=ఎందువలన, ఏకేన=ఒక్కడగు, తేన=అతనిచేత, బ్రహ్మాండ మండలం=బ్రహ్మాండ మండలము, పూర్ణం=నిండింపబడి యున్నదో.

ఓ శిష్యా! ఈ బ్రహ్మాండ మండలమునందు తత్త్వజ్ఞుడగు వాడొకప్పుడును దుఃఖమును పొందడు. ఎందుకనగా ఈ బ్రహ్మాండ మంతయు పూర్ణుడనై నేనే వ్యాపించియున్నానని అతడు నిశ్చయించుకొని యున్నాడు. దుఃఖము దేనినుండి కలుగును? రెండవ వస్తువునుండి. రెండవవస్తువే లేనప్పుడు మరి దుఃఖము దేనినుండి కలుగును?

**న జాతు విషయాఃఽపి స్వారామం హర్షయన్త్యమీ ।**
**సల్లకీపల్లవప్రీతమివేభం నింబపల్లవాః ॥ 3**

సల్లకీపల్లవప్రీతం=అందుగుచిగుళ్ళయందు ప్రీతిగల, ఇభం=ఏనుగును, నింబపల్లవాః=వేపచిగుళ్ళు, న హర్షయంతి ఇవ=సంతోష పెట్టజాలని యట్లు, అమీ=ఈ, కే=ఏ, విషయా అపి=విషయములుగూడ, స్వారామం=స్వాత్మారాముని, న హర్షయన్తి=సంతోషపెట్టజాలవు.

ఎవడు తన ఆత్మయందు రమించుచున్నాడో అతనికి ఆత్మారాము

డని పేరు. ఆ యాత్మారాముడు విషయములు ప్రాప్తించుటవలనగాని, విషయానుభవమువలనగాని ఒకప్పుడును సంతోషమును పొందడు. విషయములు తుచ్ఛములని తలంచుటవలన - అనగా విషయజన్య సుఖములు క్షణికములని తెలిసికొన్నందువలన విషయభోగము లతనిని సంతోషపరచజాలవు. మధురములగు అందుగుచిగుళ్ళను ఆస్వాదించి ఆనందించు ఏనుగును చేదుగల వేపచిగుళ్ళు ఆనందపరుపజాలవు. అట్లే ఆత్మానందము ననుభవించువానిని విషయానందములు తృప్తిని కలుగ జేయజాలవు.

**యస్తు భోగేషు భుక్తేషు న భవత్యధివాసితః ।**
**అభుక్తే నిరాకాంక్షీ తాదృశో భవదుర్లభః ॥ 4**

యః=ఎవడు, భుక్తేషు=అనుభవింపదగిన, భోగేషు=భోగముల విషయమై, అధివాసితః=ఆసక్తుడు. న భవతి=కాడో, చ=మఱియు, అభుక్తేషు= అభుక్త పదార్థముల విషయమై, నిరాకాంక్షీ=ఆశారహితుడో, తాదృశః= అటువంటివాడు భవదుర్లభః=ప్రపంచమునందు దుర్లభుడు.

ఎవనికి భోగవస్తువులు సిద్ధముగా నున్నను వాటి ననుభవించవలె ననెడి కోరిక యుండదో, ఎవనికి అప్రాప్త వస్తువుల విషయమై కావలయు ననెడి కోరిక యుండదో, ఎవడు తన ఆత్మయందే రతి గలవాడుగా నుండునో, అట్టివాడు ప్రపంచమునందు కోట్లజనులలో ఏ ఒక్కడో ఉండును. లేక ఆ ఒక్కడుగూడ దుర్లభుడే.

**బుభుక్షురిహ సంసారే ముముక్షురపి దృశ్యతే ।**
**భోగమోక్షనిరాకాంక్షీ విరలో హి మహాశయః ॥ 5**

బుభుక్షుః=భోగేచ్ఛ గలవాడు, ముముక్షుః=మోక్షేచ్ఛ కలవాడు, అపి=కూడ, ఇహ సంసారే=ఈ ప్రపంచమునందు, దృశ్యతే=కనబడు చున్నాడు. హి=అయితే, భోగమోక్షనిరాకాంక్షీ=భోగమోక్ష అశారహితు డగు. మహాశయః=మహాత్ముడు. విరళః=అరుదుగా నున్నాడు.

ఈజగత్తులో ముముక్షువులు అనేకులు కనబడుచున్నారు. భోగపరులును అనేకు లున్నారు. కాని భోగ మోక్షములను రెంటిని విడిచి ఆశారహితుడై యున్న మహాత్ముడు దుర్లభుడు. గీతయందు భగవానుడు గూడ ఇట్లు చెప్పెను.

**"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥"**

వేలకొలది మనుషులలో ఒకానొకడు మాత్రమే అంతఃకరణశుద్ధి కలిగి, ఆత్మసిద్ధికొఱకు యత్నము చేయును. అయితే వారిలోనుకూడ ఏ ఒక్కడో ఆత్మను యథార్థముగా తెలిసికొనుచున్నాడు.

**ధర్మార్థకామమోక్షేషు జీవితే మరణే తథా ।**
**కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా న హి ॥** 6

ధర్మార్థకామమోక్షేషు=ధర్మార్థకామమోక్షములయందు, జీవితే= జీవితవిషయమునను, తథా=అట్లే, మరణే=మరణవిషయమునందును, కస్య=ఒకానొక, ఉదారచిత్తస్య అపి=ఉదారచిత్తునకు మాత్రమే, హేయోపాదేయతా=త్యాగగ్రహణములు, న హి=ఉండవు.

తా॥ ఓ శిష్యా! ప్రపంచమున ధర్మ, అర్థ, కామ, మోక్షములయందు గాని, జీవించుటయందు గాని, మరణించు విషయమున గాని ఎవడు

ఉదాసీనుడై యుంటున్నాడో; ఎవనికి సుఖాకారవృత్తి గాని, దుఃఖాకార వృత్తి గాని లేదో; ఎవడు తన ఆత్మయందే శాంతుడై ఉంటున్నాడో- అట్టివాడు అరుదు. సుఖ దుఃఖములు రెండునూ సాపేక్షకములు. ఎవనికి సుఖము కలుగునో వానికి దుఃఖమున్ను కలుగక మానదు. దుఃఖానంతరము సుఖము కలుగును. కాన నీ వీ రెంటిని విడిచి ఆత్మానందముతో మెలగుము.

**వాంఛా న విశ్వవిలయే న ద్వేష స్తస్య చ స్థితౌ ।**
**యథా జీవికయా తస్మాద్ధన్య ఆస్తే యథా సుఖమ్ ॥ 7**

విశ్వవిలయే=ప్రపంచలయమునందు, వాంఛా=ఇచ్ఛగాని, తస్య= ఆవిశ్వము యొక్క, స్థితౌ=స్థితియందు, ద్వేషః=ద్వేషముగాని, యః = ఎవడు, (న ప్రాప్నోతి=పొందడో,) ధన్యః=ధన్యుడగు, సః=వాడు, యథా జీవికయా=యథాప్రాప్తమగు ఆ జీవికద్వారా, యథాసుఖమ్= సుఖ పూర్వకముగా, ఆస్తే=ఉంటున్నాడు.

తా॥ ఓ కుమారా! విశ్వము లయ మగుటయందు ఎవనికి ఇచ్ఛ లేదో, ప్రపంచస్థితియందును ఎవనికి ద్వేషము లేదో అనగా ప్రపంచ ముండు గాక! లేక ఉండుకుండు గాక! దాని నిమిత్తమే లేనివాడై, తనను విశ్వమునకు సాక్షిగాను, అధిష్ఠానముగాను తెలిసికొని స్థితుడవై యుంటున్నాడో, అతడే కృతకృత్యుడు, ధన్యుడు, పూజాయోగ్యుడు.

**కృతార్థోఽనేన జ్ఞానేనేత్యేవం గళితధీఃకృతీ ।**
**పశ్యఞ్ఛృణ్వన్ స్పృశఞ్జిఘ్రన్నశ్నన్నాస్తే యథా సుఖమ్ ॥ 8**

అనేన=ఈ, జ్ఞానేన=జ్ఞానముచేత (అహం=నేను), కృతార్థః=

కృతార్థుడును, ఇత్యేవం=ఈ ప్రకారముగా, గళితధీః=జారిపోయిన బుద్ధి గలవాడై, కృతీ=జ్ఞాని, పశ్యన్=చూచుచు, శృణ్వన్=వినుచు, స్పృశన్=తాకుచు, జిఘ్రన్=ఆఘ్రాణించుచు, అశ్నన్=తినుచు, యథాసుఖమ్=సుఖ పూర్వకముగా, ఆస్తే=ఉంటున్నాడు.

అద్వైతమగు ఆత్మజ్ఞానము ద్వారా నేను కృతార్థుడ నైతినను బుద్ధి గూడ ఎవనికి ఉత్పన్నము కాదో, ఆహారాది క్రియలు చేయుచున్నను ఎవడు శరీర సంబంధమగు సుఖదుఃఖములను పరిగణింపకుండునో; మఱియు బాహ్యేంద్రియ వ్యాపారములు జరుగుచున్నను అజ్ఞాని యగు మూర్ఖునివలె నెవడు దుఃఖింపడో; నిలుచున్నను, కూర్చున్నను, చూచు చున్నను, వినుచున్నను, తినుచున్నను ఎవడు సమాహిత చిత్తుడై యుండునో అతడే ధన్యుడు. అట్టివాడే పరబ్రహ్మస్వరూపుడు.

శూన్యా దృష్టిర్వృథా చేష్టా వికలానీంద్రియాణి చ ।
న స్పృహా న విరక్తిర్వా క్షీణసంసారసాగరే ॥ 9

క్షీణసంసారసాగరే=సంసారసాగరము క్షీణించిన దగుచుండగా దానియందు, దృష్టిః=దృష్టి, శూన్యా=శూన్య మగుచున్నది, చేష్టాః=క్రియలు, వృథా=వ్యర్థమగుచున్నవి, ఇంద్రియాణి=ఇంద్రియములు, వికలాని=వికలము లగుచున్నవి, స్పృహా=ఇచ్ఛ, వా=మఱియు, న=లేదు, విరక్తిః=విరక్తియు, న=లేదు.

ఓ శిష్యా! ఎవనికి సంసారసాగరము నశించిపోయినదో, వానికి విషయభోగములయం దిచ్ఛ యుండదు. మఱియు వానినుండి విరక్తుడను కావలెననెడి కోరికయు నుండదు. అతనియొక్క మనస్సు మఱియు ఇంద్రియములు మొదలగునవి బాలునివలె లేక ఉన్మత్తునివలె వ్యాపార

శూన్యము లగుచున్నవి. మఱియు వాని శరీరచేష్టలుగూడ వ్యర్థమై పోవు చున్నవి. ఆతని ఇంద్రియములు బలరహితములై పోవుచున్నవి. తన యెదుటనున్న విషయములను నిర్ణయించుటకుకూడ శక్తి లేకపోవుచున్నది. ఈ విషయము గీతయందుకూడ చెప్పబడినది.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥"

ఏ ఆత్మజ్ఞానరూప రాత్రియందు సమస్తభూతములును నిద్రించు చున్నవో, దానియందు జ్ఞాని మేల్కొనుచున్నాడు, సమస్తభూతములును ఏ అజ్ఞానరూప పగటియందు మేల్కొని యున్నవో, దానియందు జ్ఞాని నిద్రించుచున్నాడు.

**న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి ।**
**అహో పరదశా క్వాఽపి వర్తతే ముక్తచేతసః ॥** 10

న జాగర్తి=మేల్కొనుట లేదు, న నిద్రాతి=నిద్రించుట లేదు. న ఉన్మీలతి=కంటిరెప్పలను తెరచుట లేదు. న మీలతి=మూయుట లేదు, ముక్తచేతసః=ముక్తచేతస్కుడగు జ్ఞానికి, క్వాఽపి=ఒకానొక, పరదశా= ఉత్కృష్టదశ. వర్తతే=ఉంటున్నది, అహో=ఆశ్చర్యము!

ఓ శిష్యా! జ్ఞాని ఇటువంటి పగటియందు మేల్కొని యుండడు. ఎందుకనగా మేల్కొని యున్నవాడు కంటి రెప్పలను తెరచియుంచవలెను గదా! అనగా బాహ్యావిషయములను చూచుట, స్మరించుట చేయుచున్నాడు. జ్ఞాని బాహ్యావస్తువులను చూడడు, స్మరించడు. కావుననే అతడు మేల్కొన

లేదని చెప్పుటకు కారణము, మఱియు జ్ఞాని నిద్రించుటయు లేదు. కారణము - నిద్రించువాడు కంటి రెప్పలు మూసికొనును గదా! అందువలన నతడు బాహ్యపదార్థములను వేటినీ చూడజాలడు. జ్ఞాని యన్ననో బాహ్యములగు సమస్త పదార్థములను పరబ్రహ్మస్వరూపమునుగా చూచుచున్నాడు.

ప్రశ్న ॥ ఇట్టి జ్ఞానికి ఎట్టి దశ కలుగును?

ఉ॥ ఆహా! అటువంటివానికి గల దశను ఏమని వర్ణింపగలను? శాంతచిత్తు డగు జ్ఞానికి ఒకానొక అప్రాకృతమగు ఉత్కృష్ట తురీయావస్థ కలుగును. ఆ దశను వర్ణించుటకు చర్మమయమైన యీ నోరు చాలదు, అది దీని కతీత మైనది.

**సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః ।**
**సమస్తవాసనాముక్తో ముక్తస్సర్వత్ర రాజతే ॥ 11**

ముక్తః=జీవన్ముక్తుడు, సర్వత్ర=అంతట, స్వస్థః=ప్రశాంతాత్ముడై, సర్వత్ర=అంతట, విమలాశయః=నిర్మలాంతఃకరణము గలవాడుగా, దృశ్యతే=కనబడుచున్నాడు, చ=మరియు, సర్వత్ర=అంతట సమస్తవాసనా రహితుడై, రాజతే=విరాజిల్లుచున్నాడు.

ఓ శిష్యా! జ్ఞాని యగు జీవన్ముక్తుడు సుఖదుఃఖముల యందంతటను స్వస్థచిత్తుడై ఉంటున్నాడు. అజ్ఞాని సుఖము వచ్చునప్పుడు సంతోషమును, కష్టము వచ్చినప్పుడు శోకమును పొందుచున్నాడు. జ్ఞాని సుఖ దుఃఖములను హర్ష శోకములను సమానముగా చూచుచు ఆత్మా

నందములో నిమగ్నుడై యుండును. అజ్ఞాని మిత్రులయందు రాగమును, శత్రువులయందు ద్వేషమును ప్రకటించును. జ్ఞాని శత్రు, మిత్రులను సమానముగా జూచును. జ్ఞాని విషయవాసనా రహితుడై, జీవన్ముక్తుడై నిరంతరము ఆత్మానందము ననుభవించుచు ఒకే రీతిని వెలుగొందును.

**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గృహ్ణన్ వదన్ వ్రజన్ ।**
**ఈహితానీహితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః ॥ 12**

పశ్యన్=చూచుచున్నవాడై, శృణ్వన్=వినుచు, స్పృశన్=తాకుచు, జిఘ్రన్=ఆఘ్రాణించుచు అశ్నన్=తినుచు, గృహ్ణన్=గ్రహించుచు, వదన్=మాట్లాడుచు, వ్రజన్=పోవుచు, ఈహితానీ హితైః=రాగద్వేషముల నుండి, ముక్తః=విడివడిన, మహాశయః=మహాత్ముడు, ముక్తః ఏవ= నిశ్చయముగా ముక్తుడే.

అంతట చూచుచు, వినుచు, తాకుచు, వాసన చూచుచు, వినుచు, గ్రహించుచు, మాట్లాడుచు నడచుచు జ్ఞాని ఇచ్ఛాద్వేషరహితు డగుచున్నాడు. అతని చిత్తమెల్లప్పుడు పరబ్రహ్మమునందే నిమగ్నమై యుండును. అందువల్లనే అతడు, జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

**న నిన్దతి న చ స్తౌతి న హృష్యతి న కుప్యతి ।**
**న దదాతి న గృహ్ణాతి ముక్తస్సర్వత్ర నీరసః ॥ 13**

సర్వత్ర=అన్నిటియందును, నీరసః=ఆసక్తి లేనివాడై, ముక్తః= ముక్తు డగుజ్ఞాని, న నిన్దతి=నిందించడు, న స్తౌతి=స్తుతించడు, న హృష్యతి= హర్షము నొందడు. న కుప్యతి=కోపింపడు, న దదాతి=యివ్వడు, న గృహ్ణాతి=గ్రహింపడు.

జీవన్ముక్తు డగువాడు ఎవనినీ నిందింపడు, ఎవనినైనను స్తుతింపడు, హర్షింపడు, కోపింపడు. అనగా - ఒకడు తనకు ఆదర సన్మానములు చేసినను వానిని స్తుతింపడు, నిరాదరము చూపిన వానిని దూషింపడు. మిక్కిలి మంచి భోజనాదులు దొరికి నప్పుడు హర్షించడు. అవి దొరకనప్పుడు దుఃఖింపడు. మఱియు శరీరనిర్వాహమునకు మించి ఏ వస్తువునైనను గ్రహింపడు. లేక దేనినైనను తీసికొని ఇంకొకరికి ఇచ్చుటకు ప్రయత్నింపడు. ఒకరినుండి ఒకరికి ఇప్పించుటకును చూడడు. నిరంతరము తనలో తానే ఆనందమగ్నుడై యుండును.

ప్రశ్న॥ గురుదేవా! లోకులు దిగంబరులను, భిక్ష తీసికొని జీవించు వారలను జీవన్ముక్తులని తలంచుచున్నారు. ఇది నిజమా?

ఉ॥ సంసారమునం దున్నవారు సకాములు. సకాము డగువాడు నిజానిజములను తెలిసికొనజాలడు. ఇతడు జ్ఞాని యని, ఇతడు అజ్ఞాని యని, ఇది సత్యమని, ఇది అసత్యమని తెలుసుకొను వివేక మతని కుండదు. అందువలన దంభాచారులగు వీరు దిగంబరులై తిరుగుచు, అమాయకు లగు శిష్యుల కుపదేశించుచుందురు. మఱియు ఒకనివద్ద ధనమును తీసికొని ఇంకొకని కిచ్చుచుందురు. నిమిత్తముకొఱకు మఠాదుల నేర్పఱతురు. అట్టి దంభాభిమాను లెన్నటికిని జీవన్ముక్తులు కాజాలరు, వారుగూడ శిష్యులవలె సకాములే, వారు వారి కామనాపూరణము కొఱకు ఆయా వేషములను వేయుచు శిష్యులను వంచించుచున్నారు. ఎవని హృదయము విషయాశలనుండి విముక్తిని పొందలేదో, వాడు అవశ్యము నరకమును పొందగలడు. అతడు దిగంబరుడే యగుగాక! పాషండుడే అగుగాక! తప్పక అతడు నరకమును పొందును.

ఇందుకు దృష్టాంతము:- ఒక మహాత్ము డొకరాజగృహమునందు చాలకాలమువఱకు ఉండెను. ఒక దినమున మహాత్ముడు మరణించెను. అదే దినము రాజుగూడ మరణించెను. ఆ నగరమునకు వెలుపల నున్న అరణ్యములో నొక తపస్వి యుండెను. ఒక మనుష్యు డాతని సమీపమున కూర్చొని యుండగా ఆ యోగి దేనినో ఆలోచించి బిగ్గరగా నవ్వ నారంభించెను, అప్పు డాదగ్గర నున్నవాడు "మహాత్మా! ఏ కారణము లేకుండగనే ఎందుకు నవ్వుచున్నారు?" అని అడిగెను. అప్పు డామహాత్ము డిట్లు చెప్పెను. 'నేను కారణము లేకుండా నవ్వుట లేదు. మరేమనగా - రాజు దగ్గర నొక మహాత్ము డుండెను గదా! ఆ ఇరువురును ఒకేసారి మరణించుట నీకు తెలిసినదే. వారిలో రాజు స్వర్గమునకు పోయెను. ఆ మహాత్ముడు నరకమునకు పోయెను. కారణము రాజుయొక్క మనస్సు నిరంతరము మహాత్మునియందే యుండెను. ఆ కారణమువలన నతడు స్వర్గమునకు పోయెను. మహాత్మునియొక్క మనస్సు నిరంతరము రాగభోగములయం దుండుటవలన నాతడు నరకమును పొందెను. కావున నతడెంత దిగంబరు డైనను వాసనారహితుడు కానిచో నత డెన్నటికిని జీవన్ముక్తుడు కాజాలడు. వాసనారహితు డగువా డెవడైనను జీవన్ముక్తుడే. ఇందు సందేహ మేమియు లేదు.'

**సానురాగాం స్త్రియం దృష్ట్వా మృత్యుం వా సముపస్థితమ్ ।**
**అవిహ్వలమనాః స్వస్థో ముక్త ఏవ మహాశయః ॥ 14**

సానురాగాం=అనురాగముతో (ప్రీతితో) కూడుకొన్న, స్త్రియం=స్త్రీని, దృష్ట్వా వా=చూచినను (లేక) సముపస్థితమ్=సమీపమునందున్న, మృత్యుం=మృత్యువును, దృష్ట్వా వా=చూచినను, అవిహ్వలమనాః=

వ్యాకుల రహితమైన మనస్సు గలవాడై, స్వస్థః=శాంతచిత్తుడై, మహాశయ ఏవ=మహాత్ముడే, ముక్తః=ముక్తుడు.

తా॥ అనురాగము అనగా ప్రీతితో కూడుకొన్న స్త్రీని చూచినను ఎవని మనస్సు కామాతురము కాదో, మృత్యువును చూచినను ఎవని మనస్సు భయాందోళనను చెందదో, విశేషించి ఆత్మానందమునందు నిమగ్నుడై యుండునో, ఆతడే జీవన్ముక్తుడు.

**సుఖే దుఃఖే నరే నార్యాం సంపత్సు చ విపత్సు చ ।**
**విశేషో నైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః ॥**

సుఖే=సుఖమునందును, దుఃఖే=దుఃఖమునందును, నరే= పురుషుని యందును, నార్యాం=స్త్రీయందును, సంపత్సు=సంపదల యందును, విపత్సు=విపత్తులయందును, సర్వత్ర=అంతటను, సమదర్శినః= సమానముగా చూచుచున్న, ధీరస్య=ధీరుడగు జ్ఞానికి, విశేషః=విశేషము (భేదము), న=లేదు.

తా॥ ఎవని మనస్సు సుఖ దుఃఖములయందు సమానముగా నుండునో, అనగా శరీరసంబంధమగు సుఖము కలిగినప్పుడు సంతోష మును గాని, శరీరమునకు కష్టము కల్గునప్పుడు శోకమును గాని పొందదో, ఎవనికి స్త్రీ పురుషాది భేద ముండదో, అనగా అందఱిని ఆత్మస్వరూపుల నుగా చూచుచున్నాడో, ఎవనికి సంపదలు కలుగునప్పుడు హర్షమును, విపత్తులు సంభవించునపుడు దుఃఖమును కలుగదో, అతడే జీవన్ముక్తుడు.

**న హింసా నైవ కారుణ్యం నౌద్ధత్యం న చ దీనతా ।**
**నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే ॥ 16**

క్షీణసంసరణే=నశించిన సంసారము గల, నరే=మనుష్యునియందు, హింసా న=హింసయు లేదు, న కారుణ్యం=కరుణయు లేదు, న ఔద్ధత్యం=దౌష్ట్యము లేదు, న దీనతా=దీనత్వము లేదు, న ఆశ్చర్యం= ఆశ్చర్యము లేదు, న క్షోభః=క్షోభము లేదు.

సంపూర్ణముగా ప్రకృతి నశించిపోయిన జీవన్ముక్తుడు ఒక ప్రాణిని హింసించడు, ఒకదానిపై దయజూపడు, ఒకనిపై దౌర్జన్యమును జూపడు. శరీరసుఖమునకై ఒకరిదగ్గర దీనత్వమును ప్రకటించడు, ఒకప్పుడు ఆశ్చర్యమును ప్రకటించడు, ఒకప్పుడు కలవరపడడు, స్వస్వరూప మగు ఆత్మానందములో నిత్యము నిమగ్నుడై యుండును.

**న ముక్తో విషయద్వేష్టా న వా విషయలోలుపః ।**
**అసంసక్తమనాః నిత్యం ప్రాప్తాప్రాప్తముపాశ్నుతే ॥ 17**

ముక్తః=జీవన్ముక్తుడు, న విషయద్వేష్టా=విషయములను ద్వేషించు వాడు కాడు, న విషయలోలుపః=విషయములయందు లోలుపుడు గాడు, నిత్యం=ఎల్లప్పుడు, అసంసక్తమనాః=ఆసక్తి రహిత మనస్సు గలవాడై, ప్రాప్తాప్రాప్తం=ప్రాప్తాప్రాప్త వస్తువులను, ఉపాశ్నుతే= అనుభవించు చున్నాడు, (ప్రాప్తవస్తువు ననుభవించుచున్నాడు, అప్రాప్తవస్తువును కోరుటలేదు.)

ఎవడు విషయములను ద్వేషింపడో మఱియు వాటియందు లోలుపత్వమునుగూడ చూపడో, ఎవని మనస్సు నిరంతరము అనాసక్తమై దేనిని ఆశింపదో. ప్రారబ్ధవశమున ప్రాప్త మగుదాని ననుభవించుచు అప్రాప్త మగు దానిని కోరడో, అతడే జీవన్ముక్తు డని చెప్పబడుచున్నాడు.

**సమాధానాసమాధాన హితాహిత వికల్పనాః ।**
**శూన్యచిత్తో న జానాతి కైవల్య మివ సంస్థితః ॥ 18**

శూన్యచిత్తః=మనస్సునం దే సంకల్పములు లేనివాడైన జీవన్ముక్తుడు, సమాధానాసమాధాన హితాహితవికల్పనాః=సమాధాన అసమాధాన ములు, హితముఅహితములు వీటియొక్క కల్పనలను, న జానాతి= తెలిసికొనడు, పరంతు=మరేమనగా, కైవల్యం ఇవ=కేవలము మూర్తీభవించిన మోక్షమువలె, సంస్థితః=ఉంటున్నాడు.

ఎవడు ఇది మంచి దని గాని, ఇది చెడ్డ దని గాని, ఇది యోగ్య మని గాని, ఇది అయోగ్య మని గాని, ఇది హిత మని గాని, ఇది అహిత మని గాని ఈ మొదలగు సంకల్పములను చేయడో, ఎవరు ప్రపంచవిషయ వాసనలను సంకల్పములను హృదయమునం దుంచడో, నిర్మలుడై యుండునో, విదేహ కైవల్యమును పొందెనో- అతడే జీవన్ముక్తుడు.

**నిర్మమో నిరహంకారో న కించిదితి నిశ్చితః ।**
**అంతర్గళితసర్వాశః కుర్వన్నపి న లిప్యతే ॥ 19**

అంతర్గళితసర్వాశః=అంతఃకరణమునందలి సమస్తకోరికలు నశించిన వాడును, నిరాహంకారః=అహంకార రహితుడును, నిర్మమః= మమతా రహితుడును, కించిత్=కొంచెముగూడ, న=లేదు (ఇదంతయు మిథ్య), ఇతి=ఇట్లని, నిశ్చితః=నిశ్చయజ్ఞానము గలవాడు, కుర్వన్ అపి= కర్మలు చేయుచున్న వాడైనను, న లిప్యతే=అంటదు.

ఓ జనకా! ఎవడు "అహం, మమ" అను అభిమానము పూర్తిగా లేనివాడో, అనగా 'ఇది నాది, దీని కంతటికి కర్తను నేనే' యను అభిమాన

మెవనికి లేదో, అధిష్ఠాన చైతన్యముకంటె వేరైన దొకటియు సత్యము గాదు, అదంతయు మిథ్యయే యను నిశ్చయజ్ఞాన మెవనికి గలదో, అట్టివాడు సమస్తకార్యములు చేయుచున్న వాడైనను ఏమియు చేయనివాడే. ఎందుకనగా వానికి కర్తృత్వ భోక్తృత్వాభిమానము లేదు.

**మనఃప్రకాశ సంమోహ స్వప్న జాడ్యవివర్జితః ।**
**దశాం కామపి సంప్రాప్తో భవేద్గళితమానసః ॥ 20**

గళితమానసః=నశించిన మనస్సు గల జ్ఞాని, మనఃప్రకాశ సంమోహ స్వప్నజాడ్యవివర్జితః=మనఃప్రకాశమునుండియు, చిత్తభ్రాంతి నుండియు, జడత్వరూపనిద్రనుండియు విడివడినవాడై, కామపి=అనిర్వాచ్యమైన ఒకానొక, దశాం=దశను (అవస్థను) సంప్రాప్తః=పొందినవాడుగా, భవేత్=అగును (అగుచున్నాడు)

ఓ శిష్యా! గళితమైపోయిన అనగా నశించిన అంతఃకరణవృత్తి గలిగి సంకల్ప వికల్పములు ఎవనికి స్ఫురించుట లేదో, ఎవనికి స్త్రీ పుత్రాది సమస్త విషయములయందును, మోహము దూరమైపోయినదో, ఎవడు అంతఃకరణమును నిరంతర మాత్మానందమునందే నియోగించునో, ఎవడు జడరహితుడో, ఎవడు నిరంతర మాత్మానందమునందే రమించుచున్నాడో వాడే జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

ఇది పదునేడవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పదునెనిమిదవ ప్రకరణము

## శాంతిశతకము

ఈ ప్రకరణమునందు శాంతియొక్క ప్రధానతను చూప దలంచినవాడై ప్రథమమున శాంతరూప పరమాత్మకు నమస్కారము జేయుచున్నాడు.

**యస్య బోధోదయే తావత్స్వప్నవద్భవతి భ్రమః ।**
**తస్మై సుఖైకరూపాయ నమః శాన్తాయ తేజసే ॥ 1**

యస్య=దేనియొక్క, బోధోదయే=బోధోదయ మైనమీదట, తావత్=మొదట, భ్రమః=భ్రాంతి, స్వప్నవత్=స్వప్నమువలె, భవతి=అగు చున్నదో, తస్మై=ఆ, సుఖైకరూపాయ= ఆనందైక స్వరూపుడును, శాన్తాయ= శాంతిఃస్వరూపుడును అగు, తేజసే= జ్యోతిఃస్వరూపునికొఱకు, నమః= నమస్కారము.

ఏ యాత్మ శాంతరూప మైనదో, దేనియందు సంకల్ప వికల్పము లుత్పన్నములు కావో, దేనియొక్క స్వరూపజ్ఞానము కలుగగానే జగద్భ్రాంతి స్వప్నమువలె మిథ్య యని తోచునో అట్టి ఆనందైకరూప పరమాత్మకు నమస్కారము చేయుచున్నాను.

అవ॥ అయితే ధనవంతుడుగూడ ప్రపంచములో సుఖస్వరూపుడుగా కనిపించుచున్నాడు, మఱి ధనవంతునకును, జ్ఞానికిని గల భేద మేమి? అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**ఆర్జయిత్వాఽ ఖిలానర్థాన్ భోగానాప్నోతి పుష్కలాన్ ।**
**న హి సర్వపరిత్యాగ మన్తరేణ సుఖీ భవేత్ ॥ 2**

అఖిలాన్=సర్వవిధములైన, అర్థాన్=ధనములను, ఆర్జయిత్వా = సంపాదించి, పుష్కలాన్=పుష్కలము లయిన, భోగాన్=భోగములను, (పురుషః=పురుషుడు), ఆప్నోతి=పొందుచున్నాడు (పరంతు=అయితే), సర్వపరిత్యాగం అంతరేణ=సకలపరిత్యాగము లేకుండా (చేయక), సుఖీ=సుఖవంతుడు, న భవేత్=కాజాలడు.

లోకమున ధనవంతులు గూడ సుఖము ననుభవించుచున్నారు. కాని అవి తుచ్ఛములు, త్యాగము లేనిదే యెవరికిని నిజమైన సుఖము సంభవింపదు.

ఓ జనకా! ధనికులు భార్య, బిడ్డలు, ధనము మొదలగు సంపదలను సమకూర్చుకొని భోగించుచున్నారు. కాని అవి నాశన మైనచో మిక్కిలి దుఃఖించుచున్నారు. చూడుము:

**పృథివీం ధనపూర్ణాం చేదిమాం సాగరమేఖలామ్ ।**
**ప్రాప్నోతి పునరప్యేష స్వర్గ మిచ్ఛతి నిత్యశః ॥**

పూర్ణముగా ధనముతో నింపబడి చతుస్సముద్రముద్రిత మగు ఈ భూమి యంతయు నొకనికి చేకూరినను మఱల వాడు స్వర్గము నాకు లభించిన బాగుండునని నిత్యము కోరుచుండును. ప్రపంచమునందు ధనవంతులు తరచుగా రోగులుగా కనబడుచున్నారు. కొందఱికి అజీర్తి రోగము, కొందఱికి మధుమేహము మొదలగు రోగములు కనబడుచున్నవి.

ధనవంతులకు పరస్పర స్పర్ధ యెక్కువగా ఉంటున్నది. మఱియు వారికి రాజులవలన, చోరులవలన నిత్యము భయము కలుగుచున్నది. దొంగల భయమువలన రాత్రులయందు నిద్రపట్టదు. ధనము సంపాదించుట యందును, ధనమును రక్షించుటయందును వారు మిక్కిలి క్లేశపడు చున్నారు. ప్రపంచములో ధనికులకు గల దుఃఖము బీదవారియందు కనబడదు. ధనమువలన గలుగు విషయభోగాది సుఖములు నశించి పోవునవి ; మఱియు తుచ్ఛములు. కావుననే సంపూర్ణధనాదిక త్యాగము వినా సుఖరూపమగు ఆత్మానందప్రాప్తి కలుగదని చెప్పబడినది. ఏవిధముగా వంధ్యాపుత్రుడు అసత్యమని తెలిసికొనినచో వానిని త్యజింప గలుగుచున్నాడో, లేనిచో త్యాగమునకు అవకాశము లేదో, ఆ ప్రకారముగా సంకల్పవికల్ప రూపజగత్తంతయు మిథ్య యని తెలిసికొనుటవలననే దానిని త్యజించగలుగుచున్నాడు. అప్పుడే సుఖైకరూపుడు కాగలుగుచున్నాడు.

అవః వంధ్యాపుత్రత్వమును తుచ్ఛమును, అసంబంధమును గాన దానిని విడిచినట్లుగానే సంకల్పవికల్పరూప మనస్సునుగూడ త్యజించి నప్పుడే సుఖమును పొందుచున్నాడు అని చెప్పుచున్నాడు.

**కర్తవ్యదుఃఖమార్తండజ్వాలాదగ్ధాన్తరాత్మనః ।**
**కుతః ప్రశమపీయూషధారాసారమృతే సుఖమ్ ॥ 3**

కర్తవ్య దుఃఖమార్తండ జ్వాలాదగ్ధాన్తరాత్మనః=కర్మజన్య దుఃఖ రూప సూర్యకిరణజ్వాలలవలన దహింపబడుచున్న మనస్సు గలవానికీ, ప్రశమపీయూషధారాసారం, ఋతే=సంకల్ప వికల్ప ప్రశమరూప అమృత వర్షము లేక, సుఖం=సుఖము, కుతః=ఎక్కడిది?

తా॥ కర్తృస్వరూప కర్మలు, వాటివలన గలిగెడు జన్మదుఃఖములు-ఇవియే సూర్యతప్తాగ్ని వంటివి. ఈ అగ్నివలన ఎవని మనస్సు దగ్ధ మగుచున్నదో, అట్టి దావాగ్ని దగ్ధ మనస్కునకు శాంతి శమ దమాది అమృతవృష్టి వినా సుఖప్రాప్తి కలుగజాలదు.

అవ॥ సంసారదుఃఖ మనెడు విషయమును నశింపజేయునది కనుక సంకల్ప వికల్ప ఉపశమనమే అమృత మనబడునని తెలుపుచున్నాడు.

**భవోఽయం భావనామాత్రో న కించిత్పరమార్థతః ।**
**నాస్త్యభావస్స్వభావానాం భావాభావవిభావినామ్ ॥ 4**

అయం=ఈ, భవః=సంసారము, భావనామాత్రః=సంకల్ప మాత్రమే, పరమార్థతః=యథార్థముగా, కించిదపి=కొంచెముగూడ, న=లేదు, హి=ఎందుకనగా, భావాభావ విభావినాం=భావాభావ పదార్థములయందు స్థితమై ఉంటున్న, స్వభావానాం=స్వభావములకు, అభావః=అభావము, నాస్తి=లేదు.

తా ॥ ఓ జనకా! ఈజగత్తు సంకల్పమాత్రమే. పరమార్థ దృష్టితో చూచినచో ఆత్మకంటె అతిరిక్తమైన ఏవస్తువుగూడ భావరూప మైనది-అనగా సత్యరూప మైనది గాదు. మఱేమనగా సంపూర్ణ ప్రపంచము అభావ (అసత్య) రూపమైనది.

అభావరూప ప్రపంచముగూడ కాలాదికవశమువలన భావ స్వభావము గలది కావచ్చును గదా?

ఉ॥ భావరూపమునందు మఱియు అభావరూపమునందు స్థిరమైన

స్వభావముల కెప్పుడును అభావము కలుగజాలదు. అనగా భావ పదార్థమున కభావమును, అభావ పదార్థమునకు భావము ఎప్పుడును కలుగజాలదు. ఏ విధముగా మనోరాజ్యమునందలి లేక స్వప్నమునందలి పదార్థములకు ఒకప్పుడును భావముండదో, అట్లే ప్రపంచ పదార్థముల కొకప్పుడును సత్తా ఉండదు. మనోరాజ్యమగు స్వప్నమునందలి పదార్థము లెట్లు సంకల్ప మాత్రములో అట్లే జాగ్రత్ప్రపంచ పదార్థము లన్నియు కల్పితములు. సంకల్పములు దూరమగుచో సంసారరూపతాపముగూడ దూరమై పోవుచున్నది. సంకల్పనాశనమే మోక్షహేతువు.

అవ॥ సంకల్పము లుపశమించినంత మాత్రమున ఆత్మామృతము లభించుటెట్లు? అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**న దూరం న చ సంకోచాల్లబ్ధమేవాత్మనః పదమ్ ।**
**నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్ ॥ 5**

ఆత్మనః=ఆత్మయొక్క, పదం=స్థానము, న దూరం=దూరము నందు లేదు, సంకోచాత్=సంకోచమువలన, లబ్ధం=పొందబడునది, న=కాదు, (తత్=అది), నిర్వికల్పం=సంకల్పరహిత మైనది. నిరాయాసం= ప్రయాసరహిత మైనది, నిర్వికారం=వికారరహిత మైనది, నిరంజనం= దుఃఖరహిత మైనది.

తా॥ సంకల్పము దూరమైనంతమాత్రమున ఆత్మరూపామృత మెట్లు లభ్య మగును?

ఉ॥ ఆత్మ ఎవనికి దూరమున లేదు. మఱియు పరిచ్ఛిన్నమును గాదు. అది సర్వత్ర వ్యాపక మైనది. ఈకారణమువలన ఆత్మ నిత్యప్రాప్త

మైనది. మనఃసంకల్పమునకు వశమైనవాడు ఆత్మను అప్రాప్త మైనదిగా తలంచుచున్నాడు, ఒకానొకనికి కంఠాభరణము తన మెడలో ఉండిన దైనను, భ్రాంతిమూలమున నా కంఠాభరణము పోయినదని వెదకుకొను రీతిగా ఈయాత్మ అందఱిలోను నిత్యప్రాప్తమై యున్నను, తనయొక్క స్వరూపాజ్ఞానమువలన సంకల్పవశముచేత అప్రాప్త మైనదివలె తోచుచున్నది. ఆత్మ వికారముల కతీత మైనది. అనగా మనోవికారములు నశించినచో తెలిసికొనుటకు అవకాశము గలదిగా నున్నది. ఈవిధముగా ఆయాత్మ వికారరహితమును, ఉపాధిశూన్యమును, సదా ఏకరసమునై యున్నది.

అవ॥ ఆత్మ నిత్యప్రాప్త మైనదైనచో ఒక శాస్త్ర విచారమువలనను ఆచార్యోపదేశమువలనను లాభమేమి? అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

**వ్యామోహమాత్రవిరతౌ స్వరూపాదానమాత్రతః ।**
**వీతశోకా విరాజన్తే నిరావరణదృష్టయః ॥ 6**

వ్యామోహమాత్రవిరతౌ=విశేషమోహము నశించిన దగుచుండగా, స్వరూపాదానమాత్రతః=తన స్వరూపగ్రహణమాత్రమువల్లనే, వీతశోకాః= శోకరహితులై, నిరావరణదృష్టయః=ఆవరణ రహిత దృష్టి గలవారై, విరాజన్తే=ప్రకాశించుచున్నారు.

ప్ర॥ ఆత్మ నిత్యప్రాప్త మైనచో మఱల దాని ప్రాప్తికై శాస్త్రవిచారణ, ఆచార్యోపదేశము - వీని ఆవశ్యకత ఏమి?

ఉ॥ ఓ జనకా! అజ్ఞానరూపమైన మోహావరణము అందఱి అంతఃకరణములలోను ఉన్నది. ఆయావరణ మున్నంతవఱకు ఎవనికిని ఆత్మ సాక్షాత్కారము కలుగదు. ఆయావరణ తొలగించుటకొఱకే శాస్త్రవిచారణ, గురూపదేశము అవసరమై యున్నది.

దీని కొక దృష్టాంత మున్నది- పదిమంది కలిసి ఒకచోటికి పోవుచూ త్రోవలో నొక నదిని దాటి ఆవలి ఒడ్డునకు చేరిరి. అప్పుడు వారు 'మన మందరము సురక్షితముగా ఒడ్డు చేరితిమా? లేక యెవడైన నదీ ప్రవాహములో కొట్టుకొని పోయెనా? లెక్కపెట్టి చూడుడు' అని పరస్పర మనుకొనిరి. అందులో నొకడు లెక్కపెట్టుటకు ప్రారంభించి తనను విడిచిపెట్టి తొమ్మిది మందిని లెక్కించెను. అప్పుడతడు "అయ్యో! పదవవాడు నదిలో కొట్టుకొనిపోయె"నని చెప్పెను. రెండవవాడు లెక్క పెట్టెను. అతడుగూడ తనను విడిచి తక్కిన తొమ్మిదిమందిని లెక్కించి పదవవాడు నదిలో పడి కొట్టుకొనిపోయెనని నిర్ణయించెను. ఇట్లే తక్కిన అందఱును తమను విడిచి లెక్కపెట్టుటచేత తొమ్మిదిమందే ఉన్నారనియు, పదవవాడు గంగలో కలిసిపోయె ననియు నేడవ నారంభించిరి.

ఇంతలో ఆనది ప్రాంతమున నొక పెద్దమనిషి పోవుచు ఈరోదనము విని యేమేమి? ఏమి జరిగినదని వారలను సమీపించెను. వారినుండి విషయమును తెలిసికొని ఆతడు లెక్కించగా పది మందియు నుండిరి. అప్పుడాతడు వీరలు కేవలము మూర్ఖు లనుకొని "మీరు ఏడవకుడు, పదిమంది ఉన్నారు. ఇప్పుడు నా యెదుట లెక్కింపు" డని యనెను. వారు మొదటివలెనే తనను మాత్రం విడిచిపెట్టి తొమ్మిదిమందిని

లెక్కింప మొదలిడిరి. అంత నాతడు నీవే పదవవాడవని తెలిపెను. అప్పుడు దానికి "ఓహెూ! మన మందరము ఉన్నాము"ని యనుకొని సంతోషించెను. అదేవిధముగ అజ్ఞానవశుడై తనలోనే నున్న ఆత్మను తీర్థములయందును, పర్వతములపైన ఇంకెక్కడో యున్నదని వెదకుచూ తిరుగుచున్నాడు. ఆ దశమ పురుషునివలె తనను తెలిసికొనలేకున్నాడు. ఎప్పుడు గురువు ఉపదేశించుచున్నాడో అప్పుడు "ఆనందరూపమైన ఆత్మను నేనే" యని తెలిసికొనుచున్నాడు. ఈకారణమువలన గురువుయొక్కయు, శాస్త్రముల యొక్కయు ఆవశ్యకత ఉండనే యున్నదని తెలియబడుచున్నది గదా!

**సమస్తం కల్పనామాత్రమాత్మా ముక్తస్సనాతనః ।**
**ఇతి విజ్ఞాయ ధీరో హి కిమభ్యస్యతి బాలవత్ ॥ 7**

సమస్తం=సమస్త ప్రపంచము, కల్పనామాత్రం=కల్పనా మాత్రమై యున్నది, ఆత్మా=ఆత్మ, ముక్తః=ముక్తమును, సనాతనః= సనాతనమునై యున్నది, ఇతి=ఇట్లని, విజ్ఞాయ=తెలిసికొని, ధీరః=జ్ఞాని, బాలవత్=పిల్లవానివలె, కిం=దేనిని, అభ్యస్యతి=అభ్యసించుచున్నాడు?

తా॥ సంపూర్ణమైన యీ జగత్తంతయు మనఃకల్పిత మాత్రమై యున్నది.

**"శుద్ధో ముక్తస్సదైవాత్మా నై బధ్యేత కర్హిచిత్ ।**
**బంధమోక్షౌ మనః సంస్థౌ తస్మిన్ఛాన్తే ప్రశామ్యతి ॥**

ఆత్మ శుద్ధము, ముక్తము, ఒకప్పుడు బంధింపబడునది గాదు. బంధమోక్షములు రెండును మనఃస్థితములు. ఆ మనస్సు శాంతిని అనగా ఉపశమనమును పొందినచో బంధము, మోక్షము అను రెండును వాటంత

టవే ఉపశమనమును పొందుచున్నవి. ఆత్మ నిత్యముక్త మైనది. సనాతన మైనదని తెలిసికొనిన జ్ఞాని పిల్లవానివలె వ్యవహరించును.

అవ॥ అంతయు కల్పనామాత్రమే యను జ్ఞానమునకు కారణమగు తత్-త్వం పదార్థములయొక్క ఐక్యజ్ఞానము నుపదేశించుచున్నాడు.

**ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ ।**
**నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్ ॥ 8**

ఆత్మా=జీవాత్మ, బ్రహ్మ=బ్రహ్మము, చ=మఱియు, భావాభావౌ= భావాభావములు. కల్పితౌ=కల్పితములు, ఇతి=ఇట్లని, నిశ్చిత్య= నిశ్చయించుకొని, నిష్కామః=నిష్కాముడగు పురుషుడు, కిం=దేనిని, విజానాతి=తెలిసికొనుచున్నాడు, కిం బ్రూతే=ఏమి చెప్పుచున్నాడు? కిం కరోతి=ఏమి చేయుచున్నాడు?

త్వం పదార్థమగు జీవాత్మ, తత్పదార్థమగు బ్రహ్మము ఈ రెంటికిని భేద మేమియు లేదని నిశ్చయించుకొని భావాభావములు - అనగా ఘటభావము, దాని నాశము అను రెండును అధిష్ఠాన చైతన్యమునందు కల్పితమాత్రములే యని యీ ప్రకారముగా సమస్త జగత్తు మిథ్య యనియు, తుచ్ఛమనియు తెలిసికొనిన జ్ఞానికి అవిద్య సమూలముగా నాశమైపోవును. అట్టివాడు ఇక దేనిని తెలిసికొనుటకు ఇచ్ఛయించును? దేనిని జేయబూనును? అతడు ఏ పనిని చేయడు. ఎందుకనగా అతని యందు కర్తృత్వాభిమానము నశించిపోయినది.

అవ॥ ఆత్మయే సర్వమునను జ్ఞానమే సర్వసంకల్పములను తొలగించునని చెప్పుచున్నాడు.

**అయం సోऽహమయం నాహమితి క్షీణా వికల్పనాః ।**
**సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీభూతస్య యోగినః ॥ 9**

సర్వం=సమస్తమును, ఆత్మా=ఆత్మయే, ఇతి=ఇట్లని, నిశ్చిత్య= నిశ్చయించుకొని, తూష్ణీభూతస్య=ఉదాసీనముగా నున్న, యోగినః= యోగికి, అయం=వీడు, సః=వాడు, అహం=నేను, (అస్మి=అగు చున్నాను,) అయం=వీడు, నాహం=నేను కాను, ఇతి=ఈ ప్రకారమగు, వికల్పనాః=వికల్పములు, క్షీణాః=క్షీణించిపోవుచున్నవి.

సర్వరూపములును ఆత్మయే యగుచున్నది. అది శరీరాదిక వ్యాపారములనుండి రహిత మైనది. అదే జీవన్ముక్తావస్థ యని చెప్పబడు చున్నదని జ్ఞాని నిశ్చయించుకొనుచున్నాడు. ఆ విషయమే ఇట్లు చెప్పబడు చున్నది.

**"వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని ।**
**ఏకీకృత్య విముచ్యేత యోగోऽయం ముఖ్య ఉచ్యతే ॥"**

క్షేత్రజ్ఞునకు అనగా జీవాత్మ పరమాత్మయందు గల ధ్యేయాకారవృత్తి నశించిన పిమ్మట రెంటికి ఐక్యము కలుగుచున్నదను నిశ్చయము గల పురుషుడు ముక్తు డగుచున్నాడు. అనగా ఎప్పుడు మనస్సు నానావిధము లగు సంకల్పములనుండి రహితమై పోవుచున్నదో, అప్పుడే జీవన్ముక్తావస్థ యని చెప్పబడుచున్నది. సంకల్పరహితుడే జీవన్ముక్తుడని భావము.

అవ॥ ఇప్పుడు సంకల్పములనుండి రహితమగు మనస్స్వరూపమును చూపుచున్నాడు.

**న విక్షేపో న చైకాగ్ర్యం నాతిబోధో న మూఢతా ।**
**న సుఖం న చ వా దుఃఖ ముపశాన్తస్య యోగినః ॥ 10**

ఉపశాన్తస్య=ఉపశాంతి నొందిన, యోగినః=యోగికి, న విక్షేపః=విక్షేపము లేదు, న ఏకాగ్ర్యం=ఏకాగ్రత లేదు, న అతిబోధః=బోధము లేదు, న మూఢతా=మూఢత్వము లేదు, న సుఖం=సుఖము లేదు, న దుఃఖం= దుఃఖము లేదు.

ఓ జనకా! ఎవనియొక్క మనస్సు సంకల్ప వికల్పములనుండి రహితమైపోయినదో, అట్టివానికిక విక్షేపము కలుగదు; మఱియు ఏకాగ్రత కొఱకు ప్రయత్నముకూడ చేయ నవసరము లేదు. ఎందుకనగా విక్షేపము కలిగియున్నచో గదా దాని నివృత్తికై ప్రయత్న మవసరము. విక్షేపమే లేనప్పుడు మఱి ప్రయత్న మెందుకు? మఱియు నతనికి పదార్థములను తెలిసికొన నిచ్ఛగాని, తెలిసికొనజాలని మూఢతగాని యుండదు. మఱియు నాతనికి విషయజన్యసుఖము గాని, దుఃఖము గాని యుండదు. కేవల మాత్మానందమునందు నిరంతరము మగ్ను డైనవానికి సుఖదుఃఖముల ప్రసక్తి ఎక్కడ?

**స్వరాజ్యే భైక్షవృత్తౌ చ లాభాలాభే జనే వనే ।**
**నిర్వికల్పస్వభావస్య న విశేషోఽస్తి యోగినః ॥ 11**

స్వరాజ్యే=స్వయముగా రాజభోగము లనుభవించుటయందు గాని, భైక్షవృత్తౌ=భిక్షావృత్తియందుగాని, లాభాలాభే=లాభాలాభముల యందుగాని, జనే=జనమధ్యమునందుగాని, వనే=వనమధ్యమునందు గాని, నిర్వికల్పస్వభావస్య=వికల్పరహితమైన స్వభావము గల, యోగినః=

యోగికి, విశేషః=విశేషము, నాస్తి=లేదు.

జీవన్ముక్తునకు స్వర్గరాజ్యము స్వయముగా సంప్రాప్త మైనను సంతోషించడు. భిక్షావృత్తియందు ఏహ్యమును జూపడు. అనగా ఇది నీచమైన దనిగాని, కష్టమైన దనిగాని యనుకొనడు. లాభాలాభములు రెండును అతనికి సమానములే. అతడు వనమునందుండు గాక! లేక గృహమునందుండు గాక! ఎచట నున్నను ఒకేవిధముగా నుండును.

**క్వ ధర్మః క్వ చ వా కామః క్వచార్థః వివేకతా ।**
**ఇదం కృత మిదం నేతి ద్వంద్వైర్ముక్తస్య యోగినః ॥ 12**

ఇదం=ఇది, కృతం=చేయబడినది, ఇదం=ఇది, న కృతం=చేయబడలేదు, ఇతి=ఈ ప్రకారమగు, ద్వంద్వైః=ద్వంద్వములచేత, ముక్తస్య=ముక్తుడైన, యోగినః=యోగికి, ధర్మః=ధర్మము, క్వ=యెక్కడ? వా=మఱియు, కామః=కామము, క్వ=ఎక్కడ?, అర్థః=అర్థము, క్వ=ఎక్కడ? వివేకతా=వివేకము (విచారము), క్వ=ఎక్కడ?

స్థిరచిత్తము గలయోగికి ధర్మార్థ కామ మోక్షములతో కొంచెమైనను పనిలేదు. మఱియు "ఈ పనిని నేను చేయుచున్నాను, దీనిని నేను చేయలేదు" అను ఈ ప్రకారమగు ద్వంద్వములనుండి విడివడినవాడే జీవన్ముక్తుడగు యోగి యని చెప్పబడుచున్నాడు.

**కృత్యం కి మపి నైవాస్తి న కాఽపి హృది రంజనా ।**
**యథా జీవనమేవేహ జీవన్ముక్తస్య యోగినః ॥ 13**

జీవన్ముక్తస్య=జీవన్ముక్తుడగు, యోగినః=యోగికి, కృత్యం=చేయదగిన

కార్యము, కిమపి=కొంచెమైనను, న ఏవ అస్తి=లేనే లేదు, హృది= హృదయమునందు, కా అపి=ఎటువంటియు, రంజనా=అను రాగము, న=లేదు, ఇహ=ఈ ప్రపంచములో, యథా=ఏ ప్రకారము, జీవనం= జీవనము అగుచున్నదో, (అంతమాత్రము భోగానుభవము చేయుచున్నాడు.)

తా॥ ప్రశ్న॥ జీవన్ముక్తుడు ఏ పనినీ చేయకపోయినచో అతనికి శరీరయాత్ర యెట్లు జరుగును?

ఉ॥ జీవన్ముక్తునకు ఏపనిగూడ తన సంకల్పముచే నగుటలేదు. అతనికి చేయదగిన కార్య మేదియు మిగిలియుండలేదు. ఎందుకనగా వానికి ఏ పదార్థముపై నైనను కోరిక లేదు. రాగమే లేనిచో కర్మ ఉండుటకు లేదు. మఱియు రాగద్వేషములకు కారణమగు అవిద్య వీనికి పూర్తిగా నష్టమైపోయినది. ఆతనికి శరీరయాత్ర ప్రారబ్ధవశమువల్లనే జరుగుచున్నది.

**క్వ మోహః క్వ చ వా విశ్వం క్వ తద్ధ్యానం క్వ ముక్తతా ।**
**సర్వసంకల్పసీమాయాం విశ్రాన్తస్య మహాత్మనః ॥ 14**

సర్వసంకల్పసీమాయాం=సర్వసంకల్పములు రహితమగు స్థానము నందు, విశ్రాన్తస్య=విశ్రాంతు డగు, యోగినః=యోగి యగు, మహాత్మనః= మహాత్మునకు, మోహః=మోహము, క్వ=ఎక్కడ, విశ్వం= ప్రపంచము, క్వ=ఎక్కడ, తత్=ఆ ప్రసిద్ధమైన, ధ్యానం=ధ్యానము, క్వ=ఎక్కడ?, ముక్తతా=మోక్షము నొందుట, క్వ=ఎక్కడ?

తా॥ సర్వసంకల్పములు నశించిపోయినందున జీవన్ముక్తునకు ఏవస్తువునందును మోహముగూడ ఉండదు. అందువలన జీవన్ముక్తుని దృష్టిలో జగత్ప్రతీతి గూడ కలుగదు. మఱియు నతడు ధ్యానమునందుగాని,

ముక్తియందుగాని ఇచ్ఛ నిడడు. ఎందుకనగా వానికి మనోరథమునం దొక్కటియు మిగిలియుండలేదు.

**యేన విశ్వ మిదం దృష్టం స నాస్తీతి కరోతు వై ।**
**నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి ॥ 15**

యేన=ఎవనిచేత, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, దృష్టం= చూడబడినదో, సః=ఆ ప్రపంచము, నాస్తీతి=లేదు అని, (నిశ్చితః= నిశ్చయించి,) కరోతు=చేయబడుగాక! నిర్వాసనః=వాసనా రహితుడగు యోగి, కిం కురుతే=ఏమి చేయుచున్నాడు, సః=అతడు, పశ్యన్నపి= చూచుచున్న వాడైనను, న పశ్యతి=చూచుట లేదు.

తా॥ వాసనావాసితు డైనవాడు, సంకల్పములు నశించని పురుషుడు జగత్తు ఉన్నదనిగాని, లేదనిగాని చెప్పజాలడు. ఎందుకనగా సంకల్పాణు వులు వానియందింకను నశించలేదు. వాసనా రహితుడగు వాడు జగత్తును చూచుచున్నను చూడనివానివలె నుంటున్నాడు. కారణ మేమనగా సుషుప్తి యందున్న పురుషునివలె ఆతనికి సంకల్ప వికల్పములు నశించిపోయినవి. సంకల్ప వికల్పములు లేనివానికి ఈ జగత్తే లేదు గదా! ఇక మిగిలినది ఆ పరబ్రహ్మ స్వరూప మొక్కటే.

**యేన దృష్టం పరంబ్రహ్మ సోఽహం బ్రహ్మేతి చిన్తయేత్ ।**
**కిం చిన్తయతి నిశ్చిన్తో ద్వితీయం యో న పశ్యతి ॥ 16**

యేన=ఎవనిచేత, పరంబ్రహ్మ=పరబ్రహ్మము, దృష్టం= చూడబడినదో, సః=వాడు, అహం=నేను, బ్రహ్మ=ఆపరబ్రహ్మమును, ఇతి= ఇట్లని

(ఈప్రకారము), చిన్తయేత్=చింతించవలయును, యః=ఎవడు, నిశ్చిన్తః= చింతారహితుడై, ద్వితీయం=రెండవవస్తువును, న పశ్యతి=చూడడో, సః=వాడు, కిం=దేనిని, చిన్తయతి=చింతించుచున్నాడు?

ఎవడు బ్రహ్మమును అన్నిటికంటె వేరుగా చూచుచున్నాడో, అతనికి నేనే పరబ్రహ్మము ననెడి దృఢజ్ఞానము గలుగుచున్నది. అతనికి జగత్తంతయు బ్రహ్మమయముగానే తోచును. అట్టివాడు సమస్తచింతల నుండి రహితుడై దేనిని గూడ చింతించడు. అసలు "నేను పరబ్రహ్మమును' ' అనెడి చింతన గూడ మరి చేయడు.

అవ॥ జ్ఞానికి చిత్తనిరోధము సైతము లేదని చెప్పుచున్నాడు.

**దృష్టో యేనాత్మవిక్షేపో నిరోధం కురుతే త్వసౌ ।**
**ఉదారస్తు స విక్షిప్తః సాధ్యాభావాత్కరోతి కిమ్ ॥ 17**

యేన=ఎవనిచేత, ఆత్మవిక్షేపః=ఆత్మవిక్షేపము, దృష్టః= చూడబడు చున్నదో, అసౌ=ఇతడు, నిరోధం=విక్షేపనిరోధమును, కురుతే=చేయు చున్నాడు. తు=అయితే, ఉదారః=త్యాగపురుషుడగు జ్ఞాని, విక్షిప్త రహితః=విక్షేపరహితుడు (అత ఏవ=ఇందువలననే) సాధ్యాభావాత్= సాధింపదగినది లేనికారణమున, సః=అతడు, కిం= దేనిని, కరోతి= చేయుచున్నాడు.

ఎవడు తనలో నున్న విక్షేపములను తెలిసికొనుచున్నాడో, అతడు ఆ విక్షేపములు దూరమగుటకు చిత్త నిరోధమును చేయవలెనని చింతించుచున్నాడు. అసలు విక్షేపములే లేనివాడు మఱి చిత్తనిరోధము చేయవలెనని యెందుకు చింతించును? ఇక వానికి చింతనావసరమే లేదు.

**ధీరో లోక విపర్యస్తో వర్తమానోఽపి లోకవత్ ।**
**న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి ॥ 18**

ధీరః=జ్ఞాని, లోకవిపర్యస్తః=లోకమునకంటె వేరైనవాడై (విక్షేప రహితుడై), లోకవత్=లోకులవలె, వర్తమానఃఅపి=ఉంటున్నవాడైనను, స్వస్య= తనయొక్క, సమాధిం=సమాధిని గాని, విక్షేపం=విక్షేపమును గాని, లేపం చ=బంధనమును గాని, న పశ్యతి=చూడడు.

జ్ఞాని యగువాడు జనుల మధ్య విక్షేపరహితుడై యుండియు, ప్రారబ్ధవశమువలన బాధితానువృత్తి గలవాడై, అన్ని కర్మలు చేయుచు తాను నిర్లిప్తుడై, బంధనారహితుడై యుంటున్నాడు. అతనికి విక్షేపము లేదు. సమాధి లేదు. (లేపమనగా కర్తృత్వాద్యభిమానము.)

అవ॥ కర్తృత్వాద్యభిమానములు లేని యోగిని ఇంద్రియ వ్యాపారము లంటవని తెలుపుచున్నాడు.

**భావాభావవిహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః ।**
**నైవ కించిత్కృతం తేన లోకదృష్ట్యా వికుర్వతా ॥ 19**

తృప్తః=తృప్తుడైన, యః=యే, బుధః=జ్ఞాని, భావాభావ విహీనః= భావాభావరహితుడై, నిర్వాసనః=వాసనారహితుడై, లోకదృష్ట్యా= లోకదృష్టిలో, వికుర్వతా అపి=చేయుచున్న వాడైనను, తేన=అతనిచేత, కించిదపి=కొంచెముగూడ, న కృతం=చేయబడుటలేదు.

ఎవడు ఆత్మానందమువలన తృప్తుడై నిందాస్తుతులనుండి రహితు డగుచున్నాడో, అట్టి జ్ఞాని లోకదృష్టితో చేసినవాడైనను అకర్తయే

అగుచున్నాడు. కర్తృత్వాధ్యాసమే లేనివాడు కనుక లోకదృష్టికి అందటివలె వ్యవహరించుచున్నను వ్యవహరింపనివాడే యగును.

**ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః ।**
**యథా యత్కర్తుమాయాతి తత్కృత్వా తిష్ఠతస్సుఖమ్ ॥ 20**

యదా=ఎప్పుడు, యత్=యత్కించిత్కర్మ, కర్తుం= చేయుటకు, ఆయాతి=వచ్చుచున్నదో, తత్=దానిని, సుఖం=సుఖ పూర్వకముగా, కృత్వా=చేసి, తిష్ఠతః=సమాధిస్థితుడైన, ధీరస్య=జ్ఞానికి, ప్రవృత్తౌ వా=ప్రవృత్తియందు గాని, నివృత్తౌ వా=నివృత్తియందు గాని, దుర్గ్రహః=దురాగ్రహము, న ఏవ=(ఒకప్పుడును) ఉండనే యుండదు.

ధీరునకు అనగా ఆత్మజ్ఞానికి ప్రవృత్తియందు గాని, నివృత్తి యందు గాని (అనగా ప్రారబ్ధవశమువలన) గలుగు కృత్యములను చేయు చున్నపుడు గాని, చేయకున్నపుడు గాని దురాగ్రహము లేదు, అనగా నిది తప్పక చేయవలెనని గాని, చేయవల దని గాని దురాగ్రహము (పట్టుదల) ఉండదు. ప్రారబ్ధవశమువలన ప్రవృత్తియందు గాని, నివృత్తియందు గాని మగ్నుడు కావలసివచ్చినచో సుఖపూర్వకముగానే దానిని చేయును. మఱియు దానియందు ఆసక్తుడు కాడు. నిస్సంగుడై సర్వమును చేయును. కర్తృత్వాద్యభిమానములు లేనివారికి మఱి బంధ మెక్కడ?

అవ॥ జ్ఞాని నిర్వాసనాస్థితి గలవాడైనచో మరి యెవరి ప్రేరణవలన కర్మలను చేయుచున్నాడు? అను శంకకు సమాధానము.

**నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్తబన్ధనః ।**
**క్షిప్తః సంసారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్ ॥ 21**

నిర్వాసనః=వాసనారహితుడును, నిరాలంబః=ఆలంబరహితుడును, స్వచ్ఛందః=స్వతంత్రుడును (స్వేచ్ఛాచారియు), ముక్తబన్ధనః=బంధన రహితుడును, (అగుజ్ఞాని), సంసార వాతేన=ప్రారబ్ధరూపవాయువుచేత, క్షిప్తః=ప్రేరేపింపబడినవాడై, శుష్కపర్ణవత్=ఎండుటాకులవలె, చేష్టతే= చేయుచున్నాడు.

తా॥ ఏ హేతువువలన జ్ఞాని వాసనారహితు డయ్యెనో, అదే కారణమువల్ల నిరాలంబకుడును అగుచున్నాడు. అట్టి వాసనారహితుడును, నిరాలంబకుడును, కర్తవ్యానుసంధాన రహితుడును, బంధముక్తుడును, రాగద్వేషరహితుడు నగు జ్ఞాని పూర్వసంస్కారమను వాయువశముచే అవశ్యముగ ప్రేరితుడై యెండుటాకు గాలికి చలించువిధమున వ్యవహరించుచున్నాడు. ("ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః"=ప్రారబ్ధకర్మ అనుభవింపక జ్ఞానమాత్రమునపోదు. కనుక కర్తవ్యానుసంధానము లేకయే జ్ఞాని వ్యవహరించునని భావము)

అవ॥ సంకల్పాదిశూన్యు డగువాడు నిత్యతుష్టు డని చెప్పుచున్నాడు.

**అసంసారస్య తు క్వాపి న హర్షో న విషాదతా ।**
**న శీతలమనా నిత్యం విదేహ ఇవ రాజతే ॥ 22**

అసంసారస్య తు=సంసారరహితు డగు జ్ఞానికైతే, క్వ అపి= ఎక్కడను(ఎప్పుడును), హర్షః=హర్షము, న=లేదు, చ=మఱియు, విషాదతా= శోకము, న=లేదు, సః=అతడు శీతలమనాః=శాంతమైన మనస్సు గలవాడై, నిత్యం=యెల్లప్పుడు, విదేహ ఇవ=ముక్తునివలె, రాజతే=ప్రకాశించుచున్నాడు.

సంసార మనగా నేమి? సంసారహేతువగు అజ్ఞానము ఎచ్చట ఉన్నదో అదే సంసారము. అజ్ఞానము ఎచ్చట లేదో అదే అసంసారము. అజ్ఞాన రహితు డగువానియందు హర్ష విషాదములుగూడ ఉత్పన్నములు కావు. అందువలన నతడు శాంతచిత్తు డగును మఱియు నతడు విదేహ ముక్తుని వలె ఉంటున్నాడు.

**కుత్రాపి న జిహాసాఽస్తి ఆశా వాఽపి న కుత్రచిత్ ।**
**ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః ॥ 23**

ఆత్మారామస్య=ఆత్మయందు రమించుచున్నటువంటియు, శీతలాచ్ఛ తరాత్మనః=చల్లనైన మిక్కిలి నిర్మలమైన మనస్సు గల ధీరస్య ధీరుడగు జ్ఞానికి, కుత్రాపి=యెచ్చట నైనను, జిహాసా=త్యాగేచ్ఛ, నాస్తి=లేదు, కుత్రచిత్=ఎచ్చట నైనను, ఆశా చ=గ్రహణేచ్ఛయు, నాస్తి=లేదు.

సంతతాత్మారాముడై నిశ్చలచిత్తు డగు జ్ఞాని ధీరు డనబడును. నిర్మలమనస్కు డగుటచే శీతలాచ్ఛతరాత్ముడు అనగా శాంతాత్ము డనబడును. అట్టి జ్ఞానికి రాగద్వేషములు లేవు. కనుక ఏవస్తువునందైనను త్యాగబుద్ధి గాని గ్రహణబుద్ధి గాని ఉండదు. అందువలన నతడెట్టి యనర్థము నైనను చేయనొల్లడు ఎందుకనగా అతనియం దనర్థ హేతు వేదియు మిగిలి యుండలేదు.

**ప్రకృత్యా శూన్యచిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా ।**
**ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా ॥ 24**

ప్రకృత్యా=స్వభావముచేతనే, శూన్యచిత్తస్య=సంకల్ప వికల్పములు

నశించిన మనస్సు గలిగినటువంటిన్నీ, యదృచ్ఛయా= ప్రారబ్ధవశము వలన స్వేచ్ఛగా, ప్రాకృతస్య ఇవ=అజ్ఞానికివలె, కుర్వతః=చేయుచున్నటు వంటిన్నీ, ధీరస్య=చిత్తవిక్షేపము లేనటువంటి, అస్య=ఈ జ్ఞానికి, మానః= మానము (గౌరవము) న=లేదు, అవమానతా=అవమానము, న=లేదు.

స్వభావముగానే ఎవని చిత్తము సంకల్ప వికల్ప రహిత మైనదో, తన యాత్మయందే ఆత్మశాంతి ననుభవించుచున్నదో, అట్టి జ్ఞాని అజ్ఞానివలె సమస్తకర్మలు చేయుచున్నవాడైనను హర్ష శోకములను పొందడు. మఱియు మానావమానములుగూడ పరిగణించడు.

అవ॥ ఇప్పుడు జ్ఞానియొక్క అనుభవమును చూపుచున్నాడు.

**కృతం దేహేన కర్మేదం న మయా శుద్ధరూపిణా ।**
**ఇతి చిన్తానురోధీ యః కుర్వన్నపి కరోతి న ॥ 25**

ఇదం=ఈ, కర్మ=కర్మ, దేహేన=దేహముచేత, కృతం= చేయబడినది, శుద్ధరూపిణా=పరిశుద్ధరూపుడ నగు, మయా=నాచేత, న కృతం= చేయబడలేదు. ఇతి=ఈ ప్రకారమగు, యః=ఎవడు, చింతానురోధీ= చింతించుచున్నాడో, సః=అట్టివాడు, కుర్వన్ అపి=చేయుచున్న వాడైనను, న కరోతి=చేయనివాడే.

ఓ జనకా! ఈకర్మ దేహముచే చేయబడినది. పరిశుద్ధాత్మ స్వరూపుడ నగు నాచేత చేయబడలేదు. ఈకారణముచేత నతడు కర్మలను చేయుచున్న వాడైనను, కర్మలను చేయనివాడే.

ప్రశ్న ॥ వ్యభిచారాది కర్మములను చేయువారుగూడ అంతా దేహము

చేతనే చేయబడుచున్నదని చెప్పుచున్నారు. అప్పుడు వారికిగూడ ముక్తి కలుగవలయును గదా?

పామరుడు కర్మఫలమునందు అధ్యాసము చేయుచున్నాడు. ఎందుకనగా శుభకర్మ చేయునపుడు వాని హృదయములో సంతోషము కలుగుచున్నది. అశుభకర్మ చేయునప్పుడు వానిమనస్సులో భయము, లజ్జ ఉత్పన్నము లగుచున్నవి. మఱియు వ్యభిచారాది కర్మలను మరుగు పఱచుటకు ప్రయత్నించును. ఇందువలన వాని నిశ్చయ మింకను పక్వము కాలేదు. కావున అట్టివా డెన్నటికిని ముక్తిని బొంద సమర్థుడు కాజాలడు. అయితే జ్ఞానియొక్క వ్యవహారము దానికంటె భిన్నముగా నుండును. శుభకర్మ చేయుటవలన జ్ఞాని హృదయములో సంతోషము గాని, అశుభకర్మ చేయుటవలన భయము గాని, సిగ్గు గాని అతనియం దుదయింపవు. మఱియు వ్యభిచారము చేయుటకు అతడు ప్రయత్నింపడు.

ఎవరు స్త్రీ మొదలగువాటిద్వారా ఆనందము కలుగునని తలంచునో అట్టివాడే ఆ వ్యభిచారాది కర్మలు చేయుటకు ప్రయత్నించుచున్నాడు. ఎవనికి చక్కెర తినుటకు దొరకలేదో అట్టివాడు దాని చవి నెట్లు తెలిసికొన గలుగును? వాడెప్పుడును బెల్లమును గాని లేక చెరకు రసమును గాని పానము చేయుటకు ప్రయత్నించును. ఎవనికి చక్కెర ఎల్లప్పుడు లభ్యమగుచున్నదో, అట్టివాడొకప్పుడును బెల్లమునుగాని, చెరకు రసమునుగాని పానము చేయనొల్లడు. పేడపురుగు ఒకప్పుడును చక్కెరయొక్క రసమును దాని పనిని తెలిసికొనజాలదు.

పామరుడు మలరూపమగు విషయానందమును ఆస్వాదించు

వాడుగా నున్నాడు. జ్ఞానవంతుడు ఆత్మానందరూప శర్కర నాస్వాదించు వాడుగా నున్నాడు. ఈకారణమువలన అజ్ఞాని జ్ఞానియొక్క ఆనందమును తెలిసికొనజాలడు. అనగా జ్ఞానిని గుర్తింపజాలడు.

**అతద్వాదీ వ కురుతే న భవే దపి బాలిశః ।**
**జీవన్ముక్త స్సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే ॥ 26**

అతద్వాదీ ఇవ=విరుద్ధవాక్యమును చెప్పువానివలె, జీవన్ముక్తః= జీవన్ముక్తుడు, కురుతే=కార్యమును చేయుచున్నాడు, బాలిశః= మూర్ఖుడు, న భవేత్=కాడు, అత ఏవ=ఇందువల్లనే, సంసరన్ అపి=సంసారము నందున్నవా డైనప్పటికీ, సః=అతడు, సుఖీ=సుఖము గలవాడును, శ్రీమాన్ =శ్రీమంతుడునునై, శోభతే=ప్రకాశించుచున్నాడు.

'ఈ కార్యమును నేను చేయుదును' అని గాని లేక చేయను అని గాని చెప్పకనే చేయుదునని చేయనివానివలెను, చేయనని చేయువానివలెను ప్రపంచమున జీవన్ముక్తుడగు వాడు కార్యములను చేయుచున్నాడు. అనగా మతి లేనివానివలె లోకమునకు కనబడుచున్నాడు. కాని మూర్ఖుడు గాని, పిచ్చవాడు గాని కాడు. సంసారమునం దాయాపనులు చేయుచునే అతడు అత్యంత ప్రశాంత చిత్తము గలవాడై వెలుగొందుచున్నాడు.

**నానావిచారసుశ్రాన్తో ధీరో విశ్రాన్తిమాగతః ।**
**న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి ॥ 27**

నానావిచారసుశ్రాన్తః=ద్వైతవిచార నివృత్తి గలవాడై, ధీరః=జ్ఞానియై, విశ్రాన్తిం=ఆత్మశాంతిని, ఆగతః=పొందుచున్నాడు, అతఏవ=

ఇందువల్లనే, (సః=అతడు), న కల్పతే=కల్పన చేయడు, న జానాతి = తెలిసికొనడు, న శృణోతి=వినడు, న పశ్యతి=చూడడు.

తా॥ ఓ శిష్యా! నానా ప్రకారములగు (ద్వైతాది) విచారములనుండి రహితుడగు జ్ఞాని అంతరాత్మయందే శాంతిని పొందుచున్నాడు. అతడు సంకల్పాదిరూప మనోవ్యాపారమును చేయడు. మఱియు బుద్ధి సంబంధ మగు వ్యాపారమునుండి గూడ దూరు డగుచున్నాడు. ఎందుకనగా అతనికి కర్తృత్వాద్యభిమానము లేదు. అందువలన ద్వైతభావ మతనియందు లేదు.

**అసమాధేరవిక్షేపాన్న ముముక్షుర్న చేతరః ।**
**నిశ్చిత్య కల్పితం పశ్యన్ బ్రహ్మైవాస్తే మహాశయః ॥ 28**

మహాశయః=మహాత్ముడగు జ్ఞాని, అసమాధేః=సమాధి రహితు డగుటవలన, ముముక్షుః=మోక్షేచ్ఛ గలవాడు, (న భవతి=కాడు), అవిక్షేపాత్=ద్వైతభ్రమ లేనందువలన, ఇతరః=బద్ధుడు, న=కాడు, ఇతి=ఈ ప్రకారముగా, నిశ్చిత్య=నిశ్చయించి, ఇదం=ఈ సమస్త ప్రపంచమును, కల్పితం=కల్పితమునుగా, పశ్యన్=చూచుచున్నవాడై, బ్రహ్మైవ=బ్రహ్మముగానే, ఆస్తే=ఉంటున్నాడు.

జ్ఞాని ముముక్షువు కాడు. ఎందుకనగా జ్ఞానికి సమాధియందుండ వలయు ననెడి నియమ మేమియు లేదు. విక్షేపనివృత్తికొఱకు ముముక్షువు సమాధి నవలంబించుచున్నాడు. జ్ఞానికి విక్షేపమే లేదు, అందువలన సమాధి నాచరించవలయు ననెడి నిర్బంధ మేమియు లేదు. ద్వైతభావమే లేనందున జ్ఞానికి బంధముగూడ లేదు. ద్వైతభ్రాంతి గలవానికే బంధము. సంపూర్ణ జగత్తంతయు జ్ఞానికి మొదటినుండియు కల్పితమని తోచుచున్నందున

అతడు తద్విలక్షణమగు పరబ్రహ్మస్వరూపుడే యగుచున్నాడు. తరువాత బాధితానువృత్తిచేత ఇది మిథ్య యని జ్ఞప్తియుందుంచుకొనియే ప్రపంచమునందు వ్యవహరించుచున్నాడు. కావున అతనిని ప్రపంచ విషయ వాసన లేవియు అంటవు.

**యస్యాన్తః స్యాదహంకారో న కరోతి కరోతి సః ।**
**నిరాహంకారధీరేణ న కించిదకృతం కృతమ్ ॥ 29**

యస్య=ఎవనియొక్క, అంతః=అంతఃకరణమునందు, అహంకారః= అహంకారము (కర్తృత్వాద్యభిమానము), స్యాద్యది=అయ్యేనేని (కలిగెనేని), సః=వాడు (లోకదృష్ట్యా=లోకదృష్టి ద్వారా), న కరోతి అపి=చేయనివా డైనప్పటికిని, కరోతి=(సంకల్పాదిద్వారా) చేయు చున్నాడు), నిరహంకారధీరేణ=అహంకార రహితుడైన జ్ఞానిచేత (లోకదృష్ట్యా=లోకదృష్టి ద్వారా), న కించిత్=అధికముగా, కృతమపి= చేయబడిన దైనప్పటికిని (స్వదృష్ట్యా=స్వకీయదృష్టిచేత), (తత్=అది), న కృతం=చేయబడనిదే.

ప్రపంచమును చూచుచు పరబ్రహ్మస్వరూపు డెట్లు కాగలుగును?

ఉ॥ ఎవనికి అంతఃకరణమునందు అహంకారాధ్యాసము కలిగినదో అతడు పైకి చేయనివానివలె కనబడినను, సంకల్పాదిద్వారా చేయు చున్నవాడే. ఒకానొకడు జడలు ధరించి ఒడలినిండ విభూతి పూసికొని ధుని పెట్టుకొని మాట్లాడకుండా కూర్చున్నాడనుకొందము. అప్పుడు లోకులు- "ఆహా! ఈబాబాజీని చూడుడు, ప్రపంచవ్యవహార మించుకయు లేక ఎంత నిర్మలముగా నున్నాడో!" యని తలంతురు. కాని అతని మనస్సు

మాత్రము 'ఎవడైన ధనవంతుడు వచ్చి నాకు భంగి, గంజాయిలకు డబ్బు ఇచ్చిపోవునా లేదా? నాకు కావలసిన భోజన పదార్థములు ఎవరు సమకూర్తురు?' మొదలగు ఆలోచనలతోనే యెల్లప్పుడును పని చేయును.

జ్ఞాని యీవిధముగా నెప్పుడును ఉండడు. అసలు ఆతనికి సంకల్ప వికల్పములే లేవు. అట్టివానికి కర్తృత్వాద్యభిమానము లెక్కడ? అట్టివాడు ప్రారబ్ధవశమున నేమైనను చేసినను చేయనివాడే. ఇందులకు గీతా ప్రమాణమును చూడుడు:

**"యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాఽపి స ఇమాన్లోకాన్న హన్తి న నిబధ్యతే ॥"**

**"కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥"**

అహంత్వ - కర్తృత్వాద్యభిమానము లేక లోకసంగ్రహార్థము ఏమి చేసినను వాడేమియు చేయనివాడే యనియు, కర్మేంద్రియములను బిగబట్టి మనస్సుతో సంకల్పించువాడు అన్నియు చేసినవాడే యనియును పై శ్లోకముల తాత్పర్యము.

**నోద్విగ్నం న చ సంతుష్టమకర్తృస్పందవర్జితమ్ ।**
**నిరాశం గతసందేహం చిత్తం ముక్తస్య రాజతే ॥** 30

ముక్తస్య=జీవన్ముక్తు డగు జ్ఞానియొక్క, చిత్తం=మనస్సు, అకర్తృ= కర్తృత్వరహిత మైనదిగను, స్పందవర్జితం=చలన రహిత మైనదిగను, నిరాశం=ఆశారహిత మైనదిగను, గతసందేహం=గతించిన సందేహ

ములు గలదిగను, నోద్విగ్నం= కలత లేనిదిగను, న సంతుష్టం= సంతోషముతో నుబ్బి పోవనిదియునై, రాజతే=ప్రకాశించుచున్నది.

జీవన్ముక్తుడగు మహాత్మునియొక్క మనస్సు కర్తృత్వాదులు లేనిదై, చలనరహితమై, ఆశావర్జితమై, సందేహరహిత మైనదై, ఉద్వేగము లేనిదై, ఉప్పొంగనిదై, అత్యంత నిర్మల మైనదై ప్రకాశించుచున్నది. కావుననే అచట ఎట్టి సంకల్ప వికల్పములు గలుగుటకు తావుండదు.

**నిర్ధ్యాతుం చేష్టితుం వాఽపి యచ్చిత్తం న ప్రవర్తతే ।**
**నిర్నిమిత్త మిదం కిం తు నిర్ధ్యాయతి విచేష్టతే ॥ 31**

యత్=జ్ఞానియొక్కయే, చిత్తం=మనస్సు, నిర్ధ్యాతుం=ధ్యాన రహితముగా (నిష్క్రియాభావముతో నుండుటకుగాని), వా అపి=లేనిచో, చేష్టితుం= ఏదైన చేయుట గాని, న ప్రవర్తతే=ప్రవర్తింపదు. కింతు=ఒకా నొకప్పుడు, ఇదం=ఈ చిత్తము, నిర్నిమిత్తం=నిమిత్తము లేకుండగనే, నిర్ధ్యాయతి=క్రియారహితమై యుంటున్నది, చ=మఱియు, విచేష్టతే= నానా ప్రకారములగు క్రియలను చేయుచున్నది.

జ్ఞాని నిష్క్రియుడై యూరకుండినను, బాహ్య వ్యాపారములను చేయుచున్నను, వాని చిత్త మెల్లప్పుడును సంకల్పశూన్యముగ నుండును. మఱియు నట్టి జ్ఞాని ఎట్టి సంకల్పములు లేకయే ఒకప్పుడు నిశ్చలరూపుడై యుండును, ఒకప్పు డేవేని చేష్టలు చేయుచుండును. అట్లయినను ఆతని కేమియు ప్రతిబంధము లేదు. ఆతని కేదియు నంటదు.

అవ॥ ఇట్లు జ్ఞానికిని, అజ్ఞానికిని గల విశేషములను చెప్పి - జ్ఞాని విషయమై యింకను వివరముగా చెప్పుచున్నాడు.

**తత్త్వం యథార్థమాకర్ణ్య మందః ప్రాప్నోతిమూఢతామ్ ।**
**అథవాఽఽయాతి సంకోచ మమూఢః కోఽపి మూఢవత్ ॥ 32**

మందః=అజ్ఞాని, యథార్థం తత్త్వం=యథార్థతత్త్వమును, అకర్ణ్య అపి=వినియును, మూఢతాం=మూఢత్వమును, (సంవయ=విపర్యయము లను), ప్రాప్నోతి=పొందుచున్నాడు, అథవా=లేదా, సంకోచం= సంకోచబుద్ధిని (సమాధిని), ఆయాతి=పొందుచున్నాడు. తథా=ఆ ప్రకారము, అమూఢః=జ్ఞాని. కోఽపి=ఒకానొకడు, మూఢవత్= అజ్ఞానివలె మూఢతాం=మూఢత్వమును, (బాహ్యదృష్ట్యా= బాహ్య దృష్టితో), ప్రాప్నోతి=పొందుచున్నాడు.

అజ్ఞాని - త్వంపదార్థైక్యమును సద్గురువువలన శ్రవణము చేసియు, సంశయ విపర్యయ భావములు గలిగియున్నందున (చెప్పిన దానిని సరిగా తెలిసికొనకయు వ్యతిరేకార్థము చేసికొనియు) అవివేకము నొందును. లేదా సాక్షాత్కారముకొఱకు చిత్తనిరోధము చేయును, అయితే అనేకమంది జనులలో నొకానొకడు మాత్రమే అంతరమున పరిపూర్ణానుభవశాలియై బాహ్యమునకు మూఢునివలె అనగా సంశయ విపరీతభావనలు కలవానివలె వర్తించును. సంశయము అనగా గురువు చెప్పినది ఔనో, కాదో అని యనుకొనుట. విపరీతము అనగా ఆత్మ కాని దానిని ఆత్మ యనుకొనుట, గురువు చెప్పిన దానిని విపరీతముగా అర్థము చేసికొనుట.

అవ॥ "అథవాఽఽయాతి సంకోచమ్" అని పైని చెప్పియున్నాడు గనుక ఏకాగ్రతకొఱకు చిత్తనిరోధముగూడ దూష్యమని చెప్పుచున్నాడు.

**ఏకాగ్రతా నిరోధో వా మూఢై రభ్యస్యతే భృశమ్ ।**
**ధీరాః కృత్యం న పశ్యన్తి సుప్తవత్స్వపదే స్థితాః ॥ 33**

ఏకాగ్రతా=చిత్తైకాగ్ర్యము, వా=లేక, నిరోధః=చిత్తనిరోధము, మూఢైః= అజ్ఞానులచేత, భృశం=మిక్కిలి, అభ్యస్యతే=అభ్యసింపబడు చున్నది, ధీరాః=ధీరులగు జ్ఞానులు, కృత్యం=పూర్వకృత్యమును (ఏకాగ్రతా సమాధులను), న పశ్యన్తి=చూడరు. (వాటిపై దృష్టి నిడరు), పరం తు=మరేమనగా, స్వప్నవత్=నిద్రపోవువానివలెనే, స్వపదే=తన స్వరూపమునందే, స్థితాః=ఉంటున్నారు.

ఇతర ధ్యానము లేవియు లేకుండ లక్ష్యము నొక్కదానినే ధ్యానించుట ఏకాగ్రత యనబడును. అట్టి ఏకాగ్రత గాని, చిత్తనిరోధము గాని, ఆత్మసాక్షాత్కారము గలుగని అజ్ఞానులచేత అభ్యసింపబడును. దేహాత్మధీ రహితులగు జ్ఞానులు స్వస్వరూపానుసంధానారూఢులై, ఇట్టి చిత్త నిరోధాది సాధనలకొఱకు యత్నింపరు. అద్వైతానందాత్మ సాక్షాత్కారము గలిగిన జ్ఞానికి అట్టి సంశయవిపరీతభావనలు గలుగక స్వస్వరూప ప్రకాశము మాత్రమే స్ఫురించును.

**అప్రయత్నా త్ప్రయత్నాద్వా మూఢో నాప్నోతి నిర్వృతిమ్ ।**
**తత్త్వనిశ్చయమాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః ॥ 34**

మూఢః=అజ్ఞాని,అప్రయత్నాత్=చిత్తనిరోధాదులను చేయకుండుట వల్లగాని, ప్రయత్నాత్=చేయుటవల్లగాని, నిర్వృతిం=పరమ సుఖమును, నాప్నోతి=పొందకున్నాడు. ప్రాజ్ఞః=జ్ఞాని, తత్త్వనిశ్చయమాత్రేణ= కేవలము తత్త్వనిశ్చయము చేయుటచేతనే, నిర్వృతః=పరమసుఖమును

పొందువాడుగా, భవతి=అగుచున్నాడు.

జీవబ్రహ్మైక్యతా జ్ఞానము లేనివాడే మూర్ఖుడు. అట్టివాడు చిత్తనిరోధ రూపమగు సమాధిని చేయనీ లేక కర్మానుష్ఠానము చేయనీ లేక మరేమి చేసినను వాడెన్నటికిని ఆ పరమసుఖమును పొందజాలడు. ఆనంద హేతువైన ఆత్మానుభవము వానికి లేకున్నది. జ్ఞాని యగువాడు సమాధి నవలంబించడు. కర్మములను చేయడు. అతనికి చేయదగినదేదీ లేనందువలన నిత్య సుఖము ననుభవించుచున్నాడు. ఈ యర్థమునే గీత సమర్థించుచున్నది.

"యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే ॥"

ఆత్మయందే సంతుష్టుడై, బాహ్యపదార్థములయం దనురక్తి లేని వానికి చేయదగిన దేదియు మిగిలి యుండదు.

అవ॥ యోగాభ్యాసమువలన మూఢునకు ఆత్మానుభవము కలుగదా! యను శంకకు సమాధానము.

**శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం**
**నిష్ప్రపంచం నిరామయమ్ ।**
**ఆత్మానం తం న జానన్తి**
**తత్రాభ్యాసపరా జనాః ॥** 35

తత్ర=ఆ హఠయోగాదులయందు, అభ్యాసపరాః=అభ్యాస పరులగు, జనాః=జనులు, శుద్ధం=శుద్ధ మైనట్టియు, బుద్ధం=జ్ఞాన స్వరూప

మైనట్టియు, ప్రియం=ప్రియ మైనట్టియు, పూర్ణ మైనట్టియు, నిష్ప్రపంచం=ప్రపంచరహిత మైనట్టియు, నిరామయం=దుఃఖరహిత మైనట్టి, తం=ఆ, ఆత్మానం=ఆత్మను, న జానన్తి=తెలిసి కొనజాలరు.

ప్రపంచమునందు హఠాది యోగాభ్యాసమువలనను, ఖేచరీ భూచరీ శాంభవీత్యాది ముద్రాలక్ష్యములవలనను చిత్తనిరోధ మొనరించి తద్వారా ఆత్మానుభవ మొంద యత్నించు మూఢు లెన్నటికిని మాయా మలాతీత మును, స్వప్రకాశ విలసితమును, ఆనందమయమును, సర్వపరిపూర్ణమును, ప్రపంచాతీతమును, సకలసంసారరహితమును, నిరామయము నగు తత్త్వమును బొందజాలరు.

వి॥ చిత్తశుద్ధి లేనివారలకు బ్రహ్మనిష్ఠ కలుగదు గనుక అట్టివారలకు మూఢదశయందు చిత్తశుద్ధి కలుగువఱకు హఠాది యోగాభ్యాసము, ధ్యాన ధారణ సమాధులును అవసరమే యగును. కాని పూర్వజన్మ సంస్కార వశమున చిత్తశుద్ధి గలవారలకు విశేష ప్రయత్నము చేయ నక్కరలేకయే గురూపదేశ మాత్రమున సులభముగ తత్త్వజ్ఞానము కలుగును.

**నాప్నోతి కర్మణా మోక్షం విమూఢోఽభ్యాసరూపిణా ।**
**ధన్యో విజ్ఞానమాత్రేణ ముక్తస్తిష్ఠత్యవిక్రియః ॥ 36**

విమూఢః=అజ్ఞాని, అభ్యాసరూపిణా=అభ్యాసరూపమైన, కర్మణా కర్మచేత, మోక్షం=మోక్షమును, నాప్నోతి=పొందజాలడు, అవిక్రియః= క్రియారహితుడైన, ధన్యః=పుణ్యపురుషుడు, విజ్ఞానమాత్రేణ=కేవల జ్ఞానమాత్రముచేతనే ముక్తః=ముక్తుడై, తిష్ఠతి=ఉంటున్నాడు, (మోక్షమును పొందుచున్నాడు.)

తా॥ ఓ జనకా! మూఢుడగు అజ్ఞాని హఠయోగాది కర్మలవలన మోక్షము గలుగునని తలంచుచున్నాడు. కాని అట్లెన్నటికినీ కాదు. ఈ విషయమున ఉపనిషత్తు చెప్పినది చూడుడు.

"న కర్మణా న ప్రజయా ధనేన"

ధనమువలన గాని, కర్మలవలన గాని, సంతానమువలన గాని మోక్షము నొకప్పుడును పొందజాలడు. మఱి అవిద్యామలదోషము నెపుడు దూర మొనరించుచున్నాడో, ఎవడు కేవల విజ్ఞానస్వరూపమాత్రుడై యున్నాడో, అట్టివాడే మోక్షమును పొందగలుగుచున్నాడు.

**మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యతో భవితు మిచ్ఛతి ।**
**అనిచ్ఛన్నపి ధీరో హి పరబ్రహ్మస్వరూపభాక్ ॥ 37**

యతః=ఏకారణమువలన, మూఢః=అజ్ఞాని, బ్రహ్మ=బ్రహ్మము, భవితుం=అగుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడో, తతః=ఆ కారణము వలననే, సః=అతడు, తత్=ఆ బ్రహ్మమును, నాప్నోతి=పొందజాల కున్నాడు, ధీరః=జ్ఞాని, అనిచ్ఛన్నపి=కోరకున్నను, పరబ్రహ్మస్వరూప భాక్=పరబ్రహ్మస్వరూపమును పొందువాడుగా, భవతి=అగుచున్నాడు.

అజ్ఞాని చిత్తనిరోధాదులవల్లనే బ్రహ్మత్వము నొందగోరుచున్నాడు. కాని యీ మార్గము ద్వారా బ్రహ్మప్రాప్తి నొందజాలడు. జ్ఞాని మోక్షేచ్ఛ లేకయే నిశ్చయముగ నతడు పరబ్రహ్మస్వరూపు డగుచున్నాడు. అంతఃకరణరూపావరణమే లేనివాడై సర్వభావశూన్యుడైన యాత్మజ్ఞాని వ్యవధాన రహితముగ బ్రహ్మమే యగును. ఇచ్చట "బ్రహ్మవిద్బ్రహ్మైవ **భవతి"** అను శ్రుతి ప్రమాణము.

**నిరాధారా గ్రహవ్యగ్రా మూఢాస్సంసారపోషకాః ।**
**ఏతస్యానర్థమూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః ॥ 38**

నిరాధారాః=ఆధారరహితు లైనటువంటివిన్నీ, గ్రహవ్యగ్రాః= దురాగ్రహు లైనటువంటివిన్నీ, మూఢాః=మూఢులు, సంసారపోషకాః= సంసారమును పోషించువారుగా, (భవన్తి=అగుచున్నారు.) అనర్థ మూలస్య= అనర్థములకు హేతువైన, ఏతస్య=ఈ, సంసారస్య= సంసారముయొక్క, మూలచ్ఛేదః=మూలచ్ఛేదము, బుధైః=జ్ఞానులచేత, కృతః=చేయబడినది.

తత్త్వజ్ఞాన విహీనులగు మూఢులు వేదాంతశాస్త్రముయొక్కయు, ఆత్మవేత్త యగు గురువుయొక్కయు ఆధారము లేకనే కేవలము చిత్త నిరోధమువల్లనే మోక్షప్రాప్తి నొందెదమను దురాగ్రహముతో ప్రయత్నించుచు జననమరణరూప సంసారవృక్ష నిర్మూలనసాధన మగు జ్ఞాన ఖడ్గమును బడయజాలక, ఆ సంసారవృక్షమునే పొందుచుందురు. జ్ఞాను లీ సంసార వృక్షమూలమును జ్ఞానఖడ్గముచేత ఛేదించి విముక్తు లగుదురు. అజ్ఞానమే సంసారవృక్షమునకు మూలము. కనుక దానిని సమూలముగా నశింపజేయునది మోక్షము.

**న శాన్తిం లభతే మూఢో యతశ్శమితు మిచ్ఛతి ।**
**ధీరస్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాన్తమానసః ॥ 39**

యతః=ఏకారణమువలన, మూఢః=అజ్ఞాని, శాన్తిం=శాంతిని, ఇచ్ఛతి=కోరుచున్నాడో, తతః=ఆ కారణమువలన, సః=అట్టివాడు, శాన్తిం=శాంతిని, న లభతే=పొందడు, ధీరః=బుద్ధిమంతుడగు జ్ఞాని, తత్త్వం=పరతత్త్వమును, వినిశ్చిత్య=నిశ్చయము చేసికొని, సర్వదా=

ఎల్లప్పుడు, శాన్తమానసః=శాంతమైన మనస్సు గలవాడుగా నున్నాడు.

అజ్ఞాని (ఆత్మతత్త్వము నెఱుంగనివాడు) చిత్తనిరోధాదులవలన శాంతి నొందగోరుచున్నాడు. కాని ఈ కారణమువల్లనే ఆతడు శాంతిని నొందజాలకున్నాడు. విజ్ఞాని ఆత్మతత్త్వమును తెలిసికొనిన వాడగుటచేతనే కోరిక లేకయే స్వభావముచేతనే సర్వదా శాంతమానసు డగుచున్నాడు.

(ఇచట శాంతి యన సర్వవృత్తులను ఆత్మయందు లయము చేసి ఆత్మయందే విశ్రాంతి నొందుట యని యర్థము.)

**క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్టమవలమ్బతే ।**
**ధీరాస్తం తం న పశ్యన్తి పశ్యన్త్యాత్మాన మవ్యయమ్ ॥ 40**

యద్దృష్టం యత్ = ఎవనిచేత, దృష్టం = దృశ్యపదార్థము, అవలంబతే= అవలంబింపబడుచున్నదో, తస్య=అతనికి, ఆత్మనః= ఆత్మయొక్క, దర్శనం=దర్శనము, క్వ=ఎక్కడ, ధీరాః=జ్ఞానులు, తం తం=ఆ యా, దృష్టం=దృశ్య ప్రపంచమును, న పశ్యన్తి=చూడరు, (పరం తు= మరేమనగా,) అవ్యయం=నాశరహితమగు, ఆత్మానం=ఆత్మను, పశ్యన్తి= చూచుచున్నారు.

అజ్ఞానులు ప్రత్యక్షముగా కంటికగపడు వస్తువులే సత్యములని తలంతురు. ఇంద్రియవ్యాపారము గలవారగుటవలన వారికొకప్పుడును ఆత్మదర్శనము కానేరదు. జ్ఞాని యెల్లప్పుడును ఈదృశ్యపదార్థములు సత్యమని భావింపడు. మరేమనగా వాటియందు అంతర్గత మగు కారణశక్తిని చిద్రూపాత్మను అంతట చూచుచున్నాడు. ఈ కారణమువలన నత డెల్లప్పుడును పరమాత్మయందే లీనమై యుంటున్నాడు, కార్యరూప మగు జగత్తు అతనికి గోచరించదు.

**క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతి వై ।**
**స్వారామస్యైవ ధీరస్య సర్వదాఽసావకృత్రిమః ॥ 41**

యః=ఎవడు, నిర్బంధం=చిత్తనిరోధమును, వై=హఠముతో, కరోతి=చేయుచున్నాడో, (తస్య=ఆ), విమూఢస్య=మూఢునకు, నిరోధః=చిత్తనిరోధము, క్వ=ఎక్కడ? (కలుగదని భావము). స్వారామస్య=ఆత్మారాముడగు, ధీరస్య=జ్ఞానికి, సర్వదా ఏవ=ఎల్లప్పుడును, అసౌ=ఈ చిత్త నిరోధము, అకృత్రిమః=కృత్రిమ రహిత మైనది, స్వాభావిక మైనది.

అజ్ఞాని యగువాడు శుష్కచిత్తమును నిరోధించుటకు హఠము నూనుచున్నాడు. కాని అట్టివాని మనస్సెప్పుడును నిరోధింపబడదు. అజ్ఞాని చిత్తనిరోధముకొఱకు సమాధి నవలంబించుచున్నాడు. కాని మఱల నాతడు సమాధినుండి ఉత్థానమును పొందిన పిదప నతని మనస్సు ప్రాపంచిక విషయములయందు లగ్న మగుచున్నది. అట్లుగాక ఎవడు ఆత్మయందే రమించుచు, ఆత్మానందము నొందుచున్నాడో, అతని చిత్తము నిశ్చల మగుచున్నది. అతని మనస్సెల్లప్పుడును ఆత్మయందే నిరుద్ధమైన కారణముచేత ఆతడెల్లప్పుడును సమాధియందే యున్నవా డగుచున్నాడు.

**భావస్య భావకః కశ్చిన్న కించిద్భావకోఽపరః ।**
**ఉభయాభావకః కశ్చి దేవమేవ నిరాకులః ॥ 42**

కశ్చిత్=ఒకానొకడు, భావస్య=భావముయొక్క, భావకః=భావకుడుగా, (భవతి=అగుచున్నాడు), అపరః=ఇతరుడు, ఒకానొకడు, కించిత్=కొంచెముగూడ, న భావయతే=భావించుట లేదు, ఏవమేవ=ఈ ప్రకారముగానే, కించిత్=కొంచెముగూడ, ఉభయాభావకః=భావాభావము

లను రెంటిని భావించనివాడై, నిరాకులః=స్వస్థచిత్తు డగుచున్నాడు.

భావరూప ప్రపంచము పరమార్థముగా సత్యమైనది అని నైయాయి కులు తలంచుచున్నారు. కొందఱు శూన్యవాదులు ఈ ప్రపంచ మంతయు శూన్యమైనదని తలంచుచున్నారు. శూన్యమునుండియే ఉత్పత్తి యగుచున్న దని వారి వాదము. కాని అనేకమంది జనులలో ఆత్మానుభవ శాలి యగు యొకానొక జ్ఞాని మాత్రము ఈ భావవాదమును, శూన్య వాదమును నిరాకరించి స్వస్థచిత్తుడును, సర్వసాక్షియు, స్వయంప్రకాశ మానుడునై యుండును. వేదాన్తవిజ్ఞాన వినిశ్చితాత్ము డగు జ్ఞాని సర్వమతాతీతుడై సచ్చిదానంద పరబ్రహ్మమై విరాజిల్లునని భావము.

**శుద్ధమద్వయమాత్మానం భావయన్తి కుబుద్ధయః ।**
**న తు జానన్తి సమ్మోహాద్యావజ్జీవ మనిర్వృతాః ॥ 43**

కుబుద్ధయః=దుర్బుద్ధు లగువారు, శుద్ధం=శుద్ధ మైనట్టియు, అద్వయం=అద్వితీయ మైనట్టియు, ఆత్మానం=ఆత్మను, భావయన్తి= భావించు చున్నారు, తు=అయితే, సమ్మోహాత్=అజ్ఞానకారణమువలన, న జానన్తి=తెలిసికొనజాలకున్నారు. అతః=ఈ కారణమువలన, యావజ్జీవం= జీవితాంతము వఱకు, అనిర్వృతాః=సంతోషరహితులై యున్నారు.

ఆత్మానుభవము లేని మూఢులు ఆత్మ నిర్మలము, అద్వితీయము, సర్వవ్యాపకము అయినదని చెప్పుదురే గాని అనుభవపూర్వకముగా ఆత్మ సాక్షాత్కారము నొందజాలరు. ఇందులకు కారణము సమ్మోహమే. ఆ సమ్మోహమువలన ప్రపంచవిషయములనుండి వారు నివృత్తిని జెందరు.

సాపేక్షము ననుసరించి మోహమింకను పూర్తిగా పెరుగునే గాని, క్షీణించదు మోహము క్షీణించని వారు ఆత్మయొక్క నిర్మలత్వాదులను వర్ణింతురేగాని ఆత్మానందము నొందజాలరు. సద్గురూపదిష్ట మార్గమున అనుభవ యుక్తమగు జ్ఞానమువలననే పరమానందావాప్తి యగును. ఆత్మ సాక్షాత్కారము లేక సంతోషము కలుగజాలదు.

**ముముక్షోర్బుద్ధిరాలంబమంతరేణ న విద్యతే ।**
**నిరాలంబైవ నిష్కామా బుద్ధిర్ముక్తస్య సర్వదా ॥ 44**

ముముక్షోః=ముక్తిని కోరువానియొక్క, బుద్ధిః=బుద్ధి, ఆలంబమంత రేణ=ఆలంబమును విడిచి, న విద్యతే=ఉండదు, ముక్తస్య=ముక్త పురుషునియొక్క, బుద్ధిః=బుద్ధి, నిష్కామా=కామనారహిత మైనదియు, చ=మఱియు, నిరాలంబా=ఆశ్రయరహిత మైనదియు, ఏవ=గానే, విద్యతే=ఉండును.

ఆత్మసాక్షాత్కారము లేనివానియొక్క బుద్ధి ప్రపంచ విషయా లంబనము గలదియై యుండును. మఱియు శివకేశవాది మూర్తివిశేషముల నవలంబించుచుండును. జీవన్ముక్తు డగువాని బుద్ధి నిరాలంబమై యుండును. అనగా ఆత్మసాక్షాత్కారము గలుగని మందుడు సంశయ గ్రస్తుడై యేదేని ఆలంబనముకొఱకు ప్రయత్నించును. ఆత్మ సాక్షాత్కార మును పొందిన జ్ఞాని ఆత్మేతర మెద్దియు తలంపక సదా ఆత్మారాముడై యుండునని భావము.

అవ॥ విషయాసక్తిని తొలగించుకొనజాలనివారు విషయములనుండి చిత్తమును నిరోధించుకొన జూతురు. కాని ఆత్మానుభవము గలవారట్టి ప్రయత్న మొనరింపరని చెప్పుచున్నాడు.

**విభయద్వీపినో వీక్ష్య చకితాశ్శరణార్థినః ।**
**విశన్తి ఝటితి క్రోడం నిరోధైకాగ్ర్యసిద్ధయే ॥ 45**

విషయద్వీపినః=విషయరూపములగు వ్యాఘ్రములను, వీక్ష్య=చూచి, చకితాః=భయపడినవారై, శరణార్థినః=శరీరమును రక్షించుకొన వలయుననెడి మూఢులు, నిరోధైకాగ్ర్యసిద్ధయే=చిత్తనిరోధము, ఏకాగ్రము సిద్ధించుటకొఱకు, ఝటితి=శీఘ్రముగా, క్రోడం= గుహలను, (యందు), విశన్తి=ప్రవేశించుచున్నారు.

వ్యాఘ్రములవలె క్రూరములును, విషప్రాయములు నగు విషయము లను జూచి భయ మొందినవారు స్వశరీరరక్షణమునకై ఏ పర్వతగుహల యందో నివసింపజూతురు. కాని వారికి కార్యసిద్ధిమాత్రము కాజాలదు. ఎందువల్ల ననగా అంతర్వృత్తి వారికి నశించుట లేదు. అంతర్వృత్తి రహితము కానివా డెక్కడున్నను దుఃఖము తప్పదు. శాంతి అనునది వానికి లేశ మాత్రమైనను ఉండదు. ఆత్మజ్ఞాని యగువాడు ఈ ప్రపంచ విషయరూప వ్యాఘ్రమును ఇంద్రజాలజన్య పదార్థమువంటిదని తలంచి యించుకైనను భయపడడు. భయ మనునది వాని దరికే చేరదు.

**నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదన్తినః ।**
**పలాయన్తే న శక్తాస్తే సేవన్తే కృతచాటవః ॥ 46**

నిర్వాసనం=వాసనారహిత పురుషరూప మగు, హరిం= సింహమును, దృష్ట్వా=చూచి, విషయదన్తినః=విషయములను గజములు, న శక్తాః= అసమర్థములైన,తూష్ణీం=ఊరకే, పలాయన్తే=పరుగెత్తి పోవుచున్నవి. తే=ఆ విషయములు, (ఈశ్వరకృష్టాః=ఈశ్వర ప్రేరితములైనవై),

కృతచాటవః=ప్రియోక్తులు గల ప్రియురాండ్రవలె, (తం=ఆ నిర్వాసన గల వానిని), ఆగత్య=వచ్చి, సేవన్తే=సేవించుచున్నవి.

సింహమును జూచి గజములు పారిపోవునట్లు విషయ వాసనా రహితుడగు జ్ఞానిని జూచి విషయములు పారిపోవును. ఆ విషయములే ఈశ్వర ప్రేరితములైనవై నరసింహమూర్తిని భక్తులు ప్రియవాక్కులతో సేవించినట్లు సేవించుచున్నవి. లేదా ప్రియురాండ్రు ప్రియుని భయ భక్తులతో సేవించునట్లు నిర్వాసనా పురుషుని విషయములు సేవించు చున్నవి (ప్రారబ్ధ వశాగతములగు విషయములు ఆత్మారాముడగు జ్ఞాని చిత్తమును చలింపజేయజాలక తమంతట జరుగుచుండునని భావము.)

**న ముక్తికారికాన్ ధత్తే నిశ్శంకో యుక్తమానసః ।**
**పశ్యన్శృణ్వన్స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖమ్ ॥ 47**

నిశ్చలమునైన మనస్సు గలవాడు నగు జ్ఞాని, ముక్తికారికాన్=యమ నియమాది యోగక్రియలను, ఆగ్రహాత్= పట్టుదల వలన, న ధత్తే= ధారణచేయడు, కిం తు=మరేమనగా, పశ్యన్= చూచుచు, శృణ్వన్= వినుచు, స్పృశన్=తాకుచు, జిఘ్రన్=ఆఘ్రాణించుచు, అశ్నన్=తినుచు, సః=అతడు, యథాసుఖం=సుఖపూర్వకముగా, ఆస్తే=ఉంటున్నాడు.

సమస్తసంశయ విదూరుడును, నిశ్చలమానసుడు నగు జ్ఞాని యమనియమాసనాది క్రియలతో ప్రసక్తి లేకయే లోకదృష్టికి చూచుట, వినుట, తాకుట, ఆఘ్రాణించుట, భుజించుట మొదలగు దేహేంద్రియ కృత్యము చేయుచున్నను ఆయా పనులయందు కర్తృత్వాధ్యాసము లేనివాడై సదాత్మానంద నిమగ్నుడై యుండును. ఇచ్చట భగవద్గీతయందలి ఐదవ

అధ్యాయమునందు గల "నైవ కించిత్కరోమీతి" అను శ్లోకము మొదలు "లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా" అనునంతవఱకు ఈ మూడు శ్లోకములు ప్రమాణములు.

**వస్తుశ్రవణమాత్రేణ శుద్ధబుద్ధిర్నిరాకులః ।**
**నైవాచారమనాచార మౌదాస్యం వా ప్రపశ్యతి ॥ 48**

వస్తుశ్రవణమాత్రేణ=యథార్థవస్తుశ్రవణమాత్రముచేతనే, శుద్ధబుద్ధిః= పరిశుద్ధమైన బుద్ధి గలవాడును, నిరాకులః=వ్యాకులము లేనివాడైన, (స్వస్థచిత్తుడగు పురుషుడు), ఆచారం వా=ఆచారమును గాని, అనాచార=అనాచారమును గాని, ఔదాస్యం=ఉదాసీనతను గాని, న పశ్యతి=చూడడు.

చిదాత్మశ్రవణమాత్రముచేతనే శుద్ధమైన అఖండాకారజ్ఞానోత్పత్తి గలవాడును, గురూపదిష్ట తత్త్వమసీత్యాది మహావాక్య శ్రవణమాత్రముచేత స్వస్వరూపస్థితియం దున్నవాడు నగు జ్ఞాని కేవల పరబ్రహ్మమే తానగుట వలన క్రియానుష్ఠానపరుడై ఆచారవంతుడు గాడు, క్రియారహితుడై యనాచారవంతుడును గాడు, మఱియు నీ యుభయకర్మలతో తటస్థుడుగా నుండి నిష్కర్ముడును గాడు, (అనగా జ్ఞానికి శుభా శుభ కర్మలతోగాని నైష్కర్మ్యముతో గాని, పని లేదని భావము)

అవ॥ జ్ఞానియొక్క వ్యాపారము బాలకుని చేష్టలవలె నుండునని చెప్పుచున్నాడు.

**యదా యత్కర్తుమాయాతి తదా తత్కురుతే ఋజుః ।**
**శుభం వాప్యశుభం వాఽపి తస్య చేష్టా హి బాలవత్ ॥ 49**

యదా=ఎప్పుడు, శుభం వా=శుభమైనది గాని, అశుభం వా=అశుభ మైనది గాని, యత్=ఏకర్మ, కర్తుం=చేయుటకు, అయాతి= వచ్చుచున్నదో, తదా=అప్పుడు, తత్=ఆ కర్మను, ధీరః=జ్ఞాని, ఋజుః= ఆగ్రహము లేనివాడై, కురుతే=చేయుచున్నాడు. హి=ఎందుకనగా, తస్య=అతనియొక్క, చేష్టా=వ్యవహారము, బాలవత్=బాలునివలె, భవతి=అగుచున్నది.

పసిబిడ్డ ఇది అపాయ మనిగాని, ఇది నిరపాయ మనిగాని, ఇది హేయ మనిగాని, ఇది ఉపాదేయ మనిగాని, ఇది చేయదగిన దనిగాని, చేయదగని దనిగాని అనుకొనకయే అనగా భావాభావములు లేకయే ఆయా పనులు చేయునట్లు ఆత్మారాముడగు జ్ఞానియు పసిబిడ్డవలెనే ఆయా పనులు చేయును. కాని అతనికి పిల్లవానివలె కర్తృత్వాద్యభిమానము లేదు. కాన నతని నా కర్మఫల మంటదు.

**స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లభతే పరమ్ ।**
**స్వాతంత్ర్యాన్నిర్వృతిం గచ్ఛేత్ స్వాతంత్ర్యాత్పరమం పదమ్॥50**

జ్ఞాని=జ్ఞాని, స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యమువలన, సుఖం= సుఖమును, అప్నోతి=పొందుచున్నాడు, స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యమువలన, పరం=పరమును, లభతే=పొందుచున్నాడు, స్వాతంత్ర్యాత్=స్వాతం త్ర్యమువలన, నిర్వృతిం=పరమశాంతిని (సుఖమును), గచ్ఛేత్=పొందు చున్నాడు. స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యమువలననే, పరమం పదం=పరమ పదమును, ఆప్నోతి=పొందుచున్నాడు.

స్వతంత్రత అనగా రాగద్వేషాది అనాత్మగుణములకు వశుడు

గాకుండుటయే స్వతంత్రత, అనగా తన స్వరూప స్థితియం దుండుట. అట్లుగాక దేహాద్యనాత్మ గుణములకు వశుడగుటయే పరతంత్రత. పరతంత్రుడు కానివాడే స్వతంత్రుడు. అట్టి స్వాతంత్ర్యమువలన పురుషునకు ఆత్మజ్ఞానమున్ను, నిత్యసుఖమున్ను, పరమశాంతియు గలుగును.

**అకర్తృత్వమభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా ।**
**తదా క్షీణా భవన్త్యేవ సమస్తాశ్చిత్తవృత్తయః॥ 51**

యదా ఎప్పుడు (పురుషః=పురుషుడు,) స్వాత్మనః=తన ఆత్మకు, అకర్తృత్వం=అకర్తృత్వమును, అభోక్తృత్వం=అభోక్తృత్వమును, మన్యతే=తలంచుచున్నాడో, తదా=అప్పుడు, తస్య=అతనియొక్క, సమస్తాః=సమస్తము లయిన, చిత్తవృత్తయః=చిత్తవృత్తులు, క్షీణాః= క్షీణము లైనవిగా, భవన్త్యేవ=నిశ్చయముగా నగుచున్నవి.

ఎప్పుడు తనను అకర్తగను, అభోక్తగను నిశ్చయము చేసికొను చున్నాడో, అప్పుడే అట్టివాడు సంపూర్ణవృత్తి రహితు డగుచున్నాడు, అట్లుగాక ఎప్పుడు "ఈ పనిని నేను చేయుచున్నాను, ఈఫలమును నే ననుభవించు చున్నా" ననెడి యభిమానమును గలిగియున్నాడో అప్పుడే అతని మనస్సునం దనేకవృత్తు లుత్పన్నము లగుచున్నవి. అప్పు డతడు దుఃఖి యగుచున్నాడు. కర్తృత్వ భోక్తృత్వాద్యభిమాన రహితునకు సర్వవృత్తులు ఉపశమించినందువలన పరిపూర్ణమగు ఆత్మశాంతిని పొందుచున్నాడు.

ప్రశ్న ॥ కేవలము నేను అకర్తను, అభోక్తను అని నిశ్చయము చేసికొన్నంత మాత్రముచేతనే చిత్తవృత్తులు నశించి జీవన్ముక్తు డైపోయినచో

బద్ధజ్ఞానులకుగూడ చిత్తవృత్తిరహితమైన జీవన్ముక్తి సిద్ధించవలసియున్నది. ఎందుకనగా వారుగూడ నేను అకర్తను, అభోక్తను అని అనుకొనవచ్చును గదా. ఇందువలన కేవలము అకర్తను. అభోక్తను అని అనుకొన్నంత మాత్రముచేత వృత్తి నిరోధము కాజాలదు గదా?

ఉ॥ బద్ధజీవులు నేను అకర్తను, అభోక్తను అని యనుకొన్నంత మాత్రమున వారికి వృత్తినిరోధము కలుగజాలదు. ఎందుకనగా వారికొక పరిపక్వావస్థ లేదు. వారి నిశ్చయ మింకను దృఢపడలేదు. వారి నిశ్చయమే పరిపక్వ మైనదైనచో వృత్తు లెన్నటికి విషయాకారమును పొందగూడదు. దృష్టాంతమున జూడుము. హిందూధర్మము గోమాంసమును మిక్కిలి నిషేధించుచున్నది. ఇందువలన ఏ హిందువు మనస్సైనను స్వప్నములో నైన గోమాంసమువైపునకు వెళ్లదు. అట్లే "నేను అకర్తను అభోక్తను" అని నిశ్చయము గల జ్ఞానియొక్క మనస్సు స్వప్నమునందైనను విషయముల వైపునకు పోదు. మఱియు వానికి విషయాకారవృత్తి ఒకప్పుడును ఉదయించదు. పరిపక్వ మగు నిశ్చయము లేని అజ్ఞాని లోకులకు నేను అకర్తను అభోక్తను అని పైకి చెప్పుకొనుచున్నను లోపల మాత్రము పిల్లివలె విషయములయందు దృష్టి లగ్నమగుచునే యుండును. ఎలుక కనబడ కుండా ఉన్నంతవరకే పిల్లి కండ్లు మూసికొనియుండుట, ఎలుక కనబడినదే తడవుగా తటాలున పట్టుకొని చంపి తినివేయుచున్నది. అట్లే మిథ్యా జ్ఞాని విషయములు ఎదుటపడకుండా ఉన్నంతవరకే వాని నిశ్చయము. విషయ రూపమగు ఎలుక దగ్గరకు వచ్చెనా వెంటనే కర్త, భోక్త అయి దాని ననుభవించి తీరును.

ఒక మంచిసాధువు పంజాబు దేశములో ఒకానొక గ్రామమునందు ఒక యువతికి "విచారసాగరము" అను గ్రంథమును చెప్పుచుండెను. ఇట్లు చెప్పుచూ చెప్పుచూ ఉండగా ఆసాధువు మనస్సు ఆమెపైన లగ్నమయ్యెను. అంత నాతడు ఆమెతొడపై చేయినిడి మెల్లగా తడవ నారంభించెను. అప్పు డాయువతి "మహాత్మా! విషయభోగములు విషతుల్యములని తెలిసికొని విడిచిపెట్టవలయునని యిప్పుడే నాచేత చదివించితిరి గదా? మరల నిది ఏమి? నాతొడపై చేతినిడి రాయు చున్నారు?" అని యడిగెను. అంత నా సాధువు "అమ్మాయీ! ఇట్లు చేయుట నేను కాముకుడనై కాదు; నిన్ను పరీక్షించుటకే. నీవు విచార సాగరము నంతయు చదివితివి. కాని నీకు దేహాధ్యాస యింకను పోలేదు. ఇంకను దేహాభిమానమును కలిగియే యున్నావు" అని యనెను. చూడుము, ఆ సాధువు స్వయముగా తన దేహాధ్యాసము తొలగించుటకు శక్తుడుగాక విషయలోలుడై పరస్త్రీని పట్టుకొనుటకు తయారగుచుండెను. ఈ యర్థమునే

> "రాగేచ్ఛా సుఖ దుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే ।
> సుషుప్తౌ నాస్తి తన్నాశాత్తస్మాద్బుద్ధేస్తు నాత్మనః ॥"

అని శ్రీ శంకరాచార్యులవారు ఆత్మబోధయందు రచించిరి.

**ఉచ్ఛృంఖలాప్యకృతికా స్థితిర్ధీరస్య రాజతే ।**
**న తు సంస్పృహచిత్తస్య శాంతిర్మూఢస్య కృత్రిమా ॥ 52**

ధీరస్య=జ్ఞానియొక్క, స్థితిః=స్థితి, ఉచ్ఛృంఖలాఅపి=స్వేచ్ఛ గలదియై శాంతిరహితమైనదివలె నున్నను. అకృతికా=స్వాభావిక మైనదై (శాంతి

యుత మైనదై), రాజతే=ప్రకాశించుచున్నది, సంస్పృహచిత్తస్య=కోరిక లతో నిండిన మనస్సు గల, మూఢస్య=మూఢునియొక్క, శాంతిః= శాంతి, కృత్రిమా=కృత్రిమ మైనదై, న రాజతే=ప్రకాశించదు.

తాను చేయు పనులయందు నిస్పృహుడై, నిరాడంబరుడై విహరించుచు లోకదృష్టికి శాంతి లేనివానివలె నగపడుచున్నను జ్ఞాని పరబ్రహ్మస్వరూపుడై ప్రకాశించును. కపటవృత్తి గలవాడై పైకి శాంతునివలె నటించినను మూఢుడు జ్ఞానివలె శోభిల్లడు.

అవ॥ సంకల్పశూన్యుడగు జ్ఞాని భోగముల ననుభవించుచున్నను అతనికి కర్తృత్వాధ్యాస ముండదని చెప్పుచున్నాడు.

**విలసన్తి మహాభోగైర్విశన్తి గిరిగహ్వరాన్ ।**
**నిరస్తకల్పనా ధీరా అబద్ధా ముక్తబుద్ధయః ॥ 53**

నిరస్తకల్పనాః=సంకల్పరహితులును, అబద్ధాః=బంధన రహితులును, ముక్తబుద్ధయః=ముక్తబుద్ధులు నగు, ధీరాః=జ్ఞానులు, కదాచిత్= ఒకప్పుడు, (ప్రారబ్ధవశాత్=ప్రారబ్ధవశమున,) మహాభోగైః=మహా భోగములతో, విలసన్తి=ఒప్పుచున్నారు. (కదాచిత్=ఒకప్పుడు,) గిరిగహ్వరాన్=కొండగుహలయందు, విశన్తి=ప్రవేశించుచున్నారు.

సంకల్పరహితుడును బంధముక్తుడు నగు జ్ఞాని ఒకప్పుడు ప్రారబ్ధవశమున సమస్తభోగముల ననుభవించుచున్నాడు. ఒకప్పుడు అరణ్యములయందు సంచరించుచు గుహలలో నివసించుచున్నాడు. ఆ మహాత్ము డెట్లున్నను కర్తృత్వాధ్యాసమే లేకుండా ఆసక్తిరహితుడై, వృత్తి శూన్యుడై యుండును.

అవ॥ జ్ఞాని లౌకిక వ్యాపారములు చేయుచున్నను సర్వదా నిర్లిప్తుడై, నిర్వికారుడై యుండునని చెప్పుచున్నాడు.

**శ్రోత్రియం దేవతాం తీర్థ మంగనాం భూపతిం ప్రియమ్ ।**
**దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాఽపి హృది వాసనా ॥ 54**

శ్రోత్రియం=పండితుని, దేవతాం=దేవతను, తీర్థం=తీర్థమును, సంపూజ్య= పూజించి, చ=మఱియు, అంగనాం=స్త్రీని, భూపతిం= రాజును, ప్రియమ్=ప్రియులైన పుత్రాదులను, దృష్ట్వా=చూచి, ధీరస్య= జ్ఞానియొక్క, హృది=హృదయమునందు, కా అపి=ఎటువంటి, వాసనా=వాసనయు, న భవతి=కలుగదు.

ఓ శిష్యా! జ్ఞాని యగు జీవన్ముక్తునకు శ్రోత్రియ బ్రాహ్మణుడు, ఇంద్రాది దేవతలు, గంగాది తీర్థములు- వీటిని పూజింపవలెననెడి కోరిక కలుగదు. ఒకప్పుడు పూజించును. ఎందుకనగా అతడు నిష్కామి. మఱియు సుందరులగు స్త్రీలను, పుత్రాదులను, రాజు మొదలగు వారలను చూచునప్పుడును మనస్సునందు ఎట్టి వాసనయు కలుగదు. ఎందుకనగా జ్ఞాని సర్వత్ర సమబుద్ధియు, సమదర్శనమును గలవాడు.

**భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః ।**
**విహస్య ధిక్కృతో యోగీ న యాతి వికృతిం మనాక్ ॥ 55**

భృత్యైః=సేవకులచేతను, పుత్రైశ్చ=పుత్రులచేతను, దౌహిత్రైః= మనుమలచేతను, గోత్రజైరపి=దాయాదులచేతను, విహస్య=నవ్వి, దిక్కృతః=ధిక్కరింపబడిన వాడైనప్పటికినీ, యోగీ=జ్ఞాని, మనాక్= కొంచము గూడ, వికృతిం=వికారమును (క్షోభను), న యాతి=పొందడు.

ఓ శిష్యా! జీవన్ముక్తుడగు జ్ఞానియొక్క చిత్తము భృత్యులు అనగా సేవకులచేత గాని, పుత్రులచేత గాని, పౌత్రులచేత గాని స్త్రీలచేత గాని, బంధువులచేత గాని తిరస్కరింపబడినను ఇంచుకయు చలించదు. మఱియు వారిచేత సత్కరింపబడినను సంతసించదు. రాగద్వేష హేతువగు మోహమే లేనప్పు డిక హర్ష మెక్కడ? సంతోష మెక్కడ?

అవ॥ జ్ఞానుల జాడలు జ్ఞానులకే తెలియునని చెప్పుచున్నాడు.

**సన్తుష్టోఽపి న సన్తుష్టః ఖిన్నోఽపి న ఖిద్యతే ।**
**తస్యాశ్చర్యదశాం తాం తాం తాదృశా ఏవ జానతే ॥ 56**

జ్ఞానీ=జ్ఞాని యగువాడు - లోకదృష్టితో, సన్తుష్టః అపి=సంతుష్టు డైనప్పటికినీ, న చ సన్తుష్టః=సంతుష్టుడు కాడు, ఖిన్నః అపి=దుఃఖమును పొందిన వాడైనప్పటికి, న చ ఖిద్యతే=దుఃఖించడు, తస్య=అతని యొక్క, తాం తాం=ఆయా, ఆశ్చర్యదశాం=ఆశ్చర్యదశలను, తాదృశా ఏవ= అటువంటి వారే, జానతే=తెలిసికొనుచున్నారు.

ఓ శిష్యా! లోకదృష్టితో ఖేదమును పొందినవానివలె నున్నను జీవన్ముక్తుడు ఖేదమును పొందడు. లోకదృష్టికి హర్షమును పొందినవానివలె గన్పించినను హర్షమును పొందడు. ఇట్టి ఆశ్చర్యకరము లగు జ్ఞానియొక్క లీలలను జ్ఞానియే తెలిసికొనగలుగును. ఇతరుడు తెలిసికొనజాలడు.

"విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్"

పాము జాడలు పాములకే ఎరుక గదా?

అవ॥ సంసారకారణమగు కర్తృత్వాభిమానము జ్ఞాని కెన్నడూ కలుగదని నిరూపించుచున్నాడు.

**కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యన్తి సూరయః ।**
**శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయాః ॥ 57**

కర్తవ్యతా ఏవ=కర్తృత్వబుద్ధియే, సంసారః=సంసారము, తాం=అకర్తృత్వ బుద్ధిని, శూన్యాకారాః= శూన్యాకారులును, నిరాకారాః=నిరాకారులును, నిర్వికారాః=సంకల్ప రహితులును, నిరామయాః=దుఃఖరహితులును (అగు), సూరయః= జ్ఞానులు, న పశ్యన్తి=చూడరు.

"ఇది నేను చేయవలెను" అను కర్తవ్యతాబుద్ధియే సంసార హేతు వగుచున్నది. అందువలన జీవన్ముక్తు డగు జ్ఞాని ఆకర్తవ్యతాబుద్ధినే విడిచి పెట్టుచున్నాడు. మఱియు నతడు ఎట్టి సంకల్పములనూ చేయడు, శూన్యాకారుడును, ఆకారరహితుడును, వికారరహితుడును, మానసిక రోగాది రహితుడునై యున్నాడు.

**అకుర్వన్నపి సంక్షోభాద్వ్యగ్రస్సర్వత్ర మూఢధీః ।**
**కుర్వన్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః॥ 58**

మూఢధీః=అజ్ఞాని, అకుర్వన్ అపి=కర్మలను చేయనివా డైనప్పటికినీ, సర్వత్ర=అంతట, సంక్షోభాత్=సంకల్పవికల్పరూప సంక్షోభ కారణము వలన, వ్యగ్రః=వ్యాకులుడుగా, (భవతి=అగుచున్నాడు.) కుశలః= నేర్పరి యగు జ్ఞాని, కృత్యాని=కర్మలను, కుర్వన్అపి=చేయుచున్న వాడైనను, తు=మరేమనగా, నిరాకులః=ఆకులము లేనివాడుగా, భవతి= అగుచున్నాడు.

ఓ జనకా! అజ్ఞాని యగు మూఢుడు శూన్య మందిరములలో, అరణ్యములలో, పర్వతాది గుహలలో ఏకాంతముగా కూర్చొని సమస్త

కర్మములను అనగా శరీరేంద్రియ వ్యాపారములను విడిచిపెట్టిన వాడైనప్పటి కినీ సంకల్పములు గలవా డగుచున్నందున వ్యాకులచిత్తము గలవా డగుచున్నాడు. జ్ఞాని యగువాడు అంతట అన్నిపనులు చేయుచున్నవా డైనను సంకల్పాదులు లేనివా డగుటచేత వ్యాకులమును పొందడు.

గీతయం దీవిషయ మొకచోట ప్రతిపాదించబడినది -

"కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥

**సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతి చ ।**
**సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాన్తధీః ॥** 59

వ్యవహారేఽపి=ప్రపంచవ్యవహారమునందు, శాన్తధీః=శాంత చిత్తము గలవాడై, సుఖం=సుఖపూర్వకముగా, ఆస్తే=ఉంటున్నాడు, సుఖం= సుఖపూర్వకముగా, ఆయాతి=వచ్చుచున్నాడు, చ=మఱియు, యాతి= పోవుచున్నాడు, సుఖం=సుఖపూర్వకముగా, వక్తి=మాట్లాడు చున్నాడు, సుఖం=సుఖపూర్వకముగా, భుంక్తే=భోజనము చేయుచున్నాడు.

జీవన్ముక్తు డగు జ్ఞాని సమస్త వ్యవహారములను జేయుచు శాంత చిత్తుడై ఆత్మానందముతో నుండును. లేచునప్పుడు, కూర్చున్నప్పుడు, అన్న పానాదులు చేయుచు, శయనించుచు నిరంతరము శాంత చిత్తుడై యుండును.

**స్వభావాద్యస్య నైవార్తిర్లోకవద్వ్యవహారిణః ।**
**మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశ స్సుశోభతే ॥** 60

వ్యవహారిణః=వ్యవహారమును చేయుచున్నను (సమస్తక్రియలను చేయుచున్నను.) యస్య=ఏజ్ఞానికి, స్వభావాత్=ఆత్మజ్ఞాన స్వభావము వలన, లోకవత్=లోకమువలె (పామరునివలె) ఆర్తిః=భేదము, న ఏవ=ఉండదో, సః=అట్టివాడు, గతక్లేశః=క్లేశరహితుడై, మహాహ్రద ఇవ=గొప్ప తటాకమువలె, అక్షోభ్యః=క్షోభరహితుడై, సుశోభతే= శోభాయమాను డగుచున్నాడు.

ఆత్మసాక్షాత్కారము గల జ్ఞాని నిరంతరము సంసారమునందు వ్యవహరించుచున్నను, పామరునివలె సంసార క్లేశములను పొందడు. అందువల్లనే అతడు అగాధమై గొప్పదగు తటాకమువలె చలింపడు, నిర్వికారుడై, క్షోభరహితుడై, సర్వదా ఆత్మారాముడై శోభిల్లును.

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥ 61**

మూఢస్య=మూఢుని (అజ్ఞాని)యొక్క, నివృత్తిఃఅపి=నివృత్తి గూడ, ప్రవృత్తిః=ప్రవృత్తిగా, ఉపజాయతే=అగుచున్నది. చ=మఱియు, ధీరస్య=జ్ఞానియొక్క, ప్రవృత్తిఃఅపి=ప్రవృత్తి అయినను, నివృత్తి ఫలభాగినీ= నివృత్తిఫలమును పొందించునదిగా, భవతి=అగుచున్నది.

అహంకార మమకారములు తొలగని మూఢుడు లోకప్రతీతికై బాహ్యేంద్రియ వ్యాపారము లేకుండ నివృత్తునివలె చేష్టారహితుడై యుండినను, వాని చిత్తవృత్తి (ఇంద్రియ నిరోధాదులయందే లక్ష్యముండుట చేత) ప్రవృత్తి స్వరూపముగానే యుండును. జ్ఞాని ప్రారబ్ధవశమున కర్మల జేయుచు లోకదృష్టికి ప్రవృత్తునివలె గనిపించినప్పటికి నతనికి కర్తృత్వా

ధ్యాసము లేదు. కనుక అతని ప్రవృత్తియే ముక్తికారణ మగును (వేచబడిన గింజ కంకురము నశించిన విధమున అహము మమతలు నశించిన జ్ఞానికి పునర్భవము గలుగదని భావము.)

**పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే ।**
**దేహే విగళితాశస్య క్వ రాగః క్వ విరాగతా ॥ 62**

పరిగ్రహేషు=గృహారామాదులయందు, ప్రాయః=తరచుగా, వైరాగ్యం=వైరాగ్యము, మూఢస్య=మూఢునకు, దృశ్యతే=కనబడుచున్నది, పరం తు=అయితే, దేహే=దేహమునందు, విగళితాశస్య=నశించిన ఆశ గల జ్ఞానికి, రాగః=రాగము, క్వ=ఎక్కడ, విరాగతా=వైరాగ్యము, క్వ=ఎక్కడ.

దేహాభిమానము గల మూఢునకు ధనారామ గృహాదులయందున్న రాగమువలెనే ఒకప్పుడు వైరాగ్యముగూడ గలుగవచ్చును. అట్టి వైరాగ్యము సంసారబాధవలన గలుగు విరాగమే గాని, జ్ఞానజన్య విరాగము గాదు. దేహవాసన గలిగియుండుటచేత నట్టి యవాంతర విరక్తి ఒకప్పుడు అనురక్తిగా మారవచ్చును. దేహవాసనయే (దేహాభిమానమే) లేని జ్ఞానికి దేహసంబంధ మగు పుత్ర మిత్ర కళత్రాదులయం దభిమానమే గలుగదు. శత్రు వ్యాఘ్రాదులయందు విరక్తియు గలుగదు. దేహాభిమాన మున్నవానికే రాగ విరాగాదు లుండును గాని అది లేనివారికి రాగవిరాగాదు లెక్కడ? ఉండనే ఉండవు.

**భావనాభావనాऽऽసక్తా దృష్టిర్మూఢస్య సర్వదా ।**
**భావ్యభావనయా సా తు స్వస్థస్యాదృష్టిరూపిణీ ॥ 63**

మూఢస్య=మూఢునియొక్క, దృష్టిః=దృష్టి, సర్వదా=ఎల్లప్పుడు, భావనా భావనాసక్తా=భావనయందును, అభావనయందును ఆసక్త మైనదిగా

(ఉండును), స్వస్థస్య=స్వస్థచిత్తు డగు జ్ఞానియొక్క, సా=అదృష్టి భావ్య భావనయా=భావింపదగిన దానిని భావించిన దగుటవలన, అదృష్ట రూపిణీ= దృశ్యదర్శన రహితరూపము గలదిగా, భవతి= అగుచున్నది.

అజ్ఞాని దృష్టి సర్వదా భావనయందుగాని, అభావనయందుగాని సక్తమై యుండును. ఎందుకనగా వాడు "నేను భావన చేయుచున్నాను" లేదా "నేను భావన చేయుట" లేదనెడి యహంకారము కలిగియుండును. అనగా వాని చిత్తము ఆత్మేతరమగు భావనా భావనాదులయందు లగ్నమై యుండును గాని స్వస్వరూపాత్మయందు సక్తమై యుండదు. ఆత్మనిష్ఠ గల జ్ఞానియొక్క దృష్టి భావనాభావనా రహిత మైనదై సర్వదా ఆత్మయందే లగ్నమై యుండును. నిరంతరము స్వస్వరూపానుసంధానము గలిగి యుండుటచేత నితర మేమియు వానికి గోచరించదు.

**సర్వారమ్భేషు నిష్కామో యశ్చరేద్బాలవన్మునిః ।**
**న లేపస్తస్య శుద్ధస్య క్రియమాణేఽపి కర్మణి ॥ 64**

యః=ఏ , మునిః=ముని (జ్ఞాని,) బాలవత్=బాలకునివలె, నిష్కామః= కామనారహితుడై, సర్వారంభేషు=సర్వక్రియారంభములయందు, చరేత్=చరించునో, తస్య=అటువంటి, శుద్ధస్య=పరిశుద్ధస్వరూపునకు, కర్మణి=కర్మ, క్రియమాణే=చేయబడుచున్న దైనప్పటికిని, లేపః= లేపము, న భవతి=కలుగదు.

తా॥ ఏ విద్వాంసుడు బాలునివలె కామనారహితుడై పూర్వజన్మ కర్మవశుడై అనగా ప్రారబ్ధమువలన సర్వక్రియారంభములయందు చరించునో వాడు వాస్తవమునకు ఏ క్రియయు చేసినవాడు కాడు.

ఎందుకనగా వాడు అహంకార రూప మలరహితుడు గాన వానియందు కర్తృత్వభావము లేదు.

**స ఏవ ధన్య ఆత్మజ్ఞ స్సర్వభావేషు యస్సమః ।**
**పశ్యఞ్ఛృణ్వాన్ స్పృశన్‌జిఘ్రన్నశ్నన్నిస్తర్షమానసః ॥ 65**

యః=ఎవడు, పశ్యన్=చూచుచు, శృణ్వాన్=వినుచు, స్పృశన్= తాకుచు, జిఘ్రన్=వాసన చూచుచు, అశ్నన్=తినుచు, సర్వభావేషు=సమస్త భావములయందును, సమః=సముడై, నిస్తర్ష మానసః=ఆశారహితుడో, సః ఏవ=వాడే, ధన్యః=ధన్యుడు, ఆత్మజ్ఞః=ఆత్మజ్ఞుడు.

ఎవడు సర్వప్రాణులయందును ఆత్మను దర్శించుచు సమభావము గలిగియుండునో అతడే ధన్యుడు. అతడే ఆత్మజ్ఞుడు. అట్టి మహనీయుడు తృష్ణారహితుడై చూచుచు, వినుచు, తాకుచు, వాసన జూచుచు, తినుచు నిరంతరము బ్రహ్మావలోకనపరుడై, అహంతా మమతా రహితుడై యుండును.

**క్వ సంసారః క్వ చాభాసః క్వ సాధ్యం క్వ చ సాధనమ్ ।**
**ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా ॥ 66**

సర్వదా=ఎల్లప్పుడు, ఆకాశస్యేవ=ఆకాశమునకువలె, నిర్వికల్పస్య= సంకల్పరహితు డగు, ధీరస్య=ధీరు డగు జ్ఞానికి, సంసారః= సంసారము, క్వ=ఎక్కడ, ఆభాసః=దానియొక్క భావము, క్వ=ఎక్కడ? సాధనమ్= సాధనములైన యజ్ఞాదులు, క్వ=ఎక్కడ?

జ్ఞాని ఎల్లప్పుడు సంకల్ప వికల్ప రహితు డగుటవలన అతని

దృష్టియందు ప్రపంచ మెక్కడ? స్వర్గాదు లెక్కడ? ఎప్పుడైతే అతని దృష్టియందు స్వర్గాదులు లేవో వాటికి సాధన భూతము లగు యజ్ఞాది సాధనలతో నిమిత్త మేమి? అతనికి యోగాదులతో పనేమి? ఆత్మవేత్త యగు జీవన్ముక్తుని దృష్టియందు నిరంతరము సర్వత్ర ఆత్మయే ప్రతిభాసించు చున్నందునను, రెండవ వస్తు వేదియు గోచరించనందునను అట్టి ఆత్మైక స్వరూపునికి స్వర్గ నరకములతో పని ఏమున్నది?

**స జయత్యర్థ సన్న్యాసీ పూర్ణస్వరసవిగ్రహః ।**
**అకృత్రిమోఽనవచ్ఛిన్నే సమాధిర్యస్య వర్తతే ॥ 67**

యస్య=ఎవనికి, అకృత్రిమః=స్వాభావికమైన, సమాధిః=సమాధి, అనవచ్ఛిన్నే=(తనయొక్క) పూర్ణస్వరూపమునందు, వర్తతే=ఉంటున్నదో, సః= అటువంటి, అర్థసన్న్యాసీ=అర్థయుక్తుడగు సర్వసంగపరిత్యాగి, పూర్ణస్వరసవిగ్రహః=పూర్ణానంద స్వరూపు డగు జ్ఞాని, జయతి= సర్వోత్కృష్టు డగుచున్నాడు.

జ్ఞాని దృష్టాదృష్ట (ఇహలోక పరలోక సంబంధమగు) ఫల కామానా రహితు డైనందువలన అర్థసన్న్యాసి యనియు, పరిపూర్ణభావమే స్వరూప ముగా గలవాడగుటవలన పూర్ణస్వరస విగ్రహు డనియు చెప్పబడును. తన స్వరూపమునందే నిరంతరము ఎవనికి పూర్ణసమాధి స్థితి కలుగు చున్నదో అట్టివాడు సర్వోత్కృష్టు డగుచున్నాడు. (జ్ఞాని ప్రపంచ స్ఫురణము లేక అనవచ్ఛిన్న నిత్యపరిపూర్ణుడై జీవన్ముక్తు డగునని భావము.)

అవ॥ సర్వత్ర ఆశారహితుడై యుండుటే తత్త్వజ్ఞాని లక్షణమని చెప్పుచున్నాడు.

**బహునాఽత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః ।**
**భోగమోక్షనిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః ॥ 68**

అత్ర=ఈవిషయమై, బహునా=పెక్కువిధములుగా, ఉక్తేన=చెప్పుట చేత, కిం=ఏమి ప్రయోజనము, జ్ఞాతతత్త్వః=తత్త్వము నెఱింగి నట్టియు, భోగమోక్షనిరాకాంక్షీ=భోగమోక్షముల ఆశను విడిచిపెట్టినటువంటి, మహాశయః=జ్ఞాని, సదా=ఎల్లప్పుడు, సర్వత్ర=ఎల్లయెడల, నీరసః=రాగ ద్వేష రహితుడై (వర్తతే=ఉంటున్నాడు.)

ఆత్మతత్త్వము నెరింగిన వానికి జ్ఞాతతత్త్వుడని పేరు. అట్టి మహనీయుడు భోగమును, మోక్షమును రెంటిని నిరసించినవాడై ఆశారహితుడై యుండును. అనగా రెంటియందును రాగమును గాని, విరాగమును గాని గలిగియుండడు.

**మహదాది జగద్ద్వైతం నామమాత్రవిజృంభితమ్ ।**
**విహాయ శుద్ధబోధస్య కిం కృత్య మవశిష్యతే ॥ 69**

మహదాది=మహత్త్వము మొదలగు, ద్వైతం జగత్=ద్వైత జగత్తు, నామమాత్ర విజృంభితం=నామమాత్ర భిన్నమై యున్నది. తత్ర=దానిలో, కల్పనాం=కల్పనను, విహాయ=విడిచిపెట్టి, శుద్ధబోధస్య=శుద్ధబుద్ధ స్వరూపునికి, కిం=ఏమి, కృత్యం=కర్తవ్యము, అవశిష్యతే=మిగులు చున్నది?

మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, పంచమహా భూతములు మఱియు వాటి కార్యరూపమగు జగత్తు అంతయు కేవల

నామరూపమాత్రము చేతనే ఉత్పన్న మగుచు ఆత్మకంటె భిన్న మైనదిగా తోచుచున్నది. కాని వాస్తవమునం దీ భేద మేమియు లేదు.

"వాచారంభణం వికారో నామధేయం
మృత్తికేత్యేవ సత్య"మితి శ్రుతేః ॥

కడవలు, మూకుళ్లు, ముంతలు మొదలగున వెన్నియో రూప నామములతో నెంచబడినను అవన్నియు మృత్తిక నుండియే కలిగినవి. కావున మృత్తికయే సత్యము. ఇవన్నియును నశ్వరములును, అసత్యములునై యున్నట్లు మహదాద్యహంకారకృత సమస్తప్రపంచమును మిథ్యయే; తదధిష్ఠాన మగు బ్రహ్మ మొక్కటియే సత్యము. ఇట్టి విచార జ్ఞానముతో ఈ సంపూర్ణజగత్తు కల్పిత మనియు, తదధిష్ఠాన మొక్కటియే సత్య మనియు తెలిసికొన్న జ్ఞాని కేవల శుద్ధ చైతన్యస్వరూపుడై యుంటున్నాడు. అతనికి చేయవలసిన దేదియు మిగిలియుండదు.

అవ॥ అయితే అనర్థనివారణకొఱకైనను ప్రయత్నము చేయవలసి యున్నది గదా! యనినచో చెప్పుచున్నాడు.

**భ్రమభూత మిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ ।**
**అలక్ష్యస్ఫురణః శుద్ధః స్వభావేనైవ శామ్యతి ॥ 70**

ఇదం=ఈ, సర్వం=సమస్త ప్రపంచము, భ్రమభూతం=భ్రాంతి మూలము, కించిత్=కొంచెమైనను, నాస్తి=లేనిది, ఇతి=ఈ ప్రకారమగు, నిశ్చయీ=నిశ్చయము గలిగినటువంటిన్ని, శుద్ధః=పరిశుద్ధు డైనటువంటి, అలక్ష్యస్ఫురణః=చైతన్యాత్మానుభవము గల జ్ఞాని, స్వభావేనైవ= స్వాభావికముగనే, శామ్యతి=శాంతిని పొందుచున్నాడు.

అధిష్ఠాన బ్రహ్మసాక్షాత్కారము గలిగిన జ్ఞానికి ఈ జగత్తంతయు కల్పితమని ప్రతీత మగును. వాస్తవముగా ప్రపంచ సంబంధ మగు ఏ వస్తువుగూడ సత్యమైనదని అతడు తలంచడు. ఎవనికి ఇట్టి జ్ఞానము కలిగినదో అట్టివాడు శాంతికొఱకు ప్రయత్నమును చేయడు. ఎందుకనగా అతడు స్వాభావికముగనే శాంతస్వరూపుడై యున్నాడు. మఱల శాంతికొఱకు అతడు చేయదగిన దేదియు నుండదు.

**శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావమపశ్యతః ।**
**క్వ విధిః క్వ చ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపి వా ॥ 71**

దృశ్యభావం=దృశ్యభావమును, అపశ్యతః=చూడనటువంటి, శుద్ధస్ఫురణ రూపస్య=శుద్ధప్రకాశస్వరూపు డగు జ్ఞానికి, విధిః=విహిత కర్మానుష్ఠాన రూపవిధి, క్వ=ఎక్కడ?, వైరాగ్యం=వైరాగ్యము, క్వ=ఎక్కడ? త్యాగః= త్యాగము, క్వ=ఎక్కడ?, శమోఽపి=శమముగూడ, క్వ=ఎక్కడ?

శుద్ధస్వరూప స్వప్రకాశ చిద్రూపుడై ఆత్మయందు ఆత్మదర్శనము జేయుచున్న జ్ఞాని యీ దృశ్యపదార్థమును జూడడు. దృశ్యపదార్థస్ఫురణయే లేనివానికి త్యాగమెక్కడ? విరాగమెక్కడ? విధి నిషేధము లెక్కడ? "నిస్త్రైగుణ్యేపథి, విచరతాం కో విధిః కో నిషేధః"

**స్ఫురతోఽనంతరూపేణ ప్రకృతిం చ న పశ్యతః ।**
**క్వ బంధః క్వ చ వా మోక్షః క్వ హర్షః క్వ విషాదతా ॥ 72**

అనంతరూపేణ=అనంతరూపములతో, స్ఫురతః=ప్రకాశించు చున్నప్పటికి, ప్రకృతిం=మాయను, న పశ్యతః=చూడనటువంటి జ్ఞానికి,

బంధః=బంధము, క్వ=ఎక్కడ? మోక్షః=మోక్షము, క్వ=ఎక్కడ?, హర్షః= సంతోషము, క్వ=ఎక్కడ?, విషాదతా=దుఃఖము, క్వ=ఎక్కడ?

అనంత పరిపూర్ణ చిద్రూపుడై సర్వత్ర ప్రకాశించుచు ప్రకృతి స్ఫురణమే లేని జ్ఞానికి బంధ మోక్షములు, హర్షవిషాదములు నుండవు.

బుద్ధిపర్యంతసంసారే మాయామాత్రం వివర్తతే ।
నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః ॥ 73

బుద్ధిపర్యంతసంసారే=బుద్ధిపర్యంత సంసారమునందు, మాయా మాత్రం=మాయావిశిష్టమగు చైతన్యము, (జగత్=ప్రపంచమును), వివర్తతే=కల్పన జేయుచున్నది, బుధః=జ్ఞాని, నిర్మమః=మమతా రహితుడును, నిరహంకారః=అహంకార రహితుడును, నిష్కామః=కామ రహితుడునై, శోభతే=ప్రకాశించుచున్నాడు.

ఆత్మజ్ఞానపర్యంతమే గదా సంసారము. అనగా ఆత్మజ్ఞానోత్పత్త్య నంతరము నశించిన యీ ప్రపంచము మాయా విశిష్టచైతన్యమువలన కల్పింపబడుచున్నది. ఆత్మజ్ఞానోదయానంతరము జగత్తే నశించిపోవు చున్నది. ఇట్టి నిశ్చయజ్ఞానము గల మహాత్ముడు అహంకారమును గాని, మమకారమును గాని, కామనాభావమును గాని గలిగియుండడు. అనగా ఇది నా శరీరము, నేను, వీరు, నా పుత్ర కళత్రాదులను అహంతా మమతలు గలిగియుండడు. ఈ వివర్తాది వాదములు మూడు విధములు.

వివర్తము॥ అసలు వస్తువునకు మార్పు లేకయే మఱియొక భిన్నవస్తువుగ దోచుట.

ఉ: రజ్జువు సర్పముగ దోచుట.

**పరిణామము ॥** అసలు వస్తువు మఱియొకటిగ మారుట.

ఉదా: పాలు పెరుగగుట.

**ఆరంభము ॥** అత్యల్పవస్తువులు కలసి సజాతీయ మగు నొక పెద్ద వస్తు వగుట.

ఉదా: నూలు వస్త్ర మగుట.

**అక్షయం గతసంతాపమాత్మానం పశ్యతో మునేః ।**
**క్వ విద్యా చ క్వ వా విశ్వం క్వ దేహోఽహం మమేతి చ ॥ 74**

అక్షయం=నాశరహిత మైనటువంటిన్ని, గతసంతాపం=సంతాప రహిత మైనటువంటి, ఆత్మానం=ఆత్మను, పశ్యతః= చూచుచున్నటువంటి, మునేః= మునికి, విద్యా=శాస్త్రము, క్వ=ఎక్కడ?, విశ్వం=ప్రపంచము, క్వ=ఎక్కడ, దేహః=దేహము, క్వ=ఎక్కడ, అహం మమ ఇతి చ=నేను నాది యనెడి భావము, క్వ=ఎక్కడ?

నాశరహిత మైనట్టియు, సంతాపరహిత మైనట్టియు స్వాధిష్ఠాన సచ్చిదానంద పరమాత్మను దర్శించుచున్న జ్ఞానికి, ఆత్మాతిరిక్తము లగు శాస్త్రవిమర్శనము, ప్రపంచము, దేహము, అహంకారము, మమకారము మొదలగు వానితో ప్రసక్తియే లేదు. అతడెల్లప్పుడును సాక్షిస్వరూపుడై ప్రకాశించును.

**నిరోధాదీని కర్మాణి జహాతి జడధీర్యది ।**
**మనోరథాన్ ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్యతత్క్షణాత్ ॥ 75**

జడధీః=అజ్ఞాని, నిరోధాదీని=చిత్తనిరోధము మొదలగు, కర్మాణి= కర్మలను, జహాతి యది=విడచిపెట్టుచున్నవా డైనప్పటికిని,

అతత్క్షణాత్=కొంతసేపటికి, మనోరథాన్=కోరికలను, ప్రలాపాన్=సంభాషణలను, కర్తుం=చేయుటకు, ఆప్నోతి=ప్రవృత్తు డగుచున్నాడు.

మూఢుడగు అజ్ఞానిగూడ చిత్తనిరోధము మొదలగు కర్మలను విడిచి పెట్టిన వాడై నప్పటికి మఱల మనోరథములు నెరవేరుటకై తత్సంబంధమగు సకల కార్యములు చేయుచుండును. కావున అజ్ఞానియొక్క చిత్తనిరోధాది కర్మత్యాగము గజస్నానమువలె నిష్ప్రయోజనము.

**మందః శ్రుత్వాఽపి తద్వస్తు న జహాతి విమూఢతామ్ ।**
**నిర్వికల్పో బహిర్యత్నా దన్తర్విషయలాలసః ॥ 76**

మందః=మూర్ఖుడు, తద్వస్తు=ఆ యాత్మవస్తువును, శ్రుత్వా అపి=వినినప్పటికిని, విమూఢతాం=మూఢత్వమును, న జహాతి=విడిచిపెట్టడు, బహిః=వెలుపటిదైన, యత్నాత్=యత్నమువలన, నిర్వికల్పః=సంకల్పరహితుడు, పరం తు=కాని, అంతః=లోపల, విషయలాలసః= విషయలాలసుడు, భవతి=అగుచున్నాడు.

ఆత్మతత్త్వ స్వరూపము ఇట్టిదని వినియును మూర్ఖుడు తన మూఢత్వమును విడువలేడు. కావున మూఢుడు చిత్తనిరోధాదిక ప్రయత్నమును విడిచి జ్ఞానివలె మెలగి నిర్వ్యాపారుడై యుండినను మనస్సులో విషయములను ధ్యానించుచునే యుండును.

**జ్ఞానాద్గళితకర్మా యో లోకదృష్ట్యాఽపి కర్మకృత్ ।**
**నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన ॥ 77**

యః=ఎవడు, జ్ఞానాత్=జ్ఞానమువలన, గళితకర్మా=నష్టమైన కర్మలు

గలవాడై, లోకదృష్ట్యా=లోకదృష్టికి, కర్మకృత్అపి=కర్మ చేయుచున్న వానివలె నున్నాడో, సః=అట్టివాడు, కించన=కొంచెముగూడ, కర్తుం= చేయుటకు గాని, వక్తుం=మాట్లాడుటకు గాని, అవసరం=అవసరమును, నాప్నోతి=పొందడు.

జ్ఞానోదయమువలన సమస్తాధ్యాసకర్మలు నష్టమైపోయిన జ్ఞానిలో లోకదృష్టికి కర్మ చేయుచున్నవానివలె కనబడినను "నే నీ కర్మ చేయు చున్నాను. నేను దీని ననుభవించుచున్నా" ననెడి ధ్యాస లేని వాడగుటవలన నిర్లిప్తుడై నిరంతర బ్రహ్మానంద నిమగ్నుడై యుండును.

**క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వ చ న కించన ।**
**నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా ॥ 78**

సర్వదా=ఎల్లప్పుడు, నిర్వికారస్య=వికారరహితుడును, నిరాతంకస్య= సంతాపభయాది రహితుడును నగు, ధీరస్య=జ్ఞానికి, తమః= తమస్సు, క్వ=ఎక్కడ?, ప్రకాశః=ప్రకాశము, క్వ=ఎక్కడ, హానం=త్యాగము, న కించన=కొంచముగూడా లేదు (విడిచిపెట్టవలసిన దేమియు లేదు.)

ఓ శిష్యా! మోహాది రూప సమస్త వికారములనుండి దూరుడైన జ్ఞాని దృష్టిలో అంధకార మెక్కడ? తమస్సే లేనప్పుడు ప్రకాశముతో పని ఏమి? అనగా అజ్ఞానమే లేనప్పుడు జ్ఞానముతో పని ఏమున్నది? ఈరెండును సాపేక్షికములు. ఒకటి లేనప్పుడు రెండవదాని స్థితికే ఆస్కారము లేదు. లౌకికదృష్టివలన గదా అంధకార ప్రకాశముల భావము. జ్ఞానదృష్టివలన లౌకికదృష్టి నష్టమైన తరువాత అంధకార ప్రకాశముల ప్రసక్తే అచట ఉండదు. అందువలన జ్ఞానికి కాలాది భయముకూడా లేదు. అతనికి

హాని లేదు, వృద్ధి లేదు, ఒకనిపైన ద్వేషము లేదు, రాగము లేదు, గ్రహణము లేదు, త్యాగము లేదు, అతడు సదా సచ్చిదానంద స్వరూపుడు.

**క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాంతకతాఽపి వా ।**
**అనిర్వాచ్య స్వభావస్య నిస్స్వభావస్య యోగినః ॥ 79**

అనిర్వాచ్యస్వభావస్య=అనిర్వాచ్య స్వభావము గలిగినటువంటిన్ని, నిస్స్వభావస్య=స్వభావ రహితు డైనటువంటి, యోగినః=యోగికి, ధైర్యం=ధీరత, క్వ=ఎక్కడ?, వివేకిత్వం=వివేకిత్వము, క్వ=ఎక్కడ?, నిరాంతకతా అపి=నిర్భయత్వముకూడ, క్వ=ఎక్కడ?

ఎట్టి స్వభావమును లేక అనిర్వాచ్య (యెన్న శక్యము గాని) స్వభావము గల జ్ఞానికి ధైర్య వివేక నిర్భయతాది ధర్మములు సయితము లేవు. సదానందరూప సచ్చిదాత్మునకు ఈ ధర్మములతో నిమిత్త మేమి?

**న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తిర్న చైవ హి ।**
**బహునాఽత్ర కిముక్తేన యోగదృష్ట్యా న కించన ॥ 80**

జ్ఞానినః=జ్ఞానికి, న స్వర్గః=స్వర్గము లేదు, నైవ నరకః=నరకము లేదు, జీవన్ముక్తిః ఏవ=జీవన్ముక్తియు, న=లేదు, అత్ర=ఈ విషయమై, బహునా=అనేకము, ఉక్తేన=చెప్పుటచేత, కిం=ఏమి ప్రయోజనము, (యోగినః=యోగికి) యోగదృష్ట్యా=యోగదృష్టిచేత, న కించన = ఏమియు లేదు.

జీవన్ముక్తుడగు ఆత్మజ్ఞాని దృష్టిలో స్వర్గమూ లేదు. నరకమూ లేదు.

ప్రశ్న ॥ అయితే నాస్తికులు గూడా స్వర్గ నరకములు లేవని

చెప్పుచున్నారు. అందువలన జీవన్ముక్తునకు నాస్తికునకు మఱి భేదమే లేదన్నమాట.

నాస్తికుని దృష్టిలో ఈలోక మున్నది, పరలోకము లేదు. మఱియు అతని దృష్టిలో ఆత్మగూడ లేదు. అతడంతయు శూన్యమనే తలంచు చున్నాడు. మఱి జీవన్ముక్తు డగు జ్ఞానిదృష్టిలో ఇహలోకము, పరలోకము రెండునూ లేవు. మఱేమనగా సర్వత్ర పరిపూర్ణ పరమాత్మయే వ్యాపకమై యున్నది. జ్ఞానిదృష్టిలో ఆత్మకంటె అతిరిక్తమైన మఱియొక వస్తువేదియును లేదు.

అవ॥ జ్ఞాని నిరంతరము పరమానంద పరిపూర్ణుడై యుండుటచేత దేహధారణకై యితరులను ప్రార్థింపడు. ఏదియును దొరకని యెడల పరితపింపడు అని చెప్పుచున్నాడు.

**నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి ।**
**ధీరస్య శీతలం చిత్తమమృతే నైవ పూరితమ్ ॥ 81**

ధీరస్య=జ్ఞానియొక్క, చిత్తం=చిత్తము, అమృతేన ఏవ= అమృతముచేత, పూరితమ్=నిండింపబడినదై, శీతలం=చల్లనైనది. (అత ఏవ=కనుకనే,) సః=ఆజ్ఞాని, లాభం=లాభమును, న ప్రార్థయతే=కోరడు, చ=మఱియు, అలాభేన=లాభము లేకపోవుటచే, న అనుశోచతి=దుఃఖింపడు.

జీవన్ముక్తు డగు జ్ఞాని లాభము రావలయు ననియు ప్రార్థింపడు. రానిచో 'రాలే'దే యని ఖేదపడడు. ఆతని చిత్తము నిరంతరము పరమానం దామృతము ద్వారా తృప్తి నొందినదై తన్మయీభావము నొందును.

**న శాంతం స్తౌతి నిష్కామో న దుష్ట మపి నిన్దతి ।**
**సమదుఃఖసుఖస్తృప్తః కించిత్ కృత్యం న పశ్యతి ॥ 82**

నిష్కామః=కామనారహితు డగు జ్ఞాని, శాంతం=శాంతపురుషుని, న స్తౌతి=స్తుతించడు, దుష్టమపి=దుష్టునైనను, న నిందతి= నిందించడు, సమదుఃఖసుఖః=సుఖదుఃఖములను సమానముగా చూచుచున్నవాడై, తృప్తః=ఆనందితుడై, కించిత్=కొంచెమైనను, కృతం=ఇది చేయదగినది, న పశ్యతి=చూడడు.

నిష్కాము డగు జ్ఞాని శాంత్యాది శుద్ధ సత్య గుణాధికులను జూచి వారలను స్తుతింపడు. దుష్టు లగువారు తనను నిష్ఠురము లాడి హింసించినను వారలను నిందింపడు. నిత్యతృప్తుడై ఆనందాబ్ధిలో నిమగ్నుడై సుఖదుఃఖముల రెండింటిని సమానముగా జూచును. మఱియు,

**నిః స్తుతిర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవ చ ।**
**చలాచలానికేతశ్చ యతిర్నిష్కాముకో భవేత్ ॥**

దీని అర్థము పైన వివరించినదే.

**ధీరో న ద్వేష్టి సంసారమాత్మానం న దిదృక్షతి ।**
**హర్షామర్షవినిర్ముక్తో న మృతో న జీవతి ॥ 83**

ధీరః=జ్ఞాని, సంసారం=సంసారమును (ప్రపంచమును), న ద్వేష్టి=ద్వేషింపడు, న దిదృక్షతి=చూచుటకైన ఇచ్ఛగింపడు. హర్షామర్ష వినిర్ముక్తః=సంతోష రోషములు లేనివాడు గనుకనే (సః అతడు), న మృతః=చచ్చినవాడు గాడు, న జీవతి=జీవించువాడను గాడు (అనగా జనన మరణ రహితుడని భావము).

జీవన్ముక్తు డగు జ్ఞాని సంసారమును (ప్రపంచమును)ద్వేషింపడు. ఎందుకనగా అతనిది నిరంతరము ఆత్మదృష్టి అయినందున దీనిని చూచుటకే అతడు ఇచ్ఛ చేయడు. ఒకవేళ ప్రపంచమును చూచినట్లయితే బాధితానువృత్తి ద్వారా చూచుచున్నాడు. అందువలన నతడు సంసారమును ద్వేషింపడు. పరిపక్వావస్థయందు జ్ఞాని ఆత్మను గూడ చూడడని చెప్పవలసి యున్నది. ఎందుకనగా స్వయముగా తానే ఆత్మయై యున్నప్పుడు మఱి చూడబడు వస్తువు వేరే ఎక్కడున్నది? ఆ కారణమువలన నతడు హర్ష శోకాది రహితుడును జనన మరణ రహితుడును నై యున్నాడు.

**నిస్స్నేహః పుత్ర దారాదౌ నిష్కామో విషయేషు చ ।**
**నిశ్చింతః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః ॥ 84**

పుత్రదారాదౌ=భార్యాబిడ్డలయందు, నిఃస్నేహః=స్నేహ రహితుడై, విషయేషు=విషయములయందు, నిష్కామః=కామనారహితుడై, అపి చ=మఱియు, స్వశరీరే=స్వశరీరమునందు, నిశ్చింతః=చింతారహితుడై, బుధః=జ్ఞాని, శోభతే=ప్రకాశించుచున్నాడు.

జీవన్ముక్తుడగు జ్ఞాని భార్యాపుత్రులయందు వ్యామోహము నొందడు. మఱియు భోగాదులయందు ఆసక్తి గలిగియుండడు. తన శరీర పోషణమునకై భోజనాది కృత్యముల విషయమున చింతించడు. కావుననే అతడు సర్వత్ర ప్రకాశ స్వరూపుడై వెలుగొందుచున్నాడు.

**తుష్టిస్సర్వత్ర ధీరస్య యథా పతితవర్తినః ।**
**స్వచ్ఛందం చరతో దేశాన్యత్రాస్తమితశాయినః ॥ 85**

యత్ర=ఎచ్చట, అస్తమితశాయినః=సూర్యు డస్తమించుచున్నాడో అచట పండుకొనుచున్నటువంటిన్ని, స్వచ్ఛందం=ఇచ్ఛానుసారముగా, దేశాన్=దేశములను, చరతః=తిరుగుచున్నటువంటిన్ని, యథా పతిత వర్తినః=ప్రారబ్ధానుసారముగా వచ్చిన వాటితో తృప్తు డైనటువంటి, ధీరస్య=జ్ఞానికి, సర్వత్ర=అంతట, తృప్తిః=తృప్తి, భవతి=అగుచున్నది.

జీవన్ముక్తు డగు జ్ఞాని ప్రారబ్ధవశమున నేయే పదార్థములు ప్రాప్తించుచున్నవో, ఆ యా పదార్థములతో నా యా విధముల సంతుష్టు డగుచున్నవాడై మఱియు స్వచ్ఛందముగా నానా ప్రకారములుగ దేశముల యందును, అడవులయందును, నగరాదులయందును సంచరించుచు నిరంతరము సంతుష్టుడై ఉంటున్నాడు.

**పతతూదేతు వా దేహో నాస్య చింతా మహాత్మనః ।**
**స్వభావభూమి విశ్రాంతి విస్మృతాశేషసంస్మృతేః ॥ 86**

స్వభావభూమివిశ్రాంతిః=స్వభావమనే భూమియందు విశ్రమించు చున్నటువంటిన్ని, విస్మృతాశేషసంస్మృతేః=సమస్త సంస్కారములను మరచినటువంటి, అస్య=ఈ జీవన్ముక్తు డగు, మహాత్మనః=మహాత్ము నకు, దేహః=దేహము, ఉదేతు=ఉండునుగాక, వా=లేక, పతతు=నాశన మగుగాక, చింతా=చింత, న=లేదు, (ఉండదు.)

జీవన్ముక్తు డగు జ్ఞానికి నిజస్వరూపమే అధిష్ఠానభూమి. అదియే విశ్రాంతి స్థానము. ఎవడు తన స్వరూపమగు అధిష్ఠానమునందు విశ్రాంతిని బొందుచు సర్వమును విస్మరించుచున్నాడో, యీ దేహ ముండినను, నశించినను కొంచెముగూడ చింత యెవని కుండదో, వాడే జీవన్ముక్తుడు.

అతడే సంసారమునుండి విముక్తిని బొందినవాడు (స్వభావభూమి యనగా అధిష్ఠానాత్మ యని అర్థము.)

**అకించనః కామచారో నిర్ద్వంద్వశ్ఛిన్న సంశయః ।**
**అసక్తస్సర్వభావేషు కేవలో రమతే బుధః ॥ 87**

అకించనః=దీనభావరహితుడై, కామచారః=విధినిషేధ రహితుడై, నిర్ద్వంద్వః=ద్వంద్వభావ రహితుడై, ఛిన్నసంశయః=సంశయరహితుడై, సర్వభావేషు=సమస్తభావములయందును, అసక్తః=ఆసక్తిరహితుడై, బుధః= జ్ఞాని, కేవలః=ఎట్టి వికారములు లేనివాడై, రమతే= విహరించు చున్నాడు.

జీవన్ముక్తుడగు నిర్వికారియై సంసారమునందు మెలగుచున్నాడు. అతని దగ్గఱ ఎట్టి సంచితమును ఉండదు. అతడు విధి నిషేధములకు కింకరుడు గాడు. స్వచ్ఛందముగా తన యిచ్చానుసారము తిరుగును. సుఖదుఃఖాది ద్వంద్వరహితుడును సమస్తసంశయ రహితుడునై అతడు ఏ పదార్థమునందును ఆసక్తి నిడడు.

**నిర్మమః శోభతే ధీరః సమలోష్టాశ్మకాంచనః ।**
**సుభిన్నహృదయగ్రంథిర్నిర్ధూతరజస్తమః ॥ 88**

నిర్మమః=మమతారహితుడును, సమలోష్టాశ్మకాంచనః=మట్టిపెళ్లను, బంగారపుముద్దను సమానముగా చూచువాడును, సుభిన్న హృదయ గ్రంథిః=బాగుగా భేదింపబడిన హృదయగ్రంథులు గలవాడును, నిర్ధూతరజస్తమః=ఎగురగొట్టబడిన రజస్తమోగుణములు గలవాడును నగు, ధీరః=జ్ఞాని, శోభతే=ప్రకాశించుచున్నాడు.

మమతారహితు డగు జ్ఞాని ప్రకాశస్వరూపుడై సర్వోత్కృష్టు డగుచున్నాడు. ఎందుకనగా అతని దృష్టిలో మట్టిపెళ్లయు, బంగారమును ఒక్కటియే. ఆత్మజ్ఞానబలమువలన అతని హృదయగ్రంథులు ఛిన్నాభిన్నములై రజస్తమోరూపమైన మలము మచ్చునకైనను కనిపించక మాయమై పోవుచున్నది.

**సర్వత్రానవధానస్య న కించిద్వాసనా హృది ।**
**ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే ॥ 89**

సర్వత్ర=అన్ని విషయములయందు, అనవధానస్య=ఆసక్తి రహితుడై నటువంటియు, హృది=హృదయమునందు, కించిత్=కొంచెమైనను, వాసనా=వాసన, న=లేనట్టియు, తృప్తస్య=నిత్యతృప్తు డైనట్టియు, మహాత్మనః=మహాత్ముడైన, ఈదృశస్య=ఇటువంటి జ్ఞానికి, కేన= ఎవనితో, తులనా=సాదృశ్యము, జాయతే=అగుచున్నది (అతనికి సాటి యెవ్వరును లేరని భావము.)

ఏ విషయమునందును మనస్సుతో నెవనికి అభిరుచి కలుగ లేదో, అనగా విషయసుఖముల ననుభవింపవలెనను కోరిక లేదో, ఎవని హృదయమునందు వాసనాలేశము కొంచెమైనను లేదో- అతడే అధ్యాస రహితుడైన జ్ఞాని. అట్టి జ్ఞానిని ఎవనితో సాదృశ్యము చేయనగును? జ్ఞానికి జ్ఞానియే సాటి.

**జానన్నపి న జానాతి పశ్యన్నపి న పశ్యతి ।**
**బ్రువన్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనాదృతే ॥ 90**

జానన్ అపి=తెలిసికొనుచున్నవాడైనను, (యః=యెవడు), న

జానాతి=తెలిసికొనుట లేదో, పశ్యన్ అపి=చూచుచున్న వాడైనను, న పశ్యతి=చూచుట లేదో, బ్రువన్ అపి=మాట్లాడుచున్న వాడైనను, న బ్రూతే=మాట్లాడుట లేదో, సః=అట్టివాడు, నిర్వాసనాత్ ఋతే=వాసనా రహిత పురుషునికంటె, అన్యః=ఇతరుడు, కః=ఎవడు?

జీవన్ముక్తు డగు జ్ఞాని పదార్థములను తెలుసుకొనుచున్నవానివలె నున్నను తెలిసికొనడు, చూచుచున్నట్లుండినను చూడడు, మాట్లాడు చున్నట్లుండినను మాట్లాడడు. లోకదృష్టికి మాట్లాడుచున్నట్లు, చూచు చున్నట్లు, తెలిసికొనుచున్నట్లు ఉండినను పరమార్థదృష్టికి చూచుట లేదు. తెలిసికొనుట లేదు. మాట్లాడుట లేదు. వాసనారహితు డగు జ్ఞానికి తప్ప తక్కినవాని కెవనికిని అట్లు చేయుటకు సాధ్యపడదు.

**భిక్షుర్వా భూపతిర్వాఽపి యో నిష్కామస్స శోభతే ।**
**భావేషు గళితా యస్య శోభనాఽశోభనా మతిః ॥ 91**

యస్య=ఎవనియొక్క, శోభనా=శ్రేష్ఠమైనట్టి గాని, అశోభనా= అశ్రేష్ఠమైనట్టి గాని, మతిః=బుద్ధి, భావేషు=సమస్తభావముల విషయమై, గళితా= జారిపోయినదో (నశించినదో), సః=అట్టి, నిష్కామః=కామనా రహితు డగువాడు, భూపతిః వా=రాజే యగుగాక!, వా=లేక, భిక్షుః వా= సన్న్యాసియే యగుగాక, శోభతే=శోభాయమాను డగుచున్నాడు.

ఉత్తమ పదార్థములయందు ఇచ్ఛ గాని, అనుత్తమ పదార్థముల యందు ద్వేషబుద్ధి గాని లేనివాడే నిష్కామి. అట్టి నిష్కాము డగువాడు భిక్షువగు గాక! లేక భూపతి యగుగాక! ప్రపంచమున నతడే సర్వోత్కృష్టు డగుచున్నాడు. రాజులై యుండి నిష్కాములైన శ్రీరామచంద్రమూర్తి

మొదలగువారి యశస్సు ఇంతవరకు గానము చేయబడుచునే యున్నది. మఱియు విరక్తులలో జడ భరత, దత్తాత్రేయ, యాజ్ఞవల్క్యాది మహాపురుషుల పవిత్రచరితము హస్తాకమలమువలె అందరి దృష్టియందు తాండవ మాడుచున్నది.

అవ॥ బ్రహ్మాభావనచే నంతట సమభావము గల జ్ఞానికి కర్తృత్వా ధ్యాసము లేనందున నియమముతో పని లేదని చెప్పుచున్నాడు.

**క్వ స్వాచ్ఛంద్యం క్వ సంకోచః క్వ వా తత్త్వవినిశ్చయః ।**
**నిర్వ్యాజార్జవభూతస్య చరితార్థస్య యోగినః ॥ 92**

నిర్వ్యాజార్జవభూతస్య=నిష్కపట సరళరూపు డైనట్టియు, చరితార్థస్య= యథోచిత ప్రయోజనమును పొందినట్టియు, యోగినః=యోగికి, స్వాచ్ఛంద్యం=స్వచ్ఛందత, క్వ=ఎక్కడ?, సంకోచః=సంకోచము, క్వ=ఎక్కడ, వా=లేక, తత్త్వ వినిశ్చయః=తత్త్వనిశ్చయము, క్వ=ఎక్కడ?

నిష్కపటియు, నిర్మలుడును, సరళవర్తనుడును, స్వాత్మ నిష్ఠా పరుడును, స్వచ్ఛంద విహారియు నగు జ్ఞానికి సంకోచ మెక్కడ? వృత్త్యాది స్వేచ్ఛాసంచరణ మెక్కడ? పదార్థాధ్యాసయే లేని వీనికి కర్తృత్వ మెక్కడ?

**ఆత్మవిశ్రాంతి తృప్తేన నిరాశేన గతార్తినా ।**
**అంతర్య దనుభూయేత తత్కథం కస్య కథ్యతే ॥ 93**

ఆత్మ విశ్రాంతి తృప్తేన=ఆత్మయందే విశ్రాంతిబొంది తృప్తు డైనట్టియు, నిరాశేన=ఆశారహితు డైనట్టియు, గతార్తినా=దుఃఖలేశమే లేని జ్ఞానిచేత, అంతః=లోపల, యత్=ఏది, అనుభూయతే=అనుభవించుచున్నచో,

తత్=దానిని, కస్య=ఎవనికి, కథం=ఎట్లు, కథ్యతే=చెప్పబడుచున్నది?

ఆత్మారాముడై ఆత్మయందే తృప్తు డగువాడు శాంతపురుషుడు. అతడే సంసారరహితుడు. ఎవడు బ్రహ్మానందము ననుభవించుచున్నాడో ఆయానందము నతడు ఇతరులకు చెప్పజాలడు. ఎందుకనగా అది స్వసంవేద్యము, అనగా అనుభవైకవేద్యమేగాని 'ఇట్టిది' అని వచింప వలనుపడదు.

**సుప్తోఽపి న సుషుప్తౌ చ స్వప్నేఽపి శయితో న చ ।**
**జాగరేఽపి న జాగర్తి ధీర స్తృప్తః పదే పదే ॥ 94**

ధీరః=జ్ఞాని, సుషుప్తౌ అపి=సుషుప్తియందును, న సుప్తః=నిద్రించువాడు కాడు, స్వప్నే అపి=స్వప్నమునందును, న శయితః=పండుకొనువాడు కాడు, జాగరే అపి=జాగ్రదవస్థయందును, న జాగర్తి= మేలుకొనడు, అత ఏవ=ఈప్రకారము గానే, సః=అతడు, పదే పదే=మాటి మాటికి, తృప్తః=తృప్తుడగుచున్నాడు.

జీవన్ముక్తు డగు జ్ఞాని సుషుప్తియం దున్నవాడైనను ఆతడు సుషుప్తి గలవాడు కాడు. మఱియు స్వప్నావస్థను పొందిన వాడైనను స్వప్నస్థితి లేని వాడు. జాగ్రదవస్థలో మేలుకొన్న వాడైనప్పటికి మేలుకొనువాడును గాడు. ఎందుకనగా ఈ మూడవస్థలకు మూలమగు బుద్ధికిగూడ అతడు సాక్షియై దానికంటె విలక్షణుడై యున్నాడు.

**జ్ఞః సచింతోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః ।**
**సబుద్ధిరపి నిర్బుద్ధిః సాహంకారోఽనహంకృతిః ॥ 95**

జ్ఞః=జ్ఞాని, సచింతః అపి=చింతాసహితు డైనను, నిశ్చింతః=చింతా రహితుడు, సేంద్రియః అపి=ఇంద్రియములతో గూడుకొన్న వాడైనను, నిరింద్రియ=ఇంద్రియములు లేనివాడును, సబుద్ధిః అపి=బుద్ధితో కూడుకొన్న వాడైనను, నిర్బుద్ధిః=బుద్ధిరహితుడు, సాహంకారఃఅపి= అహంకారయుక్తు డైనను, అనహంకృతిః=అహంకారరహితుడుగా, భవతి=అగుచున్నాడు.

జ్ఞాని యగు జీవన్ముక్తుడు లోకులదృష్టిలో చింతాయుక్తునివలె తోచినను, వాస్తవమున కాతడు చింతా విముక్తుడే. లోకదృష్టిలో నతడు ఇంద్రియ సహితునివలె గానిపించినను, నిజమున కతడు ఇంద్రియ రహితుడే. అట్లే అతడు బుద్ధిసహితునివలె నున్నను బుద్ధి కతీతుడును, అహంకారయుతునివలె నున్నను అహంకార రహితుడై యున్నాడు. ఎందుకనగా అతనికి సర్వత్ర ఆత్మదృష్టి తప్ప వేరే దృష్టియే లేదు. స్వాత్మానంద నిమగ్ను డగువాడు ఇతరమును దేనినీ చూడడు.

**న సుఖీ న చ వా దుఃఖీ న విరక్తో న సంగవాన్ ।**
**న ముముక్షుర్న వా ముక్తో న కించిన్న చ కించన ॥ 96**

జ్ఞానీ=జ్ఞాని, సుఖీ=సుఖవంతుడు, న=కాడు, దుఃఖీ చ=దుఃఖితుడును, న=కాడు, విరక్తః=విరక్తుడును, న=కాడు, సంగవాన్=సంగియు, న=కాడు, ముముక్షుః=ముముక్షువు, న=కాడు, ముక్తః=ముక్తుడును, న=కాడు, (తస్య=అతనికి), కించిత్=ఏమియును, న=లేదు, కించన= ఏమియు, న=కాదు.

జీవన్ముక్తు డగు జ్ఞాని లోకదృష్టికి విషయభోగముల ద్వారా గొప్ప

సుఖవంతునివలె తోచుచున్నను, వాస్తవమున కాతడు విషయజన్య రహితుడు. మఱియు శారీరకాది రోగముల దృష్ట్యా దుఃఖివలె తోచినను ఆత్మదృష్టికి అతడు రోగాది రహితుడే. ఎందుకనగా అంతఃకరణాదులతో నాతని కాధ్యాసయే లేదు.

ప్రశ్న ॥ అధ్యాస యని దేనికి పేరు?

ఉ॥ "సత్యానృతవస్త్వభేద ప్రతీతిరధ్యాసః"

సత్యవస్తువునకు మిథ్యావస్తువునకును ఎచ్చట అభేదము తోచుచున్నదో అదియే అధ్యాస మనబడును. అనగా సత్యవస్తువు ఆత్మ. మిథ్యావస్తువు అంతఃకరణము. ఈరెండింటికి అభేదప్రతీతి అజ్ఞానికి కలుగుచున్నది. ఈ కారణము వలన అంతఃకరణ ధర్మములగు సుఖ దుఃఖాదులను ఆత్మ స్వరూపుడగు తనయం దారోపించుకొనుచున్నాడు. కావుననే అతడు సుఖిగను, దుఃఖిగను భావించుచున్నాడు. జ్ఞానికి అధ్యాస ఉండదు. ఆ కారణమున నతడు సుఖదుఃఖములు అంతఃకరణ ధర్మములని తలంచునే గాని స్వస్వరూపమగు ఆత్మ ధర్మములని తలంచడు. ఇందువలన నతడు సుఖ దుఃఖరహితుడై స్వరూపస్థితుడై యుంటున్నాడు. ఇటువంటి జీవన్ముక్తునకు విషయములయందు ద్వేషబుద్ధి లేని కారణమున విరక్తితో పని లేదు. మఱియు మొదటినుండియు నతడు బంధరహితు డైనందున ముముక్షుత్వముతో నిమిత్తము లేదు. బద్ధుడైన వాడు గదా ముక్తుడు కావలసియున్నది.

**విక్షేపేఽపి న విక్షిప్తస్సమాధౌ న సమాధిమాన్ ।**
**జాడ్యేఽపి న జడో ధన్యః పాండిత్యేఽపి న పండితః ॥ 97**

ధన్యః=ధన్యుడగు జ్ఞాని, విక్షేపే అపి=విక్షేపము కలిగిన దగుచుండగా, న విక్షిప్తః=విక్షిప్తుడు కాడు, సమాధౌ=సమాధియందున్నను, న సమాధిమాన్=సమాధి గలవాడు కాడు, జాడ్యే అపి=జడత్వమునందును, న జడః=జడుడు కాడు, పాండిత్యే అపి=పాండిత్యము గలవాడైనను, న పండితః=పండితుడు కాడు.

ప్రపంచమునందు జ్ఞాని మిగుల ధన్యుడు. ఎందుకనగా లోకదృష్టికి అతనికి విక్షేపము కలిగినట్లుండినను స్వప్రకాశాత్మానుభవమునం దుండుటచేత నతడు విక్షిప్తుడు కాడు. లోకదృష్టికి అతడు సమాధియం దున్నట్లున్నను కర్తృత్వాధ్యాస లేనివా డగుటచేత వాస్తవమునం దతడు సమాధి యందుండుట లేదు. జడుని విధముగా సంచరించుటవలన లోకు లతనిని జడుడని భావింతురు. కాని వాస్తవముగా నతడు ఆత్మదృష్టి గలవాడగుట చేత జడుడు గాడు. లోకదృష్టి కతడు పండితు డైనను 'నేను పండితుడ'నను అభిమానము లేకపోవుటచేత నతడు పండితుడు గాడు. ఈ కారణము వలన జ్ఞాని ధన్యుడు.

**ముక్తో యథా స్థితి స్వస్థః కృతకర్తవ్యనిర్వృతః ।**
**సమస్సర్వత్ర వైతృష్ణ్యాన్న స్మరత్యకృతం కృతమ్ ॥ 98**

ముక్తః=ముక్తుడగు జ్ఞాని, యథాస్థితి స్వస్థః=కర్మానుసారముగా ప్రాప్తవస్తువిషయమై స్వస్థచిత్తము గలవాడును, కృతకర్తవ్యనిర్వృతః= చేయబడి నట్టియు, చేయదగి నట్టియు కార్యముల విషయమై సంతుష్టి గలవాడును, సర్వత్ర=అంతట, సమః=సముడునై, వైతృష్ణ్యాత్=తృష్ణా రహితు డైనందువలన, అకృతం=చేయబడనట్టి గాని, కృతం= చేయబడినట్టి గాని కర్మ= కర్మను, న స్మరతి=స్మరింపడు.

జీవన్ముక్తునకు ప్రారబ్ధవశమువలన ఏ స్థితి సంభవించినను దానియం దాతడు స్వస్థచిత్తుడుగనే యుండును. కొంచెమైనను ఉద్వేగమును బొందడు, మఱియు పూర్వము చేయబడినట్టియు, పిదప చేయబడ నున్నట్టియు కర్మల విషయమై అతడు సంతుష్టచిత్తుడై యుండును. వాటిని నేను చేసితిని, వీటిని నేను చేయలేదని గాని, చేయ వలయునని గాని పట్టుదల అతని కెన్నడును ఉండదు. అసలు చేయబడినట్టి గాని, చేయబడకున్నట్టి గాని కర్మల స్మృతిగూడ వాని కుండదు.

**న ప్రీయతే వంద్యమానో నింద్యమానో న కుప్యతి ।**
**నై వోద్విజతి మరణే జీవనే నాభినందతి ॥ 99**

జ్ఞానీ=జ్ఞాని, వంద్యమానః=నుతింపబడినవాడై, న ప్రీయతే= సంతోషించడు, నింద్యమానః=నిందింపబడినవాడై, న కుప్యతి= కోపించడు, మరణే=మరణవిషయమై, న ఉద్విజతి=ఉద్వేగపడడు, జీవనే అపి= జీవించి యున్నందుకు, న అభినందతి=అభినందించడు.

జీవన్ముక్తు డగు జ్ఞాని ఇతరుల స్తోత్రములకు ఉప్పొంగడు. ఇతరులు దూషించినను కుపితుడు కాడు. మఱియు మృత్యువు ఎదురుగా వచ్చినను భయవిహ్వాలుడు కాడు. ఎందుకనగా అతనికి ఆత్మ జననమరణ రహితమైన దనియు నిత్యమైన దనియు దెలియును. జీవన్ముక్తునకు చిరకాలము జీవించవలెనని ఉండదు. మరణభయము ఉండదు. అతడు సదా ఏకరసాత్మమయుడై యుండును.

**న ధావతి జనాకీర్ణం నారణ్యముపశాంతధీః ।**
**యథా తథా యత్ర తత్ర సమ ఏవావతిష్ఠతే ॥** 100

టీక॥ ఉపశాంతధీః=ఉపశాంత చిత్తము గలజ్ఞాని, జనాకీర్ణం= జనముతో వ్యాప్తమైన ప్రదేశమునుగూర్చి గాని, అరణ్యం=అడవినిగూర్చి గాని, ధావతి=పరుగిడడు, కిం తు=మరేమనగా, యత్ర తత్ర=ఎక్కడో ఒకచోట, యథా తథా=ఏదోయొక విధముగా, సమ ఏవ=సమభావము గలవాడై, అవతిష్ఠతే=ఉంటున్నాడు.

జీవన్ముక్తుడును, ఉపశాంతశీలుడు నగు జ్ఞాని జనసమ్మర్ద మగు పట్టణాది ప్రదేశములను విడిచి అరణ్యములకు బోవ యత్నింపడు లేక నిర్జనప్రదేశములను విడిచి జనసమూహమునం దుండుటకు కోరడు. జనసమ్మర్దమునం దుండినను లేక నిర్జనారణ్యమునం దుండినను సదా ఆత్మారాము డగుటచే స్వస్థచిత్తుడై యుండును.

ఇది పదునెనిమిదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## పందొమ్మిదవ ప్రకరణము

## ఆత్మ విశ్రాంత్యష్టకము

అవ॥ ఈ విధముగా (శాంతి శతకము) తత్త్వజ్ఞానియొక్కశాంతి లక్షణమును గురుముఖమున వినినవాడై, శిష్యుడగు జనకుడు కృతార్థుడై తన గురువుగారితో ఆనందపూర్వకముగా నిట్లు తెలుపుచున్నాడు.

**తత్త్వవిజ్ఞానసందంశమాదాయ హృదయోదరాత్ ।**
**నానావిధపరామర్శశల్యోద్ధారః కృతో మయా ॥ 1**

భవతః=మీనుండి, తత్త్వవిజ్ఞానసందంశం=తత్త్వవిజ్ఞానమనే పట్టకారును, ఆదాయ=పొంది, హృదయోదరాత్=హృదయగర్భమునుండి, నానావిధపరామర్శశల్యోద్ధారః=అనేక ప్రకారము లగు సందేహ వివాద కంటకోద్ధరణము (తీసివేయుట), మయా=నాచేత, కృతః=చేయబడినది.

ఓ సద్గురూ! నేను తమయొక్క అనుగ్రహమువలన తమరిచ్చిన తత్త్వజ్ఞానరూప పట్టకారుతో నా హృదయకుహరములో గల సంకల్ప వికల్పరూప సందేహ కంటకములను పీకి పారవేసితిని. ఇప్పుడు నా చిత్త మెంతో ప్రశాంతముగా నున్నది.

క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితా ।
క్వ ద్వైతం క్వ చ వాఽద్వైతం స్వమహిమ్ని స్థితస్య మే ॥ 2

టీక॥ స్వమహిమ్ని=స్వకీయమహిమయందు, స్థితస్య=ఉంటున్న, మే=నాకు, ధర్మః=ధర్మము, క్వ=ఎక్కడ?, కామః=కామము, క్వ=ఎక్కడ? అర్థః= అర్థము, క్వ=ఎక్కడ?, వివేకితా=వివేక ముండుట, క్వ=ఎక్కడ?, ద్వైతం వా=ద్వైతము గాని, అద్వైతం=అద్వైతము గాని, క్వ=ఎక్కడ?

గురుదేవా! వినాశశీలము లగు ధర్మార్థ కామ మోక్షము లెక్కడ? వాటిని నా హృదయమునుండి దూరముగా నెట్టివేసితిని. ఇప్పుడు నేను నాస్వరూపస్థితియందే యుంటున్నాను. అందువలన నాకు వివేకముతో గూడ పనేమియు లేదు. మఱియు చైతన్యాత్మయందే విశ్రాంతి నొందుచున్న నాకు ద్వైతాద్వైతములతో కొంచెమైనను ప్రయోజనము లేదు.

"ఉత్తీర్ణే తు గతే పారే నౌకాయాః కిం ప్రయోజనమ్ ॥"

నదియొక్క ఆవలిదరికి చేరిన పిదప ఓడతో ప్రయోజన మేమియు నుండదు. అట్లే ద్వైతమునకు ఆత్మజ్ఞానమువలన బాధ గలిగిన పిదప అద్వైతముతోగూడ ప్రయోజన ముండదు. ద్వైతము లేనప్పుడు అద్వైతముతో నేమిపని? కావున ద్వైతాద్వైతములు రెండును నాయందు లేవు.

**క్వ భూతం క్వ భవిష్యద్వా వర్తమానమపి క్వ వా ।**
**క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే ॥ 3**

నిత్యం=ఎల్లప్పుడు, స్వమహిమ్ని=తన మహిమయందే, స్థితస్య= ఉంటున్నటువంటి, మే=నాకు, భూతం=భూతకాలము, క్వ=ఎక్కడ, భవిష్యత్=భవిష్యత్కాలము, క్వ=ఎక్కడ? వర్తమానం అపి వా=వర్తమాన కాల మయినను, క్వ=ఎక్కడ? దేశః=దేశము, క్వ=ఎక్కడ?

గురుదేవా! కాలముయొక్క స్ఫురణకూడ నాకు లేదు. నా దృష్టిలో భూత భవిష్యద్వర్తమాన కాలము లేవియు లేవు. ఎందుకనగా నేను నిత్యము నాస్వకీయ మహిమమునందే స్థితుడనై యుంటున్నాను. నాకు అన్నిటి యందును గనబడునది ఒక్క ఆత్మయే.

**క్వ చాత్మా క్వ చ వానాత్మా క్వ శుభం క్వాశుభం తథా।**
**క్వ చింతా క్వచ వాఽచింతా స్వమహిమ్ని స్థితస్య మే ॥ 4**

స్వమహిమ్ని=నామహిమయందే, స్థితస్య=ఉంటున్నటువంటి, మే=నాకు, ఆత్మా=ఆత్మ, క్వ=ఎక్కడ? వా=లేక, అనాత్మా=అనాత్మ, క్వ=ఎక్కడ, శుభం=శుభము, క్వ=ఎక్కడ, అశుభం=అశుభము, క్వ=ఎక్కడ? చింతా=విచారము, క్వ=ఎక్కడ? అచింతా=అచింత, క్వ=ఎక్కడ

గురుదేవా! నాయొక్క స్వమహిమ యందే స్థితుడనై యున్న నాదృష్టిలో ఆత్మ ఎక్కడ? అనాత్మ ఎక్కడ? ఆత్మానాత్మల వ్యవహారము అజ్ఞాని యగు మూర్ఖుని దృష్టిలో గలుగును గాని జ్ఞాని దృష్టిలో గలుగదు. మఱియు శుభము గానీ, అశుభము గాని, చింత గాని, నిశ్చింత గాని స్వమహిమయందున్న నాకు లేనే లేవు

**క్వ స్వప్నః క్వ సుషుప్తిర్వా క్వ చ జాగరణం తథా।**
**క్వ తురీయం భయం వాఽపి స్వమహిమ్ని స్థితస్య మే ॥ 5**

స్వమహిమ్ని=స్వకీయమహిమయందు, స్థితస్య=ఉంటున్న, మే=నాకు, స్వప్నః=స్వప్నము, క్వ=ఎక్కడ? సుషుప్తిః వా=సుషుప్తి గాని, క్వ=ఎక్కడ? తథా=అట్లే, జాగరణం=జాగ్రదవస్థ, క్వ=ఎక్కడ, తురీయం అపి=తురీయముగా, భయం=భయము గాని, క్వ=ఎక్కడ?

ఓ సద్గురూ! నా దృష్టిలో జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడును లేవు. ఎందుకనగా ఈ మూడువస్థలును బుద్ధి ధర్మములై యున్నవి. ఆ బుద్ధి గూడ మిథ్యాస్వరూపమై యున్నది. మఱియు అంతఃకరణ ధర్మము లగు తురీయావస్థయు భయాభయములును నాకు లేవు. ఎందుకనగా ఆ యంతఃకరణమును మిథ్యయే. నేను నిత్య ముక్త బుద్ధ స్వరూపుడను.

**క్వ దూరం క్వ సమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా ।**
**క్వ స్థూలం క్వ చ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే॥ 6**

స్వమహిమ్ని = స్వమహిమయందు, స్థితస్య = ఉంటున్నటు వంటి, మే= నాకు, దూరం = దూరము, క్వ = ఎక్కడ, సమీపం = సమీపము, క్వ = ఎక్కడ? బాహ్యం = భాహ్యము, క్వ = ఎక్కడ? అభ్యంతరం = అభ్యంతరము. క్వ = ఎక్కడ?, స్థూలం= స్థూలము,క్వ= ఎక్కడ? సూక్ష్మం=సూక్ష్మము, క్వ = ఎక్కడ?

సర్వత్ర పరిపూర్ణుడనై నిండియున్న నాకు దూర మెక్కడ? దగ్గ రెక్కడ? బాహ్య మెక్కడ? అభ్యంతర మెక్కడ? స్థూల మెక్కడ? సూక్ష్మ మెక్కడ? ఇవేవియును నాయందు పొసగవు, నేను పరిపూర్ణుడను.

**క్వ మృత్యుర్జీవితం వా క్వ లోకాః క్వాస్య క్వ లౌకికమ్ ।**
**క్వ లయః క్వ సమాధిర్వా క్వ మహిమ్ని స్థితస్య మే ॥ 7**

స్వమహిమ్ని=నా మహిమయందే, స్థితస్య=స్థితుడనైన, మే= నాకు, మృత్యుః=మృత్యువు, క్వ=ఎక్కడ? జీవితం=జీవితము, క్వ=ఎక్కడ, లోకాః=భూర్భువాది లోకములు, క్వ=ఎక్కడ? లౌకికం=

లోకవ్యవహారము, క్వ=ఎక్కడ, లయః=లయము, క్వ=ఎక్కడ? సమాధిః=సమాధి, క్వ= ఎక్కడ?

నిరంతరము తన స్వస్వరూప స్థితియందున్న జీవన్ముక్తుడగు జ్ఞానికి మృత్యువు, జీవనము, జననము, మరణము, లోకములు, లోక వ్యవహారములు, లయము, సమాధి- ఏవియును లేవు. త్రికాలాబాధ్యమై, ఏకరసమై యున్న ఆత్మకు ఈ ధర్మములే లేవు.

**అలం త్రివర్గకథయా యోగస్య కథయాఽప్యలమ్ ।**
**అలం విజ్ఞానకథయా విశ్రాంతస్య మమాత్మని ॥ 8**

ఆత్మని = ఆత్మయందు, విశ్రాంతస్య = విశ్రమించుచున్న, మమ= నాకు, త్రివర్గకథయా = ధర్మార్థకామముల వర్ణనముచేత, అలం= చాలును, యోగస్య = యోగముయొక్క, కథయా = కథనముచేత, అలం=చాలును, విజ్ఞానకథయా = విజ్ఞానకథనముచేత అలం = చాలును.

నిరంతరము ఆత్మయందే విశ్రమించుచున్న నాకు ధర్మార్థ కామములను వర్ణించుటవలనను, యోగమును అభివర్ణించుట వలనను, విజ్ఞానముగూర్చి చెప్పుటవలనను ప్రయోజనమేమి? ఈ ధర్మములకన్న భిన్నమైన ఆత్మ స్థితియందున్న నాకు వీటితో పని ఏమి? వీటికి విలక్షణ మగు ఆత్మస్వరూపుడను.

ఇది పందొమ్మిదవ ప్రకరణము.



ఓమ్

# అష్టావక్రగీత

## ఇరువదవ ప్రకరణము

## జీవన్ముక్తి చతుర్దశకము

అవ॥ ఇదివఱకు చెప్పిన ఆత్మవిశ్రాంతికి ఫలితమై జ్ఞానికి స్వభావ సిద్ధమగు జీవన్ముక్తిదశను శిష్యు డిప్పుడు నిరూపించుచున్నాడు.

**క్వ భూతాని క్వ దేహో వా క్వేంద్రియాణి క్వ వా మనః ।**
**క్వ శూన్యం క్వ చ నైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥ 1**

నిరంజనే = సర్వోపాధిమలశూన్యమైన, మత్స్వరూపే = నా యొక్క స్వరూపమునందు, భూతాని = పంచభూతములు, క్వ=ఎక్కడ? దేహః= దేహము, క్వ = ఎక్కడ? ఇంద్రియాణి = ఇంద్రియములు, క్వ = ఎక్కడ?, మనః = మనస్సు, క్వ =ఎక్కడ? శూన్యం= శూన్యము, క్వ = ఎక్కడ? నైరాశ్యం = ఆశాభావము (ఆకాశాభావము), క్వ=ఎక్కడ?

గురుదేవా! సంపూర్ణోపాధి మలశూన్యుడను గావుననే నేను నిరంజనుడను. అట్టి నిరంజనమగు నా స్వరూపమునందు పృథివ్యాది పంచభూతము లెక్కడ? (అనగా అవి నేను కానని భావము) సూక్ష్మ భూత కార్యములగు ఇంద్రియము లెక్కడ? మనస్సెక్కడ? శూన్యముకూడ నాయందు లేదు, ఎందుకనగా సద్రూపాత్మయందు శూన్యము త్రికాలముల యందును ఉండజాలదు. శూన్యము కల్పితము. అధిష్ఠానము లేనిదే శూన్యకల్పనకుగూడ అవకాశ మెక్కడ? ఈ సంపూర్ణ భూతేంద్రియాది

కల్పిత పదార్థములకు నేను సాక్షిభూతుడనై యున్నాను.

**క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వ వా నిర్విషయం మనః ।**
**క్వ తృప్తిః క్వ వితృష్ణత్వం గతద్వంద్వస్య మే సదా ॥ 2**

సదా=ఎల్లప్పుడు, గతద్వంద్వస్య=ద్వంద్వ రహితుడ నగు, మే=నాకు, శాస్త్రం=శాస్త్రము, క్వ=ఎక్కడ? ఆత్మవిజ్ఞానం=ఆత్మవిజ్ఞానము, క్వ=ఎక్కడ? నిర్విషయం=విషయరహితమైన, మనః=మనస్సు, క్వ =ఎక్కడ? తృప్తిః=తృప్తి, క్వ=ఎక్కడ? వితృష్ణత్వం=తృష్ణారహితత్వము, క్వ=ఎక్కడ?

సద్గురూ! ద్వంద్వాతీతుడ నగు నాకు శాస్త్రముతో గాని, శాస్త్రజన్య మగు జ్ఞానముతోగాని ప్రయోజన మేమి? ఆత్మవిశ్రాంతివలనగూడ నాకు గల ప్రయోజన మేమి? సమస్తమును విడిచిపోయిన తరువాత నాకు విషయవానన లెక్కడ? నిర్వాసనా లేదు, తృప్తి లేదు, అతృప్తి అంతకంటె లేదు. తృష్ణాద్వంద్వము, నిర్ద్వంద్వము మొదలగునవి నాకు లేనే లేవు.

**క్వ విద్యా క్వ చ వావిద్యా క్వాహం క్వేదం మమ క్వ వా ।**
**క్వ బంధః క్వ చ వా మోక్షః స్వరూపస్య క్వ రూపితా॥ 3**

స్వరూపస్య=అద్వితీయచిన్మాత్ర స్వరూపుడనగు నాకు, రూపితా=రూపము గలిగియుండుట, క్వ=ఎక్కడ?, విద్యా=విద్య, క్వ= ఎక్కడ?, అవిద్యా=అవిద్య, క్వ=ఎక్కడ?, అహం=అహంకారము, క్వ=ఎక్కడ?, ఇదం=ఈ బాహ్యప్రపంచము,క్వ=ఎక్కడ?, బంధః= బంధము, క్వ=ఎక్కడ, మోక్షః=మోక్షము, క్వ=ఎక్కడ?

అద్వితీయ చిన్మాత్రస్వరూపుడనగు నాకు రెండవ సంబంధము లేదు కనుక మనోధర్మములగు విద్యావిద్యలును, అహంకార మమ కారములును, బంధమోక్షములును లేవు. నాకు బాహ్యవస్తుసంబంధ మేమియును లేదు. సంబంధము దేనితో? రెండవ వస్తువుతో. అసలు రెండవ వస్తువే లేనిచో మఱి సంబంధ మెక్కడ?

**క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తిరపి క్వ వా ।**
**క్వ తద్విదేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥ 4**

సర్వదా=ఎల్లప్పుడును, నిర్విశేషస్య=విశేష (ధర్మాధర్మ) రహితుడ నగు, మే=నాకు, ప్రారబ్ధాని=ప్రారబ్ధములైన, కర్మాణి=కర్మములు, క్వ=ఎక్కడ? జీవన్ముక్తిః=జీవన్ముక్తి, క్వ=ఎక్కడ? తత్=ఆ, విదేహకైవల్యం=విదేహముక్తి, క్వ=ఎక్కడ?

గురుదేవా! నిర్విశేష: నిరాకార నిరవయవ ఆత్మస్వరూపుడ నగు నాకు ప్రారబ్ధకర్మ మెక్కడ? జీవన్ముక్తి విదేహకైవల్యము మొదలగు (కల్పిత) ధర్మములు నాకు లేనేలేవు.

**క్వ కర్తా క్వ చ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వ వా ।**
**క్వాపరోక్షం ఫలం వా క్వ నిస్స్వభావస్య మే సదా ॥ 5**

నిస్స్వభావస్య = స్వభావరహితుడనైన, మే=నాకు, కర్తా = కర్తృత్వముగాని, భోక్తా వా=భోక్తృత్వము గాని, క్వ=ఎక్కడ? నిష్క్రియం= క్రియారహితత్వము, క్వ=ఎక్కడ, స్ఫురణం వా=స్ఫురణము గాని, అపరోక్షం=ప్రత్యక్షజ్ఞానము గాని, ఫలం వా=ఫలము (విషయాకార వృత్త్య వచ్చిన్న చేతనత్వము) గాని, క్వ=ఎక్కడ?

ఏ స్వభావమును లేని నిర్వికార చిన్మాత్రస్వరూపుడ నగు నాకు కర్తృత్వ, భోక్తృత్వ, నిష్క్రియత్వ స్ఫురణములు లేవు. అపరోక్ష (వృత్తిరూప) జ్ఞానమును లేదు, ఎందుకనగా చిత్తస్ఫురణమువలన వృత్తిరూప జ్ఞానముత్పన్న మగుచున్నది. అట్టి చిత్తస్ఫురణముగూడ నాకు లేదు.

**క్వ లోకః క్వ ముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్ క్వ వా ।**
**క్వ బద్ధః క్వ చ వా ముక్తః స్వస్వరూపేఽహమద్వయే ॥ 6**

టీక॥ అహం=ఆత్మస్వరూపుడ నగు నేను, అద్వయే=అద్వైతమైన, స్వస్వరూపే=స్వస్వరూపమువందున్న వాడ నగుచుండగా, లోకః= లోకము, క్వ=ఎక్కడ? ముముక్షుః=ముముక్షువు, క్వ=ఎక్కడ?, యోగీ=యోగి, క్వ=ఎక్కడ? జ్ఞానవాన్=జ్ఞానవంతుడు, క్వ=ఎక్కడ?, బద్ధః=బద్ధు డగుట, క్వ=ఎక్కడ?, ముక్తః=ముక్తు డగుట, క్వ=ఎక్కడ?

అద్వైతాత్మస్వరూపుడ నగు నాయందు భూర్భువాది లోకములు లేవు. లోకములే లేనప్పుడు ముముక్షువే లేడు. ముముక్షుత్వమే లేనిచో జ్ఞానవంతుడగు యోగియే లేడు. ఇట్లగుటవలన ముక్తుడు లేడు, బద్ధుడు లేడు, కేవల అద్వైతరూప ఆత్మయే యున్నది.

**క్వ సృష్టిః క్వ చ సంహారః క్వ సాధ్యం క్వ చ సాధనమ్ ।**
**క్వ సాధకః క్వ సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ॥ 7**

అహం=నేను, అద్వయే=అద్వయమైన, స్వస్వరూపే=నా నిజ స్వరూపమునందు (ఉండగా), సృష్టిః=సృష్టి, క్వ=ఎక్కడ? సంహారః= సంహారము, క్వ=ఎక్కడ?, సాధ్యం=సాధ్యము, క్వ=ఎక్కడ?, సాధనం= సాధనము, సాధకః=సాధకుడు, క్వ=ఎక్కడ?, సిద్ధిర్వా=సిద్ధి అయినను, క్వ=ఎక్కడ?

సృష్టి గాని, ప్రళయము గాని, సాధ్యము గాని, సాధనము గాని, సాధకుడు గాని, సిద్ధి గాని- యివేవియు అద్వైత రూపాత్మయందు లేవు. అది కేవలము నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపము.

**క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వ చ ప్రమా ।**
**క్వ కించిత్క్వ న కించిద్వా సర్వదా విమలస్య మే ॥ 8**

సర్వదా=ఎల్లప్పుడు, విమలస్య=నిర్మలరూపుడనగు, మే-నాకు, ప్రమాతా=ప్రమాతా, క్వ=ఎక్కడ?, ప్రమాణం=ప్రమాణము, క్వ= ఎక్కడ?, ప్రమేయం=ప్రమేయము, క్వ=ఎక్కడ?, ప్రమా=ప్రమాజ్ఞానము, క్వ=ఎక్కడ, కించిత్=కించిత్తు (కొంచెము), క్వ=ఎక్కడ?, న కించిత్ వా=అధికము ఎక్కడ?

ఎవనికి ఒకప్పుడును ఉపాధిరూప మలదోషము లేదో, అనగా ఎవనికి ఉపాధిభూత శరీరాదికము ఒకప్పుడును లేదో, అట్టివానియందు ప్రమాతృత్వ మెక్కడ? ప్రమాణ మెక్కడ? ప్రమేయత్వ మెట్లు కలుగును? వాస్తవమునకు ప్రమాత, ప్రమాణము, ప్రమేయము- ఈ మూడును అజ్ఞానకార్యములు. స్వప్రకాశ చైతన్యమునందు అజ్ఞానముయొక్క సంభావనయే లేనప్పుడు అజ్ఞానజనిత కార్యములయొక్క ఉనికియే పొసగదు. మఱియు "ప్రమ" యనెడి వృత్తిజ్ఞానముగూడ దీనియందు లేదు. ఎందుకనగా వృత్తి జ్ఞాన మంతఃకరణధర్మము. అస లాయంతఃకరణమే ఆత్మయందు లేదు. ఇక వృత్తికి అవకాశ మెక్కడ?

**క్వ విక్షేపః క్వచైకాగ్ర్యం క్వ నిర్బోధః క్వ మూఢతా ।**
**క్వ హర్షః క్వ విషాదో వా సర్వదా నిష్క్రియస్య మే ॥ 9**

సర్వదా=ఎల్లప్పుడును, నిష్క్రియస్య=క్రియారహితుడ నగు, మే=నాకు, విక్షేపః=విక్షేపము, క్వ=ఎక్కడ? ఏకాగ్ర్యం=ఏకాగ్రత, క్వ=ఎక్కడ?, నిర్బోధః=జ్ఞానము, క్వ=ఎక్కడ?, మూఢతా=మూఢత్వము, క్వ=ఎక్కడ?, హర్షః=సంతోషము, క్వ=ఎక్కడ?, విషాదః=దుఃఖము, క్వ=ఎక్కడ?

ఓ సద్గురూ! సర్వదా క్రియారహిత మగు నా స్వరూపమునందు ఏకాగ్రత ఎక్కడిది? మొదట విక్షేప మనునది ఒకటి ఉన్నచో ఆ విక్షేపనివృత్తికి ఏకాగ్రత అవసరమై యుండెడిది. అసలు విక్షేపమే లేనప్పుడు ఏకాగ్రతతో పని ఏమున్నది? ఇక మూఢత్వ మున్నప్పుడే గదా తన్నిర్మూలనమునకు జ్ఞానావశ్యకత. జ్ఞానస్వరూప మగు ఆత్మయందు త్రికాలములలోను మూఢత యనునది లేనేలేదు. ఇక జ్ఞానముతో పని ఏమి? మఱియు హర్ష విషాదములును నాయందు లేవు. ఎందుకనగా హర్ష విషాదములు అంతఃకరణధర్మములు. ఆ యంతఃకరణము క్రియాయుక్త మైనది. ఆత్మ క్రియారహిత మైనది. ఆత్మయందు సంతోష విషాదములు లేవు.

**క్వ చైష వ్యవహారో వా క్వ చ సా పరమార్థతా ।**
**క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా ॥ 10**

నిర్విమర్శస్య=దోషరహితుడ నగు, మే=నాకు, ఏషః=ఈ, వ్యవహారః= వ్యవహారము, క్వ=ఎక్కడ?, సా=ఆ, పరమార్థతా=పరమార్థత, క్వ=ఎక్కడ?, సుఖం=సుఖము, క్వ=ఎక్కడ?, దుఃఖ=దుఃఖము, క్వ=ఎక్కడ?

నిరంతరము నిర్విశేష మగు అనగా వృత్తిజ్ఞానరహిత మగు ఆత్మ

స్వరూపుడ నగు నాయందు వ్యవహారము (వ్యవహారిక పదార్థముల)యొక్క జ్ఞాన మెక్కడ? మఱియు పారమార్థిక జ్ఞానమునకు మాత్రము అవకాశ మెక్కడ? ఎందుకనగా ఈవృత్తిజ్ఞాన పారమార్థిక జ్ఞానములు రెండును అంతఃకరణధర్మములై యున్నవి. సుఖదుఃఖములుగూడ అంతఃకరణ ధర్మము లగుటవలన అవియును నాయందు లేవు. నేను నిత్య సచ్చిదానంద స్వరూపుడను.

**క్వ మాయా క్వ చ సంసారః క్వ ప్రీతిర్విరతిః క్వ వా ।**
**క్వ జీవః క్వ చ తద్బ్రహ్మ సర్వదా విమలస్య మే ॥ 11**

సర్వదా=నిరంతరము, విమలస్య=మలరహితుడనైన, మే=నాకు, మాయా=మాయ, క్వ=ఎక్కడ? సంసారః=సంసారము, క్వ=ఎక్కడ?, ప్రీతిః వా=ప్రీతి గాని, విరతిర్వా=విరాగము గాని, క్వ=ఎక్కడ?, జీవః= జీవుడు, క్వ=ఎక్కడ, తద్బ్రహ్మ=ఆ బ్రహ్మమును, క్వ=ఎక్కడ?

ఓ సద్గురూ! సర్వదా నిర్మల స్వరూపుడను, ఉపాధిశూన్యుడ నగు నాయందు మాయ ఎక్కడ? మాయయే లేనప్పుడు మాయాకార్యమగు జగత్తెక్కడ? ఆ జగత్తు మూడు కాలములయందును నాయందు లేదు. మఱియు ప్రీతియు అదేవిధముగా విరతియు నాయందు లేవు. మఱియు జీవభావము, బ్రహ్మభావముగూడ నాయందు లేవు. ఎందుకనగా ఈ రెండును మాయా, అవిద్యారూప ఉపాధులు గలవి యని చెప్పబడుచున్నవి. ఏ ఉపాధియు లేనిది బ్రహ్మమని చెప్పబడుచున్నప్పుడు జీవభావమని బ్రహ్మభావమని చెప్పుటకే వలనుపడదు.

**క్వ ప్రవృత్తిర్నివృత్తిర్వా క్వ ముక్తిః క్వ చ బంధనమ్ ।**
**కూటస్థ నిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా ॥ 12**

సర్వదా=ఎల్లప్పుడు, స్వస్థస్య=స్థిరచిత్తము గలిగినటువంటిన్నీ, కూటస్థ నిర్విభాగస్య=కూటస్థవిభాగ రహితుడనైన, మమ=నాకు, ప్రవృత్తిః= ప్రవృత్తి, క్వ=ఎక్కడ?, నివృత్తిర్వా=నివృత్తి యైనను, క్వ=ఎక్కడ?, ముక్తిః= ముక్తి, క్వ=ఎక్కడ? బంధనం=బంధనం, క్వ=ఎక్కడ?

కూటస్థ విభాగరహితుడును, క్రియారహితుడ నగు నాయందు ప్రవృత్తి ఎక్కడ? నివృత్తి ఎక్కడ? ముక్తి ఎక్కడ? బంధమెక్కడ? ఇవన్ని యును నిర్వికారాత్మయందు ఒకప్పుడును ఉన్నవని చెప్పుటకు వలను పడదు.

**క్వోపదేశః క్వ వా శాస్త్రం క్వ శిష్యః క్వ చ వా గురుః ।**
**క్వ చాస్తి పురుషార్థో వా నిరుపాధేః శివస్య మే ॥ 13**

నిరుపాధేః=ఉపాధిరహితుడ నైనట్టియు, శివస్య=మంగళకర రూపుడ నైనట్టియు, మే=నాకు, ఉపదేశః=ఉపదేశము, క్వ=ఎక్కడ?, శాస్త్రం= శాస్త్రము, క్వ=ఎక్కడ?, శిష్యః=శిష్యుడు, క్వ=ఎక్కడ? గురుర్వా= గురువైనను, క్వ=ఎక్కడ?, పురుషార్థః=పురుషార్థము, క్వ=ఎక్కడ?, అస్తి=ఉన్నది?

శివస్వరూపుడను అనగా కల్యాణరూపుడను, ఉపాధిరహితుడ నగు నాకు ఉపదేశ మెక్కడ? తనకంటె భిన్నమగు వ్యక్తి ఉన్నచో ఉపదేశము చేయవచ్చును. రెండవవాడే లేనప్పు డిక ఉపదేశ మెక్కడ? ఇందువలన

శాస్త్ర గురుకృతోపదేశమెన్నటికిని సంభవింపదు. అదేవిధముగా శిష్యభావ, గురుభావములు గూడ పొసగవు, ఎందుకనగా సమస్త భేదభావములు లేనిదే గదా పరబ్రహ్మము.

**క్వ చాస్తి క్వ చ వా నాస్తి క్వాస్తి చైకం క్వ చ ద్వయమ్ ।**
**బహునాఽత్ర కి ముక్తేన కించిన్నోత్తిష్ఠతే మమ ॥ 14**

అస్తి=అస్తిత్వము, క్వ=ఎక్కడ?, నాస్తి=నాస్తిత్వము, క్వ=ఎక్కడ?, ఏకం=ఏకము, క్వ=ఎక్కడ?, అస్తి=ఉన్నది, ద్వయం= ద్వైతము, క్వ=ఎక్కడ? అత్ర=ఈ విషయములో, బహునా=అధికముగా, ఉక్తేన=చెప్పుటచేత, కిం=ఏమి, (ప్రయోజనము), మమ=నాకు (నన్ను), కించిత్=ఏవస్తువుగూడ, న ఉత్తిష్ఠతే=ప్రకాశింపజేయజాలదు (నేనే అన్నిటిని ప్రకాశింపజేయు వాడనని భావము.)

నాయందు అస్తిత్వ, నాస్తిత్వ స్ఫురణయే లేదు. ఎందుకనగా అసత్యాపేక్షవలన "అస్తిత్వ" వ్యవహారమున్ను సత్యాపేక్షవలన నాస్తిత్వ వ్యవహారమున్ను కలుగుచున్నది. ఆ వ్యవహారమే నాయందు లేనందువల్ల యీ రెండును నాయందు లేవు. ఏకత్వము గాని, ద్వైతము గాని నాయందు లేవు. పెక్కు చెప్పుటచేత ప్రయోజన మేమి? చైతన్య స్వరూపుడ నగు నా యందు రెండవవస్తు వుండుటయే పొసగదు.

ఇది ఇరువదవ ప్రకరణము.

సర్వము సమాప్తము

